శ్రీకృష్ణాయపరబ్రహ్మణే నమః.

అఖిలకలికల్మషాపహంబగు

# శ్రీమద్భాగవతము

## ఏకాదశ ద్వాదశ స్కంధములు.

ఆంధ్రవచనము.

ఎనిమిదవభాగము. (2347-2739)

శ్రీ దేవరాజసుధీమణిప్రణీతము.



ఆనందముద్రణాలయమున ముద్రితము.

ఆర్. వేంకటేశ్వర్ అండ్ కంపెనీవారిచే

ప్రకటితము.

1924

# విషయసూచిక.

---

ఏకాదశ స్కంధము సమాప్తము.

---

## ద్వాదశస్కంధము.



శ్రీమదాంధ్ర భాగవతము

సంపూర్ణము.

---

శ్రీకృష్ణాయపరబ్రహ్మణే నమః.

అఖిలకలికల్మషాపహంబగు

# శ్రీమద్భాగవతము

## ఏకాదశ ద్వాదశ స్కంధములు.

ఆంధ్రవచనము.

ఎనిమిదవభాగము. (2347-2739)

శ్రీదేవరాజసుధీమణిప్రణీతము.




ఆనందముద్రణాలయమున ముద్రితము.

ఆర్. వేంకటేశ్వర్ అండ్ కంపెనీవారిచే

ప్రకటితము.

1924



శ్రీరామచన్ద్ర పరబ్రహ్మణేనమః.

# శ్రీమదాంధ్ర భాగవతము

## ఏకాదశస్కంధము.

—·····—✱—·····—

### మునలము పుట్టినకథ.

శ్రీశుకుఁడు—కృష్ణుఁడు బలరామునిని యదువులను నపుడపుడు తోడుచేసికొని, పూతన మొదలగు దైత్యులను వధించి పాండవులకును గౌరవులకును మిక్కిలి బలవంతమైన కలహమునుబుట్టించి భూమిభారమును దింపినవాఁడయ్యె. పాండవుల శత్రువులగు దుర్యోధనాదులు వారిని గపటంబగు జూదమాడించిరి, పెక్కులవమానములుచేసిరి, దుశ్శాసనునిచే వారిద్రౌపది కొప్పునుబట్టి యీడ్చునట్లు గావించిరి. మఱి విషముపెట్టుట మొదలుగా నెన్నియోచేసిరి. ఇట్లు మాటిమాటికిఁ జేయుచుండినందునఁ బాండవులు సయింపక కోపముగొని వారితో యుద్ధమునకుఁ బూనిరి. భగవంతుఁడా పాండవులను నిమిత్తముగాఁ జేసికొని యట్లు యుద్ధమునఁగూడిన రాజుల నొకరిచేత నొకరిని జంపించి భూభారమును హరించెను. మఱియు నతఁడు తన బాహువులచేత రక్షితులై యున్న యాదవులనుగొని భూమికి భారభూతులైన రాజుల సేనలను హతము గావించెను. అతని

స్వరూపస్వభావములనింత యంత యని కొలఁదిపెట్ట శక్యమా! ఇట్లన్నియుఁజేసి యాహరి యొకప్పుడు తనలోఁదాను 'భూమికిఁ గలభారము తీఱిపోయినను నింకను దీఱకున్నదనియే నాకుఁ దోఁచుచున్నది. ఏలంటివా? యీయాదవకులము మిక్కిలి విజృంభించి యితరులకెవ్వరికిని సహింప శక్యముగాకున్నదే. భూమిభారమును బూర్ణముగాఁ దీర్చుటకై యవతరించి యీ మిగత పెట్టుటతగునా! దీనికి నాశముగాని యపజయముగాని మఱి యొక్కరివలనను గలుగనేరదు. ఏలనఁగా నిది నన్నాశ్రయించియున్నది. నన్నాశ్రయించినవారికి నశుభమెక్కడిది? మఱి దీని వీర్యశౌర్యాదులగు విభవములో నిత్యమును బైపయిని బెరుఁగుచున్నవి. ఇట్టి దీనిని ద్రుంచుటకు నుపాయమేమి? ఇట్లు చేయుట బాగు. ఈ యదుకులమువారిలోఁ గలహము పుట్టించెదను. అపుడు వెదురుపొదరును దానిలోఁ బుట్టిన యగ్నివలె, వీరిలోని జగడము వీరిని నాశముసేయును అప్పుడు నెమ్మదినొంది నాస్థానమునకు నేను బోయెదను' అని యాలోచించెను. రాజా! ఆభగవంతుఁడిట్లు నిశ్చయముచేసికొనెను. అతఁడందఱిలోపలఁజొచ్చి నియమించునట్టి యీశ్వరుఁడు; తలఁచినదితోడనే సిద్ధించునట్టి సత్యసంకల్పుఁడుగదా! కాఁబట్టి యీ విభుఁడు బ్రాహ్మణులశాపమును నెపముచేసికొని తన కులమును సంహరించినవాఁడయ్యెను. అతఁడు తన రూపమునకుం గల మహాసౌందర్యముచేత లోకమునఁగల చక్కఁదనములనెల్లఁ దిరస్కరించెను. తనకటాక్షమోక్షముల సొగసుచేతఁ దక్కిన మనుష్యుల చూపుల యందమును గ్రిందుపఱచెను. తన మధుర వచనముల చేత వానిని దలంచుకొను వారిమనస్సులనెల్లఁగొల్లగొనెను. తన

యడుగుల విలాసముచేత దానిని జూచువారు చొక్కి తక్కిన పను లేమియుఁ దోఁపకుండునట్లు గావించెను. ఇట్లు నిరతిశయ ములయిన తన సౌందర్య కటాక్షాదులచేత లోకుల చూపులు మనస్సులు మొదలగు వానినెల్ల నాకర్షించి తనయొక్కనియందే నిలిచియుండునట్లు చేసినవాఁడయ్యెను.అతి మనోహరములయిన యిట్టిరూపచేష్టాదులచేత నతనికీర్తి యెంతో కొనియాడఁదగిన దయ్యెను. ఆ యీశ్వరుఁ డీకీర్తిని భూమియందెల్ల వ్యాపింపఁ జేసి 'మనుష్యులు నాయీకీర్తిచేతనే సంసారమును దాఁటుదు రుగాక యని తలఁచి యంతఁ దనపదమునకు వేంచేసెను' అనెను.

రాజు—'వృష్ణులందఱును బ్రాహ్మణులందు మిక్కిలి భక్తి గలవారు, దానతత్పరులు, నిత్యమును పెద్దలను సేవించుచుండు వారు, మఱి వారిమనస్సు లెప్పుడును గృష్ణునియందేయుండును. ఇట్టి వారికి బ్రాహ్మణశాపమెట్లు కలిగెను? ఆశాపమునకు నిమి త్తమేమి ? అది యెట్టిది ? ఆయాదవులందఱు నొక్కమనస్సు గలిగి యుండువారే! అట్టివారియందు భేదమెట్లుకలిగినది? బ్రాహ్మ ణోత్తమా ! ఇదంతయు నాకుఁజెప్పుము' అనియడిగెను. శుకుఁ డు-భగవంతుఁడు కృష్ణుండు సకల సౌందర్యములును జక్కఁగాఁ బొందుపడియున్న దివ్యవిగ్రహమును దాల్చి మిక్కిలి మంగళ కరములగు కర్మముల నాచరించుచు దానిచేత విస్తారమయిన కీర్తినిగాంచి యన్నికామములును సమకూడి ద్వారవతిలో విహరించుచు నుండెను. అయిన నతనికి భూభారమును దీర్చు పని యింకను గొంత మిగత పడియుండెను; కాన, దానినిగూడఁ దీర్చుటకుఁ దన కులమును సంహరింపఁ గోరెను. అతఁడు పుణ్య ములు గలిగించుననియుఁ దమ్ముగీర్తించు లోకుల కలికల్మష

ములనెల్ల నపహరించునవియు మిక్కిలి మంగళములయినవియు నైన కార్యములు సేయుచు వసుదేవుని గృహమున వసించియున్నపుడు, తాను గాలరూపమున సంహారము సేయువాఁడుగాన (యదుసంహారమునకై) మునులను గొందఱను ద్వారవతి దగ్గఱనున్న పిండారక మనుతీర్థమునకుఁ బోవునట్లు సంకల్పించెను. ఆసంకల్పముచేతఁ బ్రేరితులై మును లాతీర్థమునకుఁ బోయిరి. విశ్వామిత్రుఁడు, అసితుఁడు, కణ్వుఁడు, దుర్వాసుఁడు, భృగువు, అంగిరసుఁడు, కశ్యపుఁడు, వామదేవుఁడు, అత్రి, వసిష్ఠుఁడు, నారదుఁడు మొదలగు మును లచటికిఁ బోయిరి. అప్పుడు యదుకుమారులచటఁ గ్రీడించుచుండిరి. వారపుడుజాంబవతీదేవి పుత్త్రుఁడయిన సాంబునికి స్త్రీవేషము వేయించి యామునులదగ్గఱకుఁబోయి తా మవినీతులయ్యును మిక్కిలి వినయముగలవారివలె వారి యడుగులను బట్టుకొని మ్రొక్కి వారితో 'బ్రాహ్మణులారా! ఈబిడ గర్భిణి. పుత్త్రుఁడు గావలెనని యువ్విళ్లూరుచున్నది. ఇట మీఁదఁ గనఁబోవుచున్నది. కాన తానే చక్కమిమ్ము నడుగుటకు మిక్కిలి సిగ్గుపడుచుమాామూలముగా నడుగుచున్నది.మీజ్ఞానదృష్టియో యమోఘమైనది. కనుకఁ జెప్పుఁడు. ఇది యేబిడ్డనుగనును? కూఁతురా? కొడుకా?' అని యడిగిరి. ఇట్లు వారు వచింపఁగా నామునులు కోపమునొంది వారితో 'మూఢులారా! ఇదిమీకులమెల్ల నిర్మూలముసేయు నొక ముసలమును గనును' అనిరి. అది వినివారు మిక్కిలియు దిగులుపడి తోడనే సాంబునికడుపును విప్పిచూచిరి; చూడఁగా నందు నినుప ముసల మొకటి కనఁబడెను. వారు 'కట్టా! భాగ్యములు చెడి మన మిదియేమిచేసితిమి? మనవారిది తెలిసిన మనల

నేమందురోకదా ?' అని యందఱును విరవిరఁబోయి యాముస లము నెత్తికొని యిండ్లకుఁబోయిరి. వారు ముఖములందుఁ గాంతి సొంపు మాయఁగా రాజసభకు దానిని గొనిపోయి యాదవులెల్ల వారును వినుచుండఁగా జరిగినది రాజునకుఁ దెలిపిరి. అమోఘమయిన బ్రాహ్మణశాపమును విని యాముసలమును జూచి ద్వారకయందలివారెల్ల నాశ్చర్యపడి భయముచేత వడ వడ వడఁకిరి. యదురాజయినయాహుకుఁ డాముసల మును జూర్ణముచేయించి సముద్రజలములందుఁ బాఱవైపిం చెను. అట్లు మునలమును బొడిసేయుచుండఁగా మిగిలినయినుప సలాకనుగూడ నందు వేయించెను. అందుఁబడినయా యినుప శకలము నొకానొకచేఁప మ్రింగెను.అందువైచిన చూర్ణమో, యల లీడ్చినటు నల్లలాడుచు దానిని దెచ్చి చెలియలికట్టగట్టున వైవఁగా, నది యందు నిలిచి మూఁడుమొనలుగల యైరకము లను నిడుపాటితృణవిశేషము లాయెనఁట. జాలరివాండ్రా యినుప ముమ్రింగినచేఁపను దక్కినచేఁపలతోడ సముద్రమునందు వల వేసి పట్టిరి. వారియం దొకజాలరి యాచేఁప కడుపులోనున్న లోహమును దనబాణమున కలుగుగాఁ జేసికొనెను. భగవం తుఁడు కృష్ణుఁడు కాలత్రయమునందుఁ గలుగు సకలవిషయము లను దెలిసినవాఁడుగాన యాబ్రాహ్మణశాపమును విఫలము చేయుటకు సమర్థుఁడై యుండియు నట్లుచేయ నొల్లఁడయ్యె. మఱి తాను గాలరూపమున సంహరించునట్లు సంకల్పించియుండుటచే దానికి సమ్మతించినవాఁడయ్యెను. ఇది మొదటియధ్యాయము.

---

## నారదుఁడు వసుదేవునకు విదేహర్షభ సంవాదము చెప్పుట.

శుకుఁడు—ద్వారకానగరము గోవిందుని బాహుబలరక్షితము. అందు నారదుఁడు కృష్ణు నుపాసించుటయందు మిక్కిలి యక్కఱగలిగి యుండుటంబట్టి మాటిమాటికివచ్చి వాసము చేయుచుండెను. రాజా! ముకుందుని చరణారవిందములు సేవించినవారికెల్ల మృత్యువు గలుగదు. వానిని దేవోత్తములగు బ్రహ్మాదులును గొలుచుచుందురు అట్టిచరణారవిందములను నింద్రియములు (కన్నులు) గలవాఁడెవ్వఁడు తెలిసినవాఁడయి నను దెలియనివాఁడయినను భజింపకుండును? ఇఁక నారదునివంటివాఁడు భజింపకుండునా? ఆ దేవర్షి యొకనాఁడు వసుదేవుని గృహమునకువచ్చెను. అతఁడు నాఋషినర్చించి సుఖాసీనుం గావించి యభివాదనముచేసి యతనితో 'మహాత్మా! ఉత్తమశ్లోకుం డగు భగవంతునిఁ బ్రాప్తించుటకు మీరు మార్గభూతులు గదా! మిముబోఁట్లు రాకలెల్లఁ దండ్రిరాక పుత్త్రకులకుం బోలెఁ, దాపత్రయపీడితులై యున్నట్టి మాబోఁటి దేహధారుల కెల్లను శుభమునకే యగుచున్నవి. పర్జన్యుఁడు మొదలయిన దేవతలచరితలు ప్రాణులకుఁ గొన్నియెడల దుఃఖమును గొన్నియెడల సుఖమును గలిగించుచున్నవి. అచ్యుతునియందే మనస్సుగలిగి యుండు మీఁబోఁటి సాధువులచరితమో యెప్పటికిని సుఖమునకే యగునుగాని దుఃఖమునకుఁగాదు. మఱియొకటి విశేషము. దేవతలు తమ్మెవ్వరేవిధమునఁ గొలుతురో వారి కందులకుఁ దగిన సుఖమునే యిత్తురుగాని యంతకు మిక్కిలిగానీయరు. దేహము నీడ దానితోఁగూడఁ బెరుఁగుచును దగ్గుచును నుండునట్లు వా

రును భక్తుల కుందురు. తమఋోటి సాధువులో యట్లుగారు; దీనులయెడ నింతింతని కొలఁదిలేని వాత్సల్యము గలిగియుందురు. మహాత్మా! నీరాకచేతనే మేము కృతార్థుల మయితిమి. అయినను నీవు వేనిచేత భగవంతునిఁ బ్రసన్నునిఁ గావించికొంటివో యాభాగవతధర్మములను విన నడుగుచున్నాము. వానిని శ్రద్ధతోడ విన్నయెడ మనుష్యుఁడు సమస్త మయిన భయముల నుండి విముక్తుఁడగుచున్నాఁడుగదా! పరమపురుషుఁడే నీకుఁ బుత్త్రుఁడై యుండఁగా నిట్లడిగెదవేల యందువా? ఆ యనంతుఁడు ముక్తిప్రదుఁడే. అయినను నే నతనిని దొల్లి బిడ్డలు కావలయునని కోరి యారాధించితినేకాని ముక్తికై కాదుసుమీ. ఏమిసేయుదును. ఆదేవుఁడు తన మాయచేత నన్ను మోహింపఁజేసియున్నాఁడే. ఈ సంసారసముద్రమో నానావిధములయిన దుఃఖములతోఁగూడి యన్నివిధముల భయము పుట్టించుచున్నది. ఇట్టి మహాసముద్రమును సుఖముగా దాఁటునట్లు సువ్రతా! మమ్ము శిక్షింపుము' అనెను. రాజా! బుద్ధిమంతుఁడా వసుదేవుఁ డిట్లడుగఁగా నారదునకు హరిగుణములు తలంపునకువచ్చెను. అందుల కాదేవర్షి ప్రీతుండై 'సాత్వతసింహమా! నీ విది యడుగనిశ్చయించినది యెంతోలెస్స; జగత్తునకెల్ల నభ్యుదయము గలిగించు భాగవతధర్మముల నడుగుచున్నావే. ఇది లెస్సకాకుండునా? రాజా! భాగవతధర్మమును విన్నను, పఠించినను, చింతించినను, ఆచరించినను, అనుమోదించినను, సకలభూతద్రోహినిసయితము తోడనే పవిత్రునిఁ జేయుచున్నది. అది యట్లుండనిమ్ము. భగవంతుని కథలను వినుటయుఁ గీర్తించుటయుఁ బుణ్యావహము. అట్టి పరమకల్యాణుని దేవుని

నారాయణుని నీవిపుడు నాకుఁ దలఁపించితివే ! ఇది నాకెంతో యుపకారముచుమీ. ఈవిషయమై పురాతనమైనయొకయితిహాసము నుదాహరించుచున్నారు. అది యార్షభులకును మహాత్ముఁడయిన విదేహరాజునకును జరిగిన యొకసంవాదము. స్వాయంభువమనువునకుఁ బ్రియవ్రతుఁడనువాఁడు పుత్త్రుఁడు. అతనికాగ్నీధ్రుఁడు పుట్టెను. అతనికి నాభియు, నాభికి ఋషభుఁడును బుట్టిరి. ఆఋషభుని, మోక్షధర్మము నుపదేశింపఁదలంచి యవతరించిన వాసుదేవాంశముగాఁ జెప్పుదురు. అతనికి నూర్గురు కొడుకులు పుట్టిరి. వారందఱును వేదపారంగతులై యుండిరి. వారియందెల్ల భరతుఁడు జ్యేష్ఠుఁడు. అతఁడు నారాయణపరాయణుఁడు. అతని పేరిటనే యీవర్షము భారతవర్షమని యద్భుతముగాఁ బ్రఖ్యాతినొందెను. అతఁడీభూమియందలి భోగములనెల్ల ననుభవించి దిగవిడిచి యిలువెలువడి తపస్సుచే హరినుపాసించుచు మూఁడుజన్మములకు నాహరి పదవిని (అతనితోడిసాధర్మ్యమును) బొందెను. ఆభరతుని తమ్ములు తొంబదితొంబండ్రుగురిలో నిలావర్తుఁడు మొదలుగాఁగల తొమ్మిదిమంది, యీభారతవర్షముచుట్టునుఁ దమతమపేరులు గలిగియున్నతొమ్మిదిద్వీపములకు నధిపతులయిరి. ఎనుబదియొక్కండ్రు ద్విజులై కర్మతంత్రమునకుఁ బ్రవర్తకులుగా నుండిరి. తక్కిన తొమ్మండ్రును మునులయిరి. వారు జ్ఞానవైరాగ్యాదిభాగ్యసంపన్నులు; పరమార్థమును నిరూపింపను జాలినవారునై యుండిరి. మఱియు వారధ్యాత్మవిద్యయందుఁ జక్కఁగాఁ బరిశ్రమము చేసియుండుటవలన దానియందుఁ బ్రవీణులుగాను దిగంబరులుగాను నుండిరి. వారు, కవి, హరి, అంతరిక్షుఁడు, ప్రబు

ద్ధుఁడు, పిప్పలాయనుఁడు, అవిర్హోత్రుఁడు, ద్రమిళుఁడు, చమ
సుఁడు, కరభాజనుఁడు ననఁబడుదురు. వారు సకలమయిన స్థావర
ములనును జంగమములనును దమ్మునుఁ దక్కిన సమస్తమును
భగవంతుని రూపముగాఁ గనుఁగొనుచు భూతలమున సంచ
రించుచుండిరి. వారికే చోటికిఁ బోవలయునని కోరిన నడ్డుకొంచె
మైనను గలుగదు; కనుక సురలు, సిద్ధులు, సాధ్యులు, గంధ
ర్వులు, యక్షులు, కిన్నరులు, నాగులు, మునులు, చారణులు,
భూతనాథులు, విద్యాధరులు, గరుడులు, గోవులు మొదలగువాని
లోకములందెల్ల, దేనియందును దగులునొందక యిప్పటికిని
సంచరించుచున్నారు. వారట్లు తిరుగుచుండి యొకానొకప్పుడు
భారతవర్షమందు మహాత్ముఁడగు జనకుఁడు నిమి ఋషులచేఁ
గావించుచున్న సత్రమునకు దైవికముగాఁబోయిరి. రాజా !
సూర్యసమానులయిన యాకవి మొదలగు మహాభాగవతులను
జూచి యజమానుఁడగు నిమియు ఋషులును, మూర్తిమంతు
లయిన యాహవనీయము మొదలయిన యగ్నులును సంద
ఱును లేచి యెదుర్కొనిరి. జనకుఁడును వారు నారాయణపరా
యణులని గుఱుతెఱింగి యపు డాసనములిడి వారిపరువు
నకుఁ దగురీతిని బ్రీతుఁడై పూజలుగావించెను. వారు తమ
ప్రభచేత మిక్కిలి ప్రకాశించుచుండిరి, అట్లు బ్రహ్మపుత్రులయిన
భృగువు మొదలగు ఋషులకు సమానులైనట్టివారిని జనకుఁడు
మిక్కిలియుఁ బ్రీతిగలిగి వినయముచే వినమ్రుఁడై యిట్లని యడి
గెను. విదేహుఁడు—'మీరు భగవంతుఁడగు మధుసూదనునికిఁ
జక్కఁబార్షదు లగుదురని నాకుఁ దోఁచుచున్నది. అట్టివారేని
యీయజ్ఞలోకమునడుమఁ దిరుగాడ నేలయందురా? విష్ణుభక్తు

లగువారు లోకములను బావనముచేయుటకై యంతటను సంచరించుచుందురు గదా. అది యట్లుండె. జీవకోటికి దేహములు నానావిధములు. వానిలోపల (ముక్కిలి సుకృతముచేతనే కలుగునదియు భగవదారాధనమునకు సర్వవిధముల నుపయుక్తమయినదియు నగు) మనుష్యదేహమో దుర్లభము. దుర్లభమే కాక క్షణభంగురము. అట్టిదుర్లభమయిన మనుష్యజన్మమందు వైకుంఠప్రియులగు మీబోంటివారల దర్శనమో యత్యంత దుర్లభ మని తలంచుచున్నాను. ఈసంసారమందు నరక్షణమైనను సజ్జనులతోడి సంగము మనుష్యులకు ముక్కిలియుఁ బురుషార్థము గలిగించునది. అట్టి మీబోంటి సజ్జనులతోడిసంగమము వలన మాకుఁ బురుషార్థము సిద్ధింపకుండునా ? అనఘులారా ! కాఁబట్టి, మిమ్ము నిరతిశయమయిన క్షేమమెద్దియో దానికి సాధనమెద్దియో, యడుగుచున్నారము. (భగవత్ప్రాప్తియే క్షేమము, భాగవతధర్మములే దానికి సాధనమగునేని) భాగవతధర్మములను మేము వినుటకుఁ దగుదుమేని చెప్పుఁడు. అట్టి ధర్మములచేత నజుండగు భగవంతుఁడు ప్రసన్నుఁడై శరణాగతుఁడగువానికిఁ దన్నుసయిత మిచ్చుకొనుచున్నాఁడు గదే' యని యడిగెను. నారదుఁడు—వసుదేవా ! మహాత్ముఁడు నిమి యట్లడుగఁగా వారు సదస్యులతోను ఋత్విజులతోడను గూడియున్న రాజునెంతయు నభినందించి ప్రియంబున నిట్లనిరి. వారిలో కవి-'ఈజీవదశయందు నిత్యమును నచ్యుతుని పాదారవిందముల నుపాసించు చుండవలయును. దానిచేతనే *దేని వలనను భయముగలుగకుండునని తలఁచుచున్నవాఁడను. ప్రకృతి

* దేనివలనను భయము గలుగకుండునట్టి దశ ముక్తి యొక్కటియే. కనుక

వికారమయిన దేహమునే యాత్మగాఁ దప్పుఁదలఁచుట వలననే మనుష్యుని బుద్ధికి భయము గలుగుచున్నది. అట్టివాఁ డచ్యుతుని పాదాంబుజముల నుపాసించినచో విశ్వాత్ముఁడగు నాహరిచే నట్టిభయము సర్వవిధముల బోత్తిగా నివర్తించి వానికి మోక్షము గలుగుచున్నది. అజ్ఞులగు పురుషులకు సుఖముగాఁ బరమాత్మ లభించుకొఱకు భగవంతుఁడు (పాంచరాత్రాదుల మూలమున) చెప్పిన శ్రవణ కీర్తన స్మరణాదులైన యుపాయములే భాగవత ధర్మములని తెలియుము. రాజా! భగవంతుఁడు చెప్పిన యాయుపాయములను మనుజుఁడు చక్కఁగా ననుష్ఠించునేని, వాని కొకప్పుడును బ్రమాదమేమియుఁ గలుగదు. ఉపాయాంతర నిష్ఠులకే యట్టి ప్రమాదము సుమీ. మఱి యాభాగవత ధర్మములందుఁ గన్నులు మూసికొని పరుగిడినను, వాఁడడుగు తొట్రుపడఁడు; క్రిందను బడఁడు. మనుజుఁడు తనప్రకృతి గుణముల ననుసరించుచునే యుండునుగాని యొకప్పుడయిన నూరకుండఁడు. కాఁబట్టి వాఁడు కాయముచేతఁగాని, వాక్కుచేతఁగాని, మనస్సుచేతఁగాని, తక్కిన యింద్రియములచేతఁగాని, బుద్ధిచేతఁగాని యేయేకర్మమును లౌకికమో, వైదికమో, శాస్త్రవిరుద్ధము గానిదానిని జేయుచున్నాఁడో యదియంతయుఁ బరుం డగునారాయణునికే సమర్పింపవలయును. కొందఱు జగములోని వస్తువులు బ్రహ్మాత్మకములుగావు. స్వతంత్రములైనవి యని తప్పుఁదలంతురు. అట్లు దలంచువాఁడు భగవంతునికి విముఖుఁడగును. దానివలనవానికి

---

ముక్తియె ఆత్యంతిక క్షేమము. దానికిసాధనము భగవత్పాదారవిందోపాసనము. అనఁగా భాగవతధర్మము అని ఫలితము.

స్మృతి తలక్రిందై దేహమే యాత్మయని భ్రమముగలుగును. ఇదియంతయు భగవంతుని మాయయగు ప్రకృతిచేతఁ గలుగు చున్నది. కాఁబట్టి మనుజుఁడు వేదాంతజ్ఞానము నధిగమించి గురువే దైవముగాఁదలఁచి యామాయ నివర్తించుకొనుటకు ననన్య ప్రయోజనమగు భక్తితో భగవంతుని సర్వాత్మకునిఁగా భజింపవలయును దేహమాత్మగాదు; ఆత్మయు స్వతంత్రముగాదు. అయినను జింతింపఁగా స్వప్నమందుఁ గలుగుకోరిక యస్థిరమైనను స్థిరముగాఁ దోఁచునట్లు దేహ మాత్మగాను, ఆత్మ స్వతంత్రముగాను మనస్సునకుఁ దోఁచుచుండును. కాఁబట్టి మనస్సును ననాదికర్మము ననుసరించి దేహమును నాత్మయు నొక్కటియె యని సంకల్పించుచును నాత్మ పరమాత్మకుఁ బరతంత్రముగాక స్వంతంత్రమైన దని వికల్పించుచును నుండును. తెలిసినవాఁ డట్టి మనస్సును నడంపవలయును. దానివలన నభయంబగు మోక్షము గలుగును. మనస్సును నడంచుటకు నుపాయమిది. చక్రపాణియగు విష్ణు వీలోకమం దెత్తిన యవతారములను జేసిన కర్మములను మిక్కిలి మంగళకరములైన వానిని వినుచును, నద్దేవునిఁ బ్రదిపాదించు గీతములను నామములను సిగ్గువిడిచి పాడుచును, దేహమం దాసక్తిమాని చరింపవలయును. అప్పుడు మనస్సు భగవంతునియందుఁ దగిలి యుండే నిలిచియుండును. ఇట్టి వ్రతము నాచరించుచు రాఁగా భగవంతుఁడు మిక్కిలి ప్రియుండగును. అట్టి ప్రియుని నామములను గీర్తించుచుండఁగా నతనియందు మిక్కుటమైన యనురాగము పుట్టును. దానిచేత వాఁడు మనస్సుకరఁగి, యొకప్పుడు భగవంతు నుద్దేశించి బిగ్గరనవ్వును; ఒకప్పు డది యెడ తెగనా

యింతకాలము నన్నుపేక్షించినాఁడని యేడ్చును. ఒకప్పుడు సొంపు పట్టలేక బిగ్గరనార్చును; ఒకప్పుడు సంతోషముచేఁ బాడును. ఒకప్పు డాడును. ఇట్లు వాఁడు లోకముతోఁ బాటివాఁడుగాక వెఱ్ఱిగొన్నవానివలె నివియన్నియుఁ జేయుచుండును. ఆకాశమును, వాయువును, అగ్నిని, జలమును, భూమిని, జ్యోతిస్సులను, జంతువులను, దిక్కులను, వృక్షాదులను, నదులను, సముద్రములనును మఱి యేభూతము నయినను విష్ణువుశరీరముగాఁ దలఁచి మ్రొక్కవలయును; తుదకుఁ దన్నును నట్లే తలఁచి మ్రొక్కఁదగును. అన్నము గుడుచువానికి నొక్కొక్క కుదుపునందును, దుష్టియుఁ బుష్టియు నాఁకలిమానుటయు మూఁడును నేకకాలముననే కలుగుచున్నవి. అట్లే భగవంతుని శరణుఁజొచ్చినవానికి నీశ్వరుని స్వరూపగుణాదులను గుఱించిన తత్త్వజ్ఞానమును భక్తియు శబ్దాది విషయములందు విరక్తియు నీమూఁడును నేకకాలమందే కలుగుచున్నవి. ఇట్లచ్యుతనిపదారవిందములను ననువర్తించి భజించుచుండు భాగవతునకు భక్తియు విరక్తియు భగవంతునిఁ గూర్చిన జ్ఞానమును గలుగుచున్నవి. పిదప వానివలనఁ బరమంబగు శాంతియుఁ (మోక్షమును) దనంతఁ గలుగుచున్నది. భూతద్రోహమును దిగవిడచి భూతములందెల్ల మైత్రి గలిగి యధోక్షజుండగు భగవంతునియందు మనస్సు మిక్కిలి గాఢముగాఁ దగిలి దానివలనఁ బరిశుద్ధస్వభావుండగు వాఁడు మూఁడు లోకములను సూర్యుఁ డుదయించి పవిత్రముఁ జేయునట్లు, తన పాదరేణువులచేఁ బావనము చేయుచున్నాఁడు" అనెను. రాజు-"భాగవతుఁ డెట్టివాఁడు చెప్పుము ? వానిధర్మ

మేది ? మనుష్యులలోపల వాని స్వభావమెట్టిది ? వాని యా
చారమెట్టిది ? వాఁడేమిచెప్పును ? భగవత్ప్రియుండగువానిని
గుఱుతుపట్టు చిన్నె లేవి ?' యని యడిగెను. అందులకు హరి
యనువాఁడు 'ఎవఁడు సర్వభూతములందును దనయందును
భగవంతుఁ డుండుటయుఁ బరమాత్ముఁ డగునాభగవంతుని
యందు సమస్తభూతములు నుండుటయును జూచుచున్నాఁడో
యట్టివాఁ డుత్తముఁ డగుభాగవతుఁడు. మఱి యీశ్వరుఁడు
సర్వశరీరకుఁడని తెలియక కేవలము దేవతయని తలఁచి యతని
యందుఁ బ్రేమయు, నతనికి లోఁకువయైయుండు భాగవతుల
యందుఁ జెలిమియు, నజ్ఞులయందుఁ గృపయుఁ, బగవారియందు
నుపేక్షయు నెవఁడు సలుపునో వాఁడు మధ్యముఁడు. ఎవఁడు
హరియర్చారూపమునందు మాత్రము శ్రద్ధతోఁ బూజ సలు
పుచు నతని భక్తులయందును దక్కినగోవు మొదలగు వాని
యందును బూజసేయకుండునో వాఁడజ్ఞుఁడగు భక్తుఁడని చెప్పఁ
బడుచున్నాఁడు. ఎవఁ డిష్టములయిన విషయములనుగాని యని
ష్టములయిన విషయములనుగాని తన యింద్రియములచే ననుభ
వించుచున్నను నిదియంతయు విష్ణుమాయయేయని వానిని
ద్వేషింపకయును గాంక్షింపకయునుండునో వాఁడుత్తముఁడగు
భాగవతుఁడు. దేహము,ప్రాణము, మనస్సు, బుద్ధి,యింద్రియము
లనెడు వీనికి వరుసగా నుత్పత్తి, నాశము, ఆఁకలి, భయము,
తృష్ణ, శ్రమమనెడి యివిధర్మములు. పురుషుఁ డెవఁ డీసంసార
ధర్మములచేత, నెంతమాత్రము మోహము నొందకుండునో
వాఁడు భాగవతులందఱు ముఖ్యుఁ డని నేను దలఁచుచున్నాను.
ఎవ్వని చిత్తమునందుఁ గామములును, గర్మములును గలుగ వో

యెవ్వఁడు వాసుదేవు నొక్కనినే యాశ్రయించియుండునో వాఁడు భాగవతోత్తముఁడు. భాగవతుని యాచారము లిట్టివి. వానిని గుఱుతెఱుంగు చిహ్నములు వినుము. ఎవ్వనికిఁ దన జన్మముచేతఁగాని కర్మముచేతఁగాని వర్ణాశ్రమములచేతఁగాని జాతిచేతఁగాని యీ దేహమం దహంభావముకలిగి చిక్కుటగలుగదో వాఁడు హరికిఁ బ్రియుఁడగును. ఎవ్వనికి నాత్మలన్నియు బ్రహ్మాత్మకములును జ్ఞానైకాకారములు ననియు దేహములెల్లఁ బ్రకృతిపరిణామము లనియుఁ దెలియుటవలన నంతఃకరణ మన్నిటియెడ సమముగా నుండునట్లు శిక్షించి, సర్వభూతములందును సముఁడై యుండుటవలనఁ దనవాఁడనియుఁ బరుఁడనియుఁ దనధనమనియుఁ బరుల ధనమనియుఁ దనదేహమనియుఁ బరులదేహమనియు భేదము గలుగకుండునో వాఁడు భాగవతోత్తముఁడు. అజితుఁడగు విష్ణునియందే మనస్సు నెలకొలిపియుండు బ్రహ్మాదిదేవతలకు నైత మాభగవంతుని పాదారవిందములు దుర్లభములు. ఎవ్వఁ డట్టి భగవత్పాదారవిందములకంటె సారమైనది లేదని గట్టిగాఁ దలఁపుగలిగి ముల్లోకముల యైశ్వర్యము తనకిచ్చినను నిరాకరించి యాపదారవిందముల భజనమునుండి యరనిమిషముకూడఁ జలింపకయుండునో వాఁడు వైష్ణవులం దుత్తముఁడు. త్రివిక్రముఁడగు భగవంతుని చరణనఖ మణులనుండి వెన్నెలలవంటి చల్లని కిరణములచే హృదయమందలి కామసంతాప మెల్లఁ దూలిపోవుచున్నది. అట్టి హృదయములందు మరల నాతాపమెట్లు గలుగును? సూర్యునివలని తాపము చంద్రుఁడు పుట్టినపిదప నుండ నేర్చునా? భాగవతుఁ డిట్టివాఁడు. హరిని బారవశ్యముచేత

జేరుకొన్నను నతఁడు పాపసమూహమునెల్ల నాశము సేయు చుండును. అట్టి హరి తనపదారవిందములఁ బ్రేమపాశములచేఁ గట్టికొల్పియుండుటంబట్టి యెవ్వనిహృదయమును విడిచియుండ నేరఁడో యట్టివాఁడు భాగవతులందుఁ బ్రధానుఁ డని చెప్పఁ బడును' అనెను. ఇది రెండవయధ్యాయము.

---

## జనకార్షభసంవాదము.

(అనుబంధము)

రాజు:—భగవంతుఁడును బరుండును నీశుండు నగు విష్ణుని మాయ మాయు లగువారినిగూడ మోహపెట్టునది. అట్టిమాయను దెలిసికొనఁగోరుచున్నారము. తాము దానిని జెప్పవలయును. మీవచనములు హరికథామృతముతోఁ గూడియున్నవి. ఆయమృతము నెంత జుట్టుచున్నను నాకుఁ దృప్తికలుగకున్నది. వలన నేను సంసారతాపములచేత మిక్కిలి తప్తుఁ డయిన వాఁడను, మఱి మరణశీలుఁడను. ఇట్టి నాతాపమున కదియౌషధముగదే ! దానియెడ నెట్లు తృప్తినొందుదును" అనెను. అందులకు నంతరిక్షుఁడు 'ఆత్మ సత్త్వాదిగుణములు లేనివాఁడు, విశుద్ధుఁడుగాన వానికి శరీరసంబంధమును లేదు. మఱి వాని స్వరూపము స్వయంప్రకాశమైనది. ఇట్టివాఁడు శరీరసంబంధము నొంది గుణములకు వశుఁడై దేహమే తానని భ్రమించుచున్నాఁడు, వాని కిట్టితలక్రిందు చేయునదియె భగవంతుని మాయ. విభుం డామాయచేతనే వివిధంబైన యీ జగమును నిర్మించెను. జాగ్రదవస్థయందుఁ బంచేంద్రియములును మన

స్సును, నస్థిరములై యాత్మకానట్టి దేహాది విషయములందు నాత్మలనియు స్థిరములనియును భ్రమము నొందుచుండును. స్వప్నావస్థయందు బాహ్యేంద్రియము గూడనివట్టి యంతఃకరణము, అస్థిరములగు స్వప్నశరీరాదులందు స్థిరములనుభ్రమము నొందుచుండును. బాహ్యాంతరజ్ఞాన మంతయు లోపించియుండు సుషుప్తియందు వాసనలనెడుబీజములు మాత్రము శేషించియుండును. అదియును బ్రకృతిసంబంధమువలనఁ బుట్టినదే; ఈమూఁడవస్థలతోను గూడియున్న ప్రత్యగాత్మ ప్రకృతి పరిణామమయిన శరీరమును వీడినపుడు గలుగు ముక్తావస్థ, దేహసంబంధమువలనఁ గలుగు నామూఁడవస్థలును వీడిన తుర్యావస్థ యగుచున్నది. జీవుని స్వరూపము రాగాదులచేఁ గలుషితముగానందునఁ బరిశుద్ధమైనది, జాగ్రత్తు మొదలయిన యవస్థాభేదములు లేనిదిగాన యేకమైనది. జ్ఞానైకరసమయినది. అట్లయిన నాప్రత్యగాత్మకుఁ బ్రకృతిపరిణామ మగు దేహముతోడి సంబంధముచేత, స్వప్నమందలి గజతురగాదు లస్థిరములయినను స్థిరములుగాఁదోఁచునట్లు, జాగ్రత్తు మొదలయిన మూఁడవస్థలతోఁగూడియుండున ట్లింద్రియము లంతఃకరణము మొదలగువానికిఁ దోఁచుచున్నవి; ఇట్లుతోఁచుట జ్ఞానస్వరూపమగు ప్రత్యగాత్మ కనాదిపుణ్యపాపాదిక్రియలవలనఁ గలిగినఫలమేకాని మఱొకటిగాదు. ఇట్లాత్మయందు మాయాకార్యములయిన మూఁడవస్థలు కలుగుట,దానికిఁ గర్మములవలననదుమఁ గలిగిన ఫలమేకాని స్వాభావికమైనదిగాదు. ఏలన నామూఁడవస్థలు దానికి స్వాభావికములేని యవి దానిముక్తావస్థయందును గలుగవలయును. అవి గలుగవుగాన దానికి నిత్యములు

గావు. మఱి యిప్పుడును నొకయవస్థయందు మఱియొకయవస్థ తప్పి కలియుటగలదు. అట్లై యీయవస్థ లాత్మకుఁ గలుగవచ్చును. కాన, యివి దానికి స్వభావసిద్ధములు గానేరవు. స్వప్నమందలిసుఖము క్రియాఫలమై యనిత్యముగానుండునట్లై యిదియు నగునని విమర్శించినయెడలఁ బురుషుఁ డిట్టి క్షుద్రసుఖములకై పాటుపడుట యుడుగుచున్నాఁడు. ఆద్యుండును మహాభుజుండు నగు పరమపురుషుఁడు సకలభూతముల కంతరాత్ముఁడై మాయాకార్యము లయినయీ పృథివ్యాదిసమష్టిభూతములచేత నెక్కువతక్కువలుగానున్న పలువిధములయిన భూతములను సృజించెను. అట్లుసృజించుటయేల? తనకుశరీరభూతములయిన జీవులు కరణకళేబరములుపడసి తన్నారాధించి ముక్తియను పురుషార్థము నొందవలయుననియె. ఇట్లీపురుషార్థసిద్ధికై పంచమహాభూతములచేత సృజించిన శరీరములందుఁ బ్రత్యగాత్మప్రవేశించి జ్ఞానకర్మేంద్రియములచేతను నంతఃకరణముచేతను దనజ్ఞానమును బదునొకండు విధముల విభజించుకొని శబ్దాదివిషయములనే కుడుచుచున్నాఁడు. కాని,పరమపురుషు నారాధింపఁడు. ప్రభుండా జీవుఁడు భగవంతునిచే, సృజింపఁబడిన యీశరీరమునే యాత్మగాఁదలఁచుచుఁ, బరమపురుషుఁ డంతర్యామియై గుణపరిణామములగు తన యింద్రియములను బ్రవర్తించునట్లు పురికొలుపఁగా, నాయింద్రియములచేత శబ్దాదివిషయములను ననుభవించుచు నైహికవిషయములయందే తగులువడి యుండును. ఇట్లు విషయములననుభవించుచుండుట పయిపయిని విషయములందుఁ దగులువడుటకు హేతువగుచున్నది. ఈసంసారమందు దేహియగు జీవుఁడు పూర్వాపూర్వదేహములం దార్జించిన కర్మ

వాసనలనుబట్టి పుణ్యపాపకర్మములను జేయుచున్నాఁడు. ఆకర్మములును ఉత్తరోత్తరదేహములను గలిగించునట్టి వాసనలతోఁ గూడినవై యుండును. అట్టికర్మము లాచరించుచు వానికిఁగల సుఖదుఃఖఫలము లనుభవించుచు మీఁద దుఃఖములు దాఁపరించుచుండు విధమున భ్రమించుచున్నాఁడు. జీవుఁడిట్లు బహుదుఃఖావహములగు దేహములను గర్మములచేతఁ బొందుచుఁ బ్రకృతిపరవశుఁడై మహాభూతప్రళయపర్యంతము నుత్పత్తిమరణపరంపరలను బొందుచునుండును. పంచమహాభూతప్రళయము సమీపించినప్పుడు, ఆద్యంతశూన్యుఁ డగు పరమపురుషుఁడు కాలశరీరకుండై పంచభూతములచేతను శబ్దాదిగుణములచేతను నిర్మితమయి స్థూలముగా నున్న యీజగత్తును నామరూప విభాగములేక సూక్ష్మమై తమస్సనఁబడు నచిత్తును నాకర్షించుచున్నాఁడు. అప్పుడు నూఱుసంవత్సరములు మిక్కిలి దుస్సహమయిన యనావృష్టి భూమియందుఁ గలుగును. అట్టి కాలమున నుష్ణము మిక్కిలియుఁ బెరిఁగినవాఁడై సూర్యుఁడు మూఁడులోకములను మిక్కిలి తపింపఁజేయును. అపుడు సంకర్షణుని ముఖాగ్నిజ్వాలలు పయికిఁ జెంగలింప వాయువునుదోడుపడఁగాఁ బాతాళము మొదలుకొని నలుప్రక్కల మంటల నిగిడించుచుఁ బెరుఁగును. పిదప సాంవర్తకములను ప్రళయకాల మేఘములసమూహము నేనుఁగుతుండములంతలు జలధారలతో నూఱుసంవత్సరములు గురియును. అంత బ్రహ్మాండము జలమందు లీనమగును. అంత నావిరాట్టు (బ్రహ్మాండము) లోపలనున్న జీవవర్గము, లీనంబయిన యాబ్రహ్మాండమును విడిచి కట్టెలు లేని యగ్గి ముడింగియున్నట్లు తనజ్ఞానమును సంకుచితమైయుండ

సూక్ష్మావస్థమై తమస్సనఁబడు ప్రధానమును జొచ్చుచున్నది. అంత భూమి తన్ను నెలకొలుపునట్టి గంధమును ప్రళయ వాయువు హరింపఁగా నంత జలమునందు లయించుచున్నది. జలమును దనరస మావాయువుచేఁగోలుపోయి జ్యోతిస్సునందు లయించుచున్నది. ఆజ్యోతియుఁ బ్రళయతమస్సుచేతఁ దన రూపము హరింపఁబడఁగా వాయువునందు లయించుచున్నది. వాయువును దనస్పర్శమును నాకాశముహరింపఁగా నాయాకా శమందు లయించుచున్నది. ఆకాశమును దనగుణము కాలము చేత (కాలాత్మకుఁడైన యీశ్వరునిచేత) నపహృతముగాఁగా, భూతాదియందు లయించుచున్నది. పది యింద్రియములును, మనస్సును, బుద్ధియును దమ యధిష్ఠాతలగు దేవతలతోడఁ దమకుఁ గారణభూతమగు సాత్త్వికాహంకారమును బ్రవేశించు చున్నవి. ఆయహంకారము మూఁడువిధములును, దనకార్యము లతోఁగూడి, కారణభూతమగు మహత్తునందుఁ జొచ్చుచున్నవి. ఈభగవంతునిమాయ మహత్తత్త్వమునకుఁ గారణభూతమయి నది. కనుక నామహత్తు దానియందుఁ బ్రవేశించుచున్నది. ఆ మాయ సృష్టిస్థితిసంహారములను జేయుట కుపయుక్తమై యెఱుపు తెలుపు నలుపను మూఁడువర్ణములు (అనఁగా రజ స్సత్త్వ తమస్సులను మూఁడుగుణములు) గలిగియుండును. మేము దాని (స్వరూపమును గార్యములను) వర్ణించితిమి. మఱియు నేమి వినఁగోరెదవు' అనెను.

రాజు—'జితేంద్రియులు గానివారికిఁ దరింపనలవికాని యీ భగవంతునిమాయను స్థూలబుద్ధులగుమాబోఁట్లు సుఖముగా నేయుపాయముచేత దాఁటుదురో మహర్షీ! దానిని జెప్పు,

మనెను. ప్రబుద్ధుఁడు—'మనుజు లాలుమగలుగాఁ గవగూడి వర్తించుచు దుఃఖములను బోఁగొట్టుకొనుటకును సుఖమును బడయుటకును, నాయాకర్మములను నారంభింతురు. కాని యాకర్మములవలన దుఃఖముపోయి సుఖముగలుగక తలక్రిందుగా దుఃఖమే పరిణమించుట గాంతురు. విత్తమును సంపాదించుట మిగులఁ గష్టము. మఱి దానిని సంపాదించుటకు మరణాంతములగు సాహసకర్మములకుఁ బాలుగావలయును; అది మృత్యురూపమేయగును. కనుక దానిని సంపాదించుట నిత్యమును దుఃఖమునిచ్చుచు నేయుండును. ఇట్లు విత్తముగాని మఱి గృహములు సంతానములు మిత్రులు పశువులు మొదలగునవిగాని యెంతోకష్టపడి సాధించినను దుడకున స్థిరము లేకాని సతములుగావు. కనుక వానిని సాధించినను కలుగునట్టి సుఖమేమి ? ఈలోకమందలి విత్తాదిసుఖమువలెనే పరలోకసుఖమును ననిత్య మని కనుఁగొనవలయును. ఏలనఁగా నది కర్మముచేత సంపాదింపఁబడినది. కనుకఁ గర్మకృతము లెల్ల నశ్వరము లేయగును. దానికి మండలేశ్వరుల సుఖమునకుంబోలె నతిశయమును ధ్వంసమును సమానమైయుండును. ఇహపరసుఖము లిట్టివిగానుండుటంబట్టి వానియందు వెగటొంది యుత్తమంబగు శ్రేయస్సునను దత్సాధనమును దెలియఁగోరి వేదములందును బ్రహ్మజ్ఞానమునందును బూర్ణుండును రాగద్వేషాదులు లేమికిఁ బట్టయినవాఁడును నగు గురువుశరణు చొరవలయును. గురువే తనకుదైవముగాఁ గల వాఁడాగురువుసన్నిధియందు నిష్కపటంబయిన సేవ సేయుచు భాగవతధర్మముల నభ్యసింపవలయును. ఆధర్మములచేతఁ దన్నడిగినను నిచ్చునట్టి పరమదాతయగు సర్వాంతరాత్ముఁడు హరి

యెంతయు సంతోషించును. ఆధర్మములను వినుము. మొదట దేహమునందును దానిని సంబంధించినవానియందు నన్నిటను సంగము లేకుండుటయును, సాధువులతోడి సహవాసమును, భూతములలో యథోచితముగా దీనులయందు దయయు సములయందు మైత్రియు, నుత్తములయం దడఁకువయును, బాహ్యాంతరములని రెండువిధములగు శౌచమును, దమతమ వర్ణములకు కుచితములయిన ధర్మముల ననుష్ఠించుటయును, దపమును, ద్వంద్వముల సహించుటయు, వేదాధ్యయనమును, మనోవాక్కాయము లొక్కరూపముగా నుండుట యనెడి యార్జవమును, ఋతుకాలములందక్కఁదక్కిన యెడల స్త్రీసంగము లేకుండుట యను బ్రహ్మచర్యమును, భూత ద్రోహము లేమి యనెడియహింసయు, శీత ముష్ణము సుఖము దుఃఖము మొదలగుద్వంద్వములయందు సమత్వమును, సమస్తచేతనాచేతనములందుఁ బరమాత్మ యొక్కఁడేయని కనుఁగొనుటయు, పరిగ్రహము లేవియు లేక తానొక్కండై యుండుటయు, గృహాదులం దభిమానము లేమియు, శుద్ధములగువల్కలములను ధరించుటయు, దైవవశమున లభించిన దానితో సంతుష్టినొందియుండుటయు, భగవత్ప్రతిపాదకములగుశాస్త్రములం దాదరాతిశయమును, తక్కిన దేవతాంతరములయందు నిందయు; మనస్సును బ్రాణాయామములచేతను వాక్కును మౌనముచేతను నసత్యమును పలుకకుండుటచేతను, కర్మములను జేయమిచేతను దండించుటయు, భూతహితముగాఁ బలుకుట యనుసత్యమును, అంతఃకరణనిగ్రహ మగు శమమును, బాహ్యేంద్రియనిగ్రహ మగు దమమును, అద్భుతకర్ముండగు హరిజన్మములను గర్మములను గుణములను విను

టయుఁ గీర్తించుటయు ధ్యానించుటయు, భగవంతునికొఱకు సకలకర్మముల నర్పించుటయు యజ్ఞములను దానములను దపస్సును స్మార్తకర్మములను వృత్తములను మఱి తనకుఁ బ్రియమయిన దానిని బెండ్లములను బుత్త్రులను గృహములను బ్రాణములను నా పరమపురుషునకు నివేదించుటయు, కృష్ణుఁడే యాత్మనాథుఁడుగాఁ గల మనుష్యులయందు సౌహార్దమును దక్కిన చరాచరములగు భూతములయందును బహుమతియు మహనీయులును సాధువులు నగుమనుజులవలననుండి భగవంతుని యశమును బరస్పరము చెప్పుకొనుటయు, ఆ యశస్సునుగూర్చి పరస్పరమనురాగమును, దానిననుభవించుటవలనఁ బరస్పరము తుష్టియు, దానివలనఁ బరస్పరము మనస్సు నధ్యాత్మికాది తాపత్రయమునుండి నివర్తించుటయు నను వీనిఁ గఱచుటయు, సాధనములయందు భక్తివలనను బ్రేమలక్షణంబగు భక్తివలనను దేహమునందు గగ్గురుదాల్చుటయు, లోకవిలక్షణులై యచ్యుతుని దలంచుకొని యొక్కయెడ నేడ్చుచును నొక్కయెడ నవ్వుచును నొక్కయెడ నానందించుచును నొక్కయెడ నేమోమో చెప్పుకొనుచు నాడుచును బాడుచును భగవంతుని స్వరూప స్వభావాదులను బరిశీలించుచును నిట్లు పరమపురుషుని మనస్సుచేఁ బొంది సుఖితులై యూరకుండుటయును, ననెడి యివి భాగవతధర్మములు. ఈ భాగవతధర్మములను గఱచుచు నారాయణపరుఁడై నారాయణు నారాధించుటవలనఁ బుట్టిన భక్తిచేత దుస్తరంబగు మాయను నజ్ఞుం డగువాఁడును దాఁటుచున్నాఁడు' అనెను.

జనకుఁడు:—'నారాయణాభిధానుండును బ్రహ్మంబునగుపరమాత్ముని స్వరూపనిశ్చయమును మీరు మాకుఁ జెప్పవలయును. మీరు బ్రహ్మవిదులందు మిన్నలుగదా' యనెను. అందులకుఁ బిప్పలాయనుఁడు - 'ఎవఁ డీజగత్తునకు సృష్టిస్థితిప్రళయములకు హేతువును, దనకుఁ గారణాంతరము లేనివాఁడును స్వప్నజాగరసుషుప్తులయందును ముక్తావస్థయందును సకలాత్మలలోను నంతరాత్ముఁడై వ్యాపించి యుండువాఁడును నగునో, ఎవఁడు దేహమును నింద్రియములనును బ్రాణములను మనస్సును మేలుపుటవలన నవి మెలంగుచున్నవో, యట్టి వస్తువు రాజేంద్రా ! పరబ్రహ్మ మని తెలియుము. దానిని మనస్సు గూడ తెలియంగఁజాలదు. మఱివాక్కునకు నది గోచరముగాదు. మఱి కన్నును జీవుఁడును బ్రాణములును దక్కిన యింద్రియములును నాబ్రహ్మమునకు విశేషణము లైనవిగాని, అగ్నిని దాని విశేషణములగు జ్వాలలవలె, నవి యాబ్రహ్మమును బ్రకాశింపఁ జేయఁజాలవు. వేదాంతభాగమును బరమాత్మవిషయమైన ప్రమాణమును 'నచక్షుషాదృశ్యతే' 'నాపివాచా'యని గ్రాహకములగు చక్షురాదులకు నగోచరమైనదిగా బోధించుచున్నది. గ్రాహకములే యది లేదని నిషేధించుచుండఁగా నది యెట్లున్నదని ప్రతిపాదింపఁబడిన దన్నచో, ఒక వస్తువుండిననే దానిని గుఱించి 'తెలియ' దని నిషేధము సేయుట పొసఁగునుగాని లేనివస్తువునుగూర్చి యట్టి నిషేధము సిద్ధింపఁజాలదు. కనుక బ్రహ్మము లేనిచో దానిని గూర్చి బోధకముల నిషేధమే సిద్ధింపనేరదు. కనుక నది యర్థవశముగానున్నదనియె యేర్పడుచున్నది. సత్త్వము రజస్సు తమస్సు

నెడి మూఁడుగుణములు వర్తించునట్టి ప్రధానతత్త్వము, అది కార్యముల కెల్ల నాధారముగాన సూత్రమైనది. దానికార్యము లగు మహత్తును నహంకారమును దత్కార్యములును తత్త్వములుగా నిరూపించెదరు. జీవుండును జ్ఞానకర్మేంద్రియముల కును విషయములకును సంబంధమువలనఁ బుట్టి సుఖదుఃఖాదుల ననుభవించు చుండుననియుఁ జెప్పుదురు. ఇట్టి వగుచేత నాచేతనములెల్ల నచింత్యశక్తియగు బ్రహ్మముగాఁ బ్రమాణములచేఁ దెలియుచున్నది. మఱియు నది యాచిదచిత్తులకు విలక్షణమైనది. ఆత్మకుఁ బుట్టుకలేదు, పెరుఁగుటయు లేదు, తఱుఁగుటయు లేదు, కాన చచ్చుటయుఁ గలుగదు. అవియంతయు ననిత్యములగు దేహములకే కలుగును. ఆత్మభూతభవిష్యద్వర్తమానములనెడి కాలత్రయమునందును వర్తించుచుండును గాన నిత్యుఁడు. అది యెప్పుడు నెల్లయెడలఁ దనస్వరూపమును బాయకుండును. ఏలనఁగా నది జ్ఞానైకస్వరూపము, కన్ను చెవులు మొదలగు వానిని సంబంధించిన జ్ఞానములు పాయుచుండలేదా యన్నచో ప్రాణమొక్కటి ప్రాణాపానాదులయిన వృత్తిభేదములచే వికల్పితమగునట్లుగా నింద్రియజ్ఞానమును జక్షురాదివ్యాపారముల వశమున వికల్పముఁ నొందుచున్నది కాని, స్వరూపభూతమగు జ్ఞానమట్టిదిగాదు. అండజములందును జరాయుజములయందును, నుద్భిజ్జములయందును స్వేదజములందును జీవుండు ప్రాణమూలమున ధారకుఁడై ప్రవేశించుచున్నాఁడు. ఆ జీవుఁడు నిర్వికారుఁడు. ఇట్టి యాత్మ యందఱకును దెలియకుండుట యేలయన్నచో నిది మిక్కిలి స్ఫుటముగాఁ బ్రకాశించునదిగాదు. అయిన నింద్రియసమూహమ్ము లహంకా

కారాది మనోవ్యాపారములును నుడిగినపిదప శరీరమును వీడిన పిదప జీవులమగు మనకు జీవుని యథావస్థితమగు స్వరూపము ప్రకాశించిన దగును. అహంకారాది మనోవృత్తులు విరమించుట యెప్పుడందువా? దారపుత్రైషణాదులను దిగవిడిచి యజ్ఞనాభుని పదారవిందములందే యీషణగలిగి దానిచేతను నవిచ్ఛిన్నమగు పరమభక్తిచేతను సత్త్వాదిగుణమూలము లగు పుణ్యాపుణ్య కర్మములవలన మనస్సునకుఁ గలుగు రాగద్వేషాది మలములను నాశముచేయవలయును. అప్పుడు నిర్మలమగు నాచేతస్సునందు నాత్మకుఁ గలయాథార్థ్యము,చక్కనిచూపు గలవానికి సూర్యప్రకాశమువలెఁ, దనంతటఁ దెలియును" అనెను.

రాజు-'మాకు భగవదారాధ నాత్మక మగు కర్మయోగమును జెప్పెఁడు. ఆకర్మయోగముచేత సంస్కృతుఁ డైనవాఁ డెందు భగవద్భక్తియోగమునుత్పత్తికి విరోధులయిన పుణ్యాపుణ్యకర్మము లన్నిఁ దూలించి బంధకములగు సకల కర్మముల నివృత్తికి హేతువయినపరభక్తి పొందుచున్నాఁడుగదా. ఇట్లుడిగిన యీకర్మయోగము నాఁడి మిమ్మడిగినట్లె మాతండ్రి యిక్ష్వాకునిసమ్ముఖమున సనకాదులగు ఋషుల నడిగితిని. ఆ బ్రహ్మపుత్రులు నాకుఁ గర్మయోగమును నిరూపింప రయిరి. అట్లు చెప్పకుండుటకుఁ గారణ మేమొ నుడువవలయు' నని యడిగెను. ఆవిర్హోత్రుఁడు – 'కర్మము (కామ్యకర్మము) అకర్మము (జ్ఞాన పూర్వకర్మము) వికర్మము (నిషిద్ధకర్మము) నని యీ వాదము వేదోక్తముగాని లౌకికముగాదు. వేదమో యీశ్వరాభిప్రాయమైనది. మఱి వేదోక్తము లయినయా

కర్మాదులయందుఁ దెలిసికొనవలసిన విషయములు పెక్కులు న్నవి. కాన మిక్కిలి గహనము లగుటంజేసి వాని పట్ల విద్వాంసులును దెలియక తడఁబడుచున్నారు. కనుక బాలుండ వగునిన్నుఁజూచి యాసనకాదులు చెప్పరయిరి. ఈవేదము హితాహితములను దెలుపునట్టిదే యైనను దానియందు 'యజేతస్వర్గకామ' యిత్యాదుల కర్థములు ప్రత్యక్షాదులకు గోచరములు గావు; అవి పరోక్షములుగానే యుండునుగాన వాని యభిప్రాయము దెలియుట కష్టము.అయినను వైద్యుఁడు బాలురకుఁ గండచక్కెర లడ్డు మొదలగునవి యిచ్చెదనని యాశపెట్టి మందుఁ ద్రాగించుచున్నాఁడు. కాని యాచెప్పిన లడ్డు మొదలగువాని నియ్యక తుదకారోగ్యమును గుదుర్చుచున్నాఁడు. అట్లె వేదమును నవాంతర ఫలములగు రంభాసంభోగాదులిచ్చున ట్లాశకొలిపి యజ్ఞాది కర్మములను జేయునట్లు విధించుచున్నది గాని, పిదప నా చెప్పిన ఫలముల నొసంగక భక్తి యోగమూలమున బంధకములగు సకల పుణ్యాపాపకర్మముల నివృత్తిరూపమగు మోక్షమునే యొసంగుచున్నది. అజ్ఞుఁడెవఁడింద్రియములను జయింపక వేదవిహితమైన కర్మము నాచరింపక వేదవిరుద్ధములైన కర్మముల ననుష్ఠించుచు, నావశ్యకములయినవాని ననుష్ఠింపకయు నుండునో వాఁడు మృత్యువు నుండి మృత్యువునే పొందుచున్నాఁడు. కాఁబట్టి వేదోక్తములగు నిత్యనైమిత్తిక కామ్యకర్మములను నీశ్వరార్పితముగాఁ జేయుచు నాయావాని యవాంతరఫలములందు సంగములేకయుండువాఁడు బంధకములగు సకల కర్మములును నివర్తించుటకు మూలమగు జ్ఞానసంపత్తిని-అనఁగాఁ గర్మయోగముచే

జ్ఞానయోగమును-బొందుచున్నాఁడు. అయినను గర్మముల కక్కఱలేని యాయవాంతరఫలము లేల శ్రుతి చెప్పుచున్న దందువా? కర్మముల ఫలము గలదను శ్రుతి యర్థవాదమే యగును (ఇది నిత్యనైమిత్తిక కామ్యరూపమగు వైదిక కర్మయోగము. ఇఁకఁ దాంత్రిక కర్మయోగమును వినుము.) అహంకార మమకారాదులు ప్రకృతిసంబంధములగు కార్యములు. అవి హృదయమునఁదగిలి భేదింపరాకుండునట్లు ముడిగొని యుండును. పురుషుఁ డెవ్వఁడు తనహృదయమునంగల యట్టిముడిని విడిచికొనఁ గోరి తంత్రము (పాంచరాత్రము) నందుఁ జెప్పఁబడిన విధిచొప్పునను దేవునిఁ గేశవుని నారాధించునో వాఁడు, వేగభక్తియోగము నిష్పన్నముకాఁగా, ప్రకృతిబంధమునుండి విడివడుచున్నాఁడు. ఆతంత్రవిధియిది. ఆచార్యునివలననను గ్రహింపబడసి యతఁడు చూపినపూజాప్రకారమున మహాపురుషుని మూర్తిని దన కభిమత మయినదాని నర్చింప వలయును. శుచియై యామూర్తికి నెదురుగాఁగూర్చుండి ప్రాణాయామము మొదలయినవానిని బచరించి దేహమును విశోధించి మంచి న్యాసములచేత రక్షగావించుకొని హరి నర్చింపవలయును. ప్రతిమాదులయందుఁ గాని హృదయమందుఁ గాని యీశ్వరునిఁ, బూజకై యప్పటికి దొరకిన సాధనములతోఁ బూజింపవలయును. అందు మొదటఁ బూజకైన తులసీ చందన పుష్పాది ద్రవ్యములను బ్రోక్షణాదులచేతను, భూమి నూడ్చి యలుకుట మొదలగు వానిచేతను, దేహమును నాయా న్యాసాదులచేతను, భగవత్ప్రతిమను మృత్తికాలేపన జలక్షాళనాదుల చేతను, యోగ్యములుగావించుకొని యాసనమును బ్రోక్షింప

వలయును. పిదపఁ బాద్యము మొదలగువాని పాత్రముల నేర్పఱచు
కొని, సమాధిచేతఁ బ్రతిమాదులయందు భగవంతు నావాహ
నము చేసి, హృదయాదిన్యాసములు గావించి మూలమంత్రము
చేతను న్యాసము గావించి యామంత్రము చేతనే యర్చింప
వలయును. మఱియు నాయామూర్తిని నంగములగు హృద
యాదులను నుపాంగములగు సుదర్శనాదులను నతని పరి
వారమును నా యా మూర్తిమంత్రము చేతనే యర్చింపవల
యును. అర్ఘ్యము, పాద్యము, ఆచమనీయము మొదలయినవి
యును, స్నానము వస్త్రము భూషణము గంధ మాల్యాక్షత
ములును బుష్పదామ ధూపదీపములు నైవేద్యము మొద
లయిన యుపచారముల నొసంగి భగవంతునికి నతని పరివార
మునకును యథావిధిని బూజగావించి స్తోత్రములచేత స్తుతించి
నమస్కరింపవలయును. అంతఁ దాను ధ్యానించెడి యామూర్తి
తనయం దంతరాత్మయై యున్నాఁడని ధ్యానించుచు దానిని
బూజింపవలయును. ఆ భగవంతున కర్పించిన యన్నశేషమును
దాను భుజింపఁగయికొని భగవంతుని కర్పించిన తులసీపుష్పా
దులను సత్కారముతో శిరస్సున ధరించి యిట్లు సంపూజితుం
డయిన యాహరిని నతనిపట్టయిన పరమాకాశాదులకు నుద్వా
సనము చేసి పూజావిధిని సమాప్తము గావింపవలయును. ఈవిధ
మున నే యగ్ని సూర్యుఁడు జలము మొదలగువానియందును
నతిథులయందును హృదయమునందును సర్వాంతరాత్ముం
డయిన యీశ్వరుని పూజించువాఁడు చిరకాలముననే భక్తి
యోగము నిష్పన్నమై కర్మబంధములనుండి విడివడుచున్నాఁడు.
ఇది మూఁడవయధ్యాయము.

జనకార్షభ సంవాదము.

(అనుబంధము.)

రాజు—'హరి కర్తవశుఁడై కాక తన యిచ్ఛచేతనే యిం దవతరించుచున్నాఁడు గదా. అట్టి యవతారము లెం దేయేవి యెత్తి యేయేకర్మము లింతవఱకును జేసెనో, యిపుడు చేయుచున్నాఁడో, యికఁ జేయఁగలఁడో, వానిని మాకుఁ జెప్పుఁడు' అని యడిగెను. ద్రమిళుఁడు—భగవంతుని స్వరూప స్వభావము లవిచ్ఛిన్నములు. అట్టి యనంతుని గుణములు ననంతము లయినవి గావున వాని నెవఁడు లెక్కింపఁబూనునో వాఁడు మందమతి యగును. ఏలందువా? భూమి రేణువులను బెద్దకాలమున కెట్లో కష్టపడి లెక్కించినను లెక్కింపవచ్చునుగాని వివిధ విచిత్ర శక్తుల కెల్లఁ బట్టయియుండు భగవంతుని గుణములనో యనంతము లగుటంబట్టి యెంతమాత్రము గణింపఁదరము గాదు. ఆదిదేవుం డగు నారాయణుఁడు తాను సృజించిన పృథివి మొదలుగాఁగల భూతములనును దక్కిన తత్త్వములనును విరాట్టనఁబడు బ్రహ్మాండరూపముగా రచించి యాపురమందుఁ దనయంశముచే ధారకుఁడై ప్రవేశించి యపుడు (విరాట్) పురుషుఁడను నామము నొందెను. (ఈవైరాజపురుషుఁ డవతారములందెల్ల మొదటిదగును) ఆవైరాజపురుషునికి దేహమీమూఁడులోకము లగును. అతని యింద్రియములచేత సమస్తజీవులకును జ్ఞానకర్మేంద్రియములు గలిగినవి. అతని జ్ఞానము తనంతటఁ బ్రసరించునదిగాని యింద్రియములతో డపేక్షించునది గాదు. అతనియూపిరియగు వాయువే దేహధారుల కెల్ల బలమును, ఓజస్సును, చేష్టలును గావించుచుండును.

ఆతఁడు తనకు లోనయినప్రకృతిగుణము లగుసత్త్వాదులను గొని యీజగత్తునకు నుత్పత్తి స్థితి లయములు గావించునట్టి యాదికర్త (యుపాదానమును నిమిత్తమును) యగుచున్నాఁడు. అదియెట్లనిన—మొదట నీజగత్తును సృజించు విషయమున రజోగుణముతోఁ గూడిన బ్రహ్మ యాయెను. దీనిని సంహరించుటకై తమోగుణముతోఁ గూడిన రుద్రుఁడాయెను. దీనికి స్థితి గలిగించుటకై - సకలదేవతాశరీరకుండును యజ్ఞనిర్వాహకుండునయిన విష్ణుండు తానే పూనెను. అనిష్టములను దొలఁగించి యిష్టములను గలిగించుటయె కదా స్థితి. త్రైవర్ణికులను వారి వారి వర్ణాశ్రమములనుఁ దగిన ఫలములను నీవిష్ణుఁడు బొందించుచున్నాఁడు గాన, స్థితి గావించువాఁడగును. ఆద్యుండయిన యాపురుషుఁడే యిట్లు ప్రజలకు నెప్పుడు నుత్పత్తి స్థితి లయములు గావించుచుండును. ఇదియే రాజపురుషావతారము. భగవంతుఁడు ధర్మునికి దక్షుపుత్రికూఁతురగు మూర్తియను దానియందు నరుఁడు నారాయణుఁ డని యిరువురుగా నవతరించెను. ఈ యవతారమునం దత్యంతమును బ్రశాంతుఁడై యుండును. బంధకములగు సకలకర్మములను నివర్తించుటకు హేతువగు జ్ఞానయోగమును నారదాదులకు నుపదేశించెను. అతఁ డిప్పుడును ఋషివరులు తనయడుగులు గొలుచుచుండఁగా బదర్యాశ్రమమం దున్నాఁడు. ఇంద్రుఁడొకప్పు డతఁడు తపస్సుచేతఁ దనపదవిని గయికొనఁ గోరుచున్నాఁడేమోయని శంకించి యతని తపస్సును నాశముచేయుటకై మన్మథుని సపరివారముగాఁ బంపెను. ఆకాముఁ డతని మహిమ తెలియనివాఁడు గాన యప్సరసలగణము వసంతుఁడు మందమారుతము మొద

లయిన తన బలఁగమును గూర్చుకొనిపోయి యమ్మునిని సప్స
రః స్త్రీల వాలారు చూపులనెడి వాఁడిబాణముల గ్రుచ్చెను.
ఆ యాదిదేవుఁడు నింద్రుఁడు గావించిన యాయపరాధమును
దెలిసికొనెను. అతఁ డందులకు లోనుగామికిఁ దానుధీరుండ నని
కొంచెమైనను గర్వపడక తానెక్కడ శాపమిడునో యని వడఁకు
చున్న యాకామాదులను జూచి నవ్వుచు 'మదనా! మారుతా!
దేవతాస్త్రీలారా! భయపడకుఁడు. మీరు మాయాతిథ్యమును
గయికొనుఁడు. మాయాశ్రమము నశూన్యము గావింపుఁడు'
అనెను. శుకుఁడు—రాజా! ఇట్లతఁ డభయ మొసంగి వారితోఁ
జెప్పఁగాఁ గాముఁడు మొదలయిన యాదేవతలు సిగ్గునఁ దలలు
వాంచి యతనికిఁ దమయెడఁ గరుణపుట్టునట్లుగా 'అపరాధుల
మైనను మమ్ము ననుగ్రహించుట నీయం దొకవింత గాదు.
మఱి నీవు ప్రకృతిపురుష విలక్షణుండ వగు పరుండవు. కనుకఁ
గామ క్రోధాది వికారములు నిన్నుఁ బొందవు. మఱి యాత్మా
రాములును జితేంద్రియులు నగువా రెప్పుడును గుములుఁకొని
నీపాదపద్మములు గొలుచుచుందురు. నీభక్తులకే కామాది
వికారములు లేవనఁగా నీ కెక్కడివి? దేవతలమగు మాకిట్టి
యపరాధములు చేయుట స్వభావమైయున్నది. ఎట్లనిన, నిన్ను
సేవించుచుండు వారు దేవతల మగుమాప ట్టయినస్వర్గమును
గూడ నతిక్రమించి సర్వోత్తమమయిన నీ స్థానమును బొందు
చుందురు. కాన దానికిఁ జూపోపక దేవతలు వారికిఁ బెక్కువిఘ్న
ములు గావించుచుందురు. నిన్ను సేవింపని వారికో యట్టి విఘ్న
ములు సేయరు. ఏలన సేద్యగాండ్రు రాజునకుఁ గప్పము నొసఁ
గునట్లు వారు యజ్ఞమునందుఁ దమభాగములగు పురోడాశాదు

లను నా దేవతలకు బలు లర్పించుచుందురు. అయిన నా భక్త లకు విఘ్నములు కలిగియే తీఱునందువా? అట్లుగాదు. సర్వ దేవతల కధీశ్వరుఁడవగు నీవు వారిని రక్షించుచుండుటవలన నీభక్తుఁడు విఘ్నములతలపయిని కాలిడి త్రొక్కఁగలఁడు సుమీ! ఆఁకలి,దప్పి, శీతము,ఉష్ణము, వర్షము, గాలి, జిహ్వోప భోగములు శిశ్నోపభోగములు మొదలుగాఁగల మేమెల్ల నొక యపారసముద్ర మగుదుము. కొందఱట్టి మహాసముద్రమును దాఁటియుఁ దుదకు నిష్ఫలమయిన కోపమునకు లోనై యావు నడుగంత పల్లములో మునిఁగిపోయెదరు. నీట మునిఁగినవాఁడు తలపయినున్న బరువును దిగవిడుచునట్లు, వారు చేయఁదరము గాని తపస్సుచేసియుండియు, దాని నెల్ల వీరికిని వారికిని శాప ములు పెట్టి వెచ్చించి * వ్యర్థముగా దిగవిడచిన వారగుదురు' అనెను. ఇట్లు కామాదులు పలుకుచుండఁగా నావిభుండు వారల రూపగర్వము నడంచుటకై కొందఱు స్త్రీలను వారికిఁజూపెను. ఆ స్త్రీలు చక్కఁగా నలంకృతలై మిక్కిలి యద్భుతముగాఁ గనుపట్టుచుండిరి. వా రామహాత్మునకు శుశ్రూష గావించుచుం డిరి. దేవానుచరులయిన యాకామాదులు శ్రీదేవివలెఁ జక్కని రూపములు వెలుంగుచున్న యా మెఱుంగుఁ బోండ్లను జూచి వారి రూపంపుఁ బెంపువలనఁ దమ కాంతులు డిందుపడ వారి దేహములనుండి గుమగుమ గుబాళించుచున్న వాసనలు సోఁకఁ

---

*భగవంతునియందు భక్తిలేక కేవల తపమును మాత్రము చేయు వారు గలరు. వారిలో కొందఱు కామమునకును గొందఱు క్రోధమునకును లోనగు దురు. కామమునకు లోనయినవారు కామోపభోగములనైన ననుభవించెదరు గాని. క్రోధవశు లది కూడలేక వ్యర్థులగుదురు గాన మిక్కిలియు మూఢు లని భావము.

గాఁ బరవశులయిరి. ఆ దేవదేవేశ్వరుండు తనకుఁ బ్రణతులయి యున్నవారలను జూచి నవ్వుచు "ఈ స్త్రీలయందు మీకు నీడగు రూపుగలదాని నొక్కపడఁతిని గోరికొనుఁడు. అందఱును 'మాకెంతో యెక్కుడుగాని మాకీడయినది గలుగ దందురా'. అట్లైనచో మీ స్వర్గమున కలంకారముగా నేని యొక్కదానిని వరింపుఁడు" అనెను. ఆదేవభృత్యులాభగవంతునియాజ్ఞను వల్లెయని యంగీకరించి యతనికి నమస్కరించి యప్సరసలయందుమిక్కుటముగా నూర్వశిని వరించి మున్నిడికొని దేవలోకమునకుఁ బోయిరి. వారు దేవేంద్రుని కొలువుకూటమునకుఁ బోయి యతనికి మ్రొక్కి దేవతలందఱును వినుచుండఁగా నతనితో నారాయణఋషి బలమును జెప్పిరి. ఇంద్రుఁడు విని యాశ్చర్యపడి భయమునొందెను. ఇది నరనారాయణావతారము. అచ్యుతుండగు విష్ణుండు జగత్తులకు మంగళముగావించుటకై తనకళచే హంస స్వరూపమునను, దత్తాత్రేయుఁడుగను సనందనాదులు గాను మాతండ్రియు భగవంతుఁడునగుఋషభుఁడుగను నవతరించి జీవాత్మపరమాత్మస్వరూప జ్ఞాన యోగము నుపదేశించెను. మధువును సంహరించిన యావిష్ణువే హాయగ్రీవుఁడై యవతరించి యపహృతములయిన వేదములను మరలఁ దెచ్చెను. ప్రళయమందు మత్స్యావతారమెత్తి మను వగుసత్యవ్రతునిని భూమినిని నోషధులను ఋషులను రక్షించెను. వరాహమై ప్రళయజలములనుండి భూమిని నుద్ధరించి హిరణ్యాక్షునిఁ జంపెను. కూర్మావతారమున నమృతమునకై పాలసముద్రమును జిలుకునపుడు తనవీఁపుపయిని మందరపర్వతమును దాల్చెను. పిదప శరణాగతుఁడయి మొఱయిడిన గజేంద్రుని

మొసలినుండి విడిపించి రక్షించెను. * వాలఖిల్యు లనుఋషులు కశ్యపునికై సమిధలు దెచ్చుచుండి గోష్పదమందుఁ బడి మునింగినపుడు తన్ను స్తుతింపఁగా లేవనెత్తి యాపదనుండి విడిచిపుచ్చెను. ఇంద్రుఁడు వృత్రాసురుని వధించుటవలన బ్రహ్మహత్యనుబొందఁగా వానిని విడిపించెను. అసురయగు హిరణ్యకశిపుని గృహమందుఁ జెఱఁబడి దిక్కు లేకయుండిన దేవతాస్త్రీలను విడిచిపుచ్చెను. నృసింహుఁడై సాధువుల కభయము గావించుటకు నసురేంద్రుఁడగు హిరణ్యకశిపుని వధించెను. దేవాసుర యుద్ధమందు నింద్రాదులకొఱకు దైత్యపతులను జంపి మన్వంతరములన్నింటియందును నానాయవతారములెత్తి లోకమును బాలించెను. వామనుఁడై యాచించునెపమున బలివలన నుండి యీభూమిని హరించి దీని నింద్రాదులకు నొసంగెను. హైహయ వంశమును నాశముసేయుట కగ్నియో యన భార్గవకులమునఁ బరశురాముఁడై యవతరించి యీ భూమియందు నిరువదియొకమాఱు క్షత్రియులు లేకుండునట్లు గావించెను. ఇప్పుడు సీతాపతి యగు రాముఁడై సముద్రమునందు సేతువుగట్టి దశకంఠుఁ డగు రావణునిఁ జంపి వాని లంకను హతముసేసి తనకీర్తిచేత లోకముల పాపముల నెల్లఁ దూలించుచు సర్వోత్కృష్టుఁడై † వర్తించు చున్నాఁడు. అతనికి

---

* వాలఖిల్యులంగుష్ఠమాత్రశరీరులు. కశ్యపుని యజ్ఞమునకు ఇంద్రుఁడు వాలఖిల్యులు మొదలగువారు కట్టియలు దెచ్చుచుండఁగా వారియందు వాలఖిల్యులుగోష్పదమందుఁబడి మునిఁగిరి. దానినిజూచియింద్రుఁడునవ్వెను. అందుకై వారతనికి శాపమిడి రనుకథయిట ననుసంధింపఁబడెను.

† ఇట వర్తమాన నిర్దేశముచేత రామావతారకాలముననే యీజనకార్ష్ణభ(?)ంవాదము జరిగినదని తెలియుచున్నది.

జన్మములు గలుగవు. అయినను భూమిభారమును దీర్చుటకై యదువులందుఁ గృష్ణుఁడై జన్మించి దేవతలకుఁగూడఁ జేయ నలవిగాని కార్యములను జేయఁగలఁడు. పిదప బుద్ధుఁడై యజ్ఞ ములు సేయఁదగని దైత్యులు యజ్ఞములను గావించుచుండఁగా వారిని వేదవిరుద్ధములగు వాదములచేత మోహపెట్టఁగలఁడు. కలియుగాంతమందుఁ గల్కియై రాజులయిన శూద్రులను జంపఁగలఁడు. మహాభుజా! జగన్నాథుండును మహాయశుండును నగు భగవంతుని కర్మములును నవతారములును నిట్టివి పెక్కులు వర్ణింపఁబడి యున్నవి' అనెను. ఇది నాలుగవ యధ్యాయము.

—జనకార్షభ సంవాదము.—

( అనుబంధము. )

రాజు 'ఆత్మవిత్తములారా! ఇంద్రియములను జయింపకయు దానివలనఁ గామము లుడుగకయు నుండువారు భగవంతుని వారిని బహుళతరముగా భజింపకుందురు. అట్టివారికి మఱి దేనియుం దాసక్తి? (వారికి ప్రాప్యమేది? అందులకు హేతువేమి? వారెట్టివారు?) అని యడిగెను. చమసుఁడు——చతుర్ముఖశరీరకుం డయిన పరమపురుషుని ముఖమునుండియు బాహువులనుండియుఁ దొడలనుండియుఁ బాదములనుండియు నాయా సత్త్వాదిగుణ ములతోఁ గూడియున్న బ్రాహ్మణులు మొదలగు నాలుగు వర్ణ ములును నాలుగాశ్రమములును బుట్టినవి. వీరిలోపల నెవఁడు తమకుఁ బుట్టుకఁ గారణభూతుండును సర్వనియామకుండును నగు పరమపురుషుని భజింపకయు నతనిని దక్కిన దేవతల పాటిగాఁ దలఁచి యవమానింతురో వారు తమవర్ణాశ్రమపద ములనుండి భ్రంశమునొంది నరకమునఁ బడుదురు. 'వాఁడు తమకుఁ గారణభూతుఁడనియు నీశ్వరుఁడనియు సర్వోత్కృష్టుఁ

డనియు జ్ఞానముగలిగియుండినను నతని భజింపనివారు కృతఘ్నులుగాన వారు నరకమునఁబడుట సత్యమే; అట్టిజ్ఞానమేలేక కేవలమజ్ఞులై యుండువారి గతియేమి యందువా? హరికథలను వినుటయు నచ్యుతునిఁ గీర్తించుటయు నెవరికి శాస్త్రాధికారము లేమిచే దూరములగునో యట్టిస్త్రీలు శూద్రులు మొదలగువారు సైతము మాబోంటి భాగవతులకృపకుఁ బాత్రులై రేని తప్పక ముక్తినొందుదురు. బ్రాహ్మణుఁడుగాని క్షత్రియుఁడుగాని వైశ్యుఁడుగాని వేదసంయోగముచేతనైనను దానివలనఁగలిగిన జ్ఞానముచేతనైనను హరిచరణములను బొందించుటకు వలయు సాధనముల ననుష్ఠించుట కధికారము గలవారై యుండియు మోహమును బొందుదురు; కాన వారిపదాంబుజములను భజింపక స్వర్గాదులయినయర్థకామములం దగిలియుందురు. ఏలనవారు వేదములం (a) * దర్థవాదములు సేయుచుందురుగాన వారికా మోహము గలిగియుండును. వా రా మోహమువలనఁ గర్మములను దమకు బంధకములుగాకుండునట్లు చేయుటకుఁ దెలియకయు, నొకరికిని లొంగనివా రగుటచేఁ దెలిసినవారి నడుగకయు నుందురు. వారు మూర్ఖులు, తముఁబండితులుగాఁ దలంచుటచే గుట్టు లొకరి నడుగఁబోవరు; కాఁబట్టి, వారు చెవికి నింపుగా మాత్రముండునట్టి వేదవాక్యముల చేతమూఢులై 'మనమప్పరస

(a) * అర్థవాదపరులు. 'అపామ సోమమమృతా అభూమ, అక్షయ్యంగ్ం హవై చాతుర్మాస్యయాజి నస్సుకృతంభవతి. యత్రనోష్ణంనశీతంనగ్లానిర్నవ్యాధయః' ఇత్యాదిశ్రుతులు చెవికింపుగా మాత్రముండువానిని నమ్మి రంభాసంభోగాదులం గోరి కర్మము లనుష్ఠించుచుందురు. భగవదారాధనపరముగా ననుష్ఠింపరనిభావము. ఇదియే 'యామిమాం పుష్పితాం వాచం ప్రవదన్త్యవిపశ్చితః। వేదవాదరతాః పార్థ నాన్యదస్తీతివాదినః' ఇత్యాదిభగవద్గీతావాక్యములందు నిరూపింపఁబడియున్నది.

లతోఁ గూడివిహరింత ' మని యిట్టి ప్రియవాక్యములు * చెప్పు కొనుచుందురు. మఱియు వారికి రజోగుణమువలన నొకరిని జంపునట్టి యభిచారాదులు సేయవలయునని భయంకరము లయినసంకల్పములు గలుగుచుండును. వారికిఁ గోపము పాము లకుం బోలె నుండును. ఇట్లు దాంభికులును దురహంకారులును బాపులునై వారు విష్ణుప్రియులగు వారిని జూచి హాసముచేయుచుందురు. వారు స్త్రీలనే కొలుచుచుందురు గాని పెద్దలను సేవింపరు. వారి గృహములందు మైథునమొక్క టియె యెక్కుడు సుఖముగానుండును. వారిట్టి గృహములందు వసించుచు నొకరికొకరు † తమ పెంపుసొంపులను జెప్పుకొను చుందురు. మఱియు వారు లోభమువలన నన్న వస్త్రములుగాని దక్షిణలుగాని యొసంగకయె యజ్ఞములు సేయుదురు. తమ జీవనము కొఱకై యూరకపశువులను జంపుదురు. కాని దానిని జంపించుటవలనఁ గలుగు దోషములను దెలియరు. మఱియు నట్టి ఖలులు ధనాదిసంపదలచేత గ్రామాధిపత్యము మొదలగు నైశ్వర్యముచేతను మంచికులమునఁ బుట్టుటచేతను విద్యచేతను, దానముచేతను రూపముచేతను బలముచేతను శ్రౌతాది కర్మములచేతను గర్వితులై బుద్ధితెలివిదూల నీశ్వరునిని హరిప్రియులగు సత్పురుషులను నవమానించుచుందురు. సమస్తములయిన దేహధారుల యందును, సదా

---

* ఇదియె గీతయందు 'ఇదమద్య మయాలబ్ధ మిమం ప్రాప్స్యేమనోరథమ్ । ఇదమస్తీదమపి మే భవిష్యతి ప్రవర్ధనమ్' అని చక్కఁగాఁ బ్రతిపాదింపఁ బడియున్నది.

† శాస్త్రాధికారమును దజ్జన్యజ్ఞానమునుఁ గలిగియుండియు హరిని మూర్ఖులై భజింపని వారికి నరకపాతమేయని యిందు చెప్పఁబడెను.

యాత్మరూపుఁడై నెలకొని యాకాశమువలె వానిదోషములను దానుబొరయక నిరతిశయ పురుషార్థరూపుఁడై యుండును. వాని స్వరూపస్వభావములు వేదాంతవేద్యములు. అట్టి భగవంతుని వార్తయైనను వినరు. కాని తమతమ మనోరథముల వార్తలు చెప్పికొనుచు నజ్ఞులుగాన యిట్లు కాలము పుచ్చుచుందురు. లోకమందు స్త్రీసంగమును మాంసభోజనమును మద్యసేవయును బ్రాణులకు రాగమునుబట్టి నిత్యమును గలిగియుండును. కాని యందులకు విధిగలుఁగదు. శాస్త్రములు వానిని విధింపక పోయినను వానినిగూర్చి యొక యేర్పాటు మాత్రముచేసియున్నది. వివాహమాడిన స్త్రీతోనే సంగమము చేయవచ్చుననియు యజ్ఞమునందే మాంసము భుజింపవచ్చుననియు, సౌత్రామణి యందే మద్యపానము సేయవచ్చుననియు నియమము గావింపఁబడియున్నది. * ఈ స్త్రీసంగాదులనుండి నివర్తించుట (యనఁగా పరభార్యలందును ఋతువుగాని కాలములందును సంగమునుండియు యజ్ఞియములుగాని మాంసమద్యములను సేవించుటనుండియు) నివర్తించుటయు నిష్టమయినదికాని స్వభార్యాదులవలననుండి నివర్తించుటగాదు. ధర్మమువలన తత్త్వత్రయ ప్రకారమును గూర్చినజ్ఞానమును, భగవంతుని స్వరూపజ్ఞానమును గలుగుచున్నది. పిదప దానివలన నాఁకలి దప్పి మొదలయిన యూర్ములాఱును పీడుచున్నవి. అటువంటి ధర్మమొక్కటియే

* 'ధర్మప్రజాసంపత్త్యర్థం స్త్రియముద్వహేత్ -ఋతౌ వుపేయాత్ - పశుమాలభేత-యజమానపఞ్చమా ఇడాం భక్షయన్తి-హుతశేషమశ్నీయాత్' సౌత్రామణ్యా సురాగ్రహాన్ గృహ్ణాతి-ప్రతిగ్రహాదినా ధనమార్జయేత్, ఇత్యాది శాస్త్రములు స్త్రీసంగాదులను విధించుచుండఁగా దానిని నిందించుట యెట్లనఁగా నిది చెప్పఁబడినదని తెలియునది.

ధనమునకు ఫలముగాన ప్రతిగ్రహాదులచేత ధనమును సంపాదించి భగవంతునకుఁ బ్రీతికరమగు ధర్మమును సంపాదించుకొనవలయును గాని విషయభోగములనుగాదు. ఇది తెలియక కొందఱు కేవలము గృహములందు (విషయ భోగాదులయందు) దానిని వినియోగించుచున్నారు; కాని యీకళేబరమునకు మృత్యువు దురంతమయిన బలము గలది యని కనుఁగొనరు. కనుక వారెంతయు నింద్యులగుదురు. యజ్ఞమందు సురయును బశుభక్షణమును * ఘ్రాణశరీరకుండగు పరమాత్ముని భక్షముగా విధింపఁబడియున్నది. కనుకఁ బశువును యజ్ఞమందుఁ జంపుట హింసగానేరదు; పశ్వాత్మకముల యుజ్జీవనముకొఱకే యగును. ఇట్లే స్త్రీసంగమమును బ్రజకొఱకుఁగాని రతి సుఖముకొఱకుఁగాదు. ఇదియె విశుద్ధమగు స్వధర్మమని తెలియరు. ఎవరిట్టిధర్మము నెఱుంగక యవినీతులై తాము సజ్జనులమని తలఁచుకొని జంతుమాలి పశువులకుద్రోహము నేయుదురో వారు మృతులయి పరలోకమునకుఁ బోఁగానం దాపశువులు వారిని బట్టి తినుచున్నవి. పరుల దేహములందు ద్రోహము చూపుచుఁ దన్మూలమున నాదేహములందెల్లనుదనయందును నాత్మభూతుఁడై యుండు నీశ్వరుం డగుహరియందును ద్వేషముచూపుచును, శవప్రాయమయిన తమ దేహమందును దాని కనుబంధులయిన పుత్త్రకళత్త్రాదులందును మిక్కిలి

* యత్ప్రాణభక్షో విహితస్సురాయా స్తథాపశోరాలభనం నహింసా, అని మూలము. 'యత్ ఘ్రాణభక్షో' అని పాఠాంతరము. ఘ్రాణరూపమగుభక్షము-అనఁగా వానిని మూఁజూచుటయే వానిని భక్షించుటయగును. మూఁజూడవలసినదే కాని భక్షింపరాదనుట. ఇదియె సమంజసమయిన పాఠముగాఁ దోఁచుచున్నది.

స్నేహముపచరించుచు, నుండువారు నరకమునం బడుదురు. జ్ఞాననిష్ఠను బొందకయు మూఢత్వమును జెందకయుఁ ద్రివర్గమె ప్రధానముగాఁగలిగి క్షుణమయిన నుపశాంతిని బడయక యుండువారు తమయాత్మను * జంపిన వారయ్యెదరు. ఇట్లాత్మఘాతుకులై యశాంతులై యజ్ఞానముండియును జ్ఞానముగలిగి యున్నట్లెన్నికొనుచుండువారు కడపటఁ గాలముచేతఁ దమ మనోరథములెల్ల ధ్వంసమునొందఁగా గృతకృత్యులుగానివారై బ్రతికియున్నపుడె క్లేశములు పడుచుందురు. మఱియు వారు తామెంతో కష్టపడి సంపాదించిన గృహములను సంతానములను సుహృదులను స్త్రీలను దిగవిడిచి తా మొల్లకున్నను వాసుదేవునకుఁ బరాఙ్ముఖులగుటవలన నరకమును జొచ్చుచున్నారు' అనెను. రాజు—'ఆభగవంతుఁడేకాలమున నేవర్ణముగలిగి యెట్టియాకారముతో నేపేరితోడఁగూడి యేవిధిచేతఁ బూజింపఁబడుచున్నాఁడో దానినంతయును నిపుడు చెప్పవలయు'ననియడిగెను. అందుల † కమ్మునికృతము, త్రేత, ద్వాపరము, కలి,యని యీ యుగములు నాలుగింటను గేశవుఁడు నానావిధములయిన వర్ణములును నాకారములును గలిగి నానావిధులచేతఁ బూజింపఁబడుచున్నాఁడు. కృతయుగమందు శుక్లవర్ణముగలిగి

* కేవలమజ్ఞులయినవారు తత్త్వవిదులవలన ఉపదేశమునొంది సంసారమును దాఁటుదురు. జ్ఞాననిష్ఠులగువారు తమంతటనే దాఁటుదురు. ఈ యిరువురకు నడిమి తెగవారైన మూర్ఖులో రెంటిని బొందరనిభావము. ఆత్మనుజంపుటయనఁగా దానిని అస్వాతంత్ర్యము చేసి కడపటస్థావరత్వము నొందింతురని తెలియునది.

† ఇచటఁ జెప్పెడిముని పేరు లేకున్నది. పూర్వోక్తుఁడగు చమసుడే కావలయును.

చతుర్బాహుఁడై యుండును, మఱియునపుడు జటలుదాల్చి వల్కలములుగట్టి కృష్ణాజినమును యజ్ఞోపవీతమును నక్షమాలయు దండమును గమండలువును ధరించి బ్రహ్మచారి వేషము నమందును. ఆకాలమున మనుష్యులు శాంతులై వైరములు లేక సర్వభూత సుహృదులై సమదర్శులై శమదమములతోను ధ్యానయోగముతోనుగూడి భగవంతుని నారాధించుచుందురు. అక్కాలమున హంసుఁడు సువర్ణుఁడు వైకుంఠుఁడు ధర్ముఁడు యోగీశ్వరుఁడు అమలుఁడు ఈశ్వరుఁడు పురుషుఁడు అవ్యక్తుఁడు పరమాత్మయని యిట్టి గుణములచేతను నామములచేతను భగవంతుఁడు కీర్తింపఁబడుచున్నాఁడు. త్రేతాయుగమందు, నితఁడు రక్తవర్ణుఁడై నాలుగు బాహువులుగలిగి మూఁడు పేఁటల * మేఖలతోఁగూడి యుండును. మఱియునతఁడు పింగళవర్ణములగు కేశములుగలిగి, త్రయీప్రతిపాద్యమగుయజ్ఞమునకు నిర్వాహకుఁడగు యజ్ఞమూర్తియై స్రుక్స్రువమును జిహ్వాములుగాఁగలిగియుండును. ఆకాలమందు, సర్వదేవమయుండగునా హరిని ధర్మిష్ఠులును బ్రహ్మవాదులు నగుజనులు వేదోక్తకర్మము చేత యజింతురు. అపుడు విష్ణువు యజ్ఞుఁడు, పృశ్నిగర్భుఁడు, సర్వుఁడు, దేవుఁడు, ఉరుక్రముఁడు, వృషాకపి, జయంతుఁడు, ఉరుగాయుఁడని యీగుణముల చేతను నామములచేతను జెప్పఁబడుచున్నాఁడు. ద్వాపరమందు భగవంతుఁడువిష్ణుఁడు పచ్చని వస్త్రము దాల్చి చక్రాదులగు తనయాయుధములు గలిగి, శ్రీవత్సము మొదలగు తోడఁబుట్టిన గుఱుతులతోను గౌస్తుభము మొదలుగాఁ దెచ్చిపెట్టుకొన్న గుఱుతులతోడను గూడియుండును.

---

* ఇట మేఖల యజ్ఞదీక్షకు అంగమని తెలియునది.

అట్లు మహారాజ లక్షణములగు ఛత్రచామరాదులతోఁ గూడియున్న యాపరమపురుషుని తత్త్వత్రయజ్ఞానమును గోరి మనుజులు వేదములందును బంచరాత్రమునందును బ్రోక్తములయినవిధానములచేతఁ బూజించుచుందురు. రాజా! ద్వాపరమందు జనులాభగవంతుని 'వాసుదేవుండు సంకర్షణుండును బ్రద్యుమ్నుండును, ననిరుద్ధుండును, భగవంతుఁడునగునీకు నమస్కారము. నారాయణ ఋషియుఁ బురుషుండును, మహాత్ముఁడును, విశ్వేశ్వరుండును,విశ్వుండునుసర్వభూతాత్ముండునగునీకునమస్కార'మని యాజగదీశ్వరుని స్తుతించుచుందురు. కలియుగమునందును నానావిధములగుతంత్రవిధానములచేత నెట్లుయజింతురో దానిని వినుము. కాంతియందు నింద్రనీలమణి వర్ణముగల శ్రీకృష్ణుని నతని హృదయాదులగు నంగములనును గౌస్తుభాదులగు నుపాంగములనును, సుదర్శనాదులయిన యస్త్రములనును, బార్షదులయిన నందసునందాదులను, మిక్కిలిసంకీర్తనప్రచురములగు నర్చనలచేతవివేకులగువారు యజించుచుందురు. వారాభగవంతుని 'ప్రణతజనపరిపాలకా! మహాపురుషా! ధ్యానించుటకుఁదగినదియైకుటుంబేంద్రియాదులచేత డిందువడకుండఁజేయునదియై, యిష్టార్థములను బూరించుచు, గంగాదిపుణ్యతీర్థములకాశ్రయంబగుటవలనఁ బరమపావనంబై, బ్రహ్మరుద్రాదులచేత స్తుతింపఁబడి, శరణ్యమై, హరిభక్తుల యనిష్టములనెల్ల నివారించుచు, సకలార్తి నిదానమగు సంసారసముద్రమును దరింపఁజేయు నావయగు నీచరణారవిందములకు వందనము చేయుచున్నాను. ధర్మిష్ఠా! తండ్రియగు దశరథుని వాక్యము చొప్పున దేవతలును గోరునట్టిదియుఁ ద్యజింపనెంతయుఁ గష్టమైనదియు

నగు రాజ్యలక్ష్మిని విడిచి ప్రియురాలగు జానకి వలచినమా యామృగము వెంటఁ బరుగిడిన నీపదారవిందములకు వందనము చేయుచున్నా'మని సంకీర్తనము చేయుదురు. ఇట్లు శ్రేయముల కెల్ల నీశ్వరుఁడును భగవంతుఁ నగు హరి యాయాయుగముల కనురూపములయిన నామరూపములతోఁగూడి యాయాయుగ ముల ననువర్తించుచుండు మనుజులచేతఁ బూజింపఁబడుచు న్నాఁడు. దోషములెన్నియుండినను గుణములనే తెలిసికొని సారమును గ్రహించునట్టి యార్యులు కలియుగమునే బహు మానించుచున్నారు. ఏలనఁగా నాయుగమందు సంకీర్తనము చేతనే * యభిలషించిన యర్థము లన్నియును లభించుచున్నవి. ఈ సంసారమండలమున భ్రమించుచున్న దేహులకు నాసంకీ ర్తనముకంటె నతిశయించిన పురుషార్థసాధనము మఱియొ క్కటి గలుగదు. ఆసంకీర్తనము మరణపర్యంత మాచరించిన మొదలఁ బరమంబగు శాంతిగలుగును. సంసారమును నశించు ను. కలియందు ముక్తియుపాయము మిక్కిలి సుకరముగా నుండుటంబట్టి కృతాదియుగములందలివారు కలియందుఁబుట్ట వలయునని కోరుదురు. కేవలమట్లు కోరుటయే కాక యాకలి యందును నారాయణపరాయణులై (యష్టాక్షరచింతనపరులై) పుట్టుచుంబుట్టుచున్నారు. మహాభాగా! ద్రమిడదేశమునందాయా చోట్లఁబుట్టుదురు. అందును నెచటఁ దామ్రపర్ణియుఁ గృతమా లయుఁ బయస్వినియు, మహాపుణ్యయగు కావేరియుఁ బ్రతీ

---

* 'ధ్యాయన్ కృతే యజన్ యజ్ఞైస్త్రేతాయాంద్వాపరేఽర్చయన్।య దాప్నోతితదాప్నోతి కలౌసంకీర్త్యకేశవమ్' అని సంకీర్తనమాత్రమే యభిల షించిన పురుషార్థములను సాధించుచున్నదని భావము

చియు,సురవర్త్మగయు ననెడి నదులు పాఱునో యటంబుట్టుదురు. మనుజేశ్వరా! మనుజు లెవ రానదులజలములను ద్రావుదురో వారు భగవంతుఁడగు వాసుదేవునియందుఁ దఱుచుగాభక్తిగల వారయి నిర్మలాంతరంగు లగుచున్నారు. మఱియునందు మనుజులు సంకీర్తనము చేయఁగా హరి వారికి ముక్తినొసంగుచున్నాఁడు. ఎవ్వఁడు సమస్తకర్మములను సన్న్యసించి శరణ్యుండగు ముకుందుని సర్వభావమునఁ (వ్యాప్యముగాను వ్యాపకముగాను) దలంచి శరణుఁజొచ్చునో వాఁడు దేవతులకుఁగాని ఋషులకుఁగాని కుటుంబమువారికిఁగాని మనుష్యులకుఁగాని పితరులకుఁగాని ఋణపడినవాఁడుగాఁడు;మఱివారికిఁగింకరుఁడునుగాఁడు. పరేశుండగుహరి తనపాదమూలము నే యాశ్రయించి యుపాయము గనుపేయముగను సేవించుచు. దేవతాంతరములం దట్టిభావమును దిగవిడిచి యుండువాఁడు తననిరతిశయ ప్రీతికిఁ బాత్రుండగును గాన వానికిఁ బ్రమాదవశమున శాస్త్రవిరుద్ధమగు కర్మమే దేని కలిగెనేని వాని హృదయమందు నెలకొని దానినంతయు నాశము చేయుచున్నాఁడు' అనెను.

నారదుఁడు——మిథిలాధిపతియగు జనకుఁడు భాగవతధర్మములను వీనిని విని మిక్కిలి ప్రీతుండై జయంతీదేవి పుత్త్రులయిన యాకవ్యాదిములగును దానును దన యుపాధ్యాయుండును బూజించినవాఁడయ్యెను. అంత జనులెల్లవారును జూచుచుండఁగా నాసిద్ధులగు మునులంతర్ధానము నొందిరి. రాజు నాధర్మముల ననుష్ఠించుచుఁ బరమంబగు గతినిముక్తిని బొందినవాఁడయ్యె. మహాభాగా! నీవు నయిత మిపుడు విన్న యీభాగవత ధర్మమును ననుష్ఠించుచు శ్రద్ధగలిగి దేహమందును దాని యనుబంధు

లందును నాసక్తిని వీడి యటమీఁదఁ బరమంబగు పదమును బొందఁగలవు. ఇది శాస్త్రప్రక్రియ. మీరిది లేకయె కృతార్థులరు. ఎట్లనఁగా భగవంతుఁడును నీశ్వరుండునగు హరి మీయిరువురకును బుత్త్రుఁడయినాఁడు. మీదంపతు లిరువుర యశస్సు జగమంతయు నిండినది చూడీ! మీరు కృష్ణునియందుఁ గన్నకొడుకని నెయ్యము దియ్యమును నెఱపుచుఁ గన్నారఁజూచుచును, కౌఁగిలించుకొనుచును మాటలాడుచును, కూడఁ బరుండుచును కూర్చుండుచును బొత్తునఁ గుడుచుచును నుండుటవలన మీ యాత్మలు పవిత్రములు గావింపఁబడినవి. శిశుపాలుఁడు పౌండ్రుఁడు సాల్వుఁడు మొదలగు రాజులు వైరము చేతఁ దాము పరుండునపుడును కూర్చుండునపుడును దక్కిన సమయములందును నాకృష్ణుని నడకవిలాసములను జూపులును మొదలగువానిని మనంబునఁ దలపోయుచు బుద్ధి తన్మయముగాఁగా నతనితోడి సాధర్మ్యము నొందినవారయిరి. బుద్ధి వైరము చేతనే యిట్టిగతి కలుగఁగా, నిఁక ననురాగముతోడిబుద్ధి నతనియందుఁ బచరించువారి కట్టిసాధర్మ్యము గలుగుటను జెప్పనేల? కృష్ణుండు సర్వాత్ముఁడు. సర్వేశ్వరుఁడు మాయామనుష్యభావము చేత నెంతయు నతని యైశ్వర్యము గప్పఁబడియున్నది. అతఁడు ప్రకృతివిలక్షణుండగు పరుండు. అతఁడు స్వరూప స్వభావములందు వికారము లేకుండువాఁడుగాన యవ్యయుండు. అట్టికృష్ణునియందుఁ గేవలము బిడ్డఁడనుబుద్ధి వలదు నుమీ! అతఁడు మాయామనుష్యుఁడై పుట్టి నేలయందువా? కొందఱసురులు రాజులై పుట్టిభూమికి భారము గావించుచుండిరి. వారిని జంపి సాధువులను రక్షించుటకై యందవతరించినాఁడు. మఱియు వినువారికిని గీర్తించువారికిని నిరతి

శయానందమును గలిగించుటకై తనకీర్తిని లోకమునం దెల్ల విస్తరింపఁజేయుచున్నాఁడు, అట్టివానియందు బిడ్డఁడనుబుద్ధి యుంపవలదు' అనెను. శుకుఁడు—మహాభాగా! వసుదేవుఁడును మహాభాగ్యవతియగు దేవకియును దీనినివిని కృష్ణుఁడు తమ కన్న బిడ్డఁడను మోహమునుదిగవిడిచినవారయిరి. పుణ్యంబయిన యీ యితిహాసము నెవ్వఁడుసమాహితుఁడై మనస్సునఁదాల్చునో వాఁడీ జన్మమందే భగవత్ప్రాప్తికిఁబ్రతిబంధక మగుటచేతఁ బాపంబగు పుణ్యముల నెల్ల విడిచి బ్రహ్మముతోడిసాధర్మ్యమునకుఁ బాత్రుఁడగుచున్నాఁడు. ఇది మూఁడవయధ్యాయము.

బ్రహ్మాదులు ద్వారకకువచ్చి శ్రీకృష్ణుని స్తుతించుట.

శ్రీశుకుఁడు—అంత వెలుంగుచున్న ప్రజాపతులగు మరీచి మొదలగు వారును దనపుత్త్రులగు సనకాదులును బరివేష్టించి కొలువఁగా బ్రహ్మయును, భూత గణములు పరివేష్టింపఁగా భూతభవ్యులగు ప్రజల కీశుండయిన రుద్రుండును, మరుద్గణ ములు గొలువఁగా నింద్రుండును, ఆదిత్యులును, వసువులును, అశ్విదేవతలును, ఋషులును, ఆంగిరసులును, రుద్రులును, విశ్వులును, సాధ్యులును, దేవతలును, గంధర్వులును, నప్సరస లును, నాగులును, సిద్ధులును, జారణులును, గుహ్యకులును, ఋషు లును, బితరులును, విద్యాధరలును, గిన్నరులును, నందఱునుగూడి కృష్ణునిఁ జూడవలయునని యువ్విళ్లూరుచు ద్వారకకుఁబోయిరి. వారెల్ల భగవంతుఁ డేదేహమును దాల్చి మనుష్యలోకము వారి మనస్సులను రంజింపఁజేయుచు సమస్తలోకముల పాప ములను దూలించునట్టి యశస్సును సంతతట విస్తరింపఁ జేసెనో యా దేహముతోఁగూడి యుండఁగా నతనిని జూడవలయునని

కోరిపోయిరి. ఆద్వారకాపురము భోగ్యభోగ్యోపకరణాదులయిన పెంపు సొంపులన్నియు నిండారి మిక్కిలియుఁ బ్రకాశించు చుండెను. అం దద్భుతముగాఁజూపట్టు చిన్నికృష్ణునిఁజూచిరిగాని వారికన్నులకు అవెంత చూచినను దీఱదయ్యె. ఆ దేవతలు నందన వనమునఁ బుట్టిన పూవుల నాయదుసత్తమునిపయిఁ గురి యుంచి క్రమ్మి, చిత్రములగు శబ్దములను నర్థములునుగల వచ నములతో నిట్లని స్తుతించిరి- దేవతలు- 'నాథా! నీదు పదార విందములకు మాబుద్ధిచేతను(మనస్సుచేతను) వచనములచేతను (వాక్కుచేతను) ప్రాణేంద్రియములచేతను దేహముచేతను, (అనఁగాఁగరణత్రయముచేతను) నమస్కరించు చున్నారము. కర్మమనెడి పెద్ద పాశమునుండి విడివడఁగోరుచుండు భక్తి యుక్తులగుజను లాపదారవిందములను హృదయకమల మధ్య మునఁ గేవలము చింతించుచుందురు. అట్టిదాని నిపుడుమాంసపుఁ గన్నులారఁజూచికరణత్రయముచేత నమస్కరించుచున్నారమే. ఇది యెంతోయరుదుచుమీ. నీవుగుణత్రయమయ మగుమాయ చేత ధారకుండవై నిలిచి యితరులకుఁ జింతింప నలవిగాని యీజగత్తును స్థూలచిదచిదాత్మకమగుదానిని సృజించుచును రక్షించుచును సంహరించుచును న్నాఁడవు. అయిన నీవాగుణము ల నియామకుఁడవై యధిష్ఠించియున్నావు గాని దానికిఁ బర వశుఁడవుగావు. అజితా! సృష్టిమొదలయిన యీయాకర్మములు నీకు లీలలేకాని పుణ్యపాపరూపమున నిన్నంటవు. నీ వసాధా రణమై యపరిచ్ఛిన్నమై నిజస్వరూపానందమునందుఁ దగిలి యుందువుగాని విషయ సుఖములందుఁగాదు. విషయసుఖాసక్తు లకే కర్మములును దన్మూలములగు దుఃఖాదులును గలుగు

చున్నవి. మఱియు నిన్ను హేయములంటవు. కనుక నీ సేవకుల కును హేయములు గలిగింపవు. ఇట్టి నిన్నుఁ గర్మము లంటుట యెట్లు? ఈడ్యా! సత్త్వమానసులకెల్ల నాయకా! శబ్దాది విషయములందు మిక్కిలి మనస్సు దగిలియుండుటవలన నత్యంత మగునశుద్ధితోఁగూడి యున్న యా మనుష్యులకు నీ కీర్తిని వినుటయందుఁ బెచ్చుపెరుఁగుచున్న మంచి శ్రద్ధవలన శుద్ధికలుగునట్లు, అధ్యయనమువలనను దాని యర్థశ్రవణమువలనను, దజ్జన్యమగు జ్ఞానమువలనను, దానమువలనను, దపమువలనను, వర్ణాశ్రమానుగుణములగు కర్మములవలనను, గలుగనేరదు. 'నీ కథను వినుటచేతనే శుద్ధి గలుగుచుండఁగా నీయడుగులను గుఱించి ధ్యానాదులేల' యున్నచో నీయడుగు లశుభములగు పాపవాసనలకెల్ల ధూమకేతువులుసుమీ! దానిని మునులు సంసారము నిస్తరించి క్షేమము నొందుటకై భక్తియుక్తము లగు మనంబులఁ జింతించుచుందురు. దాని నాత్మవిదులగు పాంచరాత్రులు స్వర్గలోకము నతిక్రమించి నిత్యవిభూతిని బొందుటకును, నందును సమానైశ్వర్యముఁ బడయుటకును వాసుదేవాదివ్యూహముల నుపాసించునపుడు మూఁడుసంధ్యల యందును నర్చించుచుందురు. ఈశా! కేవల వైదిక కర్మములే చేయుచుండునట్టివారు వేదవిద్యాప్రోక్త మగువిధానముగఁ జరుపురోడాశాదికమగు హవిస్సును దమ హస్తములఁ గొని యాహవనీయము మొదలయిన యజ్ఞాగ్నులయందుఁ జింతించు చుందురు. మఱియుఁ దమమాయను దెలిసికొనఁగోరు * సాంఖ్య

* సాంఖ్యులకుఁ బురుషునకంటె వేఱుగా పరమాత్మ కలుగదు. అయినను వారు చింతించు ప్రకృతివియుక్తాత్మస్వరూపము పరమాత్మకు శేషభూతవాక్కిఁ

యోగులును ప్రపత్తినిష్ఠులగు పరమైకాంతులును దానిని దమ యధ్యాత్మయోగమందు సేవించి చింతించు చుందురు. విభూ! భగవతియగు శ్రీదేవి నీవక్షమం దున్నదియే కదా, అయిన నాదేవి, వనమాల నీయడుగులవఱకు వ్రేలుచు నందు నెలకొని యున్నసొంపునకుఁ జూపోపక సవతివలె మచ్చరించి దానివలెనే తానును నీయడుగుల నతి భోగ్యములగుటచే సేవించుచున్నది. మఱియు లక్ష్మి తెచ్చి సమర్పించెడి కానుకలను గయికొనుచు నీయడుగుఁ దమ్ములు మాయశుభవాసనలకెల్ల ధూమకేతువగుఁ గాత. నీయంఘ్రి బలిని బంధించుటకు మూఁడు లోకములను మూఁడడుగులఁగొలిచినది. అందు రెండవ యడుగు నిడుసపు డది సత్యలోకమును జేరుటవలనఁ బయికెత్తినవిజయధ్వజమువలెనుండెను ముల్లోకములందును బ్రవహించుచుఁ బావనముచేయు గంగ దానికిఁ బతాకవలె వెలసెను. జగత్పావనిపుట్టిన యీయంఘ్రి నిరతిశయశుద్ధికరముగదే. మఱి యది యసురసేనకు భయంకరమును దేవతాసైన్యమునకు నభయంకరమునై యుండును. మఱి సాధువులకు సుఖమును దక్కినయసాధువులకు దుఃఖమును నది గూర్చుచుండును. భగవంతా! అట్టి నీయంఘ్రి భజించుచున్న మా పాపములను బోఁగొట్టి పవిత్రులను జేయుఁగాక. దేహధారులగు బ్రహ్మాదులు పరస్పర మతిశయింపఁ జూచుచున్నను, ముక్కునఁ ద్రాడు గ్రువ్వంబడిన యెద్దులవలె నెవ్వనికి వశగతులై యుందురో, బ్రహ్మాదులనుగూడ వశీకరించు

---

తెలియకున్నను అది పరమాత్మకు అపృథక్సిద్ధవిశేషణమగుటంబట్టి దానిని చింతించుటయుఁ బరమాత్మునిఁ జింతించుటయందే పర్యవసించుచున్నదని యర్థము. వారు పరమాత్మపర్యంతజ్ఞానము లేనందున ముక్తిని బడయక కైవల్యమునే పొందుదురని భావము.

నట్టి కాలమునకును నియంత వైనకాల శరీరకుండును, బ్రకృతిపురుషులకు విలక్షణుండును, బురుషోత్తముండును నగు నీదుచరణము మాకు సుఖమును విస్తరింపఁజేయుఁగాక. స్థూలములగు చిదచిత్తులమయమగు నీ జగత్తునకు నీ వుత్పత్తిస్థితిలయములకు హేతువగుదువు. మఱియు వ్యక్తమునకును జీవవర్గమునకును మహత్తునకును నీ వుత్తముండగు పురుషుఁడవు. సంవత్సరాత్మకమై యఖిలజగమును క్షయింపఁజేయుటకై పూని గంభీర వేగముతోఁగూడి యున్నకాలము శరీరముగాఁ గల యుత్తమపురుషుండ వగుదువు. కాన కాలశరీరకుఁడవై నీవు సంహారము చేయుచుందువు. జగత్తును సృజించుటకు నధికృతుఁ డయినయనిరుద్ధునకుసృష్టికుపయుక్తములయినవివిధవిచిత్రశక్తులరూప మగు వీర్య మమోఘముగానుండును. అతఁడు సకలవ్యూహములకు మూలభూతుండవయిన నీవలననుండి యీ జగత్తును సృజించుటకై యావిర్భవించి,పురుషుఁడు స్త్రీయందుగర్భమిడునట్లు,ప్రకృతియందుఁ బరిణామసామర్థ్యమనెడు తనవీర్యము (శక్తి) నుంచి యందుండి మహత్తత్త్వమును బుట్టించెను. ఆమహత్తును దన కారణములును ప్రకృతివలెనె మూఁడుగుణములతోఁ గూడినదై తనవలననుండి యహంకారాదులమూలమున బంగారుమయమయిన యండకోశమును సృజించెను. దానికి వెలుపల జలాదిమయములగు నావరణము లేడు గలవు. ఇట్లు జగత్తున కుత్పత్తిగావించుచుందువు.కాఁబట్టి స్థావరజంగమాత్మకమయిన యీజగత్తునకు నీవధీశుండవు. అనఁగా నీవన్నిటిలోపల నంతర్యామివై చొచ్చి నియమించుచును నవతారములచేఁ బాలించుచును వానికి స్థితిగలిగించుచుందువు. అంతర్యామివగు నీవాయా

జీవులకర్మములను కర్మముల కనుగుణమగు సంకల్పముచేత గుణపరిణామాత్మకము లగు వారి యింద్రియ వ్యాపారముల వెనకొలిపి వాని మూలమున లీలారసమునకై శబ్దాదివిషయములను జీవమూలమున ననుభవించుచుందువు; కాని కర్మవశ్యుండవు గానందున దానివలని పుణ్యాపాపకర్మములచే నంటఁబడకుందువు. నీ వింద్రియములకుఁ బతివి కాన వానిని వశీకరించువాఁడవు గాని వానికి లోనై పుణ్యాపాపములుచేసి పట్టువడువాఁడవుగావు. తక్కిన జీవులుగాని యోగులుగాని శబ్దాది విషయవాసనలను దిగవిడిచియున్నను వాసనామాత్రముచేత బద్ధులగుచుందురు గాన యావిషయానుభవమునకు వెఱచుచుందురు. నీ వింద్రియములకుఁ బతివగుట యీయవతారమందే చూడవచ్చును. నీపత్నులు పదాఱువేలమందియుఁ జిఱునవ్వుతోఁ గడకంటి చూడ్కులచే భావములను దెలుపుచును నట్లు భావసూచనములచే మఱింతవట్రువలై కొమరుచూపు కనుబొమలను గిఱపుచును, సురతపు మాటలనీటుచూపుచును మన్మథబాణములు నిగిడించినిన్నుఁగాఁడఁగ్రుచ్చినను నీయింద్రియములను గలంచి వశము గావించుకొనుటకువలంతులుగారై రిగదే. అమృతతుల్యములగు నీకథానదులును నీపాదప్రక్షాళన జలాత్మకములగు గంగాదినదులును ముల్లోకములందును గలదురితములను దూలించుటకు సమర్థములయినవి. కావుననే యాత్మశుద్ధికై పాటుపడుచుండువారు శ్రుతిసిద్ధమగు నీదుకీర్తియనెడు తీర్థమును జెవులచేతను,నీయంఘ్రులందుఁ బుట్టినగంగాతీర్థమును సంగసంగరూపములగు స్నానాదులచేతను, నిట్లీ రెండుతీర్థములను సేవించుచున్నారు'అని స్తుతించిరి. ఇట్లుబ్రహ్మ,రుద్రునిని దేవతలను

ను గూడి వారిని స్తుతించి యాకాశముననేయుండి యా గోవిందు నకుఁ బ్రణమిల్లి యిట్లనిరి. బ్రహ్మ-'ప్రభూ! ప్రభూ! సమస్తచిద చిదంతరాత్మా! మేము తొల్లి భూమిభారమును దీర్పవలయునని నీకు విజ్ఞాపనము చేసికొంటిమి. నీవు నట్లగావించితీర్చితివి. సత్యసంధులగు సత్పురుషులయందు ధర్మమును స్థాపించితివి. వినుచును జెప్పుకొనుచునుండు సకల జనముల పాపములనెల్లఁ దూలించునట్టి కీర్తినిగూడ దిక్కులయందు వెదచల్లితివి. నీవుత్తమంబయిన రూపమును దాల్చి యదువంశమునం దవతరించి యుదారశథావిషయములగు కర్మములను జగమునకు శ్రేయస్సు గలుగుటకై గావించితివి. ఈశా! కలియుగమందు సాధువులగు మనుష్యులు నీ యాచరితములను వినుచును గీర్తించుచును సుఖముగాఁ బ్రకృతికార్యంబగు సంసారమును దరింతురు. పురుషోత్తమా! విభూ! నీవు యదువంశమునం దవతరించి యింతకు నూటయిరువదియేనేండ్లు గడచెను. అఖిలాధారా! నీకిపుడు దేవకార్య మింకను జేయక మిఁగిలియున్నది యేమియు లేదు. ఈ యదుకులమును బ్రాహ్మణశాపముచేత నించుమించుగా నశించినట్టి దాయెను. కాఁబట్టి నీధామంబగు పరమపదమునకుఁ జిత్తగించిన యెడల వేంచేయుదువుగాక. ఆజ్ఞాపింప మే మెవ్వరము? వైకుంఠా! ఈలోకములను లోకపాలురను నీకుఁ గింకరులమగు మమ్మును బాలింపుము' అనిరి. మాయామనుష్యుఁడై యున్న భగవంతుఁ డీశ్వరుఁ డిట్లు బ్రహ్మాదులయిన దేవతలు స్తుతింపఁగా నా స్తుతి నభినందించి వారలఁజూచి 'దేవేశ్వరా! నీవు చెప్పినది నే నపుడె నిశ్చయించుకొనియున్నాను. మీ కార్యమంత యుఁజేసి యైనది. భూమిభారమును దింపితిని. అయిన నీయాద్య

వకులము వీర్యశౌర్యముల పెంపు సొంపున మిక్కిలి విజృంభించుచు లోకమును గబళింపఁ దివురుచున్నది. మహాసముద్రమును జెలియలికట్టవలె నేను దీని నడ్డగించియున్నాను. మిక్కిలి దర్పించిన యీయాదవుల వెనుకులమును నేను సంహరింపక పరమపదమునకుఁ బోవుదునేని నది గట్టుమీఱి పైఁబడఁగా నీలోకమంతయు నశింపఁగలదు. ఇప్పటికే బ్రాహ్మణశాపమువలన నీకులమునకు నాశ మారంభించియున్నది. అనఘా ! బ్రహ్మా ! ఇది ముగిసిన కడపట నాభవనమునకు వచ్చుచున్నాను' అనెను. శుకుఁడు—జగన్నాథుండు కృష్ణుఁడిట్లు చెప్పఁగా దేవుండా స్వయంభు వాతనికిఁ బ్రణమిల్లి దేవగణములంగూడి తన నెలవునకుఁబోయెను. పిదప నాద్వారవతియందు మహోత్పాతములు పొడచూపెను. దానినిజూచి భగవంతుఁడు సమాగతులై యున్న యదువృద్ధులను జూచి యిట్లనియె. 'ఇవిగో' నిందు మిక్కిలి గొప్ప యుత్పాతములు నలుప్రక్కలఁ బుట్టుచున్నవి. మఱిమన కులమునకు నింతకుమునుపే బ్రాహ్మణులవలనఁ గడవరాని శాపము గలిగియున్నది. పెద్దలారా! మనము బ్రతుకఁ గోరితిమేని యిచ్చటవసించియుండరాదు. ఇప్పుడేకదలి మిక్కిలియుఁ బుణ్యాంబయిన ప్రభాసతీర్థమునకుఁ బోదము జాగువలదు. మున్ను చంద్రుఁడు దక్షశాపమువలనక్షయరోగమునొందియా ప్రభాసతీర్థమందుఁ గ్రుంకిన మాత్రముననే యాకిల్బిషమునుండితొలఁగి మరలఁ దనకళలపెంపును బొందినవాఁ డాయెను. మనము కూడనందు స్నానముచేసి పితరులకును దేవతలకును దర్పణము విడిచి షడ్రసోపేతమయిన యన్నమును గమనీయుల విప్రులకు భోజనముపెట్టి వారియందుఁ బాత్రులయినవారిని శ్రద్ధతో

గోష్పదానములు చేసి యీదానములచేత,సముద్రమును నావల చేతంబోలె, బ్రాహ్మణశాపమువలని దుఃఖముల నెల్లఁ దరింతము' అనెను. కురునందనా! భగవంతుఁ డిట్లానతియ్యఁగా, యాదవులా తీర్థమునకుఁబోవుటకు బుద్ధినిశ్చయించుకొని రథములకు గుఱ్ఱము లను బూన్చునట్లు చేసిరి. భగవంతునకు నిత్యము ననువ్రతుఁ డై యుండు నుద్ధవుఁడు తండ్రిచెప్పినది విని వారిసన్నాహము లను జూచి, మఱి భయంకరము లగు నరిష్టములను గాంచి,జగ దీశ్వరులకెల్ల నీశ్వరుం డయిన యీకృష్ణుని నేకాంతమున సం ధించి యతని పాదములందు శిరముసోఁకఁగా మ్రొక్కి చేతులు జోడించుకొని యిట్లనియె.ఉద్ధవుఁడు—'దేవదేవేశా! యోగేశా! పుణ్యశ్రవణకీర్తనా! నీ వీకులమునంతయు సంహరించి యీ లోకమును విడుచుట నిజము. ఏలందువా? ఈశ్వరా! నీవు బ్రాహ్మణశాపమును బడఁగొట్టుటకు సమర్థుండ వయ్యును నట్లు చేయక యున్నావు. కాన నీ విడివిడుచుట నిక్కము. కేశవా! నేను నీపాదకమలములనురక్షణమయినను బాసియుండుటకు నొల్లను. నాథా! నన్నుఁగూడ నీధామమునకుఁ గొనిపొమ్ము! బ్రహ్మమా! నీదు వివిధక్రీడలు మనుజులకు మిక్కిలియు మంగళావహములు. అవి కర్ణముల కమృతము వంటివిగాన జనులు వానిని జవిచూచి తక్కిన దేహము మొదలగువానియందలి కోరికలనెల్ల దిగవిడుచు చుందురు. కనుక నట్టినిన్ను నాకెట్లు విడువనగును? నీవు పరుండు నపుడును, గూర్చుండునపుడును, దిరుగుచున్నపుడును,నిలుచున్న పుడును, జలకమాడునపుడును, పనులుచేయునపుడును, గుడుచు నపుడును, మఱి తక్కినసమయములందును, నీతోడఁ గూడి మాఁడి యుండువారము. మఱి మా కాత్మవు; కాన యత్యంత

ప్రియుండవు; ఇట్టినిన్ను, మఱిభక్తులగు మేమెట్లువిడనాడియుండ నేర్తుము ? మఱియుఁ బూదండలు గంధములు వస్త్రము లలంకారములును నీ వనుభవింపఁగామిగిలినవానిని గొనియలంక రించుకొని నీ యుచ్ఛిష్టమును గుడుచుచు నుండువారము. నీదా సులముఁగాన నీసంసారమాయనుజయించినవారము కాఁబట్టియం దులకు భయపడికాదు; నిన్నుఁబాయలేక వెంటఁగొనిపొమ్మను చున్నవారము సుమీ. కౌపీనమాత్రముదాల్చి దిగంబరులై యనశనాదులవలన శ్రమపడియూర్ధ్వరేతస్కులై సన్న్యాసులై రాగద్వేషాదులువీడి పాపములెల్ల దిగవిడిచికదా ఋషులుబ్రహ్మ లోకంబనెడి నీ పదమును బొందుచున్నారు. మఱి యితరులును బ్రహ్మచర్యాది క్లేశములపాలై సంసారమును దరించుచున్నారు. మేమో ! మహాయోగీ ! యీ సంసారమందుఁ గర్మార్జితము లయిన సుఖదుఃఖాదులంబడి భ్రమించుచునుండియు నీభక్తులం గూడి నీ ముచ్చటలచేత నే దుస్తరంబగు సంసారము ననాయా సముగా దాఁటుచున్నారము సుమీ! నీచేష్టితములను నీపలుకు లను నీనడకలను, నవ్వులను బరియాచకములనును మనుష్య లోకము ననుకరించుటకై నీవు గావించుదాని నెల్లఁ దలంచు చును దలఁపించుచును ననాయాసముగా నీ సంసారమును దరింతుముసుమీ'? యనెను. రాజా! ఇట్లుద్ధవుండు విజ్ఞాపింపఁ గా భగవంతుఁ డా దేవకీపుత్త్రుఁడు తన కేకాంతియుఁబ్రియుండు ను భృత్యుండు నగు నుద్ధవునింజూచి యిట్లనియె. ఇది యాఱవ యధ్యాయము.

{ శ్రీకృష్ణుఁ డుద్ధవునకుఁ బరమార్థోపదేశము సేయుచు నవధూతయదుసంవాదమును జెప్పుట. }

శ్రీ భగవంతుఁడు 'మహాభాగా! నీవు చెప్పినట్లె నేను జేయనిశ్చయించుకొంటిని. బ్రహ్మయు రుద్రుఁడును లోకపాలురును నన్ను స్వర్గమునకు రమ్మనికోరుచున్నారు. నేనుభూభారము తీర్పవలయు నని దేవతలు కోరిరి. కార్యమును బూర్ణముగా నిందు నెఱవేర్చితిని. అందులకే కదా బ్రహ్మ ప్రార్థింపఁగా నాయంశముచేత నిం దవతరించితిని. ఈ యదుకులము బ్రాహ్మణశాపముచేత దగ్ధమై పరస్పర కలహములచేత నశింప నున్నది. నేఁటి కేడవనాఁడు సముద్ర మీ పట్టనమును ముంపఁ గలదు. నే నీలోకమును వ్యజించినపుడే యిది మంగళము లెల్లఁదూలి త్వరితముగా నే కలికిం జిక్కి క్రిందు పడఁగలదు. నేను భూతలమును విడిచినపిదప నీ విచట వసించి యుండవలదు. ఏలనఁ గలియుగమందు జను లధర్మమునందు రుచిగలిగినవా రగుదురు. నీవు శబ్దాది విషయముల నన్నిటిని, స్వజనులందును బంధువులయందును గల నెయ్యమును, దిగవిడిచి నాయందు మనస్సును జక్కఁగా నెలకొల్పి యన్నియును బ్రహ్మాత్మకములని సమదృష్టి గలిగి, భూమియందుఁ గ్రుమ్మరుచుండుము. మనస్సుచేతను వాక్కుచేతను గన్నులచేతను జెవులు మొదలగువానిచేతను గ్రహించునవి యెల్లను నశ్వర మనియుఁ బ్రకృతిగుణములకు లోనయిన మనస్సుచేఁ గలుగునవనియుఁ దెలియుము. సర్వాంతరాత్ముఁడనగు నాయందు మనస్సు నుంపని పురుషునకు భ్రమము గలుగుచున్నది; ఆభ్రమము వస్తువులెల్ల బ్రహ్మాత్మకములుగాక వేఱువేఱ స్వతంత్రములై నానావిధముల నున్న

వని తోఁపించుచున్నది. (నాయందు మనస్సు నుంచువానికో అన్నియు మదాత్మకములనియు నొక్కరూపై యున్నవనియుఁ దోఁచుచుండునుగాని నానావిధములనున్నదని భ్రమగలుగదు.) ఆభ్రమము సుఖదుఃఖములను గలిగించుచున్నది. అది స్వరూపముచేత నట్లు సుఖదుఃఖములు గలిగించునది గాదు. కర్మము (అవశ్యక ర్తవ్య మగు నిత్యనైమిత్తిక కర్మము), అకర్మము (ప్రతిషిద్ధకర్మము), వికర్మము (వివిధ ఫలార్థమగు కామ్యకర్మము) అనియీ విధినిషేధాదులు భ్రమగలవానికిఁ దోఁచుచున్నవి. (కనుక విధినిషేధాదులు ప్రతిపాదించు శాస్త్రమునకు వాఁడు లోనగుచున్నాఁడు. కాఁబట్టి యా విధుల ననువర్తించుట వలనను నిషేధముల నతిక్రమించుటవలనను వానికి సుఖ దుఃఖములు గలుగుచున్నవి. కనుక భ్రమము స్వరూపముచేత విధినిషేధాదిభేదప్రతిపాదకమగు శాస్త్రమునకు లోఁబఱుచుటచేత నిట్లు) సుఖ దుఃఖములు గలిగించుచున్నది. ఇట్లు నానా విధములఁ దోఁపించు భ్రమము సుఖ దుఃఖగర్భ మగు సంసారమునకు హేతువగుటంజట్టి యింద్రియసమూహమును నియమించి నాయందు మనస్సును జొనిపి, యచిత్పరిణామాత్మక దేవ మనుష్యాదిశరీరసమూహ మగు నీజగమును జీవునియందును (అనఁగా జీవునికి ధార్యమనియును) జీవుని నీశ్వరుండనగు నాయందును (నాకువాఁడుధార్యుఁడయినవాఁడనియుఁ)గనుఁగొనుము. నీవిట్లు సదా గనుఁగొనుచుందువేని యాభ్రమమును దస్మూలమగు సంసారమును నివర్తించుచున్నది. 'అయిన నిట్టిచూపున కనాది విషయాసక్తివలన నంతరాయములు గలుగవచ్చు' నందువా? మొదట నీవు పృథివి మొదలుకొని యాత్మపర్యంతముగల తత్త్వ

ములను గూర్చి జ్ఞానమును విజ్ఞానమును బడయుము. అపుడు సమస్తభూతముల స్వరూపము దెలిసియుండుటం బట్టి నీవు వాని యన్నిటియందును నాత్మవలె సుహృదుఁడ వగుదువు. అప్పు డాత్మస్వరూపము ననుభవింతువు గాన నిరతిశయానందమయిన యా యనుభవముచేతనే సంతుష్టి నొందుదువు. అల్పసుఖము లగు విషయానుభవములందు నీ కపుడు వెగటుపుట్టును గాన విషయ సుఖానుభవమున కయిన కర్మము లంతరాయములై యట్టి చూపునకు విఘాతము గలిగింపఁజాలవు. ఇట్లాత్మానుభవముచేత సంతుష్టుఁడయినవాఁడు విషయ సుఖదుఃఖముల రెంటిని గడచినవాఁ డయినను నిషిద్ధముల నాచరించుట యాత్మప్రాప్తికి విరోధిగదాయని నిషేధములందు దోషముదలఁచి వాని నుండి నివర్తింపనే నివర్తింపఁడు. విహితమయినకర్మము స్వర్గాది సుఖసాధనముగదా యని దానియందు గుణమును దలఁచి యాచరింపఁడు. ఇట్లాతఁడు చేయఁదగనినిషేధములను జేయు చును జేయఁదగినవిహితములను జేయకయు నుండుటంబట్టి, బిడ్డఁడు దన స్వభావమును వెలి పుచ్చకయే యా యాకార్యములు చేయునట్లు, అతఁడును దన మాహాత్మ్యమును బయలు పఱుపకుండుటకై * యట్లు చేయుచున్నాఁడని తెలియుచున్నది. ఇట్లు పూర్వోక్తరీతిని సర్వభూతములకు సుహృదుఁడై వైరాగ్యమువలన శాంతుడై సకలతత్త్వములనుగూర్చి జ్ఞాన విజ్ఞా

* నిషేధములు ఆత్మప్రాప్తికి ప్రత్యవాయము గలిగించు నవయ్యును వానినిజేయుట తనమహత్త్వము తెలియకుండుటకనియు, విహితములు ఫలములను గలిగించి యాత్మప్రాప్తినుండి చ్యుతి గలిగించుచున్నవి గాన వానిని జేయఁడనియు, తెలియునది.

నములు దృఢముగాఁ బడసి సమస్తమును మదాత్మకముగాఁ గనుఁగొనుచు నుండువాఁడు మరల సంసారవిపత్తి నొందఁడు’ అనెను. ఇట్లు భగవంతుఁ డానతియ్యఁగా మహాభాగవతుం డయిన యుద్ధవుఁడు తత్త్వమును దెలియఁగోరి యచ్యుతునకుఁ బ్రణమిల్లి యిట్లనియె. ‘దేవా! నీవు యోగనిర్వాహకుండవు. యోగము నుపదేశించు వాఁడవు. యోగఫల రూపుండవు. యోగశాస్త్రజనకుండవు. మోక్షమునకై నీవు నాకుఁ జెప్పిన త్యాగమును సన్న్యాసరూపమయినదానిని జెప్పుము. భూమా! విషయముల త్యాగము విషయాసక్తచిత్తు లగువారికి దుష్కరముగా నున్నది. సర్వాత్మా! మఱి నీయందు భక్తి లేనివారికి నది మిక్కిలియు దుష్కర మని నాయభిప్రాయము. నిరతిశయ సుఖరూపమగునిన్ననుభవించువారికో యల్పసుఖములగువిషయములందుఁ ద్యాగ మెట్లయినను గలుగుచున్నది కానియట్టియనుభవములేనివారికి విషయములం దెట్లును వెగటుగలుగనేరదు. నీవు నాకుఁ ద్యాగముపదేశించితివిగాని నేనో నీమాయచేతవిరచితం బగు దేహమునందును దాని యనుబంధు లగు పుత్రకళత్రాదులందును, నహంకార మమకారములచే మూఢమతినై మిక్కిలియు మునిఁగి యున్నాఁడను. నీ వన్నియుఁ బరిత్యజింపు మని యుపదేశించినదానిని సుఖముగా సాధించునట్లు నీ భృత్యుండనగునాకు వేఱువేఱ తెలుపుము.’నేను సంగ్రహముగాఁ జెప్పితిని. తక్కినవారివలన సవిస్తరముగాఁ దెలిసికొను’ మందువేమో! ఈశా! నీకు నిత్యమును నీ స్వరూపము ప్రత్యక్షముగాఁ దెలియుచుండును. కనుక నీకెప్పుడును స్వభావము సంకుచితముగాక యుండును. నీవాత్మకును నంతరాత్ముఁడవు. ఇట్టి నీకంటె

మఱియొకని నుపదేశించువానిని దేవతలయందును నేను గనుఁ గొననేరకున్నాను. ఏలందువా? బ్రహ్మ మొదలయిన వీరందఱు ను నీమాయచేత బుద్ధి మోహము నొందుటవలనఁ గర్మాధీన ములగు దేహములు దాల్చి యాత్మకానిదానిని నే ననెడియభి మానము గలిగి యజ్ఞులై యున్నారు. నీమాయయో నీపదార విందముల రస మెఱింగినవారితోఁడఁ గూడికలేకున్న వారికి, దాని నిరసింపవలయు నని యెన్ని యుపాయములు పన్నినను నది నివర్తింప కుండునది సుమీ! అట్టి మాయచేతనే కదా వారిబుద్ధులుమోహితములై యున్నవి.ఆలుమగ లని దంపతులు గా వర్తించుచు గృహములఁ బొంది తాపత్రయములచేతఁ దపిం చుచు నున్న మానవులేనియు విషయములందలి యాసక్తి వీడి రేని సత్సంగమము గలుగుచున్నది. ఎట్టివారయినను విష యాసక్తిగలిగియుండిరా,యాసంగమముగలుగ నేరదు. కాఁబట్టి బ్రహ్మాదులవలె మోహాదిదోషములు లేక యపరిచ్ఛేద్యములగు స్వరూపస్వభావములు గలిగి సర్వవస్తువులను సాక్షాత్కరించి తెలియుచు సర్వనియంతవై యప్రహతమగు వైకుంఠము స్థానముగాఁ గలిగి నారాయణుండవై నరసఖుండవై యున్ననిన్ను సంసారదుఃఖముచేఁ గ్రాఁగుచు బుద్ధిగలఁగి వేసరియున్న వాఁడను గాన నేను శరణముఁ జొచ్చుచున్నాను' అనెను.

భగవంతుఁడు 'లోకమునం దాయావస్తువుల తత్త్వము లను విమర్శింప నిపుణులయిన వారు తమ మనస్సును చక్కఁగా శిక్షితము గావించికొని దానిచేతనే విషయ వాసనవలన నుండి తఱచుగాఁ దమ్ముత్తరించుకొనుచున్నారు. పురుషునకు మనుష్యజన్మమందు విశేషించి గురువైనది

(హితప్రవర్తకమైనది) చక్కఁగా శిక్షితమగు తనమనస్సే. ఏల నఁగా మనుష్యజన్మమందుఁబ్రత్యక్షానుమానములగు శ్రుతిస్మృతులవలననుబురుషునకు శాస్త్రాధికారమువలనను శ్రేయస్సుగలుగుచున్నది. మఱియు మనుష్యజన్మమునందే సాంఖ్యమునందును (చిదచిదీశ్వరతత్త్వత్రయవివేకమునందును) యోగమునందును (పరమాత్మోపాసనమందును) గుశలులై జితేంద్రియులగుచు నన్ను (వివిధవిచిత్రసృష్ట్యాదుల కుపయుక్తములయిన సర్వజ్ఞత్వము సత్యసంకల్పత్వము మొదలుగాఁగల) శక్తులతో నెల్ల నతిశయించియున్నవాఁడ నని మిక్కిలియు స్పష్టముగా నెఱుఁగ నేర్తురు. ఇందు నేనొకపాదముగలవానిని రెండుపాదములు గలవానిని మూఁడుపాదములు గలవానిని నాలుగుపాదములు గలవానిని పెక్కుపాదములు గలవానిని నట్లె పాదములే లేనివానిని, ఇట్లు పెక్కుదేహములను సృజించియున్నాను. అందు మనుష్యదేహమే (నన్ను స్పష్టముగా నెఱుఁగఁగూడినది గాన) నాకు మిక్కిలియుఁ బ్రియమైనది. అట్లని మనుష్యజన్మ మొందినవారెల్ల నిన్నుఁజూతురుగదా యనవలదు. నేను బ్రత్యక్షముగా గ్రహింపఁబడు రూపాది లక్షణములచేతను ననుమాన లక్షణములచేతను గ్రహింపనలవిగాని వాఁడను. కావున నెవరో కొందఱు మాత్రమె యీశ్వరుండనగునన్ను యుక్తము లగు హేతువులచేత విమర్శించి వెదకుచుఁ గనుఁగొనుచున్నారు. ఈవిషయమై పురాతనమగు నొకయితిహాసము నుదాహరించుచున్నారు. అది యొక యవధూతకును నమితతేజుం డయిన యదువునకును జరిగిన సంవాదము. ఒక బ్రాహ్మణుఁ డభ్యంగనాదులచేత దేహమును సంస్కరించుకొనక శీతవాతాదు

లకు వేనికిని భయపడక యవధూతగానుండెను. అతఁడెలప్రాయపు వాఁడు; విద్వాంసుఁడు. అతఁడుసంచరించుచుండఁగా నొకప్పుడు ధర్మవిదుఁ డగు యదు వతనిని జూచి 'బ్రాహ్మణా! నీ వింద్రియ ప్రీతికై యేకర్మమును జేయవు. మిక్కిలి నిపుణమయి లోకుల కెవ్వరికిని లేకున్న యిట్టిబుద్ధి యెక్కడనుండి కలిగినది? నీవా బుద్ధిని బడసినందున, విద్వాంసుఁడవయ్యు నజ్ఞునివలె లోకమం దుఁ జరించుచున్నావే. బహుతరముగా మనుజులు గొప్పవారు సయితము ధర్మార్థము కామములందును దానికి సాధనాదులు తెలిసికొనుటయందును నాయువు కీర్తిసంపదను బడయఁగో అకును, బ్రవర్తించుచునే యున్నారు. నీవ్రా శక్తుఁడవు గాన యశక్తిచేత నేమియుఁ జేయలేవని చెప్పనయితిలేదు. విద్వాం సుఁడవు; కాన దెలియమిచేత నూరకున్నావనరాదు. సమర్థుఁ డవు; కాన నేర్పులేమిచేత ననరాదు. చక్కనివాఁడవు, కాన విరూపినిగాననూరకున్నాననుటయుఁ దగదు. మితభాషివి, కాన మాటకారితనము లేనందుచేత ననరాదు. అయినను నీవు జడుని వలెను నున్మత్తునివలెను బిశాచముపట్టినవానివలెను నేమియుఁ జేయుట కొల్లకున్నావు. తక్కిన జనులు కామ లోభము ల నెడికారుచిచ్చుచే దగ్ధులగుచుండఁగా నీవట్లు తపింపక యగ్ని నుండి గంగాజలములం దోలలాడుచున్న యేనుఁగువలె సుఖ ముగా నున్నావు. బ్రాహ్మణా! ఇట్లు శబ్దాది విషయ స్పర్శము మాని కేవల మేదేహానుబంధమును లేని యాత్మతోఁ గూడియున్న నీదు మనస్సునకుఁ గల యా నందమునకుఁ గారణ మేమియో యడుగుచున్నవారము గాన మాకుఁ జెప్పవలయును' అనియడిగెను. భగవంతుఁడు-'మిక్కిలి

మేధావియు బ్రహ్మణ్యుండు నగు యదు విట్లు పూజించి వినయ వినమ్రుఁడై యడుగఁగా మహాభాగుం డాబ్రాహ్మణుండు-"రాజా నాకు బుద్ధిసంపన్ను లగు గురువులు పెక్కండ్రున్నారు. వారి వలన నే నేను సుశిక్షితమయిన బుద్ధినిబడసి తాపత్రయమునుండి విడివడి క్రుమ్మరుచున్నాను. బుద్ధిమంతు లయిన యాగురువులను వినుము. భూమియు,వాయువు,నాకాశమును, అప్పును,నగ్నియుఁ, జంద్రుఁడును, సూర్యుఁడును, గపోతమును, అజగరమును, నది యును, పతంగమును, మధుకృత్తును, గజమును, బోయవాఁ డును, జింకయును, జేఁపయును, పింగళయుఁ, గురరమును, బాలుఁడును, కుమారియు, అయస్కారుఁడును, సర్పమును, సాలెపురుగును,దుమ్మెదయు ననెడియీయిరువది నాలుగును నాకు గురువులు. నేను వీరిని నాశ్రయించితిని. వీరల వృత్తులచేత నా మనస్సునకు శిక్ష గావించితిని. యయాతిపుత్రా! దేనివలన, నేదానిని, నేవిధమున, శిక్షనొందితినో దాని నట్లె చెప్పెదను. పురుషసింహమా! వినుము. దైవప్రేరితములై భూతములు పట్టి పీడించుచున్నను ధీరుండై భూతములు దైవవశమున నట్లు చేయుచున్నవని యెఱింగి మార్గమునుండి చలింపకుండ వలయును. భూమికిఁ గల [1]నియతధర్మమును (క్షమను) దానినుండి శిక్షనొందితిని. సర్వదా పరోపకారము కొఱకై చేష్టించుటయుఁ బరులకొఱకె పుట్టుటయుఁ [2]బర్వతమువలన

1. భూమి సమరూపయు పర్వతవృక్షాదిరూపయునని రెండువిధములు. అందు సమరూపయగు భూమివలన గ్రహించినదానిని జెప్పిరని తెలియునది.

2. ఇందుఁ బర్వతవృక్షాది రూపయగు భూమివలననుండి శిక్షితమైనది చెప్పఁబడెను. పర్వతము తనయందలిచెట్లు పట్టలు గడ్డి సెలయేళ్లు మొందలయిన

నుండి చక్కఁగాఁ గఱపఁదగును. వృక్షములకు శిష్యుఁడై, దాని వలనఁ బరాధీనతను గఱవవలయును. ముని ప్రాణధారణమునకు వలయునంతమాత్ర మాహారాదివృత్తి గలిగి యుండవలయును గాని శబ్దాదివిషయముల ననుభవించుచుండరాదు. ప్రాణము నెలకొనియుండుటకు నాహారాదులు మాత్రము చాలును గాని, శబ్దాదివిషయములు వలదు. ప్రాణములకొఱకుఁగాని బ్రతుకు చూడ నేలయనవచ్చును. ప్రాణవ్యాపారము జరుగనిచో మనస్సు విక్లబమై జ్ఞానము నశించుచున్నది; కనుక, జ్ఞానము నశింపకుండునట్లును మనస్సుగాని చెడకుండునట్లును నందుల కుపయుక్తమగు ప్రాణవ్యాపారమును జరుపుకొనవలయును. విషయములు ప్రియములనియు నప్రియములనియుఁ బ్రియాప్రియములనియు నానాధర్మములుగలిగి యుండును. యోగియగువాఁడా విషయములం దెల్లఁజొచ్చియున్నను (అనఁగా వానిని దన యింద్రియములచే ననుభవించుచున్నను) మనస్సుమాత్రము వానివలనిప్రియాప్రియములను వీడి, వాయువు చందనముతోఁ గాని యగ్నితోఁగాని గూడియున్నను వానియందుఁ దగులు లేకుండునట్లు, తాను నావిషయములందుఁ దగులులేకుండవలయును. ఆత్మదర్శనముగల యోగి పృథివ్యాదిపరిణామరూపము లయినదేహములందుఁజొచ్చి దేవత్వము మనుష్యత్వము స్థూలత్వము కృశత్వము మొదలయిన దేహధర్మములతోఁగూడిన వాఁడుగా నగపడుచున్నను, ఆగుణములతోఁ గూడినవాఁడు గాక (అనఁగా నేను స్థూలుఁడను గృశుఁడ నని తలంపక)

---

వాని నిచ్చుటయెల్ల పరులకొఱకె. చెట్లు పరులునఱికినను జీల్చినను వలదనవు. ఒప్పుకొనును. ఇదియే పరాధీనత్వము.

వాయువు మంచి చెడు గంధములు మొదలగువాని కాశ్రయమై యుండినను వాస్తవమునకు వానితోఁ గూడిక లేక యుండునట్లు తాను నట్టి గుణములతోఁ గూడిక లేమిని దెలిసి తన్ను దేహవిలక్షణమగు నాత్మగాఁ గనుఁగొనుచుండును. వేదాంతవాక్య సమన్వయము చేత సర్వవస్తువులును బ్రహ్మాత్మకము లని సిద్ధించుచున్నది. కనుకఁ జరాచరాత్మకములగు సకలభూతములందుఁ బరమాత్ముండు నిరంతరముగా వ్యాపించి నిండియున్నాఁడు. ఇట్లతఁడు సకలమునకును వెలుపలను లోపలను వ్యాపించియున్నను నాకాశమువలె వానితోడి [1]సంగముమాత్ర మతనికిఁ గలుగదు. భూజల వికారములయిన మేఘములనెడి పదార్థములు వాయువుచేతఁ బ్రేరితములై పుటమెగసినను వానిచేత నాకాశమంటఁబడదు. అట్లే పరమపురుషుఁడును, నిమిత్తమగు కాలముచేత సృజింపఁబడినవై గుణపరిణామాత్మకములైన స్థావరజంగమములందెల్ల వ్యాపించియున్నను వానియందలి దోషములచేత నంటఁబడడు. మఱి యు

1. వాయువలనిశిక్షితము చెప్పునపుడు, వాయువు ప్రాణమనియు బాహ్యమగు వాయువనియు రెండువిధముల గ్రహించి ప్రాణవాయువుతనధారణమునకు వలయునంత మాత్ర మాహారాదివృత్తిగోరుచున్నదే కాని శబ్దాదివిషయములు నందులకుఁ గోరకుండునట్లు మునియుండవలయుననియు, బాహ్యవాయువు; తానుగూడియున్నవాని ప్రియాప్రియములతోఁ దనకుసంబంధము లేకుండునట్లు, యోగి విషయముల ననుభవించుచున్నను వానియందలిప్రియాప్రియములను బాటింపకయుఁ దగులులేకయు నుండవలయుననియు, ఆ వాయువు సురభి పూతి గంధాదులతోఁ గూడియున్నను ఆగంధాదులగుణములు వాయువు గుణములు గానట్లు, యోగి దేహాదులతోఁగూడియున్నను వాని గుణములగుస్థూలత్వకృశత్వాదులు తనవిగావని తలంపవలయుననియును శిక్ష తెలియునది.

[1] స్వచ్ఛుఁడై స్వభావముచేతస్నిగ్ధుఁడై మాధుర్యముగలిగినరులకు తీర్థస్థానమైయిట్లుజలమునకుసాటిగానుండుముని,తన్నుఁ జూచుట చేతను నుపస్పృశించుటచేతను గీర్తించుటచేతను బవిత్రము చేయును. ఆత్మయోగముగలవాఁడు తేజస్సుగలిగి తపస్సుచేత మిక్కిలి దీపించుచుండుటవలనఁ జెనకరానివాఁడై యుదరమె పాత్రముగాఁగలిగి(అనఁగా మఱియేపరిగ్రహమును లేక)మృష్టాన్నమనియుఁ గదన్నమనియుఁ జూడక యన్నిటిని భక్షించువాఁడయినను మాలిన్యమునొందక [2]యగ్నివలెనుండును.మఱియు నాయోగి,యొక్కయెడ,నగ్ని నివుఱుచేఁగప్పఁబడియున్నట్లుతనమాహాత్మ్యమును వెలిపుచ్చక, యగ్నియాజ్యాదులతోఁగూడిచెలంగునట్లు యోగాభ్యాసాదులచేతఁ జెలంగి స్వర్గమోక్షాదులగు శ్రేయములను గోరువారికి నగ్నివలెనే కొలువఁదగినవాఁడై యగ్ని పరులకొఱకే హవిస్సును గొనునట్లు తాను దనకొసంగు

1. సచ్ఛశబ్దము, జలపక్షమున తేటయైనది. మునిపక్షమున నిర్మలుఁడైనవాఁడు. స్వభావముచేత స్నిగ్ధముగానుండుట యనఁగాభూతములం దనురాగముగలిగియుండుట యని మునిపరము. జలము స్వభావముచేత స్నేహముగలదిగదా. మాధుర్యశబ్దమునకర్థము మధురములగుమాటలుగలవాఁడనిమునిపరము.తీయఁదనముగలది యనిజలపరము. తీర్థస్థాన మనఁగా,తీర్థులఁబంటివాఁడని మునిపరము. పుణ్య తీర్థమైనదని జలపరము. ఉపస్పృశించుట యనఁగా మునిపక్షమున పాదస్పర్శాదులు. జలపక్షమున స్నానపానాదులు.

2. తేజస్వీతపసాదీప్తోదుర్ధర్షోదరభాజనః।సర్వభక్షో౽పియుక్తాత్మా నాదత్తే మలమగ్నివత్' అని మూలము. దీనికి అగ్నిపక్షమున (తేజస్వీ)తేజస్సుగలవాఁడు. (తపసాదీప్తః) గ్రీష్మఋతువునందుమిక్కిలిదీపించువాఁడు, కనుక (దుర్ధర్షః) చెనకరానివాఁడు. (సర్వభక్షః)సమస్తమునుభక్షించువాఁడు. (మలంనాదత్తే) అగ్ని సర్వభక్షణము చేసియు దోషము నొందదనుట.

వారలభూతభవిష్యత్స్వాపముల నెల్లఁ గాల్చుటకై వారియిచ్చు నవి గయికొనుచున్నాఁడు. పరమపురుషుఁడు చిదచిదాత్మకమగు జగత్తును బ్రవేశించి యాయావాని దేవమనుష్యాది రూపము లుగలవానివలెను, కట్టియలందుఁ జొచ్చినయగ్ని వానివంకర మొదలగు రూపములను దాల్చునటువలెను, యోగి కనుపట్టు చున్నాఁడు. చంద్రుని కలలకే పెరుఁగుటయుఁ దఱుఁగుటయుఁ గలుగుచున్నవి; చంద్రునికిఁగావు. అట్లె గర్భాధానము మొదలు కొని శ్మశానమువఱకుఁ గలుగు వికారము లస్పష్టగతియగు కాలమునిమిత్తమున దేహమునకే కలుగుచున్నవి గాని, యాత్మకుఁ గలుగవు. [1] అగ్ని హానుఁగువడక నెలకొనియుండు నపుడే దానిజ్వాలలు పుట్టుచును నడఁగుచు నుండును. కాన యుత్పత్తి వినాశములు జ్వాలలకే కాని యగ్నికి లేవు. అట్లె ప్రవాహమువలె వేగముగల కాలముచేత జన్మనాశ ములు ప్రవాహరూపమున నిత్యములుగానున్నను నవి భూతము లకేకాని యాత్మకుఁ గావు. సూర్యుఁడుతనకిరణములచేత జలము లను దీసికొని మరల వానిని వర్షరూపమున నిచ్చునట్లు యోగి యగువాఁడు కాలోచితముగా నుపభోగ్యములగు వస్తువులను దన యింద్రియములచేత సంపాదించి వాని నర్థులకు నొసంగు చున్నాఁడుగాసితనకై యుపయోగించుకొనఁడు. దేహమేయాత్మ యని తప్పఁదలంచువాఁడు, దేవాదిశరీరములం దున్నప్రత్యగాత్మను, వాస్తవమున దానికి దేవత్వాదులు లేకున్నను, 'వీఁడు దేవుఁడు వీఁడుమనుష్యుఁ' డనియే యెఱుంగుచున్నాఁడు. మఱి

1. పూర్వవాక్యమున చంద్రదృష్టాంతముచే జన్మాది వికారము లాత్మకు లేవని, దానినే మరల నగ్నిదృష్టాంతముచే నం దుపపాదించుట తెలియునది.

తన యాత్మనుగూడ 'నేను దేవుఁడను మనుష్యుఁడను బలసితిని జిక్కితి'నని కనుఁగొనుచున్నాఁడు. ఆకాశమందున్న సూర్యుఁడద్దము జలము మొదలగువానియం దున్నట్లు తోఁచుచున్నను వానిస్వభావములతోడి సంసర్గము లేకుండునట్లు, ఆత్మయు దేవాదిదేహములం దున్నను వాని స్వభావాదులను బొందదని దేహమునకంటె నాత్మవిలక్షణమైనదను మతిగలవా రెఱుంగుదురు. అయినను సూర్యుఁ డద్దముమొదలగు వ్యక్తులయందు లేకయె యం దున్నట్లు కనఁబడుచున్నాఁడు. ఆత్మయో వాస్తవమున దేవాదిదేహవ్యక్తులం దున్నవాఁడు. అయినను సూర్యుఁడావ్యక్తుల స్వభావములతోడి సంసర్గము లేకుండునట్లె యాత్మయు లేకుండును. ఎవ్వఁడయినను మిక్కుటమయిన ప్రేమను నుపలాలనాద్యాసక్తినిని దేనియందుఁగాని నెఱపరాదు; అట్లు నెఱపినచో బుద్ధి విన్నఁనై కపోతమువలె సంతాపమును బొందుచున్నాఁడు. కపోతమొకటి యొకానొకయడవియం దొకవృక్షముపయిని గూఁడు కట్టుకొని దానును దన భార్యయుఁ గొన్ని సంవత్సరములుగా వాసము చేయుచుండెను. ఆకపోతములు రెండును నెయ్యముచేత నొండొరుల హృదయముగలసి మెలసిమిథునధర్మము నెఱపుచుఁ జూపుతోడఁ జూపును, మేనితోడ మేనును, బుద్ధితోడ బుద్ధినిని గూర్చికొని మెలంగుచుండునవి. రాజా! ఆ కపోతికి గర్భముగలిగె. అపుడు కపోత మిల్లాలివలన దయగలిగి యడుగఁగా నాపె యేమేమి గావలయునని కోరునో యా కోరినదానినంతయు మిక్కిలియుఁ గష్టపడియైనను దెచ్చియిచ్చుచుండెను. ఏలనఁగా నాకపోత మింద్రియములకు లోనయినది గదా. ఆ పిట్టలును రెండును బరుండినను గూర్చున్నను

దిరుగుచున్నను నిలుచున్నను ముచ్చటలాడినను గ్రీడించినను నెరదిన్నను మఱి యేమేమిచేసినను గవగూడియె జంకులేక చేయుచు వనసమూహములందుఁ జరించుచుండెను. కపోతి తనకుఁ దొలుచూలు రాఁగాఁ బ్రసవకాలము వచ్చినపుడు తన గూఁటియందుఁ దన మగనియెదుటనే గ్రుడ్ల నీనెను. ఆగ్రుడ్లుకాలక్రమమునఁబరిపక్వములై కూనలాయెను. మఱియు వానికి నచింత్యము లగు హరిశక్తులచేతను నవయవములేర్పడి మృదువులయిన యంగములును నీఁకలుఁగలిగినవి. ఆదంపతులు రెండును గన్నబిడ్డలయందు మిక్కిలిగారాముగలవిగానయాకూనల కూఁతలను వినుచు నవ్యక్త మధురములయిన వాని పలుకులకుఁ జొక్కుచును నిట్లు సంతోషము దొంతరలుగొన నా బిడ్డలను బెంచుచువచ్చినవి. తాఁకుటకు మిక్కిలి యింపయిన వాని చిగురుఱెక్కలను నల్లల్లఁ దడవుచును వాని యింపయిన రవళులను వినుచును, వాని సొగసయిన చేష్టలను గనుచును, నవి సొంపువెంపునఁ బయి కెగురఁగాఁ జూచుచును, తలిదండ్రు లెంతయు ముదమునొందినవి. అవి రెండును విష్ణుమాయచేత మిక్కిలియు మోహితములై నెయ్యమున మనస్సు లొండొరులయెడ ననురక్తమై నిగుడఁ దమకన్న యాకూనలను బెంచు విషయమున బుద్ధి చెలువుదప్ప వానిని బోషించుచు వచ్చెను. ఒకప్పు డాయాలుమగలు రెండు, నాకూనల కెరదెచ్చుటకై చుట్టుప్రక్కలనున్న యడవియందుఁ జాలసేపు తిరుగుచుండెను. అపు డాయడవియందుఁదిరుగుచున్నయొక బోయవాఁడుదైవికముగానాకూనలనుజూచి యవితమగూఁటికిఁబొంత దిరుగుచుండఁగా వలవైచి వానిని బట్టుకొనెను. కపోతమునుఁ

గపోతియును దమ బిడ్డలను బోషించుటయందే యెప్పుడు తవిం
గొని యుండునవి. కనుక నవి బిడ్డల కొఱకై యెరగొని తమ
గూంటికి వచ్చినవి. కపోతి యంతఁ దనబిడ్డలు వలయందుఁ జిక్కి
యుండుటను జూచి యవి మిక్కిలియు దుఃఖముతోఁ దన్నుఁ
జూచి బిట్టుగాఁ గూయిడఁగాఁ దానును బిగ్గరఁ గూపెట్టుచు వాని
కడకుఁబోయెను. ఆకపోతి యజుం డగు విష్ణుని మాయ చేత
మాటికి నెయ్యమున దనహృదయము వానియందుఁ జిక్కు
వడఁగా నవి యట్లు బద్ధములై యుండుటను జూచి స్మృతి దప్పి
తాను నా వలయందుఁబడి పట్టుపడెను. అంతఁ గపోతము తన
కంటె నెక్కుడు ప్రియులయిన తన బిడ్డలును, తనకు సమాను
రాలయిన ప్రియురాలును బద్ధులై యుండుటను జూచి మి
క్కిలియు దుఃఖమున విలపింపఁ దొడఁగెను. 'అక్కటా! చూ
డుఁడు నావ్యసనమిది. నేనుదుర్మతిని నే నల్పపుణ్యుఁడను. కావు
న నే యింకను విషయము లనుభవించి తనివినొంద నైతిని.
కనుకఁ గృతార్థుఁడనుగా నయితిని. ఇంతలో ధర్మార్థకామముల
నెడు మూఁడు పురుషార్థములకును సాధనభూతమయిన గృహ
స్థాశ్రమము నాకు హతమైనదిగా! నాయిల్లాలు నా కెంతోయను
కూలముగానుండునది. నాకు మిక్కిలి యనురూపయైనది.పతియె
దానికి దైవము. నన్ను దిగవిడిచి నా యిల్లు పాడు పుచ్చి
తానును సాధువులగు తనపుత్రులతో స్వర్గమునకుఁబోవుచున్నది.
నే నిట్లు పెండ్లమునుజచ్చి బిడ్డలునుజచ్చి దీనుండనై పాడుపడిన
యింటనుండి యెందులకని బ్రతికియుండుటకుఁ గోరవలయును ?
అన్నియును బాసి దుఃఖముతో మనవలయునా ?' అని విలపిం
చెను. అది యట్లు తన బిడ్డలు వలలందుఁ జిక్కువడి మృత్యువు

వాతఁ బట్టువడినట్లయ్యె, మూర్ఛిల్లుటఁ జూచి యజ్ఞుఁడు గానఁ దానును దీనుఁడై యా వలలయందుఁ జొచ్చెను. క్రూరుఁడయిన యా బోయవాఁడు కుటుంబియగు నాకపోతమును వానిబిడ్డలను గపోతినిని బడసి, వచ్చినపని యొడఁగూడినవాఁడై యింటికిఁ బోయెను. ఇట్లె మనుజుఁడు కుటుంబియై యింద్రియములను జయింపక శీతోష్ణాది ద్వంద్వములయందే రమించుచుఁ గుటుంబమును బోషించుచు నుండి కడపట నా పక్షి వలెనే దీనుండై పుత్రకళత్రములతోడఁ గ్లేశముపాలగు చున్నాఁడు. పక్షివలె వివేకశూన్యముగాక ముక్తి ద్వారమును దెఱచునట్టి దయిన మనుష్యదేహమును బొందియు గృహములందుఁ గపోతమువలెఁ దగులుపడ్డవాఁడు శ్రేయోమార్గము పయినెక్కియుఁ గ్రింద ద్రొల్లిపడినట్టివాఁ డగునని తెలియుదురు. ఇది యేడవయధ్యాయము.

---

### అవధూత యదుసంవాదము.

(అనుబంధము.)

బ్రాహ్మణుఁడు 'రాజా! ఇంద్రియములవలనఁ గలుగు సుఖము స్వర్గమునందును నరకమందును బ్రారబ్ధ వశమునఁ గలుగుచున్నది. దుఃఖము కోరకయే వచ్చునట్లు సుఖముగూడ వచ్చుచున్నది. దుఃఖమువలెనే సుఖము గూడ, సుఖదుఃఖములు ప్రారబ్ధఫలములని తెలిసిన వానికిఁ గోరఁదగదు. ఆహారము మిక్కిలి రసవంతమైనదిగాని విరసమైనదిగాని, మిక్కిలి చాలి వంతమైననుగాని, రవ్వంతమైననుగాని, దైవికముగానెట్టి దెంత

మాత్రము లభించునో యంతటిని లోఁగొని కష్టపడి తెచ్చు కొనుటకుఁ బ్రయత్నింపకుండుట యజగరవృత్తి యగును. ఆహారము దైవికముగాఁ దనంతట దొరకకున్న యెడల నపు డజగరమువలె నాహారప్రాప్తికిఁ బ్రతిబంధకమయిన యా ప్రారబ్ధము ననుభవించుచు నే యుద్యమమును జేయక పెక్కులు దినము లూరకపరుండి యుండవలయును. ఇంద్రియబలమును సహమును శరీరబలమును గలిగి యున్నట్టి దేహమును దాల్చి యున్నను నేపనియుఁ జేయక యూరకపరుండి యుండవలయును. ఇంద్రియము లాయా వ్యాపారములకుఁ జాలియున్నను నిద్ర లేక (అనఁగా దత్త్వ విమర్శనమునందుఁ బారవశ్యము లేక) యే సుఖమును గోరకయు నే వ్యాపారమును జేయకయు నుండవలయును. ముని సముద్రమువలెఁ బైకి బ్రసన్నముగను లోపల గంభీరముగను నుండుచు, నిట్టివాఁడని చెప్పఁదరము గాకయు గడవ నలవిగాకయు, నింతయని కొలఁది లేకయుఁ, గలంచి పుచ్చరాకయు, స్తిమితుండై యుండును. మఱియు, సముద్రము వర్షాకాలమున నదీజలములచే సమృద్ధముగానున్న ప్పు డుప్పొంగుటలేదు. గ్రీష్మమున నాజలములు లేకపోయిన పు డెండిపోవుటయు లేదు. ముని యగువాఁడు విషయ పరుఁడు గాక నారాయణపరాయణుఁడై యుండుటవలనఁ గార్యము లెల్లఁ దనకు సమృద్ధముగా నున్నపుడు హర్షింపఁడు. అవి లేనపుడు శోకింపఁడు. దేవమాయవలె మోహపెట్టునదియుమీ ముద్దియ. ఆ మగువనుజూచి దాని విభ్రమాదిభావనలచేత నింద్రియముల జయింపనివాఁడు తెలుపడి పేరాసగొని యుస్త్రీయందు మిడుతవలె, నంధతమస్సునందుఁ బడుచున్నాఁడు.

మాయారచితము లగు స్త్రీలయందును వారల బంగారు సొమ్ములు వస్త్రములు మాల్యములు చందనములు మొదలగు వానియందు నుపభోగింపందగదని బుద్ధిగలిగి మనస్సు మిక్కిలియు మోహితముకాఁగా, మూఢుండై దానివలన వివేకము చెడి [1]మిడుతవలె నశించుచున్నాఁడు. తుమ్మెద పువ్వులను బీడింపకయె యందందుఁ గొంచెమె గ్రహించుచు నొక్కచోటను గుటిగా నుండకుండునట్లు, మునియు దేహముజరుగుటకు వలయు నంతమాత్రము గొనుచు నందును గొంచెము గొంచెమే గొనుచును నెవ్వరినిని బీడింపక వర్తింపవలయును. [2] తుమ్మెద, యొక్క తామరయందే తగులువడి యుండునేని యది మొగుడు నపుడు దానిలోపలఁ జిక్కుకొనునట్లు, మునియు గుణలోభము చేత నొక్కగృహమునే యాశ్రయించి యుండునేని దాని యందలి మోహమునకుఁ బట్టువడుచున్నాఁడు. తుమ్మెద రవ్వంత పువ్వుల నుండియుఁ బెద్దపెద్ద పువ్వుల నుండియు సారమును గ్రహించునట్లు, కుశలుండగు మనుజుఁ డల్పసారములగు శాస్త్రములనుండియు మహాసారము లగు శాస్త్రముల నుండియు నన్నిటను సారమును గ్రహింపవలయును. మనుజుం డన్నమును

1. రూప రస గంధ స్పర్శ శబ్దము లయిదింటియందుఁదగిలిన పతంగ మధుకర గజహరిణమీనము లయిదును ఆ యయిదింటిచే హతములగు చున్నవి. కాన యివి యైదును గురువులు. ఇదియే 'పతంగ మాతంగ కురంగ భృతేం మీనా హతాః పంచభిరేవ పంచ| ఏకః ప్రమాదీస-కథంనహన్యతే యస్సేగన పంచభిరేవపంచ' యని చెప్పఁబడియున్నది. ఇందు రూపవిలాసమోహితుఁడ యినవాఁడు నశించుచున్నాఁడని పతంగమువలన శిక్షితమగుచున్నదని చెప్పు చున్నాఁడు

2. ఇదియె మాధుకరవృత్తి యనఁబడు చున్నది.

భిక్షించి తెచ్చి యిది మాపటిభోజనమునకు నిది రేపటి భోజనము నకని దానిని సేకరించి పెట్టుకొనఁ గూడదు. మఱి తనదోసిలియె యన్నము తినుపళ్లెరముగాను, దనకడుపే యన్నము పెట్టుకొను పాత్రముగాను గలిగి యుండవలయును. కాని* తేనెటీఁగవలెఁ గూడఁబెట్టుకొనరాదు. భిక్షించి తెచ్చుకొనువాఁ డన్నమును మాపటికనియు రేపటికనియుఁ గూడఁబెట్టుకొనరాదు. తేనెటీఁగవలె వాఁడు గూడఁ బెట్టుకొనునేని, యా తేనెతోడ నది నశించునట్లు వాఁ డా కూడఁబెట్టి కొన్నదానితోఁ గూడఁ దానునశించుచున్నాఁడు. భిక్షుఁడగువాఁడుపడఁతిని మ్రానితోఁ జేయఁబడినదాని నయినను, కాలితో నయితము ముట్టరాదు. ముట్టెనా గడ్డిమొదలగువానితోఁగప్పియున్న గోతిపయినుండు మ్రాని యేనుఁగుపెంటియొడలిని దాఁకఁగా మగయేనుఁ గాగోతిలోఁబడి పట్టువడునట్లు తానును బట్టువడుచున్నాఁడు. స్త్రీమృత్యువునకుసాటియైనది. కనుక వివేకియగువాఁడుదానిని బొందరాదు. వాఁడు దానినిబొందెనా, మగయేనుఁగొక యాఁడు గజమును బొంది తనకంటె బలమెక్కుడయిన యేనుఁగులచేఁ జంపఁబడునట్లువాఁడు హతుఁడగును. లోభియగువాఁ డెంతో కష్టపడి గడించినధనమును నొకరికిని బెట్టఁడు; దానును గుడువఁడు. తేనెటీఁగలు కష్టపడి కూడఁబెట్టిన తేనెను దానిని గొనువాఁడు హరించు

---

*మూలమునందు గురువర్గగణనమున 'పృథివీ వాయురాకాశమాపోఽగ్నిశ్చన్ద్రమారవిః। కపోతోఽజగరస్సిన్ధుఃపతఙ్గో మధుకృద్గజః। మధుహాహారిణో మీనః పిఙ్గళాకురరోఽర్భకః।కుమారీశరకృత్సర్పఊర్ణనాభిస్సుపేశకృత్ ।ఏతే మేగురవః' అని చెప్పఁబడియున్నది. అందు 'మధుకృత్' అనఁగా తుమ్మెదను తేనెటీఁగను జెల్లునుగాన, ఇంతవఱకు దుమ్మెదను గూర్చి చెప్పియిపుడు తేనెటీఁగవలనఁ గలుగు వానిని జెప్పుచున్నారు.

వట్లు ఆలోభి ధనమును దీసికొని నేర్చినవాఁడెట్లో గ్రహించి తా ననుభవించుచున్నాఁడు. వీఁడును దాన భోగములకు దాని నుపయోగింపఁడేని మతియొకఁడు వాని కంటె బలీయుఁడు దానిని లాఁగికొని యనుభవించుచున్నాఁడు. తేనెటీఁగలు కష్టపడి కూడఁబెట్టిన తేనెను దాను గుడువక దలఁచుచుండగా వానికి మునువే తేనెను హరించువాఁడు దాని ననుభవించుచున్నాఁడు. అట్లు మిక్కిలియుఁ గష్టపడి ధనమును సంపాదించి దానిచేతఁ బానభోజనాదులయిన కామముల నెల్ల ననుభవింప నువ్విళ్లూరుచుండు గృహస్థులకుఁ గల యన్నము నెల్ల వారికి మునుపు [1]యతి యనుభవించుచున్నాఁడు. కనుకఁ దేనెను హరించువాఁడే ప్రయత్నము లేకయే భోజనమును బడయునట్లు యతియుఁ బడయుచున్నాఁడు. యతిగాని వానప్రస్థుఁడుగాని గ్రామ్యజనుల గీతములను వినరాదు. (భగవద్గీతయే వినఁదగును) వేఁటకాని యింపయిన గీతమునకు మోహపడి జింక పట్టువడుటను వాఁడు నేరవలయును. [2]మృగీపుత్త్రుఁడగు ఋశ్యశృంగుఁడు గ్రామ్యములయిన స్త్రీల నృత్యవాద్యగీతములను జూచియును వినియును గడపట నాపడఁతులకు నాటబొమ్మవలె లోనయినాఁడు. కనుక నట్టి గ్రామ్యసుఖముల సేవింపరాదు. జిహ్వ మిక్కిలి కలంచి పుచ్చునట్టియింద్రియము. జనుఁడు దానిచేత దాని విషయమగు

---

1. ఇట 'యతిశ్చ బ్రహ్మచారీచ పక్వాన్న స్వామినా వుభౌ । తయోరన్న మదత్త్వాతు భుక్త్వా చాంద్రాయణంచరేత్' అనిశాస్త్రము. దీనిని దెలిసిన గృహస్థులు యతికి ముందు పెట్టియె తాము గుడుతురు.

2. గురువర్గమునందు 'మధుహా హారిణో మీనః' అన్న హారిణ శబ్దముచేత హారిణీసుతుఁడగు ఋశ్యశృంగుఁడును వివక్షితుఁడగుటచేత నతఁడును గురువని తలఁచి చెప్పుచున్నాఁడు.

రసమునందు మిక్కిలి మోహపడి దానివలన బుద్ధి చెడి, మీ నెర కాసపడి గాలమును మ్రింగి చచ్చునట్లు, తాను మృతినొందుచున్నాఁడు. బుద్ధిమంతు లాహారమును విడుచుటచే నాలుకతప్పఁ దక్కిన యింద్రియములను జయించుచున్నారు. [1]నాలుకయో యన్నము లేకున్నను బెరుఁగుచున్నది గాని డిందువడదు. పురుషుఁడు తక్కిన యింద్రియముల నన్నింటిని జయించియున్నను జిహ్వనుగూడ జయింప కుండునంతవఱకు జితేంద్రియుఁడు గానేరఁడు. జిహ్వను జయించినచో నన్నియు జయించినట్లె తొల్లి విదేహపట్టనమునఁ బింగళయను నొక వేశ్యయుండెను. దానివలన నేను నేర్చుకొన్నది కొంచెము కలదు. రాజనందనా! దానిని జెప్పెదను వినుము. ఆపింగళ విచ్చలవిడిని బ్రవర్తించినది. అది తన కెంత విత్తమిచ్చువాఁడు తనకుఁ గాంతుఁడని యొక సంకేత మేర్పఱచుకొని యుత్తమమయిన వేషము నలంకరించుకొని తగినతఱిని నింటివాకిట నట్టి విటుని నరయుచు నిలుచుండెను. అట్లు నిలుచుండ దారిని బోవుచున్న పురుషు లెందఱో కనఁబడివచ్చిరి. వారు ధనవంతులే; మఱి బత్తెమునునిచ్చుటకును నుండిరి. అయినను దానికి ధనమునందే మిక్కిలి కోరిక గాన తాను గోరినంత ధనము వారీయనందున వారియం దెవ్వరితోను రమింపదయ్యె. ఇట్లు పురుషులు వచ్చుచును నది నిరాకరింపఁగాఁ బోవుచును నుండిరి. అది సంకేతముచేతనే బ్రతుకునది గాన 'వేఱెవ్వఁడేని ధనవంతుఁ డొక్కఁడు నేను గోరినంత

1 ఆహారమును విడువఁగా పాటవము దప్పి యింద్రియము లెల్ల తోడనే లోనగుచున్నవి. కాని జిహ్వ మాత్రము అన్నము లేకున్నను అతిశయించుచున్న దని భావము.

ధన మవ్వారిగా నిచ్చి నన్నుఁ బొందఁడా' యని యెదురు చూచుచుండెను. ఇట్లు పెద్ద దురాశ పడుటచేత వాకిట నిలిచి నిలిచి యుండఁగా దానికి నిదురయుఁ జెడెను. మఱి మాటికి వెలుపల వచ్చుచును లోపలికిఁబోవుచునుండఁగా నర్ధరాత్రముకా వచ్చెను.దానికి విత్తము సందలి పేరాసవలన నిట్లులేచి లేచి మొగమెండి మనస్సు సొంపును దూలెను. దీని వలనదానికిమిక్కుటమైన నిర్వేదము మీఁదటికి సుఖావహమై పుట్టెను. ఆ నిర్వేదము వలన దానికి వేఱుచింతయుఁ గలిగెను. అప్పు డది చిత్తమున నిర్వేదము నొంది పాడిన గీతమును గలరూపున నావలన వినుము. దానిని వినుటవలనఁ బస యేమి యందువా? పురుషునకు నిర్వేద మాశాపాశములను త్రెంచునట్టి ఖడ్గముచుమీ. ఓ యీ! నిర్వేదము పుట్టనివాఁడు దేహమునందును దదనుబంధులందును గలయాశను దిగవిడువ నెంతమాత్రము గోరఁడు చుమీ.

పింగళ—ఔరా! మనస్సును గెలువకున్నందున నాకు మోహమెంతవిస్తరించి యున్నదిచూడుఁడు. నే నామోహముచేతఁ దుచ్ఛుండగుకాంతునివలనఁ గోర్కినిబడయఁగోరుచున్నానగదా. కావున నేను వివేకశూన్యురాలను. నాకు వలయు రమణుఁడు నా సమీపమున నే(హృదయమందే)యున్నాఁడు. వాఁడు నిరతిశయప్రీతికిఁ బాత్రుఁడు. మఱి నాకు రతి (నాయందనురాగము) గూర్చువాఁడు. మఱి ధనమును (ధర్మాది పురుషార్థములునాలుగును) నొసంగువాఁడు. నన్నొకప్పుడును వీడక (నిత్యుఁడై) యుండువాఁడు. ఇట్టి యీకాంతుని (భగవంతుని) దిగవిడిచి, కామములను (ధర్మాదులను) నొసంగక మఱి దుఃఖ

మును భయమును నాధియు శోకమును మోహమును గలిగించు వాఁడును గావునఁదుచ్ఛుండునగు నొకనిని దెలివిమాలినదాననై కొలుచుచున్నాను. కన్నవానితో నింత రొక్కము నీయవలెనని సంకేతముచేసికొని నేను బొట్టఁబ్రోచికొనుచుందును. ఇట్టి వృత్తి యెంతయు నిందింపఁదగినది ఇట్టికుచ్ఛితపుబ్రతుకుచేత నా దేహమునకును మనస్సునకును బరితాపము వ్యర్థముగాఁ గలిగించితిని. స్త్రీలయందు మిక్కిలి దగులుపడి ధనమునందుఁ బేరాసగలిగి మిక్కిలిజాలికిఁ బాత్రుఁడయిన యొక మనుష్యునికి నా దేహమును విలిచి వానివలనరతినిని విత్తమునును గోరుచునుంటినే. ఈ దేహ మొకయిల్లు. దీనికి నడిమి వెన్ను దూలమును దానిపయిని వాసములును వానికి నూఁతయగు కంబములు నన్నియు నెమ్ముల చేత రచింపఁబడియున్నవి. మఱి తోలుచేతను గోళ్లచేతను రోమములచేతను బయటికిఁ దెలియకుండునట్లు గప్పఁబడి యున్నది. దానికి నవద్వారములు. అన్నియును మలినమును గాఱుచుండును. మఱి మలమూత్రములచే నిండినది. ఇట్టి యీ నరదేహమును నేనుదప్ప మఱి యెవ్వతెపొందును ? ఈవిదేహపట్టనమందు నేనొక్కతెయే మూఢబుద్ధి గలదానను. కాకేమి! తన్నయిన నిచ్చునట్టిదాతయగు నచ్యుతుని విడిచిమఱియొక్కనిఁ గాంతునిఁగాఁ గోరుచున్నాను. కావున నేనెంతయు దుష్టురాలను. ఈ యచ్యుతుఁడు శరీరధారులకు నాత్మభూతుఁడు కాఁబట్టి మిక్కిలిప్రియుఁడు. మఱి హితకరుఁడు నాయకుఁడు. కాఁబట్టి యాత్మభూతుఁడైన యీ యచ్యుతునకే నాయాత్మను సమర్పించి విలుచుకొని (వశీకరించుకొని) యాతనితోడ లక్ష్మివలె రమింతును. కామ విషయములకును గామము లోపంగా

మానుష్యులకును దేవతలకును నాద్యంతములు గలవు గాని వీరందఱుఁ గామముచేత నుపద్రవము నొందుచుందురు. ఇట్టివారిని భజించుచున్నయెడల భార్య యగుదానికి వీరేమి ప్రియముచేసిరి? ఏమియులేదు. కనుక నిందు నందును భగవంతుని కంటె సేవింపఁదగినవాఁడు మఱియొకఁడు గలుగఁడు. ఏదో నేను దొల్లిచేసికొన్న యొకానొక సుకృతకర్మముచేత నాయందు భగవంతుఁడు విష్ణుఁడు ప్రీతుఁడయినాఁ డనుట నిజము. ఏలనఁగా దురాశ పట్టియున్న నాకు సుఖావహమయిన యిట్టి నిర్వేదము పుట్టెనే! అతని ప్రసాదము లేక యిట్టిదియుఁ బుట్టునా. నేను మందభాగ్యురాలనయితినేని క్లేశము లిప్పటి చందమున నాకు నిర్వేదమును గలిగింపకుండును. ఆ నిర్వేదము చేతఁగదా పురుషుఁడు దేహగేహాదులం దహంకారమమకార రూపములయిన పాశములను దిగవిడిచి మనస్సు ప్రసాదమును బొందుచున్నాఁడు. గ్రామ్యజనులతోఁ గూడిమాఁడియుండు నేను భగవంతుఁ డనుగ్రహించి యుపకరించినట్టి నిర్వేదమును నౌదలయందుఁ దాల్చి దురాశలనెల్ల దిగనాడి యధీశ్వరుం డగు నాభగవంతునే శరణుఁ జొచ్చుచున్నాను. మఱియు నేను శ్రద్ధగలిగి విత్తాదులు దొరకక పోయినను సంతోషమును వీడక దైవికముగా దొరకినదానితో బ్రదుకుచు నాత్మభూతుఁడు గావుననే నిరతిశయ ప్రియుండు నయిన యాభగవంతునితోడ మాత్రమేకూడి క్రీడించుచుండెదను. ఇది నిజము. సంసార కూపమునందుఁబడి విషయసుఖములచేత వివేకము గోలుపోయి యున్ననన్నుఁ గాలసర్పము పట్టుకొన్నపుడు గాచుటకు మరలఁ బురుషుఁడు తప్ప మఱియెవఁడు సమర్థుఁడగును? ఎప్పుడు సకల

విషయములవలన నిర్వేదమునొంది యెచ్చరికగలిగి సమస్త మయిన యీ జగమును గాలమనెడిసర్పముచే గ్రస్తమైయున్న దని కనుఁగొనుచున్నాఁడో, యప్పు డట్టు కనుఁగొని నిర్వే దముపడుచున్న పురుషునకురక్షకుఁడు పరమాత్మయె కాని మఱి యొకఁడుగాఁడు' అనెను. ఇట్లది మది నిశ్చయము చేసికొని కాంతుని యందలి యభిలాషవలనఁ గలిగిన దురాశనుదిగవిడిచి చిత్తశాంతి నొంది శయ్యకుఁబోయి నెమ్మదిగాఁ బరుండెను. ఆశయె పరమంబయిన దుఃఖము. ఆశ లేకుండుటయే పరమం బయిన సుఖము. అట్లు పింగళ, కాంతునివలని యాశను ద్రుంచు కొని హాయిగా నిదురపోయెను. ఇది యెనిమిదవ యధ్యాయము.

---

## అవధూత యదుసంవాదము.

(అనుబంధము.)

అవధూత — మనుష్యుల కేదేది ప్రియతమమో దానిని పరిగ్రహించుట యత్యంత దుఃఖము కలిగించుచున్నది. ఇట్లు పరిగ్రహము మిక్కిలి దుఃఖమునకు హేతువయినదని తెలిసి పరిగ్రహమువీడినవాఁడనంతమగుసుఖమును బొందుచున్నాఁడు. కురరమను పిట్ట నోర మాంసమును గవ్వికొనియుండఁగాఁజూచి దానికంటెబలవంతములగు డేగ మొదలయినవి తమకుమాంసము లేనందున దానినిబట్టి చంపుచున్నవి. ఆకురర మామాంసమును దిగవిడువఁగా నట్టి భయములేక మిక్కిలి సుఖమును బొందిన దయ్యె. నాకు మానమును నవమానమును గలుగవు. నాకు గేహములును బుత్రికలును గలవారికిఁ గలుగు చింతయును గలుగదు. నేను బరమాత్మతోడనే క్రీడించు చుందును. నాకుఁ బరమాత్మయందే ప్రీతి. ఇట్టివాఁడనై యీలోకమందు

మానావమానములను జింతయును లేనిబాలునివలెఁ జరించు చుండును. ఇరువురే చింతనుండియు మానావమానములనుండి విడివడ్డవారై పరమానందమున మునిఁగి యోలలాడుచుందురు. అందొకఁడు మానావమానములు దెలియనివాఁడును దేహాదులు పోషించుటకై యే పూనికయు లేకుండువాఁడు నగు బాలుఁడు. మఱియొకఁడు త్రిగుణములకు నవ్వలనుండు పరముని సాక్షాత్కరించుచుండువాఁడు. ఒకచోట నొకకుమారి యుండెను, దానిని వరించుటకై కొందఱు దానియింటికి వచ్చిరి. అపుడు దాని తలిదండ్రులు మొదలయిన బంధువు లింటలేక యెచ్చటికో పోయి యుండినందునఁ దానే వారికిఁ బూజగావింపఁ బూనెను. రాజా! ఆ వచ్చినవారికి భోజనము పెట్టుటకై యాకన్నియ రహస్యముగా వరిబియ్యమును ఱోట దంచుచుండఁగా దాని ముంజేతనున్న సంకుకడియములు బిట్టుగాఁజప్పుడు సేయసాగెను. ఆకుమారి మిక్కిలి బుద్ధిమతిగాన యీదంచు చప్పుడు వచ్చినవారు విని రేని 'ఔరా! ఇది తానేదంచుచున్నది. దీనికెవ్వరు బంధువులులేరా? నిజముగానిది దరిద్రురాలగు' నని తలంతురు గాన యట్లు దంచుట యేవగింపఁదగినదని తలఁచి యందువలన సిగ్గుపడి ముంజేతి కడియములను జప్పుడు కలుగకుండు కొఱకై యొక్కొక్కటిగాఁ జేతనుండి తీసి వైచుచువచ్చెను. అప్పు డొక్కొక్కచేత రెండేసికడియములు మాత్రమేయుండెను. మరల నది దంచుచుండఁగా నారెండేసి సంకుకడియములు గూడఁ జప్పుడు సేయసాగెను. ఆ రెంటిలోఁ గూడ నొక్కొక్కసంకువును విఱిచి పాఱవైచెను. అపుడు చేత నొక్కొక్క కడియమే యుండుటవలనఁ జప్పుడు గలుగ

దయ్యెను. అరిందమా ! నేను లోకతత్త్వములను దెలిసికొన వలయునని కోరి యాలోకములందెల్లఁ గ్రుమ్మరుచు నా కుమారివలన నీ యుపదేశమును గఱచితిని. పెక్కండ్రుఁగూడి యుండినచోఁ గలహము పుట్టుచున్నది. ఇద్దఱు గూడినచోఁ బరస్పరము ముచ్చటలు గలుగుచున్నవి. కనుకఁ గుమారి కడియమువలె నొక్కఁడుగానే యుండి క్రుమ్మరుచుండ వలయును ఇదియే నేనా కడియము వలన నేర్చితిని. మనస్సును వైరాగ్యమును నభ్యసించుచువచ్చి దాని బలమువలన స్థిరము గావించి యాసనములను సమర్థించి శ్వాసమునుజయించి ప్రాలుమాలికలేక యామనస్సును శుభాశ్రయుం డగు భగవంతు నొక్కనియందే నెలకొలుపవలయును. ఆశుభాశ్రయునియందు మనస్సును బట్టుకొలుపఁగా నది కర్మవాసనలను మెల్ల మెల్లగాఁ దుడుచుచువచ్చును. అప్పుడు సత్త్వము వృద్ధినొందఁగా రజస్తమస్సులను దూలించి విషయాంతరముల కగోచరమై ధ్యేయం బయినపరమాత్మాకారమునం దాత్మ దగిలినట్టివాఁ డగుచున్నాఁడు. ఇట్లు పరమాత్మునియందుఁ జిత్తమును నిరోధించి నిలిపినపుడు వానికి లోపలఁ గాని వెలుపలఁగాని యేదియుఁ దెలియకుండును. బాణములకుఁ జిల్లులు చేయువాఁ డాచిల్లుయందే మనస్సు నిలుపుటచేఁ బ్రక్క రాజు పోవుచున్నను జూడఁడు. ముని యగువాఁ డొంటరిగాఁదిరుగుచు నొకచోటను నిలుకడగా వసతిలేక పరాకునుబడక గుహాలయందువసించుచుఁ దనపోకడ లితరులకుఁ దెలియక యుండు సర్పమువలె

---

1 యోగిసమ్మర్థము ద్యజించుటకు కుమారిగురువు. జనసమ్మర్థము త్యజించుటకు సర్పముగురువు.

నొక్కఁడును వర్తించుచు మితముగా మాటలాడువాఁడై యుండును. దేహము ధృవముగాదు. అట్టిదానికి గృహముకట్టుకొనుట (కట్టునపు డాయాసము గలిగించుటచే) మిక్కిలి దుఃఖము కలిగించుచున్నది. మఱి కోరినంతభోగము గలుగ నందున నది విఫలమగుచున్నది. కాఁబట్టియె సర్పము తన కని యిల్లు గట్టికొనక పరులు గట్టినపుట్టలు మొదలగు పట్టులను జొచ్చి హాయిగా వర్ధిలుచున్నది. దేవుండగు నారాయణుఁడొక్కఁడు *తాను పూర్వముసృజించి యున్న జగత్తును దానిప్రలయమునకు గారణాంతరము లేక తానొక్కఁడే కారణమై కల్పాంతమునందుఁ దన విశేషణమగు కాలమునుగొని తనసంకల్పముచేత సంహరించి యంత నొక్కఁడును నద్వితీయుండునై యుండెను. అనఁగాఁ దాను మరల జగమునునిర్మించువాఁడై చిదచిత్తు లపుడు మిక్కిలియు సూక్ష్ములై నామ రూపములచే వేఱుపడక యుండుట వలన నన్నియును గూడి తానొక్కఁడేయుపాదానకారణమయ్యు నాజగమునకు నిమిత్తకారణమును రెండవది లేక తానే యయ్యు నుండెను. మఱి యపుడు సకలములయిన చిదచిత్తులకును దానాశ్రయమై తనకుఁ దానే కాక మఱియొక్క యాధారము లేక యుండువాఁడు కనుకఁ దనకు శక్తిభూతమగుకాలము నిమిత్తముగాఁగొని సత్త్వము మొదలయిన తన విశేషణములయిన శక్తులు మున్ను సృష్టిదశయందు విషమములుగా నుండిన విపుడు ప్రలయమున సామ్యమునొంది తనయందులయించి యుండఁగాఁ దనయందు వేఱుపఱుపరానంత సూక్ష్ములై యున్న యచిత్తునకును జిత్తునకును నియంతయై

* ఇట బ్రలయమందలి భగవత్స్వరూపము వర్ణితము.

యఖిలజగత్కారణభూతుఁడు గాన యాది పురుషుఁడై చిదచిత్తులకుఁ గార్యకారణావస్థలు రెంటియందును దానే మేరయై యుండు నాభగవంతుఁ డాప్రళయసమయమున నన్నియు నామరూపవిభాగములు లేమింజేసి వేఱువేఱ నేర్పడక యన్నియుఁ దానొక్కఁడుగా నుండుటచే కైవల్యుఁడని పేర్కొనబడియుండెను. మఱియు నపుడు జాడ్యమును దుఃఖమును గొంచెమయినను గలియకుండు జ్ఞానానందసమూహమే స్వరూపముగాఁగలవాఁడును, కర్మమువలనఁగాక తనంతట జ్ఞానాదులు పడసిన వాఁడుగాన నిరుధిపాకుఁడునై యుండెను. *పిదప సృష్టి సేయఁబూని మఱివేఱొక పరికరము లేక తానే సృజింపవలయుననెడితనసంకల్పముచేత నిరతిశయ సూక్ష్మమై తనకు శరీరమయినదియుఁ ద్రిగుణాత్మికయు నగు మాయను స్థూలదశనొంది వికారముఁజెందునట్లు కలఁతపెట్టుచున్నాఁడు. అంత నామాయచేత నహంకారాది తత్త్వములకెల్ల నాధారమగు సూత్రము వంటి దగుమహత్తత్త్వమును మొదట సృజించుచున్నాఁడు ఆమహత్తత్త్వమును ద్రిగుణప్రకృతికిఁ గార్యముగాను అహంకారము మొదలు పృథివి వఱకుఁ గల తత్త్వపరంపరను సృజించునదిగాను సర్వకార్యములందును బ్రాధాన్యమైనదిగాను జెప్పుదురు. ఆమహత్తత్త్వము నందే యీ జగమంతయు గ్రుచ్చంబడి యున్నది. దాని వలననే పురుషుఁడు సంసారము నొందుచున్నాఁడు. సాలెపురుగు తన కడుపులోపలనుండి నూలిని నోటివలన వెలువరించి సాగించి దానితోఁగొంత క్రీడించిన పిదప దానిని మరల లోనికిమ్రింగునట్లు మహేశ్వరుఁడును నీ జగమును వెలికి సృజించి మరల

* భగవంతుని సృష్టిచందలి ప్రకారమును వర్ణించుట తెలియనగు.

పలికి సంహరించుచున్నాఁడు. దేహి యగువాఁడు నిశ్చయ రూపమగు బుద్ధితోఁ దన మనస్సు నేయేవిషయమందు స్నేహ మువలననో, ద్వేషమువలననో, భయమువలననో నిశ్చలముగా నుంచుచున్నాఁడో యాయా దాని రూపమును బొందు చున్నాఁడు. పురుగు, దానికి రూపము గావించెడి తుమ్మెద తన గూఁటిలోనడంచియుంపఁగా నందులకు భయపడి, యాతుమ్మెద నే చింతించుచు బూర్వరూపమును ద్యజింపకయె దానితో సామ్యమును బొందుచున్నది. ఇట్లె చెప్పిన గురువులవలన నాఁకీ మతి గఱపఁబడినది. ప్రభూ ! ఇఁక నా దేహముచేతఁ గఱపఁ బడినబుద్ధిని జెప్పెదను వినుము. ఈ దేహ ముత్పత్తియు నాశ మును గలిగియున్నది. దీనికి మీఁదు మీఁదెప్పుడును దుఃఖ ఫలముగానుండును. కనుక దీనియందు నాకు విరక్తి గలుగు చున్నది. అయినను దీనివలననే నేను బ్రకృతి తత్త్వములను విమర్శించి తెలియుచున్నాను గాన యిది నాకు వివేకము గలి గించునది. ఇది నాకు గురువు. ఇట్టిదియైనను నిది కుక్క మొద లగు పరుల సొమ్మే యని నిశ్చయించి యిది యిట్లుపకారి యయ్యు దీనియం దభిమాన ముంపకయె చరించుచుందును. మఱి యీ దేహమునకుఁ బ్రియముచేయఁ దలఁచి దారాలు బిడ్డలను ధనములను బశువులను భృత్యులనును గృహము లనును నాప్తవర్గములను సంపాదించి పోషించుచున్నాఁడు. ఎట్లో పలుకష్టములు పడి ధనములను గూడఁ బెట్టియుఁ దుదకు దేహి తన యాయువు తుదముట్టఁగా నేయా దేహమును వీడియె పోవుచున్నాఁడు. దేహము విడిచిపోయినను దుఃఖము విడు చుటయెక్కడిది ? వృక్షము నశించుచు మఱియొక్క వృక్షము

నకు బీజము సంతరించునట్లు వాఁడును మఱి యొక దేహమునకు బీజమయిన కర్మమును సంతరించి మఱి మునుపటి దేహమును వీడుచున్నాఁడు. వీనిని జిహ్వ యొక్క వలనికి (రసమునకు) లాగుచున్నది. దప్పి మఱొక్కటికి (జలమునకు) లాగు చున్నది. అట్లె శిశ్నమును నొక్కటికిని (మైథునమునకును), ద్వక్కునొక టికిని (స్పర్శమునకును) ఉదర మొక్కదానికిని (అన్నమునకును) శ్రవణ మొక దానికిని (శబ్దమునకును) ఘ్రాణ మొక దానికిని (గంధమునకును) చపలమగు దృష్టి యొక్కటికిని (రూపము నకును) వీనిని బట్టి లాగుచున్నది. ఇట్లె వాక్కు మొదలయిన కర్మేంద్రియములను నొక్క వలనికి (నాయా) వ్యాపారములకు వీని నాకర్షించుచున్నది. ఇట్లు పెక్కండ్రు సవతులు చేరి యొక్క గృహపతిని దుద ముట్టించునట్లు, ఈ యింద్రియము లెల్ల దేహిని ద్రుంచుచున్నది. బ్రహ్మ (శరీరకుఁ డగు భగ వంతుఁడు) తన శక్తియు విశేషణమునగు ప్రకృతిచేత వృక్ష ములు, సరీసృపములు, పశువులు, పక్షులు, దంశములు, మత్స్య ములు మొదలుగా నానావిధము లయిన దేహములను సృజిం చెను గాని, యవి ముక్తిసాధన మనుష్ఠించుట కశక్తములగు టను జూచి సకలచేతనుల నుజ్జీవింపఁజేయుటకై తాను జేసిన సృష్టికార్యము వ్యర్థమయ్యె నని యందులకు హృదయమున సంతుష్టి నొందక పోయెను. పిదప మనుష్యుని, బ్రహ్మదర్శ నమునకు సాటి యగు నుపాసనమునకు యోగ్యుఁ డయిన వానిని, సృజించి యా దేవుఁడు ముదము నొందెను. పురుషుఁడు మిక్కిలియు దుర్లభ మయిన యీ మనుష్యజన్మమును, కోరిన పురుషార్థములను బొందించుదానిని, వెక్క జన్మములను

గడపటఁ బొంది సుఖ దుఃఖములు సమముగాఁ గొని, మృత్యువు వెంట నంటియున్న యీ దేహము చెడి పోలకము నుపే వేగిరపడి ముక్తికొఱకుఁ బాటుపడవలయునుగాని కామ విషయములకొఱకుఁగాదు. కామవిషయములో కుక్క పంది మొదలుగాఁ గల జన్మము లన్నిటి యందును సులభముగా నున్నవి. కాన, యవి యొక హెచ్చుగాదు. ఇట్లు బుద్ధిని నేర్చి కొని వైరాగ్యము పుట్టఁగా నాత్మయందలి విజ్ఞాన దృష్టిని బొంది దేహాత్మాభిమానమును వీడి, దేహానుబంధులగు పుత్రకళ త్రాదులందు సంగమును వదలి, యీభూమియందుఁ ద్రిమ్మరు చున్నాను. జ్ఞానమొక్క గురువు వలననుండియె మిక్కిలి స్థిర ముగాను మిక్కిలి పుష్కలముగాను గలుగఁజాలదుసుమీ. ఈ జ్ఞాన మద్వితీయమైనది. దీనికి సాటి మఱియొకటి లేదు. ఋషు లు నేనిని భూమి మొదలగు దృష్టాంతములను గొని పెక్కు విధ ముల వర్ణించుచున్నారు' అనెను.

భగవంతుఁడు - ఇట్లపారజ్ఞానసంపన్నుఁ డయిన యా బ్రాహ్మణుఁడు యదువునకుఁ జెప్పి యా రాజుచేత వందనము లంది చక్కఁగా నర్చితుండై సంతోషము నొంది యతనిని వీడుకొని వచ్చినదారిని బోయెను. మన కెల్లవారికిని బూర్వజు డయిన యాయదువును * నవధూత చెప్పిన దెల్ల విని సర్వ సంగములనుండి విడివడి యన్నిటను సమాత్ముఁడై ముక్తి నొందెను ఇది తొమ్మిదవ యధ్యాయము.

అవధూత యదుసంవాదము సమాప్తము.

---

* 'యోగర్ధి మాపు రుభయం యదుహైహయాద్యాః' అనుటం బట్టి హైహయుఁడగు కార్తవీర్యార్జునునితోఁ బాటిగా యదువు యోగాదులను

భక్తియోగమును దాని కంగములను కర్మ జ్ఞానాది సాధనములను భగవంతుఁ డుద్ధవున కుపదేశించుట.

భగవంతుఁడు—సర్వజ్ఞుండును బరమకారుణికుఁడు నగు నేను స్వరూపానురూపములయిన యర్చన వందనాది ధర్మములను (గీతాదులందు) నుపదేశించియున్నాను. వానిని బరాకులేక యనుష్ఠించుచు నేనే తనయునికికిని స్థితికిని బ్రవృత్తికిని నాధారమని జ్ఞానముగలిగి ఫలాభిసంధి లేక దేహమున్నంతవఱకును దన వర్ణాశ్రమకులములకుఁ దగిన యాచారములను నాచరించుచుండవలయును. మఱి యాధర్మములవలన మనస్సు పరిశుద్ధం బయినవాఁడు తనయాత్మకును బరమాత్మకును గల స్వరూపములను జింతించుచుండవలయును. అట్లు చింతించుటచేత వాఁడు విషయాసక్తచిత్తులయిన దేహులెల్ల శబ్దాదివిషయముల కొఱకే సకలములయిన ప్రయత్నములును జేయుదురనియు నట్టి ప్రయత్నములకు ఫలములు తాఱుమాఱుగా (అనఁగా సుఖమునకుమాఱు దుఃఖముగా) నుండుననియుఁగనుఁగొనును. దానిని గనుఁగొనుటచే వానికిఁ గామము లందు (ఫలములందు) మనస్సు గలుగకుండును. నిదురించు వానికిఁ గలలోఁదోఁచు విషయములును, జింతించుచుండువానికి మనస్సునఁ గలుగు గొంతెమ కోర్కులును బ్రియములనియు నప్రియములనియు నానావిధములుగా నుండుటంబట్టి విఫలములే కాని వానివలనఁ బురుషార్థముగలుగదు. అట్లె యాత్మయందు దేవమనుష్యాది భేదములును శబ్దాది విషయములును బుద్ధికిఁ

బొందెననుటచే నీ యవధూత యా యర్జునునకు నుపదేష్టగానుండిన దత్తాత్రేయుఁడుగా నుండవలయునని తోఁచుచున్నది.

దోఁచుచుండును. అవియు నానావిధములై కార్యభూతములై యసత్యములై యుండుటంబట్టి విఫలములే యగును. కనుకఁ దత్త్వమును జింతించిననే మనస్సునందుఁ గామము లేకపోవును గాని యతత్త్వములగు విషయాదులను జింతించుట వలన నట్లు గాక కామముగలిగి తుదకు దుఃఖమునకే మూలమగును. కాఁబట్టి నన్నే పరమపురుషార్థముగాఁ గల వాఁడు నిష్కామ మగు నివృత్తికర్మమునే యాచరింపవలయును. ఫలమును గోరి ప్రవృత్తికర్మ మగు కామ్యమును ద్యజింపవలయును. ప్రవృత్తి కర్మ మిష్టసాధకముఁగాని దానినివిడుచుట యెట్లందువా? మను ష్యుఁడు బ్రహ్మవిచారమందుఁ బ్రవర్తించినచోఁ గామకర్మను నకు ఫలము స్వల్పము నస్థిరమునని తలంచి దానిని గూర్చిన విధి నంతగా నాదరింప కుండును. మఱియు బాహ్యాంతఃకరణ ములనునిగ్రహించునట్టియమములను మాటిమాటికి నాచరించు చుండవలయును. శౌచము మొదలయిన నియమములను నన్నుఁ దప్ప మఱియొక్క ప్రయోజనమును గోరక యథాశక్తి నాచ రింపవలయును. మఱియును బ్రహ్మంబగు నన్నెఱింగినవాఁడును, నన్నియుమదాత్మకములుగాఁ గాంచినవాఁడును, జితేంద్రియుఁడు ను నగు గురువు నుపాసింపవలయును. ఆగురువు నెడఁ గపటము లేక యతని యందును నతని వారియందు నర్థకామాదుల వలన మచ్చరము వెట్టుకొనక, నతని గొలుచుటయందుత్సాహ ముగలిగి, దేహమునందును దానియనుబంధులందును మమకా రముంపక, గురువునందు దృఢమయిన మంచి మనస్సు గలిగి తొందరపాటులేక నిది తగును నిది తగదని యర్థములకలరూపును దెలిసికొనఁ దివురుచు, ననూయమాని, వట్టిమాటలు వదర

కుండవలయును. మమకారమెట్లు వీడునందువా? ఆలుబిడ్డలు, గృహము, పొలము, చుట్టములు, ధనములు, పశువులు మొదలగువానియందాసక్తినుంపకయు నన్నిటిని దనవిగాఁ దలంపకయు సాధారణమైనవిగాఁ దలంచుచుండవలయును. మఱియుఁ దనదిగాఁదలఁచిన ధనమే తన పుత్త్రాదు లనుభవించుటచేఁ దనవిగాకుండునట్లు, ఆలుబిడ్డలు మొదలగువారును దనవారయ్యు నట్లుగానివారినిగా నెన్నవలయును. ప్రత్యగాత్మ స్థూల దేహమునకంటెను సూక్ష్మదేహమునకంటెను వేఱు. అదిచూచునట్టిది. దేహమోచూడఁబడునట్టిదిగాని చూచునదిగాదు. అదిస్వప్రకాశమైన ప్రత్యక్కు. దేహమోపరాక్కయినదికనుక దేహమునకంటెనాత్మ వేఱుకావలయును. మఱియుఁగాల్పఁదగినదియు వెలిఁగింపఁదగినదియునగుకట్టియకంటెఁగాల్చువాఁడును వెలిఁగించువాఁడునగునగ్ని వేఱగునట్లు,ఆత్మ దేహమునకంటె వేఱేయగును. దేహమునకంటె నాత్మ వేఱగునేని దేహమునుబట్టియే యాత్మను బుట్టినాఁడుచచ్చినాఁడు బలసినాఁడు చిక్కినాఁడని చెప్పుట యెట్లందువా ? కాల్పఁదగిన కట్టియయం దగ్ని చొచ్చి యాకట్టియకుఁ గలుగుపుట్టుకను నాశమును గొంచెమగుటను బెద్దయగుటను మొదలగు నానారూపములను దాని వలనఁ బలుచనగుటయు దట్టమగుటయు మొదలగు నానాగుణములను దనకుఁ గలిగినట్లు చూపట్టుచున్నాఁడు కాని, నిజమున కవివానివి కావు. అట్లే దేహమునకంటె వేఱయిన జీవుఁడును దేహమును జొచ్చి యనాద్యజ్ఞానమువలన దానిగుణములను దనకుఁ గలిగినట్లుగా ననుసంధించుచున్నాఁడు. కాని, వాస్తవమున కవి వానివి గానేరవు. ప్రకృతి పరిణామములయిన పృథివి మొదలగు వానిచే జీవుని దేవమనుష్యాదిరూప

మయిన యీ దేహము రచింపఁబడినది గదా. ఇట్టి దేహమును బ్రవేశించుటవలన జీవునికి దేహగుణము లనుసంధించుకొనుట మాత్రమే కాక, యీ సంసార మంతయును దాని వలననే జ్ఞాన స్వరూపుండయిన యీజీవునకుఁ గలిగిన దని తెలియుము. ఆసంసారమును ద్రుంచునది పరమాత్మోపాసనమే కాని యొండు గాదు. కాఁబట్టి వేదాంతవిచారముచేసి దానివలన జీవునియం దంతరాత్ముఁడై హేయప్రతిభటుఁడై యున్న పరమపురుషుని నెఱింగి యీ దేహమును దీని యనుబంధు లగు పెండ్లాముబిడ్డలు మొదలగునవియు నుపాదేయము లనుబుద్ధి క్రమముగా నిరసించుచు రావలయును. మీఁది యరణి యాచార్యుఁడు. క్రిందియరణిశిష్యుఁడు. ఆ రెంటికి నడుమనున్న చిలుకు కొయ్య యుపదేశము—అనఁగా వేదాంతార్థవిచారము. విద్య (ఎఱుఁగుట) యీ రెంటికూడికవలనఁబుట్టిన[1]యగ్నివంటిది. అదిపరమసుఖావహము యినది. వేదనాత్మకమును విశుద్ధమును నిపుణమునయిన యీబుద్ధి (ఎఱుఁగుట) సత్త్వరజస్తమస్సులనెడి గుణములవలనఁ బుట్టినదియు విచిత్రమైనదియు నగు సంసారమును దూలించుచున్నది. అట్లది యీ దేహమును దీని యనుబంధులును వేనిపరిణామములో యీగుణములను దన్మూలకము లయిన పుణ్యాపుణ్య కర్మములను దహించి యంతఁ గట్టియలు లేకపోఁగాఁ దనంతటఁ జల్లాఱిపోవునగ్నివలెఁ [2]దానే శమించుచున్నది. మఱియుఁగామ

1. ఇందులకు 'ఆచార్యః పూర్వరూపం అన్తేవాస్యుత్తరరూపంవిద్యా సన్ధిః ప్రవచనం సన్ధానమ్' అను శ్రుతి యనుగుణముగా నిచటఁ బ్రతిపాదించుట తెలియునది.

2. దీనివలన ధ్యానరూపమును నుపాయభూతమునగు బుద్ధి ముక్తి కలిగిన పిదప నుండదు. ముక్తి గలుగువఱకును బ్రతిదినమును దాని నావర్తించుచుండవలయునని తేలుచున్నది.

కర్మముల ననుష్ఠించుచుండు వారును దాని ఫలములగు సుఖ దుఃఖములను ననుభవించుచుండువారు నయిన యీ దేవమనుష్యాదులును వీరి సుఖానుభవమునకును సుఖసాధనము లనుష్ఠించుటకును నగు దేశమును గాలమును, దగిన సాధనముల నుపదేశించు వేదమును, ఫలములను గుడుచు నట్టి జీవుఁడును, వీనికి భోగ్యములయిన శబ్దాదివిషయములును నానావిధములుగను గార్యభూతములుగను నుండినను ననిత్యములుగావు; నిత్యములుగానే యున్నవని తలఁతును. ఎట్లన సర్వపదార్థములకును వినాశము పుట్టుకవలననే కలుగుచున్నది. దేశకాలాదులకుఁ బుట్టుక గనఁబడనందున వానికి నాశమును గలుగదు గాన యవి నిత్యములే యగును. [1] దేశకాలాదులు నిత్యములయినను దేవాది దేహములును శబ్దాది విషయములును ననిత్యములుగాఁ జూపట్టుచున్నవే యందువా? సత్త్వము మొదలయిన యాయాగుణములు మిక్కుటముగా నుండుటంబట్టి దేవుఁడు మనుష్యుఁ డని యాయా

---

1. 'దేవాద్యాకారములును వానికుపభోగ్యములైన శబ్దాదివిషయములును నానావిధములై కార్యములై యనిత్యములై యుండుటంబట్టి పురుషార్థములు కావు. కనుక వాని విషయమై ప్రవృత్తికర్మము త్యజింపవలయును. వానివిధించు శాస్త్రమును ఆదరింపరాదని చెప్పఁబడినది. కాని యిది సరికాదు. దేవాద్యాకారము లనిత్యములయినను ఆ యాకారములు గలిగియుండుజీవులు నిత్యులగుటం బట్టియును, వారి యాకారపరంపరయు దానిదానికుపభోగ్యములగు విషయముల పరంపరయును నిత్యములగుటంబట్టియు, విషయానుభవమునకైన దేశకాలములును తత్సాధనములను దెలుపు ఆగమములును నిత్యములగుటం బట్టియు ఎల్లప్పుడు నాయాకోరిన విషయములను సాధించుటయు నాయాఫలముల ననుభవించుటయు స్వభావముగాఁ గలవారికిఁ బ్రవృత్తికర్మము పురుషార్థసాధనమే కాన దానిని ద్యజించుట తగదు. దుఃఖసాధనమో ప్రతికూలమగుటంబట్టి త్యజింపఁబడుట తప్పదు అని భావము.'

యాకారభేదములతో జీవులు పుట్టుచున్నారు. వారల బుద్ధియు నాయాగుణమున కనుగుణముగా నాయాఫలములను నాయా సాధనములను నాయాదేవతలను వేఱువేఱ యవలంబించు టచే నానాభేదములు గలిగి యుండును. కనుక దేవాది దేహములును శబ్దాది విషయములును ననిత్యములు గావున వానివిషయమైన ప్రవృత్తికర్మమును ద్యాజ్యముగాదు. అయిన నా ప్రవృత్తికర్మమువలన దేవాది దేహసంబంధములును వానివలన షడ్భావవికారములును దుఃఖగర్భములై తప్పక గలుగుచున్నవి గనుకఁ, బ్రవృత్తికర్మము పురుషార్థసాధనము కాదందువా? ఉద్ధవా? ఇట్లు ప్రకృతి కర్మము పురుషార్థసాధనమగుట యొప్పియున్నను సమస్తదేహులకును దేహసంబంధమువలనను, కల కాష్ఠ ముహూర్తము మొదలుగా సంవత్సరమువఱకుఁ గల కాలావయవములవలనను మాటిమాటికి జన్మము జరమరణము మొదలయిన భావములు కలుగుచునే యుండును. దానివలన దుఃఖము తొలిసిపుచ్చ రాకున్నది చుమీ. ప్రవృత్తి యొక విధమునఁ బురుషార్థమునకు సాధకముగానున్నను, రజోగుణమునో తమోగుణమునో యనుసరించుచుండు నా ప్రవృత్త కర్మములను గావించువాఁడును, గావుననే దానివలని సుఖ దుఃఖముల ననుభవించువాఁడును, గర్మములకుఁ బరతంత్రుఁడై యుండుట లోకమునఁ జూపట్టుచున్నది. అట్లు కర్మములకుఁ లోకువగాని వో దుఃఖ మెవ్వఁ డనుభవింపఁడుగదా. కనుకఁ బురుషుఁ డెవ్వఁ డట్లు పరవశుఁడై శబ్దాదివిషయములను భజించును? ఎవ్వఁడును భజింపఁడు. మఱియు దేహులకుఁ, గర్మములనుజక్కఁగాఁ జేయుటకుఁ దెలిసినవిద్వాంసుల కయినను,

సుఖము కొంచెమైనను గలుగదు ; మఱి దుఃఖమే గలుగును. అట్లే మూఢులగువారికి 'మేము కర్మములు చేయుటయందు నిపుణులము కావున మాకు దుఃఖము గలుగదు. మేము సుఖులమే' యని వట్టి యహంకారము మాత్రమే మిక్కిలి యుండును గాని మఱేమియుఁ గలుగదు. మఱి విద్వాంసులగువారు, కర్మవశ్యులగువారికి శుభకర్మములే సుఖము ప్రాపించుటకును నశుభకర్మములు దుఃఖము గలిగించుటకును నుపాయములనియు సుఖములను బడయుటకును దుఃఖములను వారించుటకును నుపాయము లివి యనియుఁ దెలియుదురు; తెలిసినను వారు మృత్యువు గలుగకుండుటకు నేది హేతువో యట్టి మోక్షోపాయము నెంత మాత్రము దెలియరు. ఇట్లు బ్రతుకుచుండువానిని మృత్యువు దేహముతోఁ గూడ నేపుట్టి దగ్గఱనే యుండి మ్రింగ నెదురుచూచుచుండఁగా నర్థముగాని కామముగాని యేది సుఖపెట్టఁగలదు ? చంపఁదగిన యపరాధిని, గొలపట్టునకుఁ గొనిపోవుచుండునపుడు వానికి క్షీరాన్నములు నలంకారములు మొదలగున వేవి యిచ్చినను దుష్టిగలిగించునా ? శ్రుతమును పశువులు మొదలయిన లౌకికఫలమగు దృష్టములును స్వర్గాదిఫలమగునదృష్టములును, కృషియుఁ బెక్కులు విఘ్నములచే నిష్ఫలమగునట్లు, తాము మచ్చరము, అసూయ, నాశము, క్షయము మొదలుగాగల యంతరాయములు పెక్కిటిచేతఁ గొట్టువడుటంబట్టి నిష్ఫలమగుచున్నవి. ఒక ధర్మము విఘ్నములచేతఁ గొట్టువడకుండుట వలనఁ జక్కఁగా ననుష్ఠింపఁబడినదియగునేని, యట్లు చక్కఁగా ననుష్ఠింపఁబడిన దాని వలనను నెట్టిస్థానమును సాధించి పొందనగునో దానిని

జెప్పెదను వినుము. ఇందు నింద్రుఁడు మొదలగు దేవతలను యజ్ఞములచేత నారాధించి, యజ్ఞానుష్ఠానముచేత విశిష్టుఁడయిన పురుషుఁడు స్వర్గలోకమునకుఁ బోవుచున్నాఁడు. ఆస్వర్గలోకమందుఁ దన యజ్ఞాదికర్మములచేత గడించి కూడఁ బెట్టుకొన్న దివ్యములగు భోగములను నింద్రాదిదేవతలవలె ననుభవించుచున్నాఁడు. మఱియుఁ దనపుణ్యకర్మములచేతఁ బడసిన నిర్మలంబగు విమానము నెక్కి దేవతాస్త్రీలనడుమ వారల మనంబుల రంజించు నట్టివేషమునుదాల్చి విహరించుచుండును. అందు గంధర్వులతనికిగానము సేయుచుందురు. మఱి యాస్త్రీలం గూడివిహరించుచుఁగామగమనంబై చిఱుగంటల సమూహములు వరుసలుగాఁ గట్టంబడియున్న విమానమందు దేవతలక్రీడాస్థానములగుమేరువుమొదలగువాని ద్రోణులందుఁగానియుద్యానములందుఁగాని సంచరించుచును గ్రీడించుచును మిక్కిలియు సుఖమునఁ జొక్కుచుఁ బుణ్యమంతయుఁ దీఱి తాను బడఁబోవుట తెలియకుండును. మఱి తన పుణ్యమంతయుఁ దీఱువఱకును స్వర్గమునందు ముదంబునఁ దేలుచుండును. పిదపఁ బుణ్యమనుభవించుటచే క్షీణింపఁగాఁ దా నొల్లకున్నను బలవంతముగ కాలముపట్టి తన్నుఁ గదల్పఁగా నచ్చటనుండి కదలి క్రిందుగాఁ బడుచున్నాఁడు. ఇట్లే యిహమందును బరమందును బోవుచును వచ్చుచును సుడియుచున్నాఁడు. ఇష్టము లగువానిని జేయువారి గతియిట్టిది. అనిష్టము లాచరించువారిగతుల వినుము. అసత్పురుషులతోడ సహవాసమువలన నధర్మమం దాసక్తుఁడై శబ్దాది కామ విషయములందు మనస్సుదగిలి యుండుటవలన నింద్రియములను గెలువక దీనుండై భోగములందుఁ బేరాసకలిగి.

స్త్రీలంపటుండై యందులకొఱకు భూతములను హింసించుచుండును. మఱియు దుష్టజనులు పురికొలుపఁగా ధనాదులకొఱకుఁ బశువులను విధిని దప్పి వధించుచును ప్రేతగణములను భూతగణములను యజించుచును నిజకర్మములకుఁ బరవశుండై జీవుఁడు నరకములను వరుసగాఁ బొంది మిక్కిలియుఁ దమస్సు నిండియున్న స్థావరజన్మమును బొందుచున్నాఁడు. కర్మములు పుణ్యములయినవి గాని పాపములైనవిగాని మీఁదట దుఃఖమునే కలిగించుచుండును. దేహమెత్తి యట్టికర్మములనే యాచరించుచు వాఁడు దేహావసానమందా కర్మములవలనఁగలుగు నాయాఫలము లనుభవించుటకుఁ దగిన దేహమును బొందుచున్నాఁడు. ఇట్లుండుటంబట్టి మరణశీలుండగువానికి సుఖము కొంచెమైనను గలుగదు. అయినను లోకములు శాశ్వతములును లోకపాలురు మరణశీలురు గానివారు నగుటం జేసి వారికి సుఖము తప్పక కలదే కదా యందువా? లోకములును లోకపాలురును గల్పమువఱకు జీవించువారయినను నావలన భయమునొందుదురు. వేయేల! రెండుపరార్థములు పరమాయుష్యముగాఁ గల బ్రహ్మకును గాలాత్ముండయిన నావలన భయముతప్పదు. లోకాదులన్నియుఁ గాలముచేఁ జలితములై యనిత్యములగుటం జేసి దుఃఖముతోఁ గలియని సుఖము వానికిని గలుగదు. ప్రాకృతములయినవగు గుణములు

1. ఇట ప్రవృత్తికర్మము త్యాజ్యమని తెలుపుటకు దానియందుఁ గల దోషములు పెక్కులు చెప్పఁబడినవి. మఱియు నుత్తరోత్తరదేహములకును గర్మములకును బూర్వపూర్వములగు దేహములు నిమిత్తములని చెప్పఁబడినవి. మఱియు రజస్తమోగుణముల కనురూపములగు ప్రవృత్తకర్మములకుఁ గర్తయగుటయు నట్టి కర్తృత్వమువలన కర్మములకుఁ బరతంత్రుఁడగుటయు దానివలన సుఖ

తమతమ కనుగుణములయిన కర్మవాసనాదులవలని దేహముల మూలమున, గర్మములను బుట్టించుచున్నవి. గుణపరిణాత్మకమై యింద్రియయుక్తమగు దేహమును గుణముల ననుసరించి కర్మములను బుట్టించుచున్నది. ఇట్లు ప్రాకృతగుణములతోఁగూడి దానికి వశ్యుఁడై యుండు జీవుఁడు తన దేహము చేతఁగలుగు పుణ్యాపాపకర్మముల ఫలములగు సుఖదుఃఖములను ననుభవించుచున్నాఁడు. [1]ప్రాకృతములగు గుణము లెంత వఱకు వైషమ్యముగలిగి యుండునో యంతవఱకు నాత్మకు జ్ఞానైకరసంబయ్యును దేవమనుష్యాది రూపములగు దేహముల చేత నానాత్వము గలుగుచున్నది. ఆ నానాత్వముండువఱకును గర్మకర్తృత్వము వలన గుణకర్మములకుఁ బరతంత్రుఁడై యుండుటయుఁ గలుగుచున్నది. ఈ దేహికిఁ బారతంత్ర్యము

---

దుఃఖములకు భోక్తయగుటయు దానివలన మరల తమతమ గుణముల కనుగుణములయిన ప్రవృత్తికర్మవాసనలవలనఁ బారతంత్ర్యము గలుగుటయు దానివలన మరల సుఖదుఃఖ భోక్తృత్వము గలుగుటయు నని యిట్లు చక్రమువలె పరివర్తనము చెప్పఁబడినది. ఇదివ దేహమునకు విలక్షణుఁడై జ్ఞానైకరస స్వరూపుఁడై నిష్క్రియుఁడగు నాత్మకు కర్తృత్వమెట్లు? ఆకర్తృత్వమెట్లు సుఖదుఃఖ భోక్తృత్వము కలిగించుచున్నది? యని శంకరాఁగా ఆత్మ యుక్తి వయ్యును, మోక్షము పొందు వఱకు దానికిఁ బ్రాకృత గుణయోగమును, వానికి వశ్యమై యుండుటయును, గుణములు మోక్షము కలుగువఱకు సామ్య వైషమ్యరూపము లలయించుచును నుదయించుచు నుండుటయును గలదు గాన, యాత్మకివి యున్నవనుట పొసఁగుచున్నది.

1. నీ వలని భయమెంతవఱ కుండునన గా ఎంతవఱకు గుణములు వైషమ్యముగలిగియు దానివలన నానావిధదేహములు గలిగియు, ఆ దేహమువలన గర్మములకుఁ గర్తయగుటయు ఆకర్తృత్వము వలన పారతంత్ర్యము గలుగుటయు దానివలన సుఖదుఃఖభోక్తృత్వము గలుగుటయు ననెడి యీపరంపర యనువర్తించునో యంతవఱకు నీవలని భయ మనువర్తించునని చెప్పుచున్నారు.

గలిగియుండుటవలనను నీశ్వరుండగు నావలన భయము (సుఖలేశముతోఁ గూడి దుఃఖబహుళమై యున్న సంసారభయము) గలుగుచున్నది. ఈశరీరము శివరాత్మయని యనుసంధించుచు దాని సుఖముకొఱకుఁ బ్రయత్నించుచుందురో వారు శోకము పాలై శోకనివృత్తి కుపాయము తెలియక తడఁబడుచుందురు. భయమునకు హేతువులు ప్రతికూలములగు దేశకాలస్వభావాదులేకాని నీవుగావే యందువా? కాలమును శరీరమును ఆగమమును (విధి ప్రతిషేధరూపమగు శాస్త్రమును) లోకమును, గాయవస్తు స్వభావమును, ధర్మము నని యిని మొదలుగాఁగల బహుప్రకారములస్పష్టిదశయందు నన్నుగాఁ (అనఁగా నాయధీనములయినవిగాఁ) జెప్పుదురు; కనుక నేనే భయాభయములు రెంటికిని గర్తనుజుమీ' యనెను. ఉద్ధవుఁడు—ప్రభూ! జీవుఁడు దేవాదిదేహములం దభిమానిగను శబ్దాదివిషయములందు భోక్తగాను, దేహజములును గుణమూలములు నగు కర్మములందుఁగర్తగానువర్తించుచున్నవాఁడుగానగుణములచేఁ గ్రమ్మఁబడకుండుటయెట్లు? దాని వలననే కర్మమూలములగు సుఖదుఃఖాదులు పొందకుండుటయెట్లు? మఱియీశ్వరునివలె స్వయంప్రకాశుండును ద్రష్టయునై యుండఁగా వానికి బంధముగాని కలుగుటయెట్లు? విద్వాంసుఁడగువాఁడెట్లు వర్తించును? ఎట్లు విహరించును? ఏలక్షణములచేత నతనిని గుఱుతెఱుంగవచ్చును? అతఁడు భోజనమును గుడుచునా? లేకకుడువక దిగవిడుచునా? అతఁడు పరుండియుండునా? లేక కూర్చుండి యుండునా? లేక తిరుగుచునే యుండునా? అచ్యుతా! నీవు ప్రశ్నములకుఁ బ్రతి చెప్పువారియందు మిన్నవు. కాన నే నడిగెడి యీప్రశ్నమును నాకుఁ జెప్ప

ము. నిత్యముక్తుఁడయిన యీశ్వరుఁడొక్కఁడే తన యవిద్యచేత నిత్యబద్ధుఁ డయినాఁడని నాకు భ్రమకలిగి యున్నది. చుమీ!' యని యడిగెను. ఇది పదియవయధ్యాయము.

—: కృష్ణుఁడుద్ధవునకు జీవపరయాథాత్మ్యము నుపదేశించుట. :—

శ్రీభగవంతుఁడు—గుణకర్మములచేత బద్ధుఁడు వానినుండి ముక్తుఁడని చెప్పుట నిర్దోషుండగు నాకువాస్తవమునఁగలుగ నేకలుగదు. మాయ(ప్రకృతి) నానియమనమునకు లోనయినది.మాయకు నియామకుఁడయిన నాకు నామాయాగుణములచేత బంధముగాని మోక్షముగాని గలుగదు.గుణకర్మములకు లోకువయగు జీవునికే యారెండును గలుగును. నాకు నియామ్యమయిన మాయచేతనే జీవునకు శోకమును మోహమును సుఖమును దుఃఖమును దేహప్రాప్తియు, స్వప్నమందు నాత్మకు దేహసంబంధము లగుసుఖదుఃఖాదులు తోఁచునట్లు, గలుగుచున్నవి. సంసార మాత్మకు స్వరూపసిద్ధమును నిత్యమును గాదు. అది [1]యుపాధిచేతఁగలిగి యనిత్యమైయుండును. ఉద్ధవా! విద్యయు నవిద్యయు నాకు దేహములు; దేహమువలె నాకు మిక్కిలి యధీనములయినవని తెలియుము. శరీరులకవి మోక్షమును బంధమును గావించుచుండునవి; ఆద్యము లయినవి. దానిని

1. ఇది యుద్ధవుఁడు ఆత్మ యెట్లు గుణముల చేతఁ గ్రమ్మఁబడక యుండును? ఎట్లు సుఖదుఃఖాదులు పొందకయుండు? నన్న ప్రశ్నముల కుత్తరములు. సంసార మనాదియగుటచే అనిత్య మగునా యనవలదు? ఆదియు అంతమును లేనిదే నిత్యమగును. సంసారమున కాది లేకున్నను అంతము కలదుగాన అనిత్యముగాదు; నిత్యమే యగును. అది ఆత్మకు అనాదిగానున్నందున దానిని గ్రమ్ముచున్నది. దానివలని సుఖము లాత్మను బొందుచున్నవి. ఇటస్వ

నాదుసంకల్ప రూపజ్ఞానముచేతను నేను నిర్మించితిని. (విద్యయనఁగా నాయుపాసనము. అవిద్య యనఁగా స్వాత్మ పరమాత్మ స్వరూపములు తెలియమి, మహామతీ! శరీరమునకుఁ బ్రధానభూతుఁడై నాకు శరీరమును విశేషణము నగుటచేత నా యంశమై యున్న యీ జీవునకు నవిద్యచేత బంధమును విద్యచేత మోక్షమును గలుగుచున్నది. ఇఁక బద్ధుఁడగు జీవునకును నిత్యముక్తుఁడయిన యీశ్వరునకును గల వైలక్షణ్యమును నీకుఁ జెప్పుచున్నాను. ఆ యిరువురు నొకదేహమునందే పరస్పరము విరుద్ధ ధర్మములుగలిగి నెలకొని యుందురు.[1] ఈ రెండు(జీవుఁడు నీశ్వరుఁడు నను) [2]పక్షులును మంచి ఱెక్కలుగలవి. సమానములయిన గుణములు గలవి. ఒకటి కొకటి చెలిమిగలవి. ఇది యదృచ్ఛచేత వృక్షమునందు (శరీరమునందు) గూడు కట్టుకొని (హృదయకమలమందు) నున్నవి. ఆ రెంటి

---

ప్నదృష్టాంతముచేత ప్రపంచము మిథ్యయని తలఁపరాదు. అదినాస్తి యనఁగా నిత్యముగాదని భావము; మిథ్యయని కాదు. స్వప్నప్రపంచమును 'నతత్ర రథా రథయోగా న పన్థానో భవన్తి అథ రథాన్రథయోగాన్ పథః సృజతే యత్ తేషు సుప్తేషు జాగర్తి కామం కామం పురుషో నిర్మిమాణః' అని ఈశ్వరుఁడు సృజించుట వాస్తవమే యగు నని శ్రుతి.

1. జీవేశ్వరులు భోక్తృత్వా భోక్తృత్వములు, జ్ఞత్వాజ్ఞత్వములు మొదలగు విరుద్ధ ధర్మముల నేకాలమందే యొక దేహమందుఁ గలిగియుందురని భావము.

2. ఇట 'ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే - తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యో అభిచాకశీతి' అను శ్రుతి యనుసంధింపఁబడెనని తెలియనది. ఇచట గూఁడనఁగా హృదయకమలము. ఈశ్వరునకును 'హృది హ్యయమాత్మా ప్రతిష్ఠితః' అని జీవునకును హృదయకమలవాసము చెప్పఁబడి యున్నది.

యందొకటి (జీవుఁడు) [1]మఱ్ఱిచెట్టుపండును (ప్రకృతి ఫలములగు శబ్దాది విషయములను) దినుచున్నది. ఇంకొకటి (ఈశ్వరుఁడు) యేఫలమును (పుణ్యాపుణ్య ఫలములగు సుఖదుఃఖాది భోగములు) లేక యుండును; (మఱియు సర్వజ్ఞత్వము సర్వశక్తిత్వము మొదలుగాఁ గల) బలముచేత మిక్కిలి మెఱుఁగై ప్రకాశించుచుండును. [2]సర్వజ్ఞుండయి (ఫల) భోక్తకా కుండెడివాఁడు, తన్నును దక్కిన ప్రధానమును బురుషునిని గలరూపున సాక్షాత్కరించుచున్నాఁడు. భోక్తయగు జీవుఁడో తన్నును దనసఖుండయిన పరమాత్మను నెఱుఁగఁడు; మఱి దేహమునే యాత్మగాఁ దప్పఁదలంచుచుండును. మఱి యవిద్యచేతఁగూడియుండువాఁడు(జీవుఁడు) నిత్యబద్ధుఁడై యుండును. విద్యమిక్కిలియుఁగలవాఁడు (ఈశ్వరుఁడు), నిత్యముక్తుఁడై యుండును. విద్వాంసుఁడెట్లు వర్తించుననిక దా యడిగితివి? వాఁడు దేహమునందుండియు దేహమునందు లేనివాఁడే. స్వప్నమునుండి మేలుకొన్నవాఁడు స్వప్నమందుఁ జూచిన శరీరమును తన్నుగాఁ దప్పఁ దలంపకుండునట్లు, దేహమందుండియు వాఁడు దేహమునే యాత్మగాఁ దప్పఁదలంచుట లేక యుండును. దేహమే యాత్మ యని తలంచు కుమతి యున్ననో, దేహమందు లేకున్నను (అనఁగా గర్భము మహాప్రలయము మొదలగు దశలయందు దేహము నిష్పన్నముగాకున్నను) స్వప్నము గనువాఁ డందలి శరీరమునే యాత్మగాఁ దప్పఁద

1. పిప్పలమనఁగామఱ్ఱి. 'పిప్పలాదః' అనఁగా మఱ్ఱినిదినువాఁడు, అనఁగా 'ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయమ్' అన్నట్లు ప్రకృతి మఱ్ఱిగా చెప్పఁబడుచున్నది. మఱ్ఱిపండనఁగా ఫలభూతములైన శబ్దాది విషయములని తెలియునది.

2. 'జ్ఞాజ్ఞౌద్వావజావీశనీశౌ' అను శ్రుతి యిట యనుసంధింపఁ బడినది.

దలంచునట్లు, దేహమునందున్నవాఁడై బద్ధుఁడై వర్తించుచుండును. విద్వాంసుఁ డగువాఁడు గుణపరిణామాత్మకములయిన తన యింద్రియములు శబ్దాది విషయముల ననుకూలములను గాని ప్రతికూలములనుగాని యనుభవించుచున్నపుడు, తానందులకు హర్షము విషాదము మొదలగు వికారముల నొందఁడు. మఱియుఁ దానే కర్తయనియు భోక్తయనియుఁ దప్పఁదలంపఁడు. విద్వాంసుఁడుగానివాఁ డన్నన్నో ప్రకృతి గుణములచేఁ గలుగు కర్మమునుబట్టి వర్తించుచున్నవాఁ డయినను దేహమునైన వాధీన మనుటయుఁ, బూర్వకర్మమును బట్టి తానందుండుటయు, దేహమునకంటె నాత్మ విలక్షణమగుటయును దెలియక దేహమునే యాత్మగాఁ దలంచుచునుండును కావున దేహాత్మాభిమానముచేతను, తానేకర్తయనియుభోక్తయనియునభిమానముచేతనుబద్ధుఁడగుచున్నాఁడు. విద్వాంసుఁ డెట్లువిహరించుననియడిగితివి. వాఁడు కుమతివృత్తిని జింతించి దేహమునందును దాని ననుబంధులందును విరక్తుఁడై మఱియుఁ[1]బరుండుట, వ్యాపించుట, తిరుగుట, జలకమాడుట, చూచుట, స్పృశించుట, మూర్కొనుట, కుడుచుట, వినుట మొదలగు వ్యాపారములను దగుళ్లొందిగాఁ జేయుచుండును. మఱియు గుణపరిణామము లయినయింద్రియములే, యీశ్వరుని వలన సత్తయుఁ బ్రవృత్తియు నొంది యాయా శబ్దాది విషయములం దమంత వర్తించి యనుభవించుచున్న వనియు[2]వానియందే కర్తృత్వభోక్తృత్వములున్న వనియుఁజింతిం

---

1. 'యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు । యుక్త స్వప్నావబోధస్య యోగీభవతి దుఃఖహా' అని భగవద్గిత.

2. 'తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మ విభాగయోః । గుణాగుణేషు వర్తన్త ఇతి మత్వాన సజ్జతే' అను భగవద్గీత యిట యనుసంధించునది.

చుచు నుండు నని బుద్ధి నెఱింగినవాఁడు కుమతివలె బద్ధుఁడు గాఁడు. అట్టి విద్వాంసుఁడు కర్మములను జేయుచును వానిఫలములగు సుఖదుఃఖముల ననుభవించుచును దేహమునందుండియుఁ గర్తృత్వాదులు శరీరమునం దుంచి తా నుదాసీనుఁడై యుండుట యెట్లందువా? వాఁడు ప్రకృతి పరిణామం బయిన దేహమునం దుండినను దాని వలని సుఖదుఃఖాదులచే వికారము నొందకయుండును. ఆకాశము, అంతటవ్యాపించియున్నను, ఆయావాని దోషములచేత వికారమునొందదు. సూర్యుఁడు తన ప్రభ చేత నంతట వ్యాపించినను, వాయువు దానియంత టఁబర్వియున్నను నాయావాని దోషముల నొందవు. అట్లె ప్రకృతి పరిణామంబగు దేహమునందుండియు దానియం దభినివేశము లేమిచే విద్వాంసుఁడు దాని వలని వికారముల నొందఁడు. వానికి బుద్ధి విశారదమై దేహాదులందు సంగము లేమిచేత వాఁడియై యుండెను. కాన యావాడిబుద్ధి చేత సందేహముల నెల్లఁ ద్రుంచుకొని కలగని మేలుకొన్నవానివలె దేవత్వము మనుష్యత్వము మొదలగు భేదములనుండి వీడి దేహమే తాననెడి యభిమానము లేకుండును. మఱి నేను దేహములకంటె విలక్షణుఁడనా? కానా? నేను స్వతంత్రుఁడనా? ఈశ్వరునికిఁ బరతంత్రుఁడనా? నే నీశ్వరుఁడా? వానికంటె వేఱా? యను సందియములు వానికిఁ గలుగవు. వానిని గుఱు తెఱుంగునట్టి లక్షణము లేవి యని యడిగితివి. ఎవ్వనికిఁ బ్రాణములయు నింద్రియములయు మనస్సును బుద్ధియు వ్యాపారములు దీనిని తినవలయును. దీనిని జూడవల

యును. దీనిని సంపాదింపవలయును. దీనిని బరిహరింపనలయు నని యిత్యాదులగు నుద్దేశములు లేకయుండునో యట్టివాఁడే దేహమునందు వర్తించుచున్నను దానిగుణములనుండి విడి వడినవాఁ డని తెలియవలయును. ఎవ్వఁ డతని దేహమును దుర్జనులు పట్టి పీడించినను, లేక దైవికముగా నెవఁడేని సత్కరించినను నట్టి పీడకును సత్కారమునకును దా నంతగా వికారము నొందకుండునో వాఁడే విద్వాంసుఁ డని తెలియవల యును. ఎవఁడు మానావమానములందు సమదృష్టి గలిగి యుం డుటవలన నారెంటిని దిగవిడిచి తన్నెవరేని మంచిదిగాని చెడ్డది గాని పలికినను జేసినను బొగడకయుఁ దెగడకయు నుండునో వాఁడు ముని యని తెలియవలయును. మఱియు వాఁడు తన యాత్మయందే రమించుచు తాను దనంతట లౌకిక కర్మ ములను మంచివానినిగాని చెడ్డవానినిగాని చేయకయుఁ జెప్పకయుఁ జింతింపకయు నుండి మననలుండై పూర్వోక్త మగు వృత్తిని వర్తించుచు జడునివలెఁ [1]జరించుచుండును. శబ్దబ్రహ్మమగు వేదమునందుఁ బారంగతుఁడయినను, పరబ్రహ్మ విషయమగు జ్ఞానమందుఁ బరినిష్ఠితుఁడు గాక పోవచ్చును. అప్పుడు వాఁ డధ్యయన మధ్యాపనము మొదలగు వానికై

---

1. ఇట్లు గుణములందువర్తించుచున్నను గుణములనుగడచియుండుట యనఁ గాశయనాసనభోజనాదులనువీడియుండుటగాదు. అహంకారరాగద్వేషములు లేకుండుటయు ఉపకారాపకారాదులందు మనస్సు సమముగా నుండుటయు దర్శనస్పర్శనాదులందుఁ దానే కర్తయనెడి యభిమానము లేమియు సువర్ణలోష్టాదులం దిష్టరిష్టులనియు అనిష్టములనియు బుద్ధి లేకుండుటయు నే యగునని బదులుచెప్పఁబడినది. ఇఁకనిట్టి పురుషునకు శాస్త్రజన్యమనియు ఉపాసనమనియు రెండుజ్ఞానములను జెప్పుచున్నాఁడు.

పడిన శ్రమమంతయు, ఈని చాలదినములయ్యుఁ బాఁడిలేని యావును రక్షించువానికింబోలె వట్టిశ్రమయే ఫలమగును. పాలుపిండియైన యావును, దుష్టురాలగు భార్యను, ప్రతిక్షణము దుఃఖహేతువగు దేహమును, దురాత్ముండగు పుత్రునిని, పాత్రమునకు దానముసేయని విత్తమును, నన్నుఁ బ్రతిపాదింపని వాక్కును రక్షించువానికి నుద్ధవా! దుఃఖమువెంట దుఃఖమే కలుగుచుండును. ఉద్ధవా! ఈజగత్తునకు నుత్పత్తిస్థితిసంహారములు సేయుచు విన్నను బలికినను బావనకరమైన నా చరిత్రమును, నేను లీలార్థమెత్తిన యవతారములలో జగమునకుఁ బ్రేమాస్పదమయిన రామకృష్ణాది జన్మములును నెవని వాక్కునకుఁ బ్రతిపాద్యములుగావో, యట్టివానివాక్కు నిష్ఫలమే యగును. బుద్ధిమంతుఁ డట్టివాక్కును దాల్పరాదు. ఇట్లు విచారముచేసి జీవాత్మయందు దేవుఁడనియు మనుష్యుఁడనియు నానావిధములఁ గలుగు భ్రమమును బోకార్చి దేహమునకంటె జీవాత్మ వేఱని యెఱింగి సకల చిదచిదాత్మకుఁ డగు నాయందు, రజోగుణములేనిదై సాత్త్వికమగు నాహారముచేతసత్త్వమందే తగిలియున్నట్టి మనస్సునునిచి, నాయందు భక్తిగావించి లౌకిక కర్మములనుండి యుపరమింపవలయును. బ్రహ్మంబగు నాయందు నిశ్చలముగా మనస్సును నిలుపుటకు శక్తుఁడవుగావేని యప్పుడు వర్ణాశ్రమోచితము లగు సమస్తకర్మములును వానిఫలము నపేక్షింపకయు వానికి నీవు కర్తగానని యధ్యవసాయము గలిగియు నాచరింపుము. మఱియు శ్రద్ధగలవాఁడై లోకపావనములును సుభగములునగు నా కథలను వినుచును బాడుచును స్మరించుచును నా జన్మములను నభినయించుచును

దలంచుకొనుచును నావిషయమై నా యారాధనమున కనియే ధర్మకామార్థములను నాశ్రయించుచు నేనే యాశ్రయముగాఁ గలిగి యుండినచో నుద్ధవా! సనాతనుం డయిన నాయందు నిశ్చలమయిన భక్తిని బొందుచున్నాఁడు. సాధువులతోడి సంగతివలన నాయందు భక్తి లభించుచున్నది. అట్టి భక్తితో నన్నెవఁడు సేవించుచున్నాఁడో వాఁడు నాస్థానమును సుఖముగాఁ బొందుచున్నాఁడు. సత్పురుషు లిట్లని నిశ్చయించి యున్నారు' అనెను.

ఉద్ధవుఁడు-ప్రభూ! ఉత్తమశ్లోకా! సాధువులు పెక్కువిధములనుందురు. వారిలో నెట్టి వాఁడు నీకభిమతుఁడు. సజ్జనులాదర పూర్వకముగా ననుష్ఠించు భక్తియు బహువిధములుగా నున్నవి. అం దెట్టి భక్తి నీ పట్ల నుపయోగించుచున్నది? ఎట్టి భక్తిని నారదాదులగు సత్పురుషు లాదరింతురు? నీవు ప్రధాన పురుషుల కధ్యక్షుఁడవు, లోకాధ్యక్షుఁడవు. జగత్పతీ! నీకుఁ బ్రణతుఁడయి నిన్ను శరణుఁ జొచ్చిన వానికి, నీకనురక్తుఁడయిన వానికి, నాకు, దీనిని జెప్పవలయును. నీవుపరబ్రహ్మమవు, పరమాకాశమువలె నిర్మలస్వరూపుఁడవు, పురుషుండవు, చిదచిత్తులను ప్రకృతులు రెంటికంటెను బరుండవు. భగవంతా! నీవు కర్మముచేతఁగాక నీయిచ్ఛచేత రామప్రద్యుమ్నానిరుద్ధాదు లగునానావిధములయినరూపములను గయికొనియవతరింతువు'అనెను. భగవంతుఁడు 'కృపగలవాఁడును భూతము దేనికిని ద్రోహము సేయని వాఁడును ద్వంద్వములను సహించువాఁడును, సత్యమే సారముగాఁ గలవాఁడును, అసూయాదిదోషములు మనస్సునందు లేని వాఁడును, సర్వత్ర సమదృష్టి గలవాఁడును, సర్వమున కుపకారి

కోఁడయునవాఁడును, సమస్తదేహములలోపల సాధువయినవాఁడును, మఱికామములచే బుద్ధికొట్టువడి చెడనివాఁడును, ఇంద్రియనిగ్రహముగలవాఁడును, మెత్తనివాఁడును, లోపలను వెలుపలను శౌచము గలవాఁడును, ప్రయోజనాంతర మేదియు లేనివాఁడును, లౌకిక వ్యాపారములు లేనివాఁడును, మితముగా భుజించువాఁడును, అంతఃకరణము నిగ్రహించినవాఁడును, స్థిరచిత్తుఁడును, నేనే రక్షకుఁడుగాఁగలవాఁడును, నాశుభాశ్రయమును మననము సేయువాఁడును, పరాకుపడనివాఁడును, లోనియభిప్రాయమును దెలియనలవిగాని వాఁడును, ఆపదలయందు ధైర్యముగలవాఁడును (ఆఁకలిదప్పిశోక మోహములు జరామరణములనెడు) గుణములాఱింటిని జయించినవాఁడును, తన దేహమునకు సత్కారమొల్లనివాఁడును, పరులకుసత్కారముసేయువాఁడును, హితోపదేశమునందు సమర్థుఁడును, వంచనలేనివాఁడును, కరుణతో వర్తించువాఁడును, చిదచిత్తులీశ్వరుఁడను మూఁడు తత్త్వముల కలరూపును దెలిసిన వాఁడును, సాధువు. ఇట్లు నేను వేదముఖమున నుపదేశించి యున్నగుణములను దోషములను దెలిసి స్వవర్ణాశ్రమోచిత ధర్మములనెల్లఁ బరిత్యజించి నన్నే యుపాయముగాను నుపేయముగాను భజించువాఁడుసాధుతముఁడు. మఱినాస్వరూపమెద్దియో నాస్వభావమేమియో నావిభూతు లెంతయో పలుమాఱు విచారించి యెవ్వఁ డితర ప్రయోజనములందును దేవతలందును సాధనములందును భావముంచక భజింతురో వారు నాకుమిక్కిలియు భక్తులు. ఇఁకభక్తి కుపయుక్తము లగు లక్షణములను జెప్పెదను. నాదు ప్రతిమలకును నాభక్తజనులదర్శించుటయు స్పృశించుటయు నర్చించుటయుఁ గాలు

పిసుకుట మొదలగు పరిచర్యలుగావించుటయు స్తుతించుటయుఁ బ్రణామిల్లుటయు గుణకర్మములను గీర్తించుటయు నాకథలను వినుటయం దక్కఱగలిగియుండుటయు, నన్నుగుఱించిధ్యానము సేయుటయు దొరకిన వెల్ల నాకు సమర్పించుటయు, తన్ను నాకు శేషభూతుఁ డని యధ్యవసాయము గలిగి యుండుటయు, నాజన్మకర్మములను వినువారికిఁ జెప్పుటయు, నా పండుగు దినములగు జయంతి మొదలగు వానియం దుత్సవములు చేసి యుప్పొంగుటయు, గీతములు వృత్తములు వాద్యములు సభలు మొదలగు వానిచేత నా యాలయములం దుత్సవములు గావించుటయు, దివ్యదేశములకు యాత్ర పోవుటయు, చాతుర్మాస్య మేకాదశి మొదలగు నేఁడాది పండుగులయందెల్ల విశేషించి నాకుఁ బూజ గావించుటయు, నా శాస్త్రమగు పంచరాత్రమునఁ జెప్పఁబడిన యుత్తమంబగు పంచసంస్కారదీక్షయు, నావ్రతములయిన యేకాదశ్యుపవాసాదుల నాచరించుటయు,నాయర్చావిగ్రహములను స్థాపించుట యందుశ్రద్ధయును, మఱియు నాకై యింటి పురటితోఁటలను వెలుపలి తోఁటలను, క్రీడాస్థలములను,బురములను, గృహములను,తానొక్కఁడైనను గాని, యందులకు శక్తిలేనిచో నితరులంగూర్చికొని కాని, చేయుటకుఁ బ్రయత్నించుటయు, నాగృహము నూడ్చుటయుఁ, గలయంపిచల్లుటయు, నలుకుటయు, ముగ్గులు పెట్టుటయు మొదలగువానినిగపటములేక యూడిగమువలెఁ జేసియలంకరించుటయు, దురహంకారములేకుండుటయు, వంచనమాటలును, చేసినధర్మమును జెప్పుకొనకుండుటయును, గలిగియుండవలయును. మఱి నాకొఱకుఁ దా నిడినట్టి గాని పరు లర్పించినట్టి కాని దీపముల

వెలుతురు వీవనలగాలి మొదలగు వానిని దనపనికై యుప యోగించు కొనరాదు. ఒకనికి లోకమునం దేదేది మిక్కిలి రమణీయమైనదో యేదేది మిక్కిలి ప్రియమైనదో యాయా దాని నెల్ల నాకు నివేదింపవలయును. అట్లు చేసినచో నది నా కపరిమితమైన ప్రీతి గలిగించి యక్షయ్యమగు ఫలము నొసంగునదగును. భద్రా ! సూర్యుఁడు, అగ్ని, బ్రాహ్మణుఁడు, గోవులు, వైష్ణవుఁడు, ఆకాశము, వాయువు, జలము, భూమి, యాత్మ, సమస్తములైన భూతములుఁను బూజించుట కయిన స్థానములు. నీవు సూర్యునియందు త్రయీవిద్యచేతను 'ఆ సత్యేన' మొదలగు మంత్రముల చేతను, అగ్నియందు పురోడాశాజ్యాదులయిన హవిస్సులచేతను, నన్నుఁ బూజింపవల యును. మఱి నన్ను బ్రాహ్మణశ్రేష్ఠునియం దాతిథ్యము చేతను, గోవులయందు యవస తిల పిష్టోదకాదులచేతను విష్ణుభక్తుని యందు బంధువువలె సత్కరించుటచేతను హృదయాకా శమందు ధ్యాన నిష్ఠచేతను వాయువునందు ముఖ్య ప్రాణ మను బుద్ధిచేతను జలమునందు జలగంధ పుష్పదూర్వా క్షతాదులచేతను స్థండిలభూమియందు మూలమంత్రముచేతను, హృదయా ద్యంగములందు మంత్రన్యాసములచేతను, తన యాత్మయందు శాస్త్రవిరుద్ధముగాని కామములచేతను దేవ మనుష్యాదిసమస్త భూతముల శరీరములందు క్షేత్రజ్ఞునిగాను (జీవశరీరకునిఁగాను)ఇట్లునన్ను రాగద్వేషములు మాని సమచిత్త ముతో యజింపవలయును. ఈసూర్యాదిస్థానములందు శంఖ చక్రగదాంబుజములతోడను గూడినదియుఁ జతుర్భుజములు గలదియు శాంతంబయినదియు నగు నారూపమును సమాహి

తుఁడై ధ్యానించి యర్చింపవలయును. ఎవ్వఁడు సమాహితుఁడై నన్ను వైదికకర్మములచేతను స్మార్తకర్మములచేతను నన్నే యజించుచున్నాఁడో వాఁడును నాప్రతిమలయెడ దర్శనాదులు చేయువానివలె నాయందుఁ బ్రేమాత్మకమును నవిచ్ఛిన్నము నగు భక్తినిబొందుచున్నాడు. నాభక్తియు సత్సంగమువలననే కలుగుచున్నది. ఉద్ధవా! సత్సంగమువలనఁ గలుగునట్టి భక్తియోగము తప్ప నాప్రాప్తికిఁ జక్కని యుపాయము మఱియొకటి బహుతరముగాఁగలుగదు. ఏలనఁగా సజ్జనుల కుపాయము నుపేయమును నేనేయగుదును జుమీ. కాన వారితోడి కూడికవలననే నాయందు భక్తియుఁ దన్మూలమున మత్ప్రాప్తియుఁ గలుగును. యదునందనా! ఇఁకఁ బరమరహస్యమయిన మఱియొకటి నిదె చెప్పుచున్నాను వినుము. ఇది మిక్కిలి గోప్యమయినది. నీవు నాకు భృత్యుఁడవనియు సుహృదుఁడవనియు సఖుఁడవనియుఁ దలఁచి దానిని నీకుఁ జెప్పుచున్నాను.

ఇది పదునొకండవయధ్యాయము.

కృష్ణుఁ డుద్ధవునకుఁ[1] బ్రపత్తియోగమును జెప్పుట

భగవంతుఁడు-ఉద్ధవా! నన్ను వర్ణాశ్రమములకుఁ దగిన(కర్మ) యోగముగాని, వివిక్తాత్మోపాసనరూపమగు సాంఖ్యమును గాని, యహింసాదిరూపమగు ధర్మము స్వాధ్యాయమును తపమును త్యాగమును యిష్టాపూర్తముగాని, దక్షిణలుగాని, యేకాదశ్యుపవాసాదివ్రతములును పంచ మహాయజ్ఞములును

1 ఇంతవఱకు భక్తియోగమును దానిపెక్కంగములును జెప్పి యిప్పుడది దుష్కరమని యుద్ధవునకుఁ దోఁచుటచే సులభోపాయమగు ప్రపత్తిని చెప్పుచున్నారని తెలియునది.

రహస్యమంత్రములును గంగాదితీర్థములును, శౌచాచమనాది నియమములును బాహ్యాంతరింద్రియనియమనములగు యమము లివియెల్ల సత్సంగమమునన్ను హృదయమందు నిలుపునట్లు, నిలిపి వశీకరింపఁజాలవు. ఏలన సజ్జనసంగము మనసునకు నేను దప్పఁ దక్కిన వానియందుఁ గలుగు సంగములనెల్ల నపహరించుచు నాయందే సంగమము గలిగించుచున్నది. యోగాదు లిట్టివి గావు [1]సజ్జనులతోడి సంబంధముచేత దైత్యులును రాక్షసులును పక్షులును మృగములును గంధర్వులునప్సరసులును నాగులును సిద్ధులును జారణులును గుహ్యకులును విద్యాధరులును మనుష్యులయందు వైశ్యులును శూద్రులును స్త్రీలును నంత్యజులును మొదలుగాఁగల రజస్తమఃప్రకృతులును, ఆయాయుగమందుఁ బెక్కండ్రు నాపదమును బొందిరి. మఱి వృత్రాసురుఁడును బ్రహ్లాదుఁడును మొదలగువారును వృషపర్వుఁడును బలియును బాణుఁడును మయుఁడును విభీషణుఁడును, సుగ్రీవుఁడును, హనుమంతుఁడును, భల్లూకమగు జాంబవంతుఁడును, గజేంద్రుఁడును గృధ్రమగు జటాయువును, వైశ్యుఁడగు తులాధారుఁడును, బోయయగు ధర్మవ్యాధుఁడును, స్త్రీయగుకుబ్జయు, గోపికలును, మునిపత్నులగు బ్రాహ్మణస్త్రీలును మఱియు నితరులును నాపదమును బ్రాపించిరి. వీరందఱును వేదములను నధ్యయనము చేసిన వారుగారు. గొప్పవారగుసాధువుల నుపాసించిన వారును గారు, వ్రతము లాచరించినవారుగారు, తపములుసల్పిన వారును

1 సజ్జనులతోడి సంబంధము వారి కులమునందుఁ బుట్టుటగాని వారున్న దేశమందు వర్తించుటగాని వారిదర్శన స్పర్శనములకుఁ బాలగుటగాని యని తెలియునది.

గారు, అయినను సత్పురుష సంగమువలన నన్నుఁ బొందిన వారయిరి, గోపికలు వేండ్రమగు కామభావముచేతను, గోవులును, గవమద్దులు మొదలయిన నగములును మృగములును నన్ను జూచుచుఁ దాఁకుచును మిక్కిలి యాదరము నెఱపుటచేతను, గాళియుఁడు మొదలయిన నాగులు తీవ్రమయిన కోపభావము చూపుటచేతను, వీరందఱును దమోగుణము గ్రమ్మిన బుద్ధులఁ గలవారయ్యును సిద్ధినొంది యనాయాసముగా నన్నుఁబొందిన వారయిరి. నన్ను, యోగముచేతను సాంఖ్యముచేతను దానవ్రత తపములచేతను యజ్ఞములచేతను శాస్త్రాధ్యాపనముచేతను స్వాధ్యాయముచేతను సన్న్యాసముచేతను నెంత ప్రయత్నించినను బొందనలవిగానట్టి నన్ను, వీరెల్లను బొందిరిచుమీ. అక్రూరుఁడు నన్నును బలరామునిని మథురకుం దోడ్కొని పోయినపుడు గోపికలు నాయందు మిక్కుటమయిన వలపుచేతఁ జిత్తము లనురక్తములై యున్నందున మనస్సునందు దుఃఖము దుస్సహమైపట్టి పీడింపఁగా మఱి దేనివలనను వారికి సుఖము చూపట్టినది గాదయ్యె. బృందావనమందు వారికిఁ బ్రియతముం డగు నన్నుఁగూడి విహరించునపు, డేరాత్రు లరక్షణమువలెఁ గడచిపోయినవ్రా యవియే మరల నేను లేకుండినపుడు కల్పములవలె వారికి నయినవిచుమీ. వారు నాయందలి మక్కువలవలన బుద్ధులెల్ల నాయందుఁ గట్టువడియుండుటవలన మునులు సమాధియందుఁ దమ్మెఱుంగకుండు నట్లును, సముద్రజలములందుఁ జొచ్చిన నదులు నామరూపము లడంగి యుండునట్లును, తమ దేహములనుగాని దూరమునున్న దానినిగాని దగ్గఱ నున్న దానినిగాని పర

వశులై తెలియరైరి. ఆయబలలజ్ఞలయ్యును, నాయందే మరులుగొని నా స్వరూపము నెంతమాత్రము దెలియకయె నన్ను జారునిఁగాను రమణునిఁగాను వలచి పరమబ్రహ్మంబగు నన్నుఁ బొందిరి. ఇట్లె సజ్జనసంగమువలన వందలకొలఁది నన్నుఁ బొందిరి చుమీ. ఉద్ధవా! కాఁబట్టి నీవు విధిని నిషేధమును విధినిషేధశాస్త్రములందుఁ బ్రతిపాదితము లగు [1]ప్రవృత్తినిని నివృత్తినిని, శ్రోతవ్యమును శ్రుతమునును దిగ విడిచి సమస్తదేహులకు నాత్మభూతుం డయిన నన్నొకనినే యుపేయముగాను బితగాను రక్షకుఁడు గాను శేషియనియు నాకుఁగల యన్ని భావముల చేతను శరణుఁజొరుము. దానివలన నీకు దేని వలనను భయము గలుగని నన్నే పొందఁగలవు' అనెను. అందుల కుద్ధవుఁడు "యోగీశ్వరేశ్వరా! నీవు చెప్పినది వినఁగా నా కుపాయవిషయమగు సందేహము వీడినది. మఱి యాత్మను గుఱించిన సంశయమో విడువకున్నది. ఆసంశయము చేత నామనస్సు భ్రమించుచున్నట్లున్నది" యనెను. భగవంతుఁడు—ఆజీవుఁడు ప్రాణవాయువుతోఁ గూడిన శరీరమందు హృదయచ్ఛిద్రమను గుహను జొచ్చి వెలుంగుచు ఘోషముతోఁ గూఁడినవాఁడై మనస్సునకు మాత్రము గ్రాహ్యము గావుననే ప్రక్కనున్నవారికిఁ దెలియరానంత సూక్ష్మమును నగు రూపమును బొంది యుచ్చరించునపుడు స్థానప్రయత్నవశమున

---

1. ఇందులకు 'తస్మాత్త్వ ముద్ధవోత్సృజ్యచోదనాం ప్రతిచోదనాం। ప్రవృత్తించ నివృత్తించ శ్రోతవ్యం శ్రుతమేవచ॥ మామేకమేవ శరణమాత్మానం సర్వదేహినామ్। యాహిసర్వాత్మభావేన యాస్యసి హ్యకుతోభయమ్'॥ అని మూలము దెలియునది.

మాత్రాదిహ్రస్వములును గకారాదివర్ణములును ఉదాత్తాది స్వరములునై మిక్కిలిస్థూలమగుచున్నది. కట్టియయందున్న యగ్ని మొదట సూక్ష్మముగా నుండును. పిదప దానిని జిలుకఁ దొడంగినపుడు వేఁడిమిరూపముగా నుండును. పిదపఁ గట్టియయందు మఱింత బలముగాఁ జిలుకఁగా నాకాశమందు గాలి సహాయ పడుటవలన మిణుఁగురుగా నేర్పడును. అంతఁ గ్రమముగాఁ బెద్దపెరిఁగి హవిస్సుచేఁ జక్కఁగా మంటమండును. అట్లె నా వాగింద్రియవ్యాపారంబయిన యీవాణియు వ్యక్తినొంది నాకు శరీరమైనాయధీనమై యుండును. వాక్కు వ్యాపారము మాత్రమే యాత్మకు లోనయినదిగాదు. పాదేంద్రియవ్యాపారమగు గతియు, పాణీంద్రియవ్యాపారమగు కర్మమును, ఉపస్థవ్యాపారమగు రతియు, పాయువ్యాపారమగు మూత్రపురీషోత్సర్గమును, ఘ్రాణేంద్రియవ్యాపారమగు గంధాఘ్రాణమును, రసనేంద్రియవ్యాపారమగు రసగ్రహణమును, చక్షురింద్రియవ్యాపారమగు దర్శనమును, త్వగింద్రియవ్యాపారమగు స్పర్శమును, శ్రోత్రేంద్రియవ్యాపారమగు శ్రవణమును, మనోవ్యాపారంబగు సంకల్పమును జ్ఞానమును, అహంకారవ్యాపారమగు నభిమానమును, బహుకార్యములకు సూత్రమునవలె నాధారమగు మహత్తు వ్యాపారమగు నధ్యవసాయమును, మఱి గుణత్రయపరిణామములగు దేహేంద్రియాదిగుణములును నా వ్యక్తియగును. మూఁడుగుణములకు వశ్యుఁడై, యాపార వశ్యమును బట్టి బ్రహ్మాండములోపల నుత్పత్తిమరణము లొందుచు స్వరూపమునందు వృద్ధియుఁ బరిణామమును లేక యేక రూపుండై నిత్యుండై కాలమున దేహమునందును దాని

యనుబంధులందును నహంకార మమకారములుగలిగియుండుట చేతఁ దనచైతన్యశక్తి ప్రిదిలి దేవుఁడు మనుష్యుఁడు మొదలయిన పెక్కురూపములొంది, విత్తనము లొక్కజాతివైనను విత్తిన నేల కనుగుణముగా వృద్ధియును క్షీణతయును నొంది పెక్కువిధములఁ జూపట్టునట్లు, వెలయుచున్నాఁడు. పటము నందు నూలిపోఁగులు గ్రుచ్చి యల్లంబడియున్నట్లు, సమస్తము లయిన యింద్రియప్రాణజాలమంతయు సంసారమందు గ్రుచ్చి యల్లంబడియున్నది. అట్టి యీసంసారవృక్షము ప్రవాహ రూపమున ననాదియైనది; కర్మాత్మకముగాన ప్రవృత్తి స్వభావమైనది. అది పువ్వులగు కర్మములను బండ్లగు సుఖదుఃఖములను గనుచున్నది. ఈసంసారవృక్షమునకుఁ బుణ్యాపాపములు రెండును బీజములు. రాగ ద్వేష భయాదులను వేళ్లు నూఱు. మూఁడు ప్రకాండములు పంచభూతములు స్కంధములు. శబ్దాదులగు పంచవిషయములు దానియందుఁ బుట్టుచున్నవి. జ్ఞానకర్మేంద్రియములు పదియును మనస్సును దానికి శాఖలు. జీవపరమాత్మలను రెండుపక్షు లున్నహృదయకమలమనుగూఁడు దానియందుఁ గలదు. దానికి వాతపిత్తశ్లేష్మము లని మూఁడువల్కలములు. భోగమోక్షములను ఫలములు రెండు. అందుఁ బ్రవృత్తికర్మమునకు భోగమును నివృత్తి కర్మమునకు మోక్షమును ఫలమగును. అధ్యాత్మికాది తాపత్రయమనెడి పాఁదునం దది నెలకొనియున్నది. ఆవృక్షమునందు సుఖదుఃఖరూపమైన యొక ఫలమును గ్రామమునందుఁ జరించు విషయాభిలాషు లగు జీవులనెడు గ్రద్దలు దినుచున్నవి. మోక్షమనెడి మఱియొక ఫలమును నరణ్యమునందు వసించుచుండెడి

హంసలు దినుచున్నవి. పురుషుఁడెవఁడు, సంసారవృక్షమును బ్రకృతిపరిణామమైనదనియు దేవత్వమనుష్యత్వాదులగు పెక్కురూపములు గలదనియు గురువులచేత నెఱుఁగునో వాఁడు వేదములను నెఱింగినవాఁడగును. ఇట్లు స్థిరభక్తితోఁగూడిన గురూపాసనముచేత * విద్య నభ్యసించి యావిద్యయను వాఁడికుఠారముచేతంగాని దేనివలనను భయములేక జీవునియందు శరీరసంబంధమనెడి వృక్షమును, నిశ్శేషముగాఁ బోకార్చి యప్రమత్తుఁడై యాత్మయగు నన్నుఁబొంది యంత నాయాయుధమును దిగవిడువుము. ఇది పండ్రెండవయధ్యాయము.

సత్త్వాదిగుణ జయాదులను జెప్పుట.

భగవంతుఁడు—సత్త్వమురజస్సు తమస్సును, ప్రకృతి పరిణామమయిన మనస్సు గుణములుగాని యాత్మకు గుణములు గావు. సత్త్వమును వృద్ధినొందించి దానిచే రజస్సును దమస్సును నాశముచేయవలయును. అయినను సత్త్వముండెనేని గుణమునకు లోనగుట గలుగుచున్నదిగదా యన్నచో, సత్త్వముచేతనే (అనఁగా సత్త్వముచే జనించిన జ్ఞానముచేతనే) సత్త్వమును నాశముచేయవలయును. పురుషునికి నాభక్తియనెడు ధర్మము, సత్త్వము వృద్ధినొందఁగాఁ గలుగుచున్నది. ఆసత్త్వమును సాత్త్వికములయిన యాహారములను సేవించుటచేత వృద్ధినొందుచున్నది. ఆసత్త్వము వృద్ధినొందఁగా మద్భక్తియును ధర్మమును నహరహ రభ్యాసమువలన నతిశయించుచున్నది. సత్త్వము తనంతట రజస్తమస్సులను నాశముసేయనేరదు. సత్త్వమువలన భక్తిరూపమగు ధర్మము

* ఇటవిద్యయనఁగా న్యాసమైనను ఉపాసనమైనను గావచ్చును.

వృద్ధినొంది రజస్తమస్సులను నాశము సేయుచున్నది. కాఁబట్టి సత్త్వవృద్ధియుత్తమమగు మోక్షోపాయమగును. 'రజస్తమస్సులు నాశమొందినను వానికి మూలమై యనాదిగానున్న పుణ్యాపాపములు ముక్తి ప్రతిబంధకమగును గాన సత్త్వవృద్ధి మోక్షోపాయమెట్లందువా! రజస్సును దమస్సును రెండునుహాణములు కాఁగా నారెంటికి మూలమై పుణ్యాపాపరూపమైన యధర్మమును వేగముగా నశించుచున్నది. సత్త్వవృద్ధికి హేతువు సాత్త్వికోపాసనము మాత్రమే కాదు మఱియు (వేదము పంచరాత్రము భగవద్వైభవ ప్రకాశకమయిన యితిహాసపురాణాదులు మొదలగు సాత్త్వికములైన) యాగమములును (విషయలంపటులనుగాక సాధువులయిన) జనులును, (గంధోదక సురా మద్యాదులుగాక గంగాది పుణ్య) జలములును, (పాన స్త్రీద్యూతాదులు గలదేశముగాక వివిక్తమగు) దేశమును, (అర్ధరాత్రము మొదలగునవిగాక బ్రహ్మముహూర్తము మొదలయిన) కాలమును (ఫలాభిసంధితోఁ గూడినది గాక యది లేనట్టి కర్మమును, (సావిత్రమును యాజ్ఞికమునగు) జన్మమును (దేవతాంతర విషయముగాక విష్ణువిషయంబగు) ధ్యానమును, (దేవతాంతరస్మారకముగాక విష్ణుస్మారకంబైన) మంత్రమును,(తాపము పుండ్రము నామము మంత్రము యాగమునవెడి పంచవిధ) సంస్కారమును — ఈపదియును సత్త్వవృద్ధికి హేతువులు. భగవద్భక్తు లగుపెద్ద లాహారాగమాదులం దేయే దానిని మేలయినదిగాఁ జెప్పుదురో యదియే సాత్త్వికము. ఏయేదానిని నిందింతురో యది తామసము. ఏయేదానిని బొగడకయుఁ దెగడకయునుందురో యదిరాజసము, పురుషుఁడు

సత్త్వము వృద్ధినొందుటకు సాత్త్వికములయినవానినే సేవింప వలయును. అట్టి సత్త్వము వృద్ధివలన మద్భక్తిలక్షణ మగు ధర్మము గలుగుచున్నది. ఆ భక్తివలన నాస్వరూప స్వభావ ములను గలరూపునఁ దెలియు జ్ఞానము గలుగుచున్నది. దాని వలన నాస్వరూపాదులను గుఱించిన స్మృతి యెడతెగక కలుగు చున్నది.దానివలన శబ్దాదివిషయాంతరములను గుఱించిన స్మృతి నిశ్చయముగా లేక పోవుచున్నది. అనఁగా విషయాంతరములకు విముఖమై మద్విషయ స్మృతి సంతానరూపమైన జ్ఞానముగలు గుచున్నది. [1]గుణత్రయముచే బుట్టునట్టి దేహమెట్లు సత్త్వ మును బుట్టించి పెంచి దానిచేఁ బుష్టినొందిన భక్తిమూల మునఁ దనకుమూలంబైన యా గుణత్రయమును దొలఁగించి తానును దొలంగఁగల' దని యడుగుదువా? ఒక వనమందు వెదు ళ్లొకటి నొకటి రాచుకొనుట వలనఁ బుట్టిన యగ్గి తనకు మూలమైన యా వెదురు టడవిని దహించి పిదపఁ దాను నుడిగి పోవుచున్నది. ఇట్లే మూఁడు గుణములును వైషమ్యము నొం దుటవలనఁబుట్టినదేహము, తనకు మూలమైన యా గుణత్రయ మును దొలఁగించి యంతఁ దాను నివర్తించుచున్నది' అనెను.

---

1. గుణములు మూఁటియొక్క పరిణామముదేహము. అది సాత్త్వికము లైన యాహారాదులచేత మొదలఁ దనయందలి సత్త్వమును. వృద్ధి నొందించు చున్నది. దానివలన భక్తియోగము జనించి రజస్తమస్సులు నిశ్శేషముగా నశింపఁజేయఁగా దేహసంబంధమునకు నిమిత్తమగుపుణ్యపాపము లనెడి యధ ర్మములు రెండును హతములగు చున్నవి. అవి హతములుగాఁగా వానివలనఁ గలుగుదేహమును నశించుచున్నదని చెప్పఁబడెను. ఇట్లు గుణములవలనఁబుట్టిన దేహమె సత్త్వవృద్ధిభక్తి పుష్టిద్వారా గుణములను దొలఁగించి తానునుదొలఁ గుచున్నది. ఇందులకేదృష్టాంతముగా వేణువులవలనఁబుట్టినయగ్ని చెప్పఁబడెను.

ఉద్ధవుఁడు—కృష్ణా! మనుజులు బహుంతరముగా శబ్దాది విషయములాపదలకుఁబట్టయినవిగా నెఱుంగుదురు. అట్లు తెలిసియుండియు వారెట్లు [1]కుక్కలవలెను గాడిదలవలెను, గొఱియలవలెను మరల నావిషయములనే యనుభవించుచున్నారని యడిగెను. భగవంతుఁడు-ఆత్మవిషయమై ప్రమత్తుఁడగువాఁడు దేహాత్మలసంసర్గమువలన దేహమునే యాత్మగాఁదలఁచి 'నేను స్థూలుఁడను, నేను గృశుఁడనని' హృదయమం దహంకారబుద్ధి నొందుచున్నాఁడు. అట్టి బుద్ధివలన వాని మనస్సు సాత్త్విక కాహంకార కార్యమువలన రజోగుణకార్యములగు కామక్రోధములు మహాపాపములగుటచే భయంకరములగు వానిని బొందుచున్నది. మన స్సట్లు రజస్సుతోఁగూడఁగా దానికి [2]సంకల్పమును వికల్పమును గలుగుచున్నవి. అనఁగా రజోగుణము విక్షేపము గలిగించుచున్నది గాన, దానివలన మనస్సునకు సంకల్పవికల్పము లనెడు వ్యాపారములు గలుగుచున్నవి. హేయములందు భోగ్యము లనెడి బుద్ధి సంకల్పము గలిగించుచున్నది గాన,యట్టి సంకల్పమువలన భోగములందిచ్ఛయగు కామముపుట్టుచున్నది.

---

1. కుక్క, మొఱుఁగుచున్నను ఆఁడు కుక్కను వెంబడించు చున్నది. గాడిద, స్త్రీ కాలం దన్నుచున్నను ఆఁడు గాడిదను వెంబడించు చున్నది. గొఱియ! తన్నుఁ జంపుటకుఁ గొనిపోవుచున్నను ఆఁడు గొఱియ వెంటఁబడుచున్నది. కాన, వీని నిట దృష్టాంతీకరించుట తెలియునది.

2. సంకల్పమనఁగా నేను మనుష్యుఁడు నేను బళువనెడి యభిమానమునకు ననుగుణముగా అన్నము పాలు మొదలగు హేయములందు భోగ్యములను బుద్ధి గలుగుట వికల్పమనఁగా (స్రక్చందన స్త్రీ) గతాకారవైవిధ్య ప్రతిపత్తి రూపమైనది. రజస్సు కర్మములను జేయించునది. తమస్సు వాని యందలి దోషములను గనుఁగొననీక కప్పుచున్నది. కామ మనఁగా, భోగేచ్ఛ.

దేహాభిమాని యగు జీవుఁ డాభోగ్యములందలి చక్కందనము తీయందనము మొదలగు గుణములనే తలపోయుచుండుటకు వానికి వానియందలి కామము సహింపరాక మిక్కుటమగుచున్నది. అట్లు వాఁడు దుస్సంగమగు కామమునకు వశగతుఁ డగుటవలనను భోగ్యముల నొసంగునని తాను దప్పఁదలంచిన కర్మములు, వాస్తవమునకుఁ బిదప దుఃఖములనే యొసఁగునవియని చక్కఁగాఁ గనుఁగొని యుండియు, నింద్రియములను జయింపనందున రజస్సు నురవడిచేఁ దెలివి చెడి యట్టి కర్మములను జేయుచున్నాఁడు. రజస్తమస్సుల చేత బుద్ధి విక్షిప్తమై మూఢముగా నున్నను వివేకి యగు వాఁడు మనస్సును సంకల్ప వికల్పములకు వశము గాకుండ నట్లరికట్టి [1]శబ్దాదివిషయ మాపదలకుఁ బట్టయిన దని వాని యందుదోషములనే కనుఁగొనుచు నావిషయములందుఁ బ్రమాదము నొందక విషయానుభవమందుఁ దగులువడక యుండును. మఱి యిట్టిదోషములనే కనుఁగొను చుండుటచే విషయ భోగములం దాసక్తి విడిచి, యప్రమత్తుఁడై యాయా యుచిత కాలమునుదప్పక [2]యాసనజయమును బ్రాణజయమును బడసి,

---

1. సంకల్పమువలన ఆత్మానుగుణములగు వస్తువులెల్ల భోగ్యములుగాఁ దోఁచుచుండును. దానివలన భోగ్యములం దిచ్ఛ-అనఁగా కామము పుట్టును. ఆ కామ మాభోగ్యవస్తువు లందలి గుణములనే తలపోయుచుండుటవలన మఱి మఱి హెచ్చును. వానియందలి దోషములనే కనుఁగొనుచుండినచో అది మిక్కిలి తగ్గునని వివేకి విషయ మిట చెప్పట తెలియనది.

2. చాలసేపు కూర్చుండినను శ్రమనుగలుగనీకుండునట్టి యభ్యాస విశేషమె ఆసనజయము. ప్రాణములను పూరణ రేచ కుంభనముల చేత వశీకరించుటయె ప్రాణజయము.

యలనుఁడు గాక, మెల్లగా మనస్సును శుభాశ్రయ భూతుఁడగు నాయందు నెలకొలిపి సమాధినిష్ఠుఁడు గావలయును. నేను హంస రూపమున నవతరించియుండినపుడు నాకుశిష్యులయినసనకాదులు నావలనయోగమును విని 'సమస్తములయిన విషయముల నుండి మనస్సునాకర్షించి, నాయందే నివేశింపవలయును' అని యింత మాత్రమె దాని నితరుల కుపదేశించిన వారయిరి'-అనెను.

ఉద్ధవుఁడు—'కేశవా ! నీ వేరూపమున సనకాదులకు నెట్లు యోగము నుపదేశించితివో యారూపమును నాకుఁ దెలుపఁ గోరుచున్నాను' అని యడిగెను.

భగవంతుఁడు—[1]హిరణ్యగర్భుండగు బ్రహ్మకు మానసపుత్త్రులయిన సనకాదులు దెలియరానంత సూక్ష్మమై యసాధారణమై యొప్పుయోగము ప్రకారమతనినడిగిరి. వా రతనితో-'ప్రభూ ! మనస్సు శబ్దాదివిషయములందు భోగ్యములని ప్రవేశించు చున్నది. ఆవిషయములును స్మరింపఁబడుచుండుటవలన మనస్సునందుఁ బ్రవేశించుచున్నవి కాని దానినుండి తొలఁగవు. ప్రకృతిబంధ మనర్థమైనదని నిశ్చయించి దానినుండి విముక్తి నొంది విషయముల నత్యంతము దాఁటఁగోరువానికి నా రెండును నొకటినొకటి వీడుట యెట్లు ?—అనఁగా విషయములు మనస్సును విడుచుటయు మనస్సు విషయములను విడుచుటయు నెట్లు? అని సంశయముగా నున్నది' యని యడిగిరి. వా రట్లడుగఁగా భూతభావనుండయిన యా మహా దేవుఁడు బ్రహ్మ దా నెంత యా ప్రశ్నకుఁ బ్రతివచన మాలోచించినను గర్మముచేత జ్ఞానము సంకోచించి సర్వజ్ఞుఁడు కాకుండుట వలనఁ

1. ఇట ప్రస్తావవశమున హంస సనకాది సంవాదము చెప్పఁబడినది.

దెలియ నేరఁడయ్యెను. అపుడా దేవుఁ డా ప్రశ్నము దరిను త్తరింపఁగోరి నన్నుఁదలంచుకొనెను. నేనపు డాతనికడకు హంస రూపమున వచ్చితిని. నన్నుఁజూచి యా సనకాదులు బ్రహ్మను మున్నిడి కొని నాకుఁ బ్రత్యుత్థానాదులుచేసి పాదమున కభి వందనము గావించి తాముడుగవలసిన దానిని విడిచి 'మీరెవ్వ' రని యడిగిరి. ఇట్లామునులు తత్త్వమును దెలియఁగోరి నన్న డుగఁగా, ఉద్ధవా! వారి కేమి చెప్పితినో వినుము. నేను వారితో "విప్రులారా! జగమునంగల చిత్తులు నచిత్తులు నగువస్తువు లన్నియు నాశరీరమై యుండుటచే నవి యన్నియు నే నొక్కఁడ నే యగుదును గాని యవి వెక్కులు వేఱు వేఱు కానేరవు. నన్ను వీడి వేత్తైయున్న చిత్తుగాని యచిత్తుగాని యొకటియు లేక యన్నియు నేనైయై యుండఁగా మీ రెవరని యడుగుట యెట్లు సరిపడును? అడిగినట్టి మీరు మదాత్మకు లగుటచే నేనేయగు దును. మీ రడుగఁగా బదులు చెప్పవలసిన విషయమును సర్వము మదాత్మకముగాన నేనేయగుదును. ఇట్లు, అడుగు వాఁడును బదులుచెప్పువాఁడును బదులుచెప్పవలసిన విషయ మును సర్వము నేనేయైయుండఁగా 'నీవెవ్వ'రని యడుగుట యెట్లుపొసఁగును? నేను సర్వాంతరాత్ముఁడని యెఱిఁగి మీ రిట్ల డిగినది పొసగదయ్యె. మఱి యజ్ఞానమువలన సర్వమును శరీర ముగా నే తలంచినవారడిగిరన్ననో నేను హంసరూపమునఁ బ్రత్య క్షమైతిని. నాకు సజాతీయములగు జంతువులన్నియుఁ బంచ భూతములచే సమానముగా రచితములై యుండఁగా 'మీరెవ్వ?' రని వావిడిచియడుగుటయు నట్టియజ్ఞానులకు సయితమువట్టినిరర్థ కమేయగును. మనస్సుచేతఁగానివాక్కుచేతఁగాని చూపుచేతఁ

గాని మఱి తక్కిన యింద్రియములచేతఁగాని నేనొక్కఁడనే గ్రహింపఁబడుచున్నానుగాని నాకంటె వే ఱొక్కటిగాదని యెఱుంగుము. పుత్త్రులారా! మదాత్మకుఁడగు జీవునకు దేహసంబంధముండునపుడు మనస్సు విషయములందును విషయములు మనస్సునందును జొచ్చుచున్నవి. కనుక నామనస్సును విషయములు నొండొంటిని వీడవు. అందులకు దేహసంబంధమే నిమిత్తము. దేహసంబంధముండఁగా మనస్సు మాటిమాటికి విషయములను సేవించుచుండుట వలన వానియందుఁ జొచ్చుచున్నవి. విషయములును మనస్సునందుఁ జొచ్చుచున్నవి. మనస్సులోపలిది; విషయములు వెలుపలివి. కనుక రెండు నొకటి యం దొకటి చొచ్చుట యెట్లందువా? విషయములు మనస్సునఁ బుట్టుచున్నవి- యనఁగాఁ బూర్వసంసారవశమున దానియందు బ్రకాశించుచున్నవి; దానివలననే మనస్సును వానిని విషయీకరించుచునుండును. ఈ విషయములు మనస్సునందు మిక్కిలి యుఁబాఁదుకొని వెడలిపోవకుండును. నారూపమును జింతించుచుండినయెడల మనస్సును విషయములును రెండు నొండొంటిని వీడుచున్నది. దానివలన దేహసంబంధమును నివర్తించుచున్నది. జాగ్రత్త స్వప్నము సుషుప్తి యని యీమూఁడవస్థలును బ్రకృతిగుణములవలనఁ గలిగి యంతఃకరణవ్యాపారనిమిత్తములై యుండును. జీవుఁ డావ్యాపారములకెల్ల విలక్షణుఁడు. వాఁడు వానికెల్ల సాక్షిగానుండునని చెప్పఁబడుచున్నాఁడు. జీవునకు దేహసంబంధరూపమగు సంసారబంధము మనస్సునకు శబ్దాదివిషయములందు భోగ్యము లనెడి బుద్ధిని గలిగించుచున్నది. ప్రకృతి వివిక్తుఁడును మదాత్మకుఁడు నగు

జీవునకు స్వరూపముచే జాగరాదులగు మూఁడవస్థలుగలుగవు. అట్టి యాత్మ స్వరూపమును గల రూపున ననుసంధించుచుండిన యెడల విషయములందు భోగ్యము లనుబుద్ధి వీడును. అది వీడఁగా విషయములును మనస్సును బరస్పర మావేశించుట వీడును. దానివలన దేహసంబంధము వీడును. దానిచేత విషయ సుఖదుఃఖములెల్ల వీడి నిరతిశయానందప్రాప్తి గలుగును. అనాదియగునహంకారముచేత నాత్మకు బంధము గావింపఁబడినది. ఆబంధము పరమపురుషార్థమును విఘాతము సేయునట్టిది. దీని నెఱింగినవాఁడు సంసారబంధము నెడ విరక్తినొంది జాగరాదుల నెడుమూఁడవస్థలనతిక్రమించియున్న యాత్మస్వరూపమునందు నెలకొని సంసారబంధమునుండి యెట్లు విడివడుదునాయను చింత దిగవిడువవలయును. పురుషునకు దేవుఁడని మనుష్యుఁడని నానావిధముల నాత్మయున్నదని తప్పఁదలంచినట్టిబుద్ధి దేహాత్మలకు భేదమును బ్రతిపాదించు యుక్తులచేత నివర్తింపకుండువఱకును, స్వప్నము గనుచుండువాఁడు దానిని స్వప్నమని తలఁపక జాగరమనియే తప్పఁదలంచునట్లు, అట్టివాఁడు జాగరావస్థయందుండినను సుప్తునివలె నజ్ఞుఁడేయగును. ఎప్పుడునుజ్ఞానైకరూపుఁడై యుండునాత్మకు నితరములైన దేవమనుష్యాద్యాకారములు లేవని ముక్తాత్మ స్వదర్శనముచేతఁ దెలియును కనుక నా దేవాదిశరీరములచే, బాలుఁడు వయసుకాఁడు బ్రాహ్మణుఁడు ననియివి మొదలుగాఁగలుగు భేదమును వానిబుద్ధులును దానికి హేతువులయిన యితరములగు దోషములును స్వప్నమును గాంచువాఁడందుఁ గనినవిషయములను మేలుకొనఁగాఁ గల్లలని తెలియునట్లు, ముక్తాత్మకు ననిత్యము లని తోఁచును.

జీవుఁడు జాగరావస్థయందుఁ బ్రతిక్షణమును బరిణామ మొందుచు సుఖదుఃఖాదులను గలిగించుచుండుటయే ధర్మముగాఁగల శబ్దాది విషయములను ననుభవించుచున్నాఁడు. స్వప్నమం దా జాగ రావస్థయం దనుభవించిన వానికి సదృశములయిన విషయ ముల ననుభవించుచున్నాఁడు. సుషుప్తియం దా విషయభోగ ముల నుపసంహరించుచున్నాఁడు. ఈ మూఁ డవస్థలయందును జీవుఁడొక్కఁడేకాని యొక్కొక్క యవస్థకును నొక్కొక్క జీవుఁడుగాఁడు. ఎట్లన నిదురించునట్టి నేనే మేలుకొంటినని స్మృ తి యాజీవునికిఁ గలిగియున్నది గాన, యాయవస్థలన్నిట జీవుఁ డొక్కఁడేకావలయును. మఱి యాజీవుఁడు కర్మనిమిత్తములగు ప్రాకృతేంద్రియములను బ్రవర్తించుచుండునుగానఁ ద్రిగుణవృ త్తులయిన జాగరాదులకు ద్రష్టయై యుండును. మనస్సునకుఁగలి గెడి యీ మూఁడవస్థలును వానివాని కర్మమున కనుగుణమ యిన నాసంకల్పముచేత మనోనిష్ఠములయిన సత్త్వాది గుణముల ను బట్టి నాయందుఁ (అనఁగా మదాత్మకుఁడయిన జీవునియందు) జేయఁబడినవనియిట్లు విచారించి నాప్రాప్తికి సాధనమగు నాయు పాసనమే పరమప్రయోజనమను విషయము నిశ్చయించి హృద యమందుఁగల సకలసంశయము లనెడివ్యాధిని ననుమానము చేతను వేదాంతవిచారవైరాగ్యములచేతను వాఁడియగు జ్ఞాన మనెడు కత్తిచేతను ద్రుంచి నన్నుభజింపుఁడు. ఈ దేవాది శరీర ములును దన కుపభోగ్యములయిన విషయములన్నియును దామే యాత్మలన్నియు భోగ్యములనియు భ్రమము గలిగించుచుండు ను. వాని వలన మనస్సునకు సంకల్పవికల్పములు గలుగుచుం డును.దాని సాధనమును, దృష్టముగాని సాధ్యములు, వినష్టము

తే. అవి మిక్కిలియుఁదిరుగుచున్న కొఱవిచక్రమువలె నుండును; కనుక నీచందము లయినవిగా ననుమానింపవలయును. మఱి యు జీవస్వరూపము జ్ఞానైక స్వరూపమయ్యును మనుష్యాది రూపములచేఁ బెక్కువిధములుగాఁ దోఁచుచున్నది. దాని స్వరూపమునకు నట్టి భేదములు లేవు. ఆదేవమనుష్యాది భేదమును మూఁడువిధము లయినవి. అది సత్త్వాదిగుణపరిణామముచేతఁ గావింపఁబడినది; సర్వజ్ఞుండును సర్వశక్తియు నగుభగవంతుని ప్రకృతిచేత స్వప్నమువలెఁ జేయఁబడినది. అనఁగా మనస్సునకు స్వప్నము దోఁచుచున్నను మేలుకొనఁగా నది నివర్తించునట్లు ఆత్మపరమాత్మల స్వరూపము ననుసంధించు నట్టివానికి నాత్మగతములని తోఁచునవియెల్ల నాత్మోపాసనము వలన నివర్తించుచున్నవి. ఆశబ్దాదివిషయముల వలన నుండి చూపును మరల్చి యాబాహ్యవిషయములను గ్రహింపక విషయాభిలాషము నుడిగి వ్యాపారములుమాని సమాధియందు నిజసుఖానుభవము చేయుచు దేహానుచింతనమే లేక మిన్నకయుండవలయును. ఇటువంటి వానికిఁ బూర్వ మనాత్మయని దిగవిడిచిన యీదేహాదులు సమాధితప్పఁ దక్కినశయనాసన భోజనాదిదశలయందు ననుసంధింపఁ బడుచున్నను వాని సమాధిని జలింపఁజేయఁ జాలవు. మఱివానికి దేహాంతరప్రాప్తి మూలమగు దేహాత్మాభిమానభ్రమమును గలిగింపఁజాలదు. మఱి భగవంతుని ధ్యానము మాత్రము శరీరము నశించువఱకును జేయుచుండ వలయును. లేనిచో మనస్సు కాలుష్యము నొందునుగాన సమాధియె జాఱిపోవును. మద్యపానము వలని మత్తుచేత వివేకరహితుఁడగు వాఁడు తాను ధరించిన వస్త్రము దైవికముగాఁ దనదేహమునందే యుండినను

గాని తొలఁగినను గాని తెలియడు. అట్లే సమాధి చక్కఁగా నొడఁగూడిన వాఁడు హేయమైనట్టి యీదేహము గూర్చున్నదియు లేచియున్నదియు ననుసంధింపఁడు. ఏలనఁగా వానికి సమాధిదశయందు నిష్కృష్టమైన యాత్మస్వరూపము సాక్షాత్కరించుచుండును గాన దేహము నెంతమాత్రము తెలియ నక్కఱలేదు. సమాధి నిష్పన్నమయినపుడు, దేహమునకు వేఱు పని లేనందున యోగికది నశించునా? కొంతకాలము వఱకుండునా? యని సంశయింపవలదు. దేహము సత్తాస్థితి ప్రవృత్త్యంతరాత్మయగు నాయధీనములు. సమాధినిష్పత్తియు నాసంకల్పమువలననే కలుగును. కనుకఁ దన దేహమునకుఁ బ్రారబ్ధ కర్మమున్నంతవఱకును బ్రాణములతో నెలకొనియే యుండును జ్ఞాని దేహమును దదితరుల దేహమును బ్రారబ్ధకర్మమున్నంతవఱకు నుండునుగాన యీరెంటికిని విశేషమేమి? యనవలదు. సమాధియోగమును బ్రాపించినవాఁడు తన యాత్మవస్తువును సాక్షాత్కరించినవాఁ డగును, గాన స్వప్నమువలె ననిత్యమైన యాదేహమును దాని యనుబంధులనును మరలఁ బొందఁడు. ఇతరుఁ డన్ననో మరల దేహాంతరమును బొందుచున్నాఁడు. విప్రులారా! [1]సాంఖ్యమునందును యోగమునందును గుహ్యమయిన యీ విషయమునంతయును మీకుఁ జెప్పితిని. మీకు మోక్షధర్మమును జెప్పంగోరి యజ్ఞనిర్వాహకుఁడగు శ్రీవిష్ణుండను నేను మీకడకు వచ్చితినని తెలియుఁడు. నేను సాంఖ్యమునకును యోగమునకును సత్యమునకును బుణ్యా

1. సాంఖ్యమనఁగా తత్త్వత్రయవిభాగపూర్వకముగా బ్రహ్మాత్మకమగు స్వాత్మనుపాసించుట యోగమనఁగా భగవదుపాసనము.

కర్మమునకును దేజమునకును శ్రీకిని గీర్తికిని శమమునకును, ముఖ్యమయినయాశ్రయమగుదును. వానికెల్ల నేనే ప్రవర్తకుండునగుదును. హేయగుణములు లేనివాఁడును, స్వార్థమునపేక్షింపక పరదుఃఖముల నిరాకరింపఁ గోరుచుండు వాఁడును నాత్మస్వరూపుండును, గావుననే ప్రియుండును సుహృదుండును నగు నన్ను సామ్యము (వైషమ్యము లేమి) ఆనందము మొదలయిన కల్యాణ గుణములన్నియును సేవించుచుండును. ఇట్లు సనకాదులయిన మునులు నావలన సందేహములనెల్ల బోఁగొట్టుకొన్నవారై పరమంబగుభక్తిచేత నన్నుఁజక్కఁగా నారాధించి స్తోత్రములచేత స్తుతించిరి. ఇట్లు హంసరూపుండగు నే నాసనకాదులచేతఁ జక్కఁగా బూజితుండనై యాపరమర్షులు స్తుతించుచుండఁగా బ్రహ్మ చూచుచుండఁగానే నా స్థానమునకుఁ బోయినవాఁడనయితిని. ఇది పదుమూఁడవయధ్యాయము.

---

{ భగవంతుఁడు మోక్ష పురుషార్థము తన్నుఁదప్ప మఱిదేనిని గుఱించినది కాదని నిర్ణయించుట. }

ఉద్ధవుఁడు—కృష్ణా! 'వేదాధ్యయనాధ్యాపనపరు లగుబ్రహ్మవాదులు ధర్మము అర్థము కామము మోక్షము మొదలుగా శ్రేయములను బెక్కింటిని జెప్పెదరు. స్వామీ! నీవు ఫలాపేక్షారహితమైన భక్తియోగమే మోక్షసాధనముగా నుదాహరించి యున్నావు. వీనియం దేదేని యొకదానిని ముఖ్యముగాఁ గొనవచ్చునా? లేక యొక్కటిమాత్రమే ముఖ్యమైనదా? ఆభక్తియోగముచేత సర్వవిషయములనుండిసంగమును

ద్రోసిపుచ్చి మనస్సు నీయందే యావేశించుచున్నది. అట్టి భక్తియే ముఖ్యమైనదా' ? యని యడిగెను.

భగవంతుఁడు—ప్రాకృత ప్రలయము వచ్చినపుడు వేదమ నెడి నావాణి తన్నుఁజదువువారును జదివించువారును లేనికాల మునఁ బుట్టి దాని వర్ణపరంపరల యథావస్థితి మాని నశించిన దయ్యె. నేను దొల్లి దానిని బ్రహ్మకుఁ గలరూపున నుపదేశించి తిని. అందు నాస్వరూపమైన ధర్మము ప్రకటితమై యున్నది. ఆబ్రహ్మయుఁ దనప్రథమ పుత్త్రుఁడగు మనువునకు దానిని నుప దేశించెను. ఆమనువువలననుండి సప్తబ్రహ్మలగు భృగువు మొద లయిన మహర్షులు గ్రహించిరి. ఆ తండ్రులవలననుండి వారి పుత్త్రులగు దేవతలు దానవులు గుహ్యకులు మనుష్యులు సిద్ధులు గంధర్వులు విద్యాధరులు చారణులు కిందేవులు కిన్నరులు నాగులు రాక్షసులు కింపురుషులు మొదలగువారు పడసిరి. వారిస్వభావము లనేకములు. అవి రజస్సత్త్వ తమము లవలనఁ బుట్టినవి. అట్టి స్వభావముచేతఁ బ్రాణులకు మతములు భేదిల్లుచున్నవి. ఎల్లవారికిని దమతమ స్వభావమున కనుగుణము గావాక్కులును నానావిధములుగాఁ బ్రవహించుచున్నవిగదా. ఇట్లు స్వభావములు విచిత్రము లగుటంబట్టి మనుష్యులకును దేవాదులకును మతములుగూడ భేదము నొందుచున్నవి. మఱికొందఱు వేదము లపౌరుషేయము లని దానికి విరుద్ధార్థ ములను గల్పించుచుండు మూలపురుషులనుండి పరంపరగా నుపదేశమునొందుటవలనఁ బాషండమతములు గలవారయిరి. పురుషసత్తమా ! కొందఱు పురుషులు నామాయచేత బుద్ధి మోహమునొందఁగాఁ దమతమ రుచులచొప్పునను దమతమ

కర్మముల కనుగుణముగాను, శ్రేయమనుటకు నానావిధములయి నవానిని జెప్పుచున్నారు.*కొందఱు ధర్మమును కొందఱు యశమును గొందఱు కామమును మఱికొందఱు సత్యదమశమములను శ్రేయముగాఁజెప్పెదరు. కొంద ఱైశ్వర్యమునుగొందఱు సొంపుగా భోజనముసేయుటను బురుషార్థముగాఁ జెప్పెదరు. కొందఱర్థమును గొందఱు కర్మములను మఱికొంద ఱిష్టాపూర్తములను నిట్లే వారువారు యజ్ఞములను దపమును దానమును శౌచాది నియమములను నింద్రియ నియమాదియమములను బురుషార్థోపాయములుగాఁ జెప్పెదరు. ఈ ధర్మాదులకుఁ గల ఫలము లాద్యంతములు గలవియేకాని సతములుగావు. ఏలన, నివి కర్మములచేత సంపాదింపఁబడినవి;మఱి తమకు మూలమైన కర్మము క్షీణించినపిదప దుఃఖమె యొసంగునవి. ఇవి యెల్ల మోహమందుఁ బర్యవసించుచుండును. మఱి వీనివలనఁ గలుగు నానందమో క్షుద్రము. వీని ననుభవించునపుడును బతనభయము గలుగుచుండుటచే శోకముతోఁగూడియె యుండును. సభ్యా! నిత్య నిరతిశ యానందస్వరూపుఁడ నగు నాయందు మనస్సును నెలకొలిపి సమస్తములయిన విషయసుఖములు క్షుద్రములుగావున వానియం దపేక్ష మాని యున్నపురుషునకు

* పూర్వ మీమాంసకులకు ధర్మమే పురుషార్థము. కావ్యాలంకారికులకు యశస్సు. కామతంత్ర ప్రణేతలకుఁ గామము. యోగులకుసత్యశమదమములు. నీతిశాస్త్రవిదులకు ఐశ్వర్యము. చార్వాకులకు విభవభోజనము· వీరు 'భస్మీభూతస్యదేహస్య పునరాగమనఁకుతః । తస్మాత్సర్వ ప్రయత్నేన ఋణం కృత్వా ఘృతంపిబేత్' అందురు. త్రయీమతానుసారులు కొందఱు యజ్ఞాదులు పురుషార్థ సాధనములుగాఁ జెప్పుదురు.

నావలనఁ గలుగునట్టి సుఖము విషయాత్ము లగు వారికి నెట్లు గలుగును? నాచేత మనస్సునందు సంతుష్టినొంది, సమస్తము నందు నాభావమె మనస్సునఁగలిగి, యభిలషింపఁదగినది మఱి యొక్కటియు లేక, దాంతియు శాంతియుఁ గలిగియుండువానికి సమస్తములయినదిశలునుగాలావస్థములును సుఖమయములుగా నుండును. నాయందు మనస్సర్పించియుండు నట్టి వాఁడు నన్నుఁ దప్ప మఱి బ్రహ్మాధిపత్యముగాని, మహేంద్ర పదవిగాని, సమస్త భూమండలాధిపత్యము గాని, పాతాళైశ్వర్యముగాని యోగ సిద్ధులయిన యణిమాదులుగాని, వేయేల మోక్షముగాని యెంత మాత్రను నొల్లఁడు. నాకు,నా దేహముగాని నాపుత్త్రుఁడగు బ్రహ్మగాని,మనుమఁడగు శంకరుఁడుఁగాని, తోఁడబుట్టువగు బలరాముఁడుగాని,యిల్లాలగుశ్రీదేవిగాని, నీబోఁటిభక్తునివలెఁ బ్రియతములుఁగారు. నన్నుఁదప్ప మఱిదేనినపేక్షింపక నా స్వరూపగుణాదులనే మననము సేయుచు శాంతుఁడై ,సర్వత్ర నాభావముగలిగి యుండుటంబట్టి వైరము లేక యుండునట్టి వానిని నేను నిత్యము వెంటనంటుచుందును ఏలన, వాఁడుచూచినది కాని తాఁకినది కాని యొక్కొక్కటియు నాపద రేణువులచేఁ బవిత్రమగుగాక యనియ ట్లుచేయుచుందును. నేనుదప్పఁగోరఁదగినది వేఱొక్కటియు లేక, నాయందే యనురక్తి మనంబులఁ గలిగి, శాంతులై సమస్త జీవులందును నాభావము గలిగి యుండుటచే దయాళువులైన సాధువుల బుద్ధికిఁ గామను లెంతమాత్ర మంటవు. అట్టి వారు నన్ననుభవించుటవలని సుఖమును ననుభవించుచుం దురు ; మోక్షసుఖమును నైతము నన్ననుభవించుటకు సాటిగాఁ దలఁపరు గాన దాని నెంతమాత్రము పాటింపరు. భక్తియో

గమును ప్రారంభించినట్టివాఁడింకను నింద్రియములను జయింప శుండును. కాని ప్రతిదినమును భక్తి పెరుగుచుండుటం బట్టి విషయములకుఁ గ్రిందుపడక యుండును. అగ్ని పయి పయిని మంటలు రగులుకొనఁగాఁ గట్టియలను నీఱుగావించునట్లు, ఉద్ధవా! నన్ను గుఱించిన భక్తియుఁ బాపము నెల్లను సమూలముగా నాశముసేయును. నాయందుఁ బ్రవృద్ధమైయున్న భక్తివలె, ధర్మముగానిసాంఖ్యముగాని యోగముగాని స్వాధ్యాయముగాని తపముగాని త్యాగముగాని నన్ను సాధింప నేరదు. ఏకరూపమైన భక్తియొక్కటిచేతనే నన్ను గ్రహించుటశక్యము. నేను బ్రియులకు నాత్మ గావున మిక్కిలి ప్రియతముఁడను. కనుక వారిభక్తికే చిక్కుదునుగాని మఱియొకదానికిఁ బట్టువడను. నాయందు నెలకొన్న భక్తి కుక్కను దిను బోయవారినయినను, వారి జాతిదోషమునుండి పరిశుద్ధులను గావించును జుమీ. ధర్మమును సత్యమును దయయుఁ గలిగియుండియు విద్యతోడను దపస్సుతోడను గూడి యుండియు, నాభక్తియొక్కటి లేకుండినచో నట్టివాని యాత్మ నది చక్కగాఁ బరిశుద్ధము గావింపదు చుమీ. మేనియందుఁ బులకలు పుట్టకయు, మనస్సు నీరుగాఁ గరంగకయుఁ, గన్నులయం దానందాశ్రుబిందువులు గ్రమ్ముకొనకయు, నూరక భక్తి యెట్లు పుట్టినదని తెలియవచ్చును? భక్తి లేక యంతఃకరణ మెట్లు శుద్ధమగును? ఎవనికి పలుకు డగ్గుత్తికపడునో, మనస్సు కరఁగునో, ఎవ్వఁ డొకానొకప్పుడేడ్చునో, మాటిమాటికి నవ్వుచుండునో, ఎవ్వఁడొక్కయెడ సిగ్గువీడి బిగ్గరఁ బాడుచుండునో, మఱియొక్కెడ నాడుచుండునో, వాఁడే నాయందలి భక్తిగలవాఁడు. వాఁడు

భువనమును దన యాత్మణస్పర్శనాదులచేతఁ బరిశుద్ధముచేయును. బంగారము నిప్పునందుఁగాఁచి పటకారుతోఁ బట్టి యూఁదఁగా నది తనయందలి మలమును వీడి తన యెప్పటి రూపము నొంది తలతల మెఱయుచుండును. అట్లె జీవుఁడు నాయందలి భక్తిచేత జ్ఞానమును గప్పునదై యనుభవింపఁగా మిగిలియున్న కర్మమును దూలంబుచ్చి నన్నుఁబొంది స్వస్వరూపమును బొందుచున్నాఁడు. ఈజీవుఁడు నాపుణ్యచరిత్రములను వినుటచేతను జెప్పుటచేతను గర్మములను దూల్చి పరిశుద్ధినొందు చువచ్చును. అపుడు వాఁడు బ్రకృతియు దానికంటె సూక్ష్మమగు జీవుఁడును వానికంటె సూక్ష్ముఁడగు నీశ్వరుఁడును ననుమూఁడు తత్త్వములను, తెవులుచేఁ గంటిచూపు చెడియున్నవానికి మందు కాటుక కలికము వేయఁగా నది దోషము వీడి రూపమును గ్రహించినట్లు-ఆమూఁడు తత్త్వములను గర్మరూపదోషములు వీడుటవలన గలరూపున వివేచించి కనుఁగొనుచున్నాఁడు. విషయములనే తలపోయుచుండిన యెడల మనుజునకు మనస్సు విషయములందే మిక్కిలి తగులుపడుచున్నది. నన్నే స్మరించుచుండు వానికి మనస్సు నాయందే మిక్కిలి లయించుచున్నది. ఇట్లు నా చరిత్రములను వినుట మొదలగు వాని వలననే క్రమముగా భక్తిపుట్టుట వలన, స్వప్నమందలి కోరికలవలె నస్థిరములయిన శబ్దాది విషయములను ధ్యానించుచుండుటను మాని నాయందలి భక్తి కలుగునట్లుగా మనస్సును నాయందే శ్రవణాదులచేతఁ గ్రమముగా సమాహితము చేయుము. స్త్రీలతోడను వారితోడి సంగము గల వారితోడను బొత్తు దూరముగాఁ దొలఁగవిడిచి యింద్రియములను మెల్లగా వశము

చేసికొని నిర్భయమును నిర్జనమునయిన దేశమునందు గూర్చుండి యలసత లేక నన్నుఁ జింతింప వలయును. స్త్రీలతోడి పొత్తువలనను స్త్రీ సంగము గలవారి వలనను గలుగునట్లుగా దక్కిన వారితోడి ప్రసక్తివలనఁ గ్లేశమును బంధమును గలుగనేరవు' అనెను.

ఉద్ధవుఁడు.—'అరవిందాక్షా! నిన్నే ధ్యానప్రకారమున నెట్టి విగ్రహముగలవానినిగా నెట్టి యాత్మస్వరూపముతోఁ గూడినవానినిగా ముముక్షు వగువాఁడు ధ్యానము చేయవలయునో యాధ్యానస్వరూపమును నాకుఁ జెప్పవలయును' అని యడిగెను. భగవంతుఁడు— సమమయిన ప్రదేశమందు నేదయినను బఱచుకొని స్వస్తికము కమలము మొదలగు నాసనములలో నొకటి గయికొని సుఖముగాఁ గూర్చుండ వలయును. అపుడు దేహమును జక్కఁగా నిలువఁ బెట్టుకొని చేతులను దొడలయందిడి, ముక్కుకొనయందుఁ జూపు నెలకొలుపవలయును. మఱి పూరక రేచక కుంభకముల చేత, ఇడాపింగళానాడి రంధ్రరూపముగా నున్న ప్రాణవాయు సంచారమార్గమును బరిశుద్ధము చేయవలయును. మరలఁ దలక్రిందుగా రేచకపూరకకుంభక క్రమమునఁ బ్రాణమార్గమును బరిశుద్ధము సేయుటను మెల్లమెల్లగా నింద్రియముల నియమనముతో నభ్యసించుచు రావలయును. మఱి హృదయమందు ఘంటానాదమువలె నవిచ్ఛిన్నముగా మ్రోఁగుచుఁ దామరతూఁడులోని సన్నని పోఁగువలె సూక్ష్మమైయున్న యోంకారమును నట్టిదిగా ననుసంధించి యంతఁ బ్రాణమనెడి వాయువుచేత (లేపి దానిచేత) లేచినట్లుగా ధ్యానించి మరల హృదయమందు నోంకారమునంతయుఁ బ్రవే

ంచినదిగా ధ్యానింపవలయును. ఇట్లు ప్రణవానుసంధానము తోఁ గూడునట్లుగా మూఁడు సంధ్యలయందును బదిమాఱులు ప్రాణసంయమము నభ్యసింపవలయును. ఇట్లు చేయుచురాఁగా మాసమునకు లోపలనే బ్రాణవాయువును జయించినవాఁ డగు చున్నాఁడు. *ఇది ధ్యానింపవలసిన విధము. శరీరములోపల హృదయకమలము తూఁడు పయిగాను ముఖము క్రిందుగాను గలిగి ముకుళించినయరఁటి పువ్వువలె వ్రేలుచుండును. దానినూర్ధ్వముఖమును నధోనాళమును నున్నిద్రమును నష్టపత్రమును సకర్ణికము నయినదానినిగా ధ్యానించి దానియందు సూర్యసోమాగ్నులను వారి మండలములను నొకటిమీఁద నొకటిగా నున్నట్లు చింతింపవలయును. పిదప నాయగ్ని మండలము నడుమ ధ్యానమునకు శుభాశ్రయరూపంబయిన నాయీరూపమును స్మరింపవలయును. నల్లని వాఁడును బ్రశాంతుఁడును జక్కని ముఖము గలవాఁడును, నిడుదలయి యందములయిన నాలుగు భుజములు గలవాఁడును మిక్కిలి సొబగయిన వానియందు సొబగయిన కుత్తుకగలవాఁడును జక్కని చెక్కిళ్లుగలవాఁడును దెల్లని చిఱునవ్వు గలవాఁడును, సమానములగు కర్ణములందుఁ దోఁడుగఁగా మిక్కిలి స్ఫురించుచున్న మకరకుండలములు గలవాఁడును బంగారువలువ గలవాఁడును మేఘశ్యాముఁడును, శ్రీవత్సమునకును శ్రీదేవికిని నివాసమైనవాఁడును శంఖచక్రగదాపద్మవనమాలావిభూషితుఁడును, పాదములందునూపురములు విలసిల్లువాఁడును గౌస్తుభకాంతులతోఁ గూడినవాఁడు

---

* ఇంతవఱకు ధ్యానాంగములు చెప్పి యిఁక ధ్యేయముయొక్క స్థానమును ధ్యానించు ప్రకారమును జెప్పుచున్నాఁడు.

ను, ప్రకాశించుచున్న కిరీటమును గటిసూత్రమును గటకము లును బాహుపురులును గలవాఁడును సర్వాంగసుందరుఁడును మనోహరుండును బ్రసాదనముఖము లయిన చూపులుగలవాఁడును సుకుమారుండునునగు నాదురూపమునందలి పాదములు మొదలుకొని శిరసువఱకుఁ గల యంగము లన్నింటియందును మనస్సును ధారణముచేసి ధ్యానము సేయవలయును. ఇంద్రియములను మనస్సుచేత శబ్దాదివిషయములనుండి యీడ్చికొని సారథి యగు బుద్ధిచేత ధీరుండగువాఁడు మనస్సును నిరతిశయానందావహుఁడయిన నాయందు సమాహితము గావింపవలయును. ఇట్లు భగవంతుని దివ్యవిగ్రహమునం దంతటను వ్యాపించునట్టి మనస్సును బట్టి లాగి దానిని నొక్క యంగమునందే నెలకొలుపవలయును. అపుడు తక్కిన యంగములను జింతింపరాదు. మిక్కిలియుఁజిఱునవ్వు దొలఁకుచుండునట్టి నాముఖమును విశేషించి చింతనము సేయవలయును. అందు మనస్సు చిరకాలము నెలకొని యనుభవించిన పిదప దానిని లాగి వ్యోమమునందు (అనఁగా వ్యోమమువలె నిర్మలమును నపరిచ్ఛిన్నమును నిరస్త నిఖిలదోషమును సమస్త కల్యాణానంతత్వాదిగుణగణయుక్తము నగు దివ్యాత్మస్వరూపమందు) ధరింపవలయును. పిదప నాస్వరూపరూపముల ననుసంధానముసేయుచు నాధారణమును దిగవిడిచి మఱి యేదియును (అనఁగా ధ్యేయమును దప్పఁ దక్కిన ధ్యాతృధ్యానక్రియాదుల నొక్కటినిని) జింతింపరాదు. ఇట్లు సమాహితచిత్తుండై సమస్తమున కాత్మభూతుండ నగు నాయందుఁ దన్నును, బ్రత్యగాత్మ యగు తనయందు న న్నును, సూర్యాదుల ప్రభను దీపాదిజ్యోతులందును, గూడియు

న్నటువలెఁ జూచుచున్నాఁడు. అంత గాయములచేతఁ గొట్టు పడక మిక్కిలియుఁ దీవ్రమయినట్టి యిట్టి ధ్యానముచేత మనస్సు నీచందమున సమాహితము గావించునట్టి యోగికి ద్రవ్యములగు పంచభూతములచేతను జ్ఞానకర్మేంద్రియములచేతను రచితమైన దేహమే యాత్మ యనియు, ఆత్మ స్వతంత్రమనియును గలిగియుండు భ్రమము వేగ నాశము నొందుచున్నది. ఇది పదునాలుగవయధ్యాయము.

---

సమాధిపర్యంతమగు ధ్యానయోగమునకు ముక్తియేకాక యణిమాదిసిద్ధులును ఫలములగు నని చెప్పుట.

శ్రీభగవంతుఁడు—'బాహ్యేంద్రియములను జయించినవాఁడును గావుననే స్థిరచిత్తుండును బ్రాణములను జయించినవాఁడును నాయందు మనస్సును ధారణము చేయు వాఁడును నగు యోగికి సిద్ధులన్నియు నుపస్థితములగు చున్నవి' యనెను. ఉద్ధవుఁడు— 'అచ్యుతా! ఏధారణచేత నేసిద్ధి యేవిధమునఁ గలుగుచున్నది. సిద్ధులెన్ని? నీవు యోగులకు సిద్ధిప్రదుఁడవు కావున దీనినిఁ జెప్పు'మని యడిగెను. భగవంతుఁడు—ధారణాయోగమందుఁ బారంగతు లయినవారు సిద్ధులు పదునెనిమిది గలవని చెప్పియున్నారు. అందు నెనిమిదింటికి నాప్రాప్తియే ముఖ్య ప్రయోజనముగా నుండును. తక్కిన పది విషయానుభవమునకు హేతువులయినవి. ఆసిద్ధులివి - దేహమునకు నణిమయు (అణుత్వమును) మహిమయును (మహత్త్వమును) లఘిమయుఁ (దేలికయు) (ప్రాణులింద్రియములచేత నాయావిషయము లనుభవించుట యనెడి) ప్రాప్తియు (శ్రుతములగు పారలౌకికములం

దును దర్శనయోగ్యములగు నైహికములందును దక్కిన వారి కంటె నతిశయించి యుండుట యనెడి) ప్రాకామ్యమును (సమస్తమునకు సామర్థ్యమును గూర్చునట్టి యీశిత్వమును(గుణములయందు సంగములేకుండుట యనెడి) వశిత్వమును, ఏసుఖమునందుఁ దక్కిన కామములు సముద్రమందునీటిబొట్టువలెలయమునొందునో యట్టి సుఖమును-అని యీ యెనిమిది సిద్ధులును సమాధియోగ నిష్పత్తిగలవానికి (నిప్పునకుఁ బైకెగయుటయు, వాయువునకు వ్యాపించుటయు నెట్లోయట్లు) స్వభావసిద్ధములై యుండుననని తలంపఁబడును. యోగి కీదేహమునందు నరలుముడుతలు గోని యాఁకలి దప్పులు మొదలగు నూర్ములు లేకుండుటయు,దూరమునందున్న సర్వభూతములశబ్దముల నెఱుంగుటయును దూరశ్రవణమును, దూరమందున్న సర్వవస్తువులసాక్షాత్కరించుటయను దూరదర్శనమును,మనస్సు చన్నచోటికి దేహమును బోవుట యను మనోజవమును, తలఁచినరూపము దాల్చుటయును, పరకాయప్రవేశమును, స్వచ్ఛందమరణమును దేవతలప్సరసలతోఁగ్రీడించుక్రీడలనుబొందుటయు, సంకల్పించినట్లుల్ల సిద్ధినొందుటయు, అడ్డులేని యాజ్ఞయు గతియు, భూతభవిష్యద్వర్తమానకాలములు మూఁటినిని దెలియుటయు, శీతోష్ణాదు లగు ద్వంద్వములకుఁ గీడ్పడకుండుటయుఁ, బరుల చిత్తములను జేష్టలను మొదలగువానిని నెఱుంగుటయును, అగ్నిసూర్యుఁడు జలము విషము మొదలగువానిని స్తంభింపఁజేయుటయు, నపజయము లేకుండుటయు, యోగధారణముచేఁ గలిగెడి-యీసిద్ధు లుద్దేశమునుబట్టి చెప్పఁబడినవి. ఇఁక, నేధారణచేత, నేసిద్ధి యే విధమునఁ గలుగుచున్నదో చెప్పెద

వినుము. ఎవఁడు భూత సూక్ష్మశరీరకుఁ డయిన నాయందు నాభూతసూక్ష్మమును మాత్రముగుఱించిన మనస్సును ధారణ చేయుచున్నాఁడో యట్లు నా శరీరభూతమైన భూతసూక్ష్మమును మాత్ర ముపాసించినట్టివాఁడణిమను నొందుచున్నాఁడు. మహత్తత్త్వముశరీరముగాఁగలిగిన పరమాత్మయగునాయందు విషయాంతరములనుండి మరల్చి చక్కఁగా నెలకొనునట్లు మనస్సును ధారణచేసినవాఁడాకాశాదులకుఁ గల యాయా మహిమమును వేఱువేఱఁ బొందుచున్నాఁడు. భూతముల పరమాణువులందు (సూక్ష్మావయవము లందు) వ్యాపించి నాయందుఁ జిత్తమునుదగులుకొలిపినవాఁడు సూక్ష్మం బగుకాలమునుధ్యానించులఘిమను బొందుచున్నాఁడు. వైకారికాహంకారము శరీరముగాఁగలనాయందుమనస్సు నేకాగ్రముగానుంచిధారణనెవఁడు చేయునో, వాఁడు నాయందేమనస్సుగలిగి, సమస్తప్రాణుల యింద్రియములును వాని వాని విషయములను బ్రాపించునట్టి స్వభావం బగుప్రాప్తిని బొందుచున్నాఁడు.*పెక్కుమణులందుఁ జొచ్చియున్న సూత్రమువలెఁ దనకార్యములు పెక్కింటియందు నాధారముగాఁ జొచ్చియుండునట్టిమహత్తత్త్వమును శరీరముగాఁగల నాయందు మనస్సును ధారణముసేయువాఁడు ప్రాకాశ్యమును (అనఁగా దృష్టాదృష్టములగు సర్వ వ్యాపారములను గుఱించిన జ్ఞానమును) పారమేష్ఠ్యమును (పరమేష్ఠివలె నితరుల

---

*కేవలమహత్తత్త్వమును శరీరముగా నేను గలిగియున్న ట్లుపాసించిన వానికి మహిమమనుసిద్ధి. మహత్తత్త్వమునుసూత్రముగాను అవ్యక్తమునుండిపుట్టినదిగాను నిట్టిగుణవిశేషములతోఁగూడిన ట్లుపాసించినయెడల ప్రాకామ్యాదులు గలుగునని భేదము తెలియునది.

కంటె నతిశయించిన వ్యాపారములను జేయఁజాలి యుండుట
నును) ప్రధానమునుండిపుట్టినయీమహత్తత్త్వమును నాకువిశే
షణముగా నుపాసించుటంబట్టి పడయుచున్నాఁడు. సర్వవ్యాప
కుండును సృష్టి స్థితి లయము లనెడు మూఁడువ్యాపారములకు
నిర్వాహకుండును గాల శరీరకుండు నయిననాయందుఁ జిత్త
మును ధారణచేయువాఁ డీశిత్వమును బొందుచున్నాఁడు.
ఈశిత్వమనఁగా సమస్తములయిన దేహములకును నాత్మలకును
నన్నిటిని గుఱించిన సామర్థ్యమును గలిగించుట యగును.
జాగ్రత్తు స్వప్నము సుషుప్తియనెడి మూఁడవస్థల కవ్వలిదై
తురీయమనఁబడు పరిశుద్ధ జీవాత్మస్వరూపములు శరీరముగాఁ
గలవాఁడును జీవులకుఁ బ్రాప్యమును బ్రాపకమును నాధార
భూతుఁడు నయినవాఁడును, జ్ఞానశక్తి బలైశ్వర్యతేజస్సు లనెడి
యాఱు గుణములచేఁ బూర్ణుఁడగుటంబట్టి భగవచ్ఛబ్దవాచ్యుం
డును నగు నాయందు మనస్సును ధారణచేసి, నాధర్మమగు
వశిత్వమును(గుణములందాసక్తిలేకుండుటను) బొందుచున్నాఁడు.
హేయగుణము లేక కల్యాణగుణములు మిక్కిలి పెచ్చుపెరిఁగి
యున్న నాయందు యోగపరిశుద్ధమగు మనస్సును ధారణము
చేసి పరమానందమును బొందుచున్నాఁడు. ఆ యానందము
నందుఁ దక్కిన కామములన్నియు సమాప్తము లగుచున్నవి.
శ్వేతద్వీపపతియు శుద్ధసత్త్వాత్మకుండును ధర్మనిర్వాహకుండును
నగు నాయందుఁ జిత్తముధారణచేసి యాఁకలి దప్పి మొద
లయిన యూర్ములాఱింటిని గడచినవాఁడై శ్వేతరూపుఁ డగు
చున్నాఁడు. ఆకాశమువలె నిర్మలమును సర్వవ్యాపకమునయిన
యాత్మస్వరూపము గలవాఁడును బ్రాణశరీరకుండు నగు నా

యందు మనస్సుచేతఁ బ్రాణఘోషమును జింతించుచు నాధా
రణయందుఁ గలిగినయుపలబ్ధితోఁ గూడి యీయోగి దూర
మందున్నట్టి భూతములందును నభివ్యక్తము లగువాక్కులను
వినుచున్నాఁడు. చక్షురింద్రియముల కధిష్ఠాతయగు సూర్యుని
యందుఁ జక్షువులనుగూర్చియు, సూర్యుని నాచక్షువునందుఁ
గూర్చి యున్నట్లుగాధ్యానించి య ట్లుభయసంయోగమునపుడు
నన్ను మనస్సుచే ధ్యానించుచు సూక్ష్మదృష్టినొంది సర్వమును
దూరమందున్నను జూచుచున్నాఁడు. నాయందు మొదట మన
స్సును బిదపఁ బ్రాణవాయువుతోడ దేహమును సంయుక్త
మైనదిగా ధ్యానించినచో మన సెచ్చటికిఁ జనునో యచ్చటికి
దేహమును నన్నుగుఱించిన ధారణ ప్రభావముచేతఁ బోవు
చున్నది. మనస్సును నాయందునిలిపి, యేయే దేవాది రూపము
గలవాఁడు గాఁగోరుచున్నాఁడో వానిమనస్సున కభీష్టమయిన
యాయారూపమును బొందుచున్నాఁడు. ఏలన వాఁడు నన్ను
గుఱించి ధారణాయోగముచేత బలము నొంది యుండును
గాన యది సుకరముగా నుండును. పరకాయమును బ్రవేశింపఁ
గోరువాఁడు దానియందుఁ దన్నుండునట్లు చింతనము సేయ
వలయును. పిదపఁ దన దేహమును విడిచి ప్రాణములను నింద్రి
యములను గూడి వాయువునకు సాటియై (వాయువు వెలుపల
నుండి నాసికరంధ్రముల మూలమున లోపలఁబ్రవేశించునట్లును,
దుమ్మెదపువ్వునుండి పువ్వున కనాయాసమునఁ బోవుచున్నట్లును)
దానిని బ్రవేశింపవలయును. పాదమూలముచేత మూలాధార
మును నదిమి ప్రాణమును గ్రమముగాహృదయమునందును ఱొ
మ్మునందును గంఠమునందునుమూర్ధమునందును నిలిపిశిరఃకపాల

ముపగులఁగా నేర్పడినబ్రహ్మరంధ్రము చేతబ్రహ్మమునుబొందించి దేహమును విడువవలయును. దేవతలుక్రీడించు దేవోద్యానాదులయందుఁ గ్రీడింపఁగోరువాఁడు నామూర్తియగుశుద్ధసత్త్వమును జింతింపవలయును; అట్లునాశరీరమైనశుద్ధసత్త్వమందుమనస్సువర్తించుచున్న యాపురుషునికడకు దేవతాస్త్రీలు విమానములతోఁగూడవత్తురు. ఎప్పుడేవిధమునుబుద్ధిచేత సంకల్పించుచున్నాఁడో యపుడువాఁడుమదాసక్తచిత్తుఁడై సత్యసంకల్పుఁడగునాయందు మనస్సును ధారణచేసి తనసంకల్పమున కనురూపమయినదానిని బొందుచున్నాఁడు. సర్వనియంతయును స్వతంత్రుఁడునగు నాదుభావ మగువశిత్వాదులనుబొందినవాఁడు (అనఁగాఁదానుసీశిత్వవశిత్వములను బొందినవాఁడు) ఈశిత్వవశిత్వములతోఁగూడినవానినిగా నన్ను ధ్యానింపఁగా వానికి దేనివలనను విపత్తుగలుగదు. మఱి నాయాజ్ఞవలెనేవానియాజ్ఞయుగతియునడ్డులేకయుండును శుద్ధమయిన యంతఃకరణము గలిగి ధారణయొఱింగినట్టి యోగికి నాభక్తిప్రభావము వలననే కాలత్రయవస్తువులను గుఱించిన జ్ఞానరూపమగు సిద్ధిగలుగును. కాలత్రయమందుఁ గలుగు వస్తువులను గూర్చిన జ్ఞానముగలిగియుండు ముని దేహము యోగప్రచురమైయుండునుగాన యది యగ్ని మొదలగు వానిచేతఁ గీడ్పడక వానినే స్తంభింపఁ జాలియుండును. ఏలన నాముని నాయోగముచేతఁ జిత్తశాంతి నొందియుండునుగాన జలజంతువులకు జలమెట్లో యట్లె యగ్ని మొదలగునవియు నతనికిఁ బ్రతిఘాతకములు గాకుండును. మఱియు శ్రీవత్సముచేతను శంఖచక్రాద్యాయుధములచేతను విభూషితములై ధ్వజములతోను నాతపత్రములతోను వ్యజనములతోను గూడి

యున్న నావిభూతులను ధ్యానించుచుండువానికిం బరాజయ మెన్నఁడును గలుగదు. ఇట్లు యోగధారణచేత నన్నుపాసించుచుండువానికిఁ బూర్వోక్తములయిన సిద్ధు లన్నియును సంప్రాప్తించుచున్నవి. అంతఃకరణమును జయించి బాహ్యేంద్రియములను జయించి ప్రాణములను జయించి నా ధారణ నుధరించుచున్న మునికి సిద్ధి యేది దుర్లభము ? నాయుపాసనమె యుత్తమయోగము. దానిని జేయుచున్న యోగికి నూర్ములు లేకుండుట మొదలయినవి యెల్ల యోగమును జలింపఁజేయునట్టివిగాన మరల సంసారమునకు హేతువులగును. కాన వీనిని విఘ్నములుగా నే యోగవిదు లెఱుంగుదురు. అయిన నణిమాదు లెనిమిది యట్టివిగావు నన్నుపాసనముచేసి దానిచేఁ దమ పారబ్ధాదులు ముగిసినతుదిని నిరతిశయపురుషార్థ రూపుండగు నన్నుఁబొందఁబోవునట్టి వాని కివి కాలక్షేపమునకు హేతువులుగా నుండును, జలజంతువులకు జలస్తంభమును బక్షుల కాకాశగమనమును మొదలగువానింబోలె జన్మముచేత నే కొన్ని సిద్ధులు గలుగుటయుఁ గలదు. అట్లు జన్మము చేతను నోషధులచేతను దపముచేతనుమంత్రముచేతను నిందెన్నిసిద్ధులుగలుగుచున్న వో యా యన్నియును నా యుపాసన మనెడు యోగముచేతఁ బొందుచున్నాఁడు. దేవాదిజన్మములు మొదలగు వానిచేత నాయా సిద్ధులు సులభము లని తలఁచి యోగము నాజన్మౌషధాదులకు వినియోగించి నా విషయముగా దానిని వినియోగింపక త్యజించుట తగదు. నన్నుపాసనము సేయుచున్నచో సమస్తములయిన సిద్ధులకును నేను బ్రాపకుండను బాలకుండను నిర్వాహకుండను. ఈ సిద్ధులకే కాదు. ప్రకృతి వివిక్తాత్మ

పాసనరూపమైనసాంఖ్యమునకు మదుపాసన రూపమైనయోగమునకును నేనట్టివాఁడనగుదును బ్రహ్మాదులకును స్వర్గాదులను గలిగించుయజ్ఞాదిధర్మములకును నేనట్టివాఁడను. ఏలయందువా? నేను సమస్తములయినజీవులకును నంతర్యామియైన యాత్మను. ఆత్మయైనమాత్రమునఁ బరిచ్ఛిన్నుండనుగాను; వానికి వెలుపల వ్యాపించియుందును. కాఁబట్టియె నాకుఁబరిచ్ఛేదములేదు. దేవమనుష్యాదిభూతములయందు నాకాశాది భూతములలోపలను వెలుపలనువ్యాపించి వర్తించుచున్నట్లె నేనున్నవాఁడను. ఇది పదునేనవయధ్యాయము.

---

శ్రీ కృష్ణుఁడు తన విభూతుల నుద్ధవునకుఁ జెప్పుట.

ఉద్ధవుఁడు—నీవు సాక్షాత్పరబ్రహ్మమవు. నీకుత్పత్తి వినాశములు లేవు. నిన్నుఁ గర్మము లావరింపవు. ఇట్టివాఁడవు గనుక నీవు సమస్తములయిన వస్తువులకును మోక్షోపయుక్తమగు జ్ఞానము నొసంగి యాత్మనుజ్జీవింపఁజేయుదువు. వానికిఁ బాలనమును బ్రలయమును నుత్పత్తియును నీవలననే కలుగుచున్నవి. జితేంద్రియులు గానివారికి నిన్నుఁదెలియుట మిక్కిలి కష్టమైనను వేదాంతవిదు లెక్కువతక్కువలుగా నుండు భూతములందు నిన్ను సమస్త భూతముల యుత్పత్తిస్థితి ప్రవృత్తులకు హేతుభూతుఁడవని నీ యథావస్థిత మయిన యాకారమున నెఱిఁగి యాయా భూతములందు వాని వాని విభూతులతోఁగూడియున్న నిన్ను భక్తి వృద్ధినొందుకొఱకు నుపాసించుచుందురు. పరమర్షులు భక్తి వృద్ధికొఱకు నిన్నే యే వస్తువులందు నే, యే విభూతిరూపముల నుండువానినిగా

నుపాసించుచు భక్తియోగనిష్పత్తిని బొందుదురో యావిభూతి రూప మగు వస్తువును నాకుఁ జెప్పుము. భూతములకు సత్తగలి గించుచు సర్వభూతాంతరాత్ముఁడు భూతము లందు స్ఫుటము గానట్లు వర్తించుచున్నాఁడు; అట్లయినను సమస్తము నొక్కు మ్మడిగా సాక్షాత్కరించుచుండు నిన్ను భూతములు నీ మాయ చేత మోహితము లగుటంజేసి కను గొనఁజాలవు. మహా విభూతీ! భూమియందును దివియందును బాతాలమందును దిక్కులయందును నీవు వాని వానియందు నుత్కృష్టములు గావించియున్న విభూతులను నాకుఁ జెప్పుము. తీర్థములకుఁ బట్టయిన నీ పదారవిందములకు నిదె మ్రొక్కుచున్నాను' అనెను.

శ్రీ భగవంతుఁడు—ఉద్ధవా! నీవు ప్రశ్నములు తెలిసిన వారియందు మిన్నవు. మునుపు కురుక్షేత్రమునందు నర్జునుఁడు కౌరవులతో యుద్ధము సేయఁదివిరి న న్నిట్లె యీ ప్రశ్నము నడిగెను. అతఁడు జ్ఞాతులనుజంపుట రాజ్యప్రాప్తికి మాత్రమే హేతువు గాని ముక్తికిహేతువుగాదనియుఁ గావున నది యధర్మమును నిందనీయము నగుననియుఁ దెలిసి 'నేను జంపువాఁడను వీఁడు చంపఁబడినవాఁ' డని ప్రాకృత బుద్ధి గలవాఁడై యీ యుద్ధమునుండి నివర్తించినవాఁ డయ్యె. అప్పుడు నే నాపురుషసింహమున కుపాయములను బోధించి తెలివి పుట్టింపఁగా నా యుద్ధాగ్రమందు నీవలెనే నా విభూతులను జెప్పుమని యడిగెను. ఉద్ధవా! నే నీ భూతములకెల్ల నాత్మ భూతుఁడను—అనఁగా నాత్మవలె లోపలఁ జొచ్చి నియమించు చుండువాఁడను. కాన యీశ్వరుఁడను. మఱి సుహృదుఁడను. సమస్త భూతములును మదాత్మకములుగావున నవియన్నియు

నేనేయగుదును. వానికి నుత్పత్తి స్థితి వినాశములును నావలన నే కలుగుచున్నవి. నేను మంచి గమనము గల వానిలోపల గతిని. అనర్థములు గలిగించునవిగా గణింపఁబడు వానిలోఁ గాలుఁడను సత్త్వాదిగుణములందలి సామ్యము నేను. గుణులకు స్వభావ సిద్ధముగాఁ గల గుణము నేను. సత్త్వాదిగుణములు మూఁడు పుట్టియున్న వానిలోపలఁ బ్రథమకార్యం బగు సూత్రంబైన మహత్తత్త్వము నేను. మహత్తయినవానిలో మహత్తత్త్వము నేను. సూక్ష్మములయినవానిలో మిక్కిలియు సూక్ష్మమగు జీవుఁడు నేను. జయింపఁ గష్టమయిన వానిలో మనస్సు నేను. దేవతలలో హిరణ్యగర్భుఁడు నేను. మంత్రములలో మూఁడక్షరములు గల ప్రణవము నేను. అక్షరముల లోపల అకారము నేను. వేదములయందు గాయత్రి నేను. సమస్త దేవతలలోపల నింద్రుఁడ నేను. పశువులందు హవ్యవాహుండగు నగ్ని నేను. ఆదిత్యులయందు విష్ణుఁడు నేను. రుద్రులయందు నీలలోహితుఁడు (శివుఁడు) నేను. బ్రహ్మర్షులయందు భృగుఁడు నేను. రాజర్షులయందు మనువు నేను. దేవర్షులయందు నారదుఁడు నేను. ధేనువులయందుఁ గామధేనువు నేను. మేటిసిద్ధులలోఁ గపిలుఁడు నేను. పక్షులలో గరుడుఁడు నేను. ప్రజాపతులయందు దక్షుఁడు నేను. పితృదేవతలయం దర్యముఁడు నేను. ఉద్ధవా ? దైత్యులయందు నే నసురేశ్వరుఁడగు ప్రహ్లాదుఁడనని తెలియుము. నక్షత్రములకును నోషధులకును నధిపతి యగు చంద్రుఁడు నేను. యక్షరాక్షసులలోఁ గుబేరుఁడు నేను. మేటి గజములలోపల నైరావతము నేను. జలజంతువులకుఁ బ్రభుండగు వరుణుండు నేను. ద్యుతిగలవారలలోను దపింపఁజేయు వారి

లోపలను సూర్యుఁడు నేను. మనుష్యులలోపల భూపతి నేను. గుఱ్ఱములలో నుచ్చైశ్శ్రవము నేను. ధాతువులయందు బంగారము నేను. దండించువారిలోపల యముఁడు నేను సర్పములందు వాసుకి నేను. పెక్కుతలలుగల మేటిసర్పములలోపల నసంతుఁడు నేను. కొమ్ములును గోఱలును గలమృగములలోపలసింహము నేను. ఆశ్రమములందునాలుగవదియగుసన్న్యాసాశ్రమము నేను. వర్ణములలోపలఁ బ్రథమంబగు బ్రాహ్మణవర్ణము నేను. ప్రవాహరూపములగు తీర్థములయందు గంగను నేను. జలములుపాఱక నిలుకడగానుండు నీటి పట్టులయందు సముద్రము నేను. ఆయుధములందు ధనుస్సు నేను. విలుకాండ్రయందుఁ ద్రిపురములను నాశముచేసిన శివుఁడు నేను. గృహములలోపల మేరువు నేను. దుర్గమము లయిన వానిలోపల హిమాలయము నేను. వృక్షములలోపల నశ్వత్థము నేను. ఓషధులయందు యవలు నేను. పురోహితులలోపల వసిష్ఠుఁడు నేను. వేదార్థనిష్ఠులలోపల బృహస్పతి నేను. సమస్తసేనానుల లోపలఁ గుమారస్వామి నేను. సన్మార్గప్రవర్తకులయందుభగవంతుఁడగుబ్రహ్మను నేను. యజ్ఞములయందు బ్రహ్మయజ్ఞము నేను వ్రతములందహింసావ్రతము నేను. శుద్ధిచేయువానిలో వాయువు అగ్ని సూర్యుఁడు జలము ఆకాశమనెడి యీపదార్థముల రూపున మిక్కిలియు శుద్ధిసేయువాఁడు నేను. యోగము లెనిమిదింటిలోపల సమాధి నేను. జయింపఁగోరువారలలో జయోపాయ మగు నీతి నేను. వివేకాదిసై పుణ్యములలో నాన్వీక్షకి (ఆత్మానాత్మ వివేకవిద్య) నేను. అన్యథాఖ్యాతివాదు లగు తార్కికాదులలో నీ విట్లు చెప్పుదువా? వేఱువిధమునఁ జెప్పెదవా? యనెడి వికల్పము

నేను. స్త్రీలయందు స్వాయంభువమనువు భార్యయైనశతరూప నేను. పురుషులయందుస్వాయంభువమనువు నేను. మునులలోపల బదర్యాశ్రమవాసి యగునారాయణముని నేను. బ్రహ్మచారుల (జితేంద్రియుల) లోపల సనత్కుమారుఁడను నేను. ధర్మముల లోపల ఫలాభిసంధిలేని ధర్మమగు నాత్మవిక్షేపము నేను. క్షేమములందు (భయరాహిత్యము గలిగించువానిలోపల) ప్రత్యగాత్మ స్వరూపానుసంధానము నేను. గుహ్యము లోపలఁ * బ్రియవచనమును మౌనమును నేను. మిథునములలోపలఁ బ్రజాపతి నేను. అప్రమత్తు లగువారిలోపల సంవత్సరము నేను. ఋతువులందుఁ జైత్ర వైశాఖములు(వసంత ర్తువు) నేను. మాసముల లోపల మార్గశీర్షము నేను. నక్షత్రములలోపల నభిజిత్తు నేను. యుగములందుఁ గృతయుగము నేను. ద్వంద్వ సహులయినధీరులలోపలనసితుండగు దేవలుఁడు నేను. వేదవిభాగ కర్తలలో వ్యాసుఁడు నేను. కవులలో (దీర్ఘదర్శులలో) సూక్ష్మ బుద్ధిగల కావ్యుడు (శుక్రుఁడు) నేను. జ్ఞానైశ్వర్యాదులు గలవారిలోపల వాసుదేవుఁడు నేను. భాగవతులలోపల నీవు నేను. కింపురుషులలోపల హనుమంతుఁడు నేను. విద్యాధరులలోపల సుదర్శనుఁడు నేను. రత్నములయందుఁబద్మరాగము నేను. మిక్కిలి సొగసైనవానిలోఁ దామరమొగ్గ నేను. తృణజాతులలోపలఁ గుశము నేను. పురోడాశము మొదలయిన హవిస్సులలో నావు నేయి నేను. ధనార్జనశీలు రయినవారిలోపల లక్ష్మి నేను. కాడు

* ప్రియవచనము లాడినను మౌనములో నుండినను బురుషునిలోపలి యభిప్రాయము తెలియదు. కనుక నవి రెండును గుహ్యములందు మేటిగాఁ జెప్పఁబడెను.

గలవారిలోపల (జూదము మొదలగువానిచే నేను జయించితినని) ఛలముచేతఁ గలుగు నాగ్రహము నేను. ఓర్పు గలవారిలోపల నోర్పు నేను. సత్త్వగుణ ప్రచురు లగువారిలోపల సత్త్వము నేను. *ఓజస్సులయం దోజస్సు నేను. బలవంతులయందు బలము నేను. భాగవతులలోపలఁ బంచరాత్రోక్తమును బంచకాలములం దనుష్ఠింపఁ దగినదియునగు కర్మము నేను. మత్స్యము మొదలు కొని కృష్ణునివఱకుఁగల తొమ్మిది యవతారమూర్తులలోపల సర్వకారణభూత మైన యాదిమూర్తి నేను. గంధర్వులలోపల విశ్వావసువు నేను. అప్సరసలలోపలఁ బూర్వచిత్తి నేను. పర్వతములలోపల స్థైర్యము నేను. భూమికిఁగల గంధమాత్రము నేను. అప్పులకు సర్వరసకారణ మైన రసము నేను. మిక్కిలి తేజముగల వానిలోపల సూర్యుని తేజము నేను. సూర్యచంద్ర తారకము లందుఁగల ప్రభ నేను. ఆకాశమందుఁగల ప్రభ నేను. ఇంద్రియములకు విషయములం దెల్లఁ బరంబయిన స్పర్శము నేను. బ్రహ్మణ్యులగు వారిలోపలబలి నేను. వీరులయం దర్జునుఁడు నేను. భూతములయుత్పత్తియు స్థితియుఁ బ్రలయమును నేను. పాదముల గతియు వాక్కులయుక్తియుఁ బాయువునుత్సర్గమును హస్తమును పాదనమును, ఉపస్థము నానందమును ననెడి యీ యైదుకర్మేంద్రియవ్యాపారములును కన్నులదర్శనమును జెవుల శ్రుతియు రసనము నాస్వాదమును ఘ్రాణము నాఘ్రాణమును, త్వక్కు స్పర్శము ననెడి యీ యైదుజ్ఞానేంద్రియవ్యాపారములును నేనే. సకలమయిన యింద్రియములకును నింద్రియము (నిర్వాహకుఁడను) నేనే.

* ఓజస్సు అనఁగా ఇంద్రియపటుత్వము. సహస్సు అనఁగా ధారణసామర్థ్యము. బలమనఁగా శరీరబలము.

పృథివియు వాయువు నాకాశమును నప్పులును జ్యోతియు నేను. వీనికెల్లఁ గారణమయిన యహంకారమును మహత్తత్త్వమును నహంకార వికారములయిన యేకాదశేంద్రియములును నచిత్తు సమష్టియు చిత్తుసమష్టియు రజస్సును సత్త్వమును దమస్సును బరంబగు ముక్తాత్మస్వరూపమును నేనే. నేను గేవల మీతత్త్వములే కాక వీని గణనమును వీనిలక్షణముల యెఱుకయు దాని వలన నా యా వస్తువుల స్వరూపస్వభావములు గలరూపున నిశ్చయించునట్టి జ్ఞానమును నేనే. లోపలఁ బ్రవేశించునట్టి యీశ్వరుఁడయిన నేనును నాకు శరీరమైన జీవుఁడును సత్త్వాది గుణములును సమష్టివ్యష్టిరూపములయి సర్వకార్యరూపములై యాగుణముల కాశ్రయములై యున్న యచిద్ద్రవ్యములునుదప్ప మఱియొక్క వస్తువు గలుగదు. * అన్నియు చిత్తు నచిత్తు నీశ్వరుఁడునను మూఁడుతత్త్వము లగును. చిదచిత్తులెల్ల మదాత్మకములై నానియమమునకులోనై యుండును. నేను నెంతోకాలము నకేని భూమియందలి పరమాణువులను లెక్కపెట్టుదునుగాని యట్లే నా విభూతులను లెక్కపెట్టనేరను. నేను సృజించు నట్టి యండములే కోట్లకొలఁది ననంతములై యుండఁగా నంద లి నా విభూతులను లెక్కింప నలవియగునా? వర్చస్సును కాంతియుఁ గీర్తియు సంపత్తియు లజ్జయు సత్పాత్రదానమును, సౌందర్యమును భాగ్యమును వీర్యమును నోర్పును వస్తుతత్త్వజ్ఞానమును, హితాహితపర్యాలోచనమును నెందుఁగలవో యది యంతయు నావిభూతియే యగును. నీకు నావిభూతులను వీనిని

* 'న తదస్తి వినాయత్స్యాన్మయాభూతంచరాచరమ్' అను భగవద్గీతార్థమిట యనుసంధింపవలయును.

సంక్షేపమున నన్నింటిని జెప్పితిని. ఇవి యెల్ల నాసంకల్పమాత్రమునఁ బుట్టినవి యని వేదము కలరూపునఁ జెప్పుచున్నది. కనుక వాక్కును జెడుమాటలు పలుకనీక నిగ్రహింపుము. మనస్సు చెడువిషయములను ధ్యానింపకుండునట్లు నిగ్రహింపుము. ప్రాణములను దుష్టాన్నాదులచేతఁ బోషితము గాకుండునట్లుగాని పూరకకుంభకరేచకాద్యుపాయముచేతఁగాని నిగ్రహింపుము. ఇంద్రియములను నిగ్రహింపుము. ఆత్మను నపాయములందుఁ బ్రవర్తింపనని నీయంతట నీవే నిగ్రహింపుము. ఇట్లు చేయుదువేని మరల సంసారమార్గమునకు రావు. ఎవఁడు వాక్కును మనస్సును జక్కఁగా నిగ్రహింపఁడో వాఁడు బుద్ధిమంతుఁడయినను యతియైనను వాని వ్రతమును దపమును దానమును బచ్చికుండలయందలినీ రొలుకుచుండునట్లుండునే కాని గుదురుగా నుండవు. కాఁబట్టి వాక్కును మనస్సును బ్రాణములను నాభక్తితోఁగూడిన బుద్ధిచేత నిగ్రహింప వలయును. అట్లు నియమింపఁగా మోక్షోపాయము సంపూర్ణమగుచున్నది. ఇది పదియాఱవయధ్యాయము.

## శ్రీకృష్ణుఁడు బ్రహ్మచారిగృహస్థధర్మముల నుద్ధవునకుఁ బ్రతిపాదించుట.

ఉద్ధవుఁడు—తమ తమ వర్ణాశ్రమములకు ననుగుణములయిన యాచారములం బ్రవర్తించుచుండు మనుష్యు లెల్లవారికి నీవు నీప్రాప్తికి సాధనమైన ధర్మమును (నీభక్తిని) జెప్పితివి. అరవిందాక్షా! తమతమవర్ణాశ్రమములకు ననుగుణమయిన ధర్మముల నేప్రకారము ననుష్ఠించుచు వచ్చిన యెడల మను

ష్యులకు నీయందుభక్తి గలుగును? ఆయనుష్ఠించు ప్రకారము ను నాకుఁ జెప్పుము. ఉపదేష్టలగు వారి పరంపరవలనఁగదా యది తెలియవలెను. నన్నడిగెదవేల యందువా? మహాబాహూ! ప్రభూ! తొల్లిపరమం బయినసుఖరూపం బగు నా ధర్మమును నీవు హంసరూపమున బ్రహ్మకును సనకాదులకును నుపదేశించితివి గదా! అమిత్రకర్శనా! ఆధర్మమును నీవు మున్నులోకమునందుఁ జక్కఁగా నేర్పఱచితివి. ఇంతకుమిక్కిలి యుఁ బెద్దకాలమయినది. కాఁబట్టి యది మనుష్యలోకము నం దిపుడు బహుతరముగా లేక విచ్ఛిన్నమయి యున్నది. అచ్యుతా! ఆధర్మమును జెప్పువాఁడును జేయువాఁడును, గాచువాఁడును నీకంటె మఱి యొక్కఁడు భూలోకమందుఁ గలుగఁడు. విద్యలన్నియువిగ్రహములు దాల్చియున్నబ్రహ్మసభయందు ను గలుగఁడు. ఇట్లా ధర్మమునకుఁ గర్తయు రక్షకుఁడునుఁబ్రవక్తయునగు నీవీభూతలమునుదిగవిడిచిపోయితివేని, మధుసూదనా! అది యెంతయు నశించిన దగును. అప్పుడు దాని నెవ్వఁడు చెప్పఁగలఁడు? కావున నీవే యుపదేశింపవలయును. సర్వధర్మజ్ఞా! అట్లు ధర్మమునకుఁ గర్తయు వక్తయు రక్షకుఁడు నగు నీవు మాకు నీ భక్తి యనెడు ధర్మ మెట్టి యంగముల తోఁ గూడినదో, యేయాశ్రమికి విధింపఁబడినదో దానిని, నా స్వామీ! నాకుఁజెప్పుము' అనెను. శ్రీశుకుఁడు—ఇట్లు తన భృత్యులయందు ముఖ్యుఁడయిన యాయుద్ధవుఁ డడుగఁగా భగవంతుఁడు హరి ప్రీతుండై మనుష్యుల క్షేమముకొఱకు సనాతనములగు ధర్మములను జెప్పువాఁడయ్యెను. భగవంతుఁడు—లోకహితైకకారియగు నీవడిగిన యీప్రశ్నముధర్మయుక్తమయినది.

ఏలన నిది తమ తమ వర్ణాశ్రమముల కనురూపమయిన యా
చారములుగల మనుష్యులకు (జ్ఞానానుష్ఠానాదులచే) ముక్తి
సాధకమైనది. భక్తియోగము ననుగ్రహించునదియై వర్ణాశ్రమా
నుగుణమయిన ధర్మమును నావలన నెఱుంగుము. మొట్టమొదటఁ
గృతయుగమందు మనుష్యులవర్ణము హంస (బ్రాహ్మణవర్ణమని)
యని చెప్పఁబడెను. అదియొకటే వర్ణమపు డుండెను గాని
తక్కిన క్షత్రియాదివర్ణములు గలుగవు. ఆయుగమునందు జను
లా హంసత్వజాతిచేఁ గృతకృత్యులై యుండినందున దానికిఁ
గృతయుగమని పేరు తెలియుదురు. అపుడు ప్రణవము మాత్ర
మే వేదముగా నుండెను. ధర్మమునకు మనోవిషయుఁ డగు నేను
వృషరూపమునఁ జతుష్పాదములనుంటిని గాని, క్రియావిశేష
ములగు యజ్ఞాదులు గలుగవు. అపుడు వారు కేవలము
యోగనిష్ఠులై యుండి నిరస్తనిఖిల దోషుండ నగుట హంసుండ
(శుద్ధుఁడ) నగు న న్నుపాసించిరి. దానివలన వారు కల్మష
ములను వీడి నావలె హంసులై యుండిరి. మహాభాగా!
పిదపఁ ద్రేతాయుగము ప్రవేశింపఁగా నాహృదయమందుఁగల
ప్రణవమునుండి ఋగ్యజుస్సాములనెడిమూఁడవయవములు గల
వేదవిద్య ప్రాదుర్భవించెను. ఆత్రయీవిద్యవలననుండి హోతయు
నధ్వర్యువును నుద్గాతయు ననుసంధించుటచే మూఁడురూపము
లైనఋగ్యజుస్సామ మంత్రములు గల యజ్ఞము నేనుగా నుం
టిని — అనఁగాఁ ద్రేతాయుగము మొదట యజ్ఞాదులగు
ధర్మములును వానికి విధాయకములయిన వేదములును గలిగి
యుండెను. బ్రాహ్మణులు క్షత్రియులు వైశ్యులు శూద్రులు
ననెడి నాలుగు వర్ణములు విరాట్టనఁబడు ననిరుద్ధుని

వలనఁ బుట్టిన చతుర్ముఖునివలన నతని * ముఖమునుండి యు, బాహువులనుండియు, నూరువులనుండియుఁ, బాదముల నుండియుఁ బుట్టిరి. వారికి, వారి వారి ధర్మములే తెలుపునట్టి లక్షణము. చతుర్ముఖశరీరకుఁ డయిన నాజఘనమునుండి గృహ స్థాశ్రమమును, హృదయమునుండి బ్రహ్మచర్యమును బుట్టెను. వక్షస్థలమునుండి వానప్రస్థముపుట్టెను. శిరస్సును సన్న్యాస మాశ్రయించెను. వర్ణములకు జన్మదేశములయినముఖబాహూ రుపాదములను నాశ్రమములకు జన్మభూములయిన జఘనహృ దయ వక్షశ్శిరస్సులనును (అనఁగా ముఖాదుల ధర్మములను) మనుష్యుల ప్రకృతు లనుసరించునవయ్యెను. కాఁబట్టి నీచ ములగు జన్మదేశములచేతఁబ్రకృతులునీచములును, నుత్తమము లయిన జన్మప్రదేశములచేత నుత్తమములునయ్యెను. శమము, దమము, తపస్సు, శౌచము, సంతోషము, క్షమ, ఆర్జవము, మద్భక్తి,దయ,సత్యము ననెడియివి బ్రాహ్మణ ప్రకృతులు (స్వభా వములు). తేజస్సు, బలము, ధృతి, శౌర్యము, తితిక్ష, ఔదా ర్యము, ఉద్యమము, స్థైర్యము, బ్రహ్మణ్యము, ఐశ్వర్యముననెడి యివి క్షత్రియస్వభావములు. ఆస్తిక్యము, దాననిష్ఠ, దంభము లేమి, విప్రసేవనము, ధనముగూర్చుటయందుఁ జాలునని తుష్టి నొందకుండుటయును, నివి వైశ్యుని స్వభావములు. ద్విజులకును గోవులకును దేవతలకునుమాయములేక శుశ్రూష సేయుటయు, దైవికముగా లభించినదానితో సంతోషమును, శూద్రస్వభావ

* ఇచట బ్రాహ్మణాదులు వైరాజుఁడగు చతుర్ముఖునిముఖాదులవలన పుట్టిరనఁగా ముఖాది వ్యవహారములగు వేదప్రవచనాదులు చేయువారయి పుట్టిరని వీరరాఘవుల మతము.

ములు. అశౌచమును నబద్ధమును దొంగతనమును నాస్తిక్య మును గారణములేని కలహమును గామమును గ్రోధమును ధనమందలి తృష్ణయు, వర్ణాశ్రమములులేని చండాలాదుల స్వభా వములు. అహింసయు సత్యమునుదొంగతనములేకుండుటయుఁగా మక్రోధలోభములు లేకుండుటయు, భూతములకుహితమునుబ్రియ మును జేయఁ బాటుపడుటయు, ననునివిసర్వవర్ణములవారికి నగు ధర్మములు. ద్విజుఁడుగర్భాదానము మొదలగు సంస్కారముల క్రమమున, నుపనయనమనెడు రెండవజన్మమునుబొంది గురుకుల మందు వాసముచేయుచుజితాంతఃకరణుఁడై వేదమునునధ్యయన ముచేయుచున్నాఁడు. అట్లితనయాశ్రమమునకుఁజెప్పఁబడినవ్ర తములందు నియతుఁడై యుండును. మఱియు నతఁడు మేఖల యు నజినమును దండమును నక్షసూత్రమును యజ్ఞోపవీతమును గమండలువునుదాల్చి యభ్యంగనాదులు లేనందున వెండ్రుకలు జడలుగట్టఁ,బల్లుగాని వస్త్రములుగానితోమక, వేడుకకు నెత్తినిప చ్చునివస్త్రములను ధరింపక, గుశలను దాల్చి యుండవలయును. మఱియు స్నాన భోజన హోమములందును జపమునను మూత్ర పురీషోత్సర్జనమునందును మౌనినై యుండవలయును, చంకల యందును మొలయందునుగల వెండ్రుకలను నఖములను ద్రుంపరాదు. అతఁ డెప్పుడుగాని బుద్ధిపూర్వకముగా రేతస్సు నొలుకరాదు. అతఁడు బ్రహ్మచర్యవ్రతమును దాల్చి గృహస్థుఁడు ను గాకుండుటచే నొకప్పుడు రేతస్సును నొలుకునేని యపుడు జ లములం దవగాహనముచేసి, ప్రాణాయామము గావించి సావిత్రి నష్టోత్తరసహస్రము జపింపవలయును. వాఁడు రెండు సంధ్య

లయందును శుచియై * యగ్నిని అర్కుని ఆచార్యుని గోవులను విప్రులను గురువులను వృద్ధులను దేవతలను నుపాసింపవలయును. మఱియు సమాహితచిత్తుఁడును మౌనియునై సంధ్యయందు సావిత్రిని జపింపవలయును. వాఁడాచార్యుని నన్నుఁగాఁ దెలియవలయును. అతని నొకప్పుడు నవమానింపరాదు. అతనియందొక మనుష్యుఁడనియసూయచూపరాదు. గురువు సర్వదేవమయుఁడుచుమీ! ఆచార్యుని రేపును మాపు నుపాసింపవలయును. తాను భిక్షింపఁగా దొరకిన యన్నమునుగాని మఱి దేనినిగాని గొనిపోయి యాచార్యునకు నివేదింపవలయును. అంత నాయాచార్యునను జ్ఞను గొని తాను దానిని నుపయోగించుచు వాఙ్నియమము గలిగియుండవలయును. ఆచార్యునికి దానునివలె శుశ్రూషచేయుచు నతనిని సదా యుపాసింపవలయును. అతఁడు పోవుచుండఁగాఁ బిఱుందఁబోవలయును; పరుండఁగాఁ దగ్గఱఁ బరుండియు, కూర్చుండఁగా దాపుగాఁ గూర్చుండియు నుండవలయును. చేతులుమోడ్చి యతని నియోగము నెదురుచూచుచు మిక్కిలి దవ్వుగాక యుండునట్లు నిలుచుకొనియుండవలయును. ఇట్టివ్రతముగలవాఁడై భోగములుమాని యధ్యయనము సమాప్తమగువఱకు నవిచ్ఛిన్నముగా నావ్రతమును ధరించి గురుకులమున వసించియుండవలయును. ఈ బ్రహ్మచారి వేదాధ్యయనాది కర్మములకు ఫలంబగు బ్రహ్మలోకము నారోహింపఁ గోరునెడల నపుడు స్వాధ్యా

---

* అగ్నిని అగ్నిహోత్ర హోమము చేతను, సూర్యుని సూర్యమండలాంతర్వర్తి పరమపురుషధ్యానము చేతను, గోవులనుగడ్డి మొదలగునవి యిచ్చుట చేతను, గురువులను బ్రణామాదుల చేతను, నుపాసింపవలయును.

యమునకై బ్రహ్మచర్య వ్రతమును దాల్చియె గురువునకు దన దేహమధీనముగావింపవలయు. ఇట్లు చేసిన నేనై ష్ఠికుఁడగును. అగ్నియందును గురువునందును దనయందును దక్కిన సర్వభూతములయందును నున్న పరముండగునన్ను—భేదబుద్ధి లేక బ్రహ్మచర్యవ్రతముచేత వర్చస్సు వెలుంగుచుండ నకల్మషుండై యుపాసింపవలయును. మఱి బ్రహ్మచర్యుఁడు గృహస్థుఁడుగానందున స్త్రీలనుజూచుటయుఁ దాఁకుటయు వారితో మాటలాడుటయుఁ బరియాచకములాడుటయు మొదలగువానిని వర్జింపవలయును. ఒండొంటిని రతియందుఁ గలసియున్న ప్రాణులను బశుపక్ష్యాదులను సయితము చూడకుండవలయును. శౌచమును నాచమనమును స్నానమును సంధ్యోపాసనమును (మనోవాక్కాయము లొక్కటిగా నుండుటయనెడి) ఆర్జవమును దీర్థసేవయు గాయత్రి మొదలగువానిని జపించుటయుఁ, దాఁకరానివానిని భక్షింపఁదగనివానిని మాటలాడఁగూడనివానిని వర్జించుటయు, సమస్తభూతములందును మదాత్మకములనెడి [1] మనోవాక్కాయములసంయమము, ననెడి యివి యాశ్రమముల కన్నిటికిని సామాన్యముగాఁ బ్రయుక్తములయిన నియమములు. కులనందనా! ఇట్లు బ్రహ్మచర్య వ్రతమునుదాల్చి వేదములను దదర్థములను నధిగమించి, వేండ్రమయి యెడ తెగని తపస్సుచేత నగ్నివలె జ్వలించుచు, నాయందలి భక్తియోగమును లభించి దానివలననే నన్నుఁబొందుటకుఁ బ్రతిబంధక

1. మనస్సు సంయమమనఁగా అసత్తగు వానిని ధ్యానింపకుండుట. వాక్సంయమమనఁగా అనృతములాడకుండుట. కాయసంయమమనఁగా నిషిద్ధభోగములు లేకుండుట.

ములగు కర్మవాసనలను దగ్ధముగావించి దేహాంతమందుఁ బ్రకృతి సంబంధ మనెడి మాలిన్యము వీడి నిర్మలుఁడై ముక్తుఁ డగుచున్నాఁడు. బ్రహ్మచారి విద్యను సమాప్తము చేసిన పిదప వేదవేదార్థములను నెఱింగి మఱి యొకయాశ్రమమును బ్రవేశింపఁగోరినపుడు గురువునకు దక్షిణయొసంగి గురువు ననుజ్ఞఁబొంది సమావర్తనంబను స్నానము చేయవలయును. *పిదప నతఁడు గృహస్థాశ్రమమునైనను వానప్రస్థాశ్రమము నయినను బొందవచ్చును. వాఁడు ద్విజోత్తముఁ (బ్రాహ్మణుఁ) డగునేని,సన్న్యసింపవచ్చును. నాభక్తుఁడగు ద్విజుండొకయాశ్రమముముండి మఱియొక యాశ్రమమును బొంద వచ్చును గాని యేయాశ్రమము ననుష్ఠింపక యూరక త్రిమ్మరు చుండరాదు. అందు గృహస్థాశ్రమమును గోరినవాఁడు తన కంటె వయస్సునందుఁ బిన్నదియు దుష్టురాలు గానిదియుఁ దనకు సజాతీయురాలు నయినదియుఁ దన కనురూప మైనదియు నగుభార్యను బెండ్లాడవలయును. మొదట నతఁడు సవర్ణురాలిని బెండ్లాడి పిదప నితరవర్ణపు వారిని బెండ్లాడఁదగును. మఱి యజ్ఞమును నధ్యయనమును దానములును ద్విజన్ములెల్ల వారికిని గలవు. అందుఁ బ్రతిగ్రహమును నధ్యాపనమును యాజనమును బ్రాహ్మణునికి మాత్రమే కలిగి యుండును. బ్రాహ్మణుఁడందుఁ బ్రతిగ్రహమునుదనతపస్సునకును దేజస్సునకునుయశస్సునకును విఘాతుకముగాఁ దలంచునేని తక్కిన యాజనాధ్యాపనములు రెంటిచేత బ్రతుకవచ్చును.వానియందుదోషముగలదని

* దీనివలన బ్రహ్మచర్యము నుండియే చక్కఁ మూఁడవ నాలుగవ యాశ్రమమును గూడఁ బొందవచ్చునని తెలియుచున్నది.

చూచునేని, [1]శిలములచేతఁగాని జీవింపవచ్చును. బ్రాహ్మణునికిఁ గలయీదేహముక్షుద్రములగు కామములకై యేర్పఱుపఁబడదు అదియిహమందు మిక్కిలియుఁ గాయక్లేశరూపమగుతపస్సుచే యుటకును మృతినొందినపిదప ననంతసుఖములను బడయుటకు నై యేర్పడియున్నది. వాఁడుశిలోంఛవృత్తిచేతఁజిత్తమునసంతుష్టినొంది నైర్మల్యమును గలిగించునదియు మహాఫలంబయినదియును నిజవర్ణాశ్రమోచితమునయిన ధర్మము ననుష్ఠించుచు నాయందు మనస్సును సమాహితము చేసియుండునది. గృహమందే యుండినను భోగములయం దాసక్తుఁడుగాక సంసారక్లేశములశాంతి(ముక్తి)నిబొందుచున్నాఁడు. శిలాదులచేతఁ గ్లేశపడుచున్నవాఁడును మత్పరాయణుండు నగు విప్రునికి నెవరు జీవనము గలిగింతురో వారిని నే నాపదలనుండి వేగముగా, నావ సముద్రమునుండి యుద్ధరించునట్టు లుద్ధరింతును. రాజయిన వాఁడు, తండ్రి బిడ్డలనుంబోలె సమస్త ప్రజలను నుద్ధరింపవలెను. తన్నుఁదనచేతనే యుద్ధరించుకొనవలెను. ఇట్లుగజపతిగజములనుంబోలెఁ దన్నునుబరులనునుద్ధరించుకొనవలయును. ఇట్లు చేయునట్టిరాజిందుఁ దనకుఁగల యశుభముల నెల్ల విదిల్చికొని సూర్యునివలె మెఱయుచున్న విమానము నెక్కి యింద్రునితోడ మోదమునొందుచున్నాఁడు. విప్రుఁడుశిలోంఛవృత్తిచేతజీవనము చేయనేరక కష్టపడుచున్నచో, నతఁడు వణిజునివృత్తిచేత నందును నిషిద్ధములగు లవణమాంసాదులను గాక తమ వ్యవహారమున కనుగుణములయిన తృణకాష్ఠాదులను నంగడి సరకులను

---

1. శిలమనఁగా పొలమునందుసొంతకాఁపు విడిచిపెట్టినధాన్యకణికలు. దానినే దిని బ్రతుకుట శిలవృత్తి.

విక్రయముచేసి,బ్రతుకు దొరకకున్న యెడలను గడపికొనవచ్చును. అప్పటికిని నాపద పయికొనెనేని ఖడ్గముగొనిక్షత్రియవృత్తిచేతఁగానిబ్రతుకవచ్చును. కాని,కుక్కవలె నీచవర్ణములవారిని సేవించుటచేత నట్టి యాపదలను నేవిధముననుగడపుకొనరాదు. రాజన్యుఁడగువాఁడు వైశ్యవృత్తిచేతఁ గాని వనమార్గమందు వేఁటలాడుటచేతఁ గాని యదియునుగూడక పోయెనా బ్రాహ్మణవృత్తి చేతఁగాని యాపదయందు జీవింపవలయును గాని కుక్కవలె నీచవర్ణముల సేవించి యెట్లును బ్రతుకరాదు. వైశ్యుఁడు నట్టి సమయమున శూద్రవృత్తిని వర్తింపవచ్చును. శూద్రుఁడునుదంతెవులు పేనుట చాపలల్లుట మొదలగుపనులు చేయవచ్చును. వీరందఱును నట్టి యాపదనుండి విడివడిన పిదప నితరవర్ణముల కర్మములు తమకు నింద్యములు గాన, యట్టి కర్మములచేత నెంతమాత్రము జీవింపరాదు. వేదాధ్యయనముచేతను(బ్రహ్మయజ్ఞాదులచేతను)స్వధచేత(తాష్టకాదిశ్రాద్ధములచేతను) స్వాహాచేతను (యాగహోమాదులచేతను)బలియన్నము మొదలగువానిచేతను దనకలిమి సొంపునకుఁదగినట్లు వరుసగా ఋషులను బితృదేవతలను దేవతలనుభూతములనునుమచ్ఛరీరభూతము లయినవానిని బ్రతిదినమును యజింప వలయును. తానేమియుఁబాటువడక దైవికముగా లభించినట్టిధనములచేతఁగాని పరిశుద్ధమైన ధనముచేతఁగాని తనవృత్తిచేత గడించిన దానిచేతఁగాని, పోష్యులగు వారిని బీడింపకయె నన్నుయజింపవలయును.యజ్ఞములననుష్ఠింపవలయును. గృహస్థుఁడగువాఁడును భార్యాపుత్రాదుల యందు మమత నుంపరాదు. దేహముఁదన్నుగాఁ బ్రమాదపడరాదు. వాఁడు తత్త్వస్వరూపము నెఱిం

గినవాఁడై తాను గన్నారఁ జూచువానివలెనేచూడనివి (అదృష్ట ములు) అగు స్వర్గాదులనుగూడ నశ్వరములుగాఁ గనుఁగొన వలయును. పుత్త్రులు పెండ్లములు ఆప్తులు బంధువులు మొద లగువారితోడి పొత్తు చలిపందిరియందలి బాటసారుల పొత్తు వంటిదేకాని మఱియొకటి గాదు. నిద్ర రాఁగా స్వప్నము వచ్చును. నిద్ర వీడఁగా స్వప్నమునువాయును. అట్లే దేహము కలిగిన వెంటఁ బుత్త్రాదులు గలుగుదురు. అది వీడఁగా వారును వీడుదురు. ఇట్లు దృష్టాదృష్టములు రెండును ననిత్యములగుటఁ బరామర్శించి సమాహితుఁడై గృహములయందు దొకయతిథి వలెఁ దానుదాసీనుఁడై వసించుచు నహంకార మమకారములు విడిచి యాగృహములందాసక్తుఁడుగాకుండవలయును. మఱియొక గృహస్థునకు విహితములయిన యజ్ఞాదికర్మములచేత నారా ధించి భక్తిమంతుఁడై యావజ్జీవము గృహాశ్రమమందే యుండ వచ్చును. పుత్త్రవంతుఁ డయినయెడల వానప్రస్థుఁడుగావచ్చును. లేక సన్న్యసింపవచ్చును. ఎవ్వఁడు గృహమందు బుద్ధి దగులు కొలిపి దారపుత్త్రధనేషణలచేత నాతురుఁడై స్త్రీలకు వశ్యుఁడగు నో యట్టివాఁడు బుద్ధిచెడి నేను నాదియనెడియభిమానములచేత మూఢుఁడై బంధమునొందును. వాఁడు 'అయ్యో వృద్ధులైననాతలి దండ్రులును బసిబిడ్డల తల్లియగు నాయిల్లాలును గన్నబిడ్డలును నేను లేనియెడల దిక్కుమాలిన వారగుదురే! అట్లు వారు దుఃఖితులై యెట్లు బ్రతుకఁగలరు?' అని యిట్లు గృహాదుల యందుఁ దలంపులు మల్లడిగొనుటచేఁ జిత్తము తత్తరపడఁ గా, బుద్ధిచెడి విషయ భోగమునందుఁ దృప్తినొందక యా గృహాదులనే తలంచుకొనుచు మృతుఁడై యంధతమ

స్సును (మిక్కిలి తామసంబయిన జన్మమును) బొందుచున్నాఁడు. ఇది పదియేడవయధ్యాయము.

---

—:కృష్ణుఁ డుద్ధవునకు వానప్రస్థాశ్రమ ధర్మములను జెప్పుట.:—

శ్రీభగవంతుఁడు—వానప్రస్థుఁడు కాఁగోరినవాఁడు భార్యను బుత్రులకప్పగించి కాని, భార్యను గూడఁ దోడ్కొని కాని, వనమునకుఁ బోయి జితేంద్రియుఁడై యాయువునందు మూఁడవభాగమంతయు (డెబ్బదియేనవయేఁడు వఱకు) వసించి యుండవలయును. అడవియందు బుట్టినవియు శాస్త్రవిహితములయినవియు నగు కందమూలఫలముల చేత జీవనము గావించుకొనవలయును. వల్కలములను, నదిలేనిచోఁ దృణములనో పర్ణములనో యజినములనో వస్త్రములుగాఁ గట్టుకొనవలయును. కేశములు రోమములు నఖములు గడ్డములు మీసలు మొదలగు మలములు ద్రుంచివుచ్చరాదు. పలుదోమరాదు. నిత్యము మూఁడు కాలములు జలమునందుఁ గ్రుంకవలయును. తృణాదులు పఱచిన భూమిపైఁ బరుండవలయును. మండువేసవియందుఁ బంచాగ్నులచేతఁ దనకుఁ దాపము గావించుకొనవలయును. వర్షాకాలమునందు జడివానలయం దోర్చియుండవలయును. శిశిరమునందు నీళ్లలోఁ గుత్తుకబంటి మునిఁగియుండవలయును. ఇట్టి వృత్తి గలిగి తనతన వర్ణాశ్రమమున కుచితమయిన తపము నొనరింపవలయును. కందమూలముల నగ్నిచేతఁ బక్వములు గావించి భుజింపవలయును. ఫలములను గాలముచేతఁ బక్వములయిన వానిని భుజింపవలయును. నివ్వరిధాన్యములను ఱోటిచేతఁగాని ఱాతిచేతఁగాని దంచుకొనవలయును. దంతములే ఱోలుగాను గొనుట (యనఁగా దంతము

లతోనే ధాన్యమును జక్కఁ బెట్టుకొనుట) దగును. తన జీవన మునకు సాధనమయిన కందమూలాదులను తానే తెచ్చుకొన వలయును గాని మఱియొకరిచేఁ దెప్పించుకొనరాదు. దేశ కాలముల బలిమిని దెలిసికొని కాలాంతరమునఁ దెచ్చిన దానినపుడు వానప్రస్థుఁడుగయికొనరాదు. వన్యములగునీవారాదులచేతఁ గాలచోదితములయిన యగ్రయణాదులగు చరుపురోడాశాదుల నిర్వహింపవలయును. శ్రౌతపశువగు భాగము మొదలయినవాని చే నన్నుయజింపరాదు. వైదికవాక్యములందు, మునికిఁగూడఁ నగ్నిహోత్రమును దర్శమును బౌర్ణమాసమును జాతుర్మాస్యమునువిహితములయియున్నవి. కనుక వానియందలికర్మముచేత నన్నువానప్రస్థుఁ డారాధింపవలయును. ఇట్లుముని, నాడులుదేహ మంతయు వ్యాపించి యుండగా, జీవితకాలమంతయు నాచరించిన తపస్సుచేతఁ దపోమయుం డగు నన్నారాధించి (యనఁగా యావజ్జీవము ఫలాభిసంధిలేక స్వధర్మనిష్ఠుఁడై మద్భక్తియుక్తుఁడై యుండి) యీలోకమును విడిచి దేహాంతమందు నన్నుఁ బొందుచున్నాఁడు. మిక్కిలి కష్టముచేతఁ గావించిన యీతపస్సు నిశ్శ్రేయసమునకు సాధనమైనది. ఇట్టి మహనీయమయిన తపమును మిక్కిలి యల్పమయిన కామమునకు నుపయోగించిన యెడల నట్టి వాని కంటె మూర్ఖుఁ డెవఁడు గలఁడు? ఈవానప్రస్థుఁడు తనకు నియమంబయిన స్వధర్మమందు సమర్థుఁడు గాక ముదిమిచేతఁ గంపము నొందినపుడు, ఆ హావనీయాదు లయిన యగ్నులను హృదయమం దారోపించి కొని నాయందే చిత్తమిడి యగ్నిని బ్రవేశింపవలయును. స్వర్గాది లోకములు కర్మవిపాకములు గనుక నరకరూపములే య

గును. వాని యందు విరక్తి గలిగినపు డగ్నులను న్యాసముచేసి కొని ప్రవ్రజనముచేయ వలయును. వాఁడు మొదట యథా విధి నెనిమిది శ్రాద్ధములను గావించి ప్రాజాపత్యేష్టిచే న న్నారా ధించి సర్వస్వమును ఋత్విజున కొసంగి యగ్నులను దనయాత్మ యందారోపించికొని నన్నుఁ దప్పఁ దక్కినవానియం దపేక్షా రహితుఁడై ప్రవ్రజనము గావింప వలయును. విప్రుఁడు సన్న్య సించునపుడు దేవతలు దార పుత్ర బంధుజనాదుల రూపమునఁ దోఁచి 'వీఁడు మనల నుల్లంఘించి పరమపదమునకుఁ బోవునో' యని వానికి విఘ్నములు గావించుచుందురు. వాఁడు ముని యగునేని కౌపీన మొక్కటియే వస్త్రములన్నిటివలెఁ దాల్ప వలయును గాని మఱియొక్కటి దాల్పరాదు. వాఁ డాపద లే నపుడు త్రిదండమును గమండలువును దప్పఁ దక్కిన వాని నెల్లఁ ద్యజింప వలయును. చూపు వెట్టి చక్కఁగాఁ బరిశుద్ధ మైనచోటనే యడుగు పెట్టవలయును. జలమును వస్త్రము చేత వడియఁగట్టి త్రాగవలయును. సత్యముచేతఁ బరిశుద్ధముల యిన మాటలు పలుక వలయును. మనస్సుచేతఁ దగును దగదని వివేచించి యుక్తమగు దాని నాచరింపవలయును. వాక్కు నకు మౌనమును దేహమునకుఁ గామ్యకర్మముల దిగవిడుచు టయు మనస్సునకుఁ బ్రాణాయామమును దండములగును. ఇవి నాలుగవయాశ్రమము వాని కెవ్వనికి లేకుండునో వాఁడు యతిగాఁడు. ఉద్ధవా! వెదుళ్లుచేపట్టినంత యతిగాఁడు. నాలు గు వర్ణములవారి యందు భిక్షుయాచరింపవచ్చును. అయినను వారియందు నభిశస్తులు పతితులు మొదలుగాఁగల నింద్యులను వర్జించి తక్కినవారినే యాచింపవలయును. మఱియు యతి

యేడిండ్లయందు మాత్రమే బిచ్చమడుగవలయును. ఆయిం డ్లను ముందుగా నేర్పఱచుకొన్నవి గా కుండవలయును. అంత వఱకు లభించిన దానితోనే తృప్తినొందవలయును. ప్రతిదిన మును నూరి వెలుపలనున్న నీటిపట్టునకుఁ బోయి యాచమన ముచేసి మౌనియై తాను దెచ్చిన భైక్షాన్నము నెవరేని యా చించిన యెడల వారికిఁ బంచి యిచ్చి శేషించిన దంతయును భుజింపవలయును, కాని, యంత కన్న నెక్కుడు మరలఁ బోయి తెచ్చుకొనరాదు. మఱియు దా నొక్కండు ననహా యుఁడై యెందును దగులువడక లోపలి వెలుపలి యింద్రియ ములను రెంటిని నడంచి పుచ్చి యాత్మయందే క్రీడించుట యందుఁ గుతుకము గలిగి పరమాత్మయందే సంతుష్టుఁడై సమస్తమును బ్రహ్మాత్మకములని సమదృష్టి గలిగియుండవల యును. జనులు లేకయు భయము గలుగకయు నుండు చోటు వాసస్థానము గావించుకొనవలయును. మఱియు నాయందలి భక్తిచేత నిర్మలంబగు మనస్సుగలవాఁడై తనయాత్మయుఁ నావలెనే జ్ఞానైకరూపమైనదని చింతింపవలయును. తనకు బంధ హేతువును మోక్షహేతువును తత్త్వజ్ఞాననిష్ఠచేతఁ బర్యాలో చింపవలయును. ఇంద్రియములు విచ్చలవిడిగా నుంచుటయే బంధము. వాని నడంచిపుచ్చుటయే మోక్షము. కాఁబట్టి మన స్సుతోఁ గూడిన యింద్రియము లయిదింటిని నడఁచిపుచ్చి నా యందే భక్తిభావముగలిగి క్షుద్రములగు కామములైనశబ్దాది విషయములందు విరక్తుఁడై యాత్మస్వరూపమం దపారమయిన సుఖమును బడసి చరింపవలయును. మఱియు భిక్షార్థము పురము లను గ్రామములను గొల్లపల్లెలను సాత్త్వికజనసమూహముల

నును జొచ్చుచును మహియందెల్లఁ బుణ్యాగులగు దేశములను నదులను బర్వతములను వనములను నాశ్రమములను సంచరింపవలయును. వానప్రస్థు లున్నయాశ్రమప్రదేశములందు మాటిమాటికి భిక్షుగొనవలయును. ఏలనఁగా వారు శిలవృత్తిచేతఁ బడయు నన్నమును దినుటచేతఁ దాను శుద్ధసత్త్వుఁడై మోహము నివర్తించి ముక్తి నొందుచున్నాఁడు. కావుననే యందు మాటికి భైక్ష మాచరించుచున్నాఁడు. (కామములవలన విరక్తుఁడగుటకు నుపాయము వినుము.) ఈకనఁబడుచున్న శబ్దాది విషయజాలమును వాస్తవముగాఁ గనుఁగొనరాదు. ఏలన నవి నశించునట్టివి. దీనినిబట్టి పారలౌకికవిషయములందును జిత్తము దగులువడ కుండవలయును. ఇహపరములందలి కామములను సాధించుటకైన కార్యములనుండి విరమింపవలయును. ఇట్లు చక్కఁగా వివేకముచేత విరక్తుఁడు గావలయును. మఱియు బుద్ధి యింద్రియములు మనస్సు ప్రాణములు పంచభూతముల నెడి వీని కూడికచేతనయిన యీజంగమ శరీరము ప్రకృతి పరిణామాత్మక మని వితర్కించి బ్రహ్మాత్మకంబగు తన యాత్మస్వరూపమందే కుదురుగా నెలకొని దానినే చింతనము సేయుచు శరీరమం దాత్మాభిమానమును వదలి మరల నాశరీరము నాత్మగాఁ దలంప కుండవలయును. భగవంతుఁడే పరమప్రాప్యమును బ్రాపకమును, నామనోరథమందుఁగల తక్కిన వంతయు నతఁడే యనెడి యధ్యవసాయమే వైరాగ్యయుక్తమగు జ్ఞానము. అట్టి విరక్తిగలజ్ఞాననిష్ఠుఁడుగాని, ఫలాపేక్షలేకుండు మద్భక్తుఁడుగాని యుపాయము తమకు నిష్పన్నమై యుండుటంబట్టి విధిని బట్టి ప్రవర్తింపవలయు నని కాని నిషేధమునుబట్టి నివర్తింప

వలయునని కాని యొక నియతికి లోనుగాకుందురు. వారన్నియు నావిధినిషేధములను బట్టి కాక భగవత్కైంకర్యములని చేయుచుందు వారు. కనుక, వారాశ్రమములును వాని లింగములును దమ ముక్తి యుపాయమునకుఁ దోడుపడునట్టి వనుబుద్ధి గలిగి యుండరుకాని, భగవత్కైంకర్యము లని తలంచుటచే స్వరూపముతో వానిననుష్ఠించుటవదలకుందురు. అట్టివాఁడు వివేకవంతుఁడుగా నుండినను బాలునివలెఁ గ్రీడించు చుండవలయును. నేర్పరియైనను జడునివలెఁ జరించు చుండవలయును. విద్వాంసుఁడయినను వెఱ్ఱి పట్టిన వానివలెఁ బలుకవలయును. వేదార్థనిష్ఠుఁడయినను బశువువలె (నజ్ఞునివలె) నడచుకొనవలయును. వేదవాదము లందాసక్తుఁడుగాఁదగదు. పాషండియుఁగారాదు. కేవలము తర్కనిష్ఠుఁడును గారాదు. పనికిమాలిన ముచ్చటలకుఁగాని రచ్చలకుఁ గాని యెవరి పక్షమును జేరరాదు. ధీరుండై జనులకు భయపడరాదు. జనులను భయపెట్టుటయుఁ దగదు. దురుక్తములను సయించుకొన వలయును. ఎవరినిగాని యవమానింపరాదు. భూతపరిణామము లయిన దేవమనుష్యాది దేహములందుండెడి ప్రత్యగాత్మలయందు నెలకొనియున్న పరుండయిన పరమాత్ముఁడు, జలపాత్రములు పెక్కింటియందుఁ గనఁబడుచున్న చంద్రునివలె నొక్కఁడే యగును. భూతములకెల్లఁ బరమపురుషుఁడే యాత్మగాన దేహమును గూర్చి యెవరితోఁగాని పశువులవలెఁబగపెట్టుకొనరాదు. ఒకటివేళ నశనముదొరకని యెడల ధృతిమంతుఁ డగువాఁడు విషాదము నొందరాదు. ఒకప్పు డశనము దొరకెనా యందులకై యుబ్బరాదు. ఏలనఁగా నది దొరకుటయు దొరకకపోవుటయు రెండును దైవా

ధీనములగును. 'అట్లైని భిక్షయెత్తుటకుఁ బాటుపడవలసినది చాలుఁగదా' యందువా? అట్లుగాదు. ఆహారము కొఱకుఁ బాటుపడియే తీఱవలయును. దాని వలననే ప్రాణములు నిలఁబెట్టుకొనఁగూడును. ప్రాణములు నిలఁబెట్టుకొనుటవలనఁ బనయేమందువా ? దానివలనఁ దత్త్వమును విమర్శించుట గలుగుచున్నది. ఆ తత్త్వమును (అనఁగాఁ జిదచిదీశ్వరుల స్వరూపమును) దెలియుటవలన ముక్తి గలుగు చున్నది. కావున నందుల కుపయుక్తమగు ప్రాణధారణమునకై యాహారమును గొనఁ బ్రయత్నింపవలయును. తాను బాటుపడకయే దైవికముగా దొరకిన యన్నము శ్రేష్ఠమైనది. తక్కినది నికృష్టమైనది. ఆ రెంటియందు దేనినిగాని గుడువవలయును. అట్లె వస్త్రముగాని శయ్యగాని దైవికముగాఁ బ్రాప్తించినదానిని ముని యగువాఁడు గయికొనవలయును. శౌచమును, ఆచమనమును, స్నానమును మఱి తక్కిననియమములను నేను శాస్త్రమును బట్టి కాక లీల కొఱకుఁ జేయునట్లె జ్ఞానియు శాస్త్రముచేతఁగాక 'యిది కైంకర్యము నాస్వరూపమున కనుగుణమైన' దని తలఁచి చేయవలయును. ఇట్టివంటి యాచారముతోఁ గూడి యున్నవానికి బ్రహ్మాత్మకములు గాక స్వతంత్రములై వస్తువు లున్నవనుభేద భ్రాంతి గలుగదు. వానికి సర్వమును మదాత్మకములని బుద్ధి గలిగియుండునుగాన దానిచే నాభేదభ్రమము కొట్టువడిపోవును. అయినను దేహము ముగియునంతలో నెప్పుడేనియొకప్పుడట్టితోఁచిక గలుగవచ్చును గాని, వాఁడు మదాత్మకములనెడి చూపుచేత దేహాంతమందు నన్నుఁ బొందుచున్నాఁడు గాన దేహాంతమం దట్టి తోఁచిక నిరవశేషముగా నివర్తించు

చున్నది. కామములకు మీఁదటిఫలములు దుఃఖములే కాన మిక్కిలి హేయములను నిశ్చయము నొందినవాఁడై యవి యనర్థావహములను బుద్ధియుఁజెంది మత్ప్రాప్తికి సాధనధర్మ మిదియని తెలియనివాఁడు మననశీలుఁడును బ్రహ్మనిష్ఠుండు నగు గురువు సన్నిధి నొందవలయును. మఱియు బ్రహ్మమును దెలిసికొనునంతవఱకును గురువునందు భక్తియు శ్రద్ధయుఁ గలిగియు యనసూయమాని యతఁడే నేనని తలఁచి యాద రంబుగఁ బరిచర్య చేయుచుండవలయును. ఇంద్రియవర్గ మా ఱింటిని నడంచిపుచ్చక, విషయములందు మిక్కిలి యాసక్త మయిన బుద్ధిగలిగి జ్ఞానవిజ్ఞానములు రెండును లేకుండునట్టి వాఁడు, త్రిదండము మొదలగు నాయాయాశ్రమ చిహ్న ములను దాల్చుట, వానినిగొని బ్రతుకుటకే కాని యాయాశ్ర మములను నిర్వర్తించుటకుఁ గాదు. అట్టివాఁడు తాను విశేష భూతుండని తెలియఁడు గాన తన్నును, తాను స్వతంత్రుఁడనెడి యభిమానముచేతఁ దన యాత్మయందున్న నన్నునుఁ బ్రతా రించుచున్నాఁడు. కనుక సర్వాశ్రమములవారికి విహితధర్మ మగు భక్తిని వాఁడు గీడ్పఱచుకొనుచున్నాఁడు. భక్తి లేమిం జేసి వానికిఁ బాపములు దూలకయె యుండును. దానినిఁబట్టి వాఁడిహమునకునుబరమునకును వెలియగుచున్నాఁడు. నాలుగవ యాశ్రమమువాఁడగు భిక్షువునకు నింద్రియ జయమును నహిం సయు ధర్మములు. వానప్రస్థునకు శాస్త్రీయకాయక్లేశరూప మగు తపమును స్వాత్మ పరమాత్మల స్వరూపములను గనుఁ గొనుటయు ధర్మములగును. గృహస్థునకు భూతరక్షయుఁ బంచ మహాయజ్ఞములును ధర్మములగును. బ్రహ్మచారికి నాచా

ర్యని సేవించుట ధర్మము. ఋతువులందుమాత్రము భార్యను బొందునట్టి గృహస్థునకు బ్రహ్మచర్యమును దపమును శౌచమును సంతోషమును భూతములందుఁ జెలిమియుఁ గలుగుచున్నవి. ఎల్లవారికిని న న్నుపాసించుట ప్రధానమయిన ధర్మము. ఎవ్వఁడు దేవతాంతరమునందు భక్తిసేయక సర్వభూతములందు మదాత్మకము లనెడి బుద్ధిగలిగి యిట్లు స్వధర్మముచేత నన్ను భజించుచున్నాఁడో వాఁ డచిరకాలముననే నాయందలి భక్తిని బడయుచున్నాఁడు. ఉద్ధవా ! సమస్తమున కుత్పత్తిలయముల పట్టయినవాఁడును, గావుననే సర్వలోకములకు మహేశ్వరుండును సమస్తమునకుఁ గారణభూతుండును, బరబ్రహ్మభూతుండు నగు నన్ను ననపాయిని యగుభక్తిచేత వాఁడు పొందుచున్నాఁడు. ఇట్టి స్వవర్ణాశ్రమ ధర్మముచేత శుద్ధం బగు సత్త్వము గలిగి నా స్వరూపమును నెఱింగినవాఁడై జ్ఞానవిజ్ఞానసంపన్నుఁడై విరక్తుఁ డగువాఁ డనపాయినియగు భక్తిచేత నన్నుఁ బొందుచున్నాఁడు. వర్ణాశ్రమములు గలవారికి నాచారమనెడి యీ ధర్మము నిరూపింపఁబడినది. ఈ ధర్మము నాయందలి భక్తితోడఁ గూడిన దగునేని ముక్తికి సాధనమగును. మఱి యింతకంటె నుత్కృష్టమయిన యుపాయమును గలుగదు. సాధూ ! నీవు న న్నడిగినందులకు మనుజుఁడు తనతన వర్ణాశ్రమధర్మము ననుష్ఠించుచు భక్తితోడఁ గూడినవాఁ డగు నేని ప్రకృతిపురుష విలక్షణుం డగు నన్నుఁ బొందుచున్నాఁడని నీకుఁజెప్పితిని. ఇది పదునెనిమిదవయధ్యాయము.

-----

{భగవంతుఁడు భక్తియోగమున కశక్తులగువారికి న్యాసము ముక్తిసాధనముగాఁ జెప్పుట.}

శ్రీభగవంతుఁడు — శాస్త్రజన్యజ్ఞానం బగు విద్యయు నుపదేశజన్యజ్ఞానం బగు శ్రుతియు ననురెండును గలవాఁడై శాస్త్ర విరుద్ధముగాని తర్కమును దెలిసి సమాహితచిత్తుం డగువాఁ డీశరీరము ప్రకృతి పరిణామాత్మకమనియు భగవన్మాయచేత రచితం బయినదనియు నెఱింగి జ్ఞానాత్మక మయిన యాత్మ స్వరూపమును సర్వశేషియు సర్వాంతరాత్ముఁడు నగు నాకు లోనయినదిగా ననుసంధింపవలయును. జ్ఞానికిఁ బ్రాప్యము నేనే. కావున, నేనే వానికిఁబ్రియతముఁడు. నేనే వానికిఁ బ్రాపకమును సమ్మతుఁడును. నేను దప్పఁ దక్కిన మోక్షమును గైవల్యమును మఱి తక్కినదేదియును వానికిఁ బ్రియముగాదు. జ్ఞానవిజ్ఞానసంపన్నులగువారు నన్నుఁ బ్రకృతిపురుషవిలక్షణునిఁగాను గావున సర్వోత్తమునిఁగాను నా స్వరూపము నెఱుంగుదురు. కావుననే జ్ఞాని నాకుఁ బ్రియతముఁడగును. నేను లేక తాను నిలువనేరఁ డనుజ్ఞానము వానికిఁ గలిగి యుండును గాన వాఁడే నన్ను భరించుచున్నాఁడు. అనఁగా వాఁడులేక నేనును నిలుపోపకయుందును. జ్ఞాన లేశముచేతఁ గలుగునట్టి శుద్ధిని, దపమును దీర్థములును జపములును దానములును మఱి పవిత్రములయిన యితరములును జేయనోపవు. ఇట్లు జ్ఞానమునిరతిశయ శుద్ధిని గలిగించునదిగావున, దానితోఁ గూడినవాఁడై యంతరాత్మ యగు నేనే ప్రాప్యమును బ్రాపకము నగుదునని యెఱింగి యుద్ధవా! జ్ఞాన విజ్ఞానసంపన్నుఁడ వగు నీవు నాయందలి ప్రేమగలిగి న న్నారాధింపుము.

జ్ఞానవిజ్ఞానము లనెడియజ్ఞములచేత జీవాత్మయం దంతరాత్మనై సర్వయజ్ఞనిర్వాహకుం డైయున్న నన్నారాధించి నన్నే ముక్తిగా మునులు మున్ను పొందినవారగయిరి. ఉద్ధవా! 'మాయాపరిణామం బయినశరీరము నాశ్రయించి వర్తించుచున్న నీయందు నుత్పత్తిస్థితిప్రలయము లనువికారములు శరీరసంబంధమునకు మునుపుగాని కడపటఁగాని గలుగవు. మఱి యాశరీరమునకుఁ గలయీ జన్మాదులు దానికే కాని నీకుఁ గలుగవు. మఱి శరీరమునకు మొదలను గడపలను నాత్మస్వరూపముండు నట్లినడుమనుఁగూడ నుండును గాని శరీరమువలె వృద్ధిక్షయాదులు పొందు చుండవు. కనుక జన్మాదు లచేతనమగు శరీరములకే కాని యాత్మకుఁ గలుగవు! ఆత్మనిత్యుఁడు' అనెను.

ఉద్ధవుఁడు—విశ్వేశ్వరా! 'విశ్వమూర్తీ!ఉపదేశపరంపరచేఁ బ్రాప్తించుటంబట్టి పురాణంబయినదియు వైరాగ్యముతోను విజ్ఞానముతోను గూడినదియు విశుద్ధి గలిగించునదియు నగు నీజ్ఞానమును, విపులముగా మహనీయులకు వెదకఁ దగియుండుటం బట్టి పరమ గోప్యముగనున్న నీదు భక్తియోగమును, నాకుఁ దెలియఁజెప్పుము. ఈశా! ఘోరమయిన సంసారమార్గమందుఁ జిక్కి తాపత్రయమనెడి యెండచేఁ గొట్టువడి మిక్కిలియుఁ దపించుచున్న నాకు నమృతమును (మోక్షసుఖమును) గురియుచున్న నీ పదయుగళమనెడు గొడుగుతప్ప మఱియొక శరణము గానరాకున్నది. సంసార మనుగోతియందుఁబడి కామమనెడి సర్పముచేఁ గఱవఁగా క్షుద్రసుఖములయందు మిక్కుటమయినతృష్ణ నొంది తాపత్రయముచేతఁ దపించుచున్న యీ జనుని నన్నుఁ గృపచేత నుద్ధరింపుము. మఱి యపవర్గబోధకములగు వాగమృ

తములచేత మహానుభావా! తడువు’మనెను. శ్రీభగవంతుఁడు-తొల్లిరాజయినయజాతశత్రుఁడు యుధిష్ఠిరుఁడు మేమెల్లవారును వినుచుండఁగా ధార్మికాగ్రణ్యుఁడయిన భీష్ముని నడిగెను. భారత యుద్ధ ముడిగినపిదప నా రాజు సుహృదులను జంపుటకు విహ్వాలుండై పెక్కులు ధర్మములు విని పిదప మోక్షధర్మముల నడిగెను. భీష్మునిముఖమువలననుండి విన్నట్టి యా ధర్మములను నీకుఁ జెప్పుచున్నాను. అవి, జ్ఞానముతోను విజ్ఞానముతోను వైరాగ్యముతోను శ్రద్ధతోను భక్తితోను గూడియున్నవి. ఈ కనుపట్టుచున్న దేవమనుష్యాది శరీరములయందు శబ్దము స్పర్శము రూపము రసము గంధము విసర్గము శిల్పము గతియుక్తి యనెడి తొమ్మిదియు,నింద్రియములు పదునొకొండును, మహాభూతము లయిదును, సత్త్వాదిగుణములు మూఁడును, ననెడి యీపదార్థములనుజ్ఞానైకాకారములయిన యాత్మవస్తువులను మచ్ఛేషత్వమే స్వరూపముగాఁ గల జీవస్వరూపమును గనుఁగొనుటయె-అనఁగా ప్రకృతిపురుషస్వరూప వివేచనమే-జ్ఞానమని నేను నిశ్చయించితిని.ఆట్టి ప్రకృతిపురుషులకు విలక్షణుఁడును నొక్కఁడును నగు నన్నె యుపాయముగాఁ గొని నాస్వరూపమును బొందవలయుననుటయె విజ్ఞానము. మఱి యీవిజ్ఞానము చేతఁ ద్రిగుణాత్మక ప్రకృతి పరిణామము లయిన దేహములకే జనస్థితి వినాశములు గలుగుచున్నవని కనుఁగొనవలయును. ఆత్మస్వరూప మొకదేహమునుండి మఱియొక దేహమునకుఁ బోవునపుడు మొదటను నడుమను గడపలను దానిని వెంబడించి పోవుచుండును. మరల నాశరీరము ప్రళయమొందినపుడది తానేకరూపమున శేషించి యుండునే కాని కూడఁ

బ్రలయమునొందదు. ఇట్లు వికారమునొందక యుండునట్టిదే యాత్మస్వరూప మని విమర్శించుటయు జ్ఞానంబగును. శ్రుతి ప్రత్యక్షము * ఐతిహ్యము అనుమాన మనెడి యీ నాలుగు ప్రమాణములచేతఁ బ్రమితములగు నా యాకర్మముల ఫలము లందుఁ బూర్వోక్తమగు జ్ఞానముగలవాఁడు విరక్తినొందు చున్నాఁడు. ఇదియె వైరాగ్యము కర్మములకుఁ గలఫలము లొక్కరూపున నెలకొనియుండవు. మఱి యవి తారతమ్యము గలవియు వికారములతోఁగూడినవియునై వినాశము నొందు చుండును గాన వానివలననుండి విరక్తిగలుగుచున్నది. ఇట్లు కర్మము లొక్కతీరుగాక వికారము నొందుచుండుటవలన దృష్టములవలె నదృష్టములును బ్రహ్మాధిపత్యమువఱకును సమస్తమును శ్రుత్యాదులచేఁ బొందు కర్మ ఫలములు నశ్వరములు; కావుననే యమంగళములు దుఃఖగర్భము లని జ్ఞాని యగువాఁడు గనుఁగొనవలయును. అనఘా! నాయందు మిక్కిలియుఁ బ్రీతి గలిగియున్న నీకు భక్తియోగమును సపరికరముగా మునుపే చెప్పితిని. కాన యిపు డుపదేశింప వలసినదిలేదు. ఇప్పుడు చెప్పఁబడినభక్తియోగ కారణములలో నుత్కృష్టమైయంతరంగ కారణ మగుదానిని జెప్పెదను. ఎప్పుడు నమృతతుల్యంబయిననాకథలను వినుట మొదలగువానియం దాదరమును, సంతతము నాగుణము గీర్తించుచుండుటయును

* ఐతిహ్య మనుటచే శ్రుతి మూలకములగు స్మృతి పురాణాదులను గ్రహించునది. శ్రుత్యాదులచేతఁబ్రమితమగుకర్మఫలము స్వర్గాదులు. ప్రత్యక్షసిద్ధ మగు కృష్యాది కర్మఫలము అన్నాదులు. అనుమాన సిద్ధములయినవి ఆరోగ్యాదులు. ఇవి ఔషధాదులచేతఆరోగ్యము గలుగు ననెడి యనుమానము చేత సిద్ధించుచున్నవని తెలియునది.

నాపూజయం దాసక్తియు, నాజన్మకర్మములను బ్రతిపాదించు నుతులచేత నన్నుఁ బొగడుటయు, నామందిర మూడ్చుట యు లుకుట మొదలగుపరిచర్యలయం దాదరమును, సర్వాంగముల చేత నాకు వందనములును, నాభక్తులను మిక్కిలిగాఁ బూజించు టయు, సర్వభూతములును మదాత్మకములనెడి మతియు, నన్నా రాధించుట కుపకరణములగు తులసిపువ్వులు మొదలగునవి గడించు కార్యములకై దేహవ్యాపారము చేయుటయు, లౌకికములగు వాక్కులచేతను నాగుణములను జెప్పుటయు, మనస్సు నాయం దర్పించుటయు, సమస్తములయిన యితరకామములను దిగవిడుచుటయు, నాకొఱకై ధనమును వ్యయము చేయుటయు, భోగములను సుఖములనుదిగవిడుచుటయు, నాకొఱకయిన యజ్ఞములను దానములను హోమములను నతిథిభోజనములను నేకాదశి మొదలయిన వ్రతములనును దపములను సలుపుటయు, మఱి తన యాత్మను నాకధీనముగా సమర్పించుటయు, ననెడి యివి యుద్ధవా! యివి మనుష్యులకు ధర్మములు. వీనివలన నెల్ల నాయందు భక్తిపుట్టుచున్నది. అట్టు భక్తియోగ ముప్పతిల్లి నట్టివానికిఁ బురుషార్థమేది కొఱఁతయగును? అన్ని పురుషార్థము లట్టివానికి సులభము లే యగును. ఎప్పుడు రజస్తమస్సులను గీడ్పఱచినసత్త్వముతోఁ గూడినదై కావుననే రాగాదులచేతఁ గలుషితముగాక యున్న చిత్తము నంతరాత్మ యగునాయం దర్పించునో యపు డట్టిపురుషుఁడు ధర్మమును జ్ఞానమును వైరాగ్యమును నైశ్వర్యమును బొందుచున్నాఁడు. రజస్తమస్సులు మిక్కుటముగాఁగలదై దేహమం దాసక్తమై యున్నచిత్త మింద్రియములు నియమింపఁగా శబ్దాదివిషయ

ములకుఁ బరుగెత్తుచున్నది. అట్టిచిత్తము వ్యత్యస్తముగా, న ధర్మాదులకుఁ గారణ మగునని యెఱుంగుము. నాయందలి భక్తిని గలిగించునది ధర్మము.సమస్తములయిన యాత్మలందుఁ బరమాత్మ యాత్మభూతుఁడై యున్నాఁడని కనుఁగొనుటయే జ్ఞానము. శబ్దాదివిషయము లనర్థహేతువు లని విమర్శించి దానియందుఁ దగులులేకుండుటయె వైరాగ్యము. అణిమాదు లైశ్వర్యములని చెప్పఁబడియున్నది' యనెను.

ఉద్ధవుఁడు—శత్రుకర్శనా! యమముగాని నియమముగాని యెన్నివిధములు? కృష్ణా! యమమనఁగా నేమి? దమ మెద్ది? ప్రభూ! తితిక్షయు ధృతియు ననఁనేమి? దానమన నేమి? తపము శౌర్యము ననఁగా నేమి? సత్య మెద్ది? ఋతమనునది యేమి? త్యాగమేమి? ధన మెద్ది? చేష్టయన నేమి? యజ్ఞమేమి? దక్షిణ యెద్ది? శ్రీమంతా! పురుషునికి బల మెద్ది? కేశవా? వానికి దయయన్నను లాభ మన్నను నేమి? విద్య యెద్ది? హ్రీయెద్ది? పరంబగు శ్రీయెద్ది? సుఖమేమి? దుఃఖ మన నెద్ది? పండితుఁ డెవఁడు? మూర్ఖుఁడెవఁడు? మంచిమార్గ మెద్ది? చెడ్డమార్గ మెద్ది? స్వర్గ మన నేమి? నరక మన నేమి? బంధువన నెవరు? గృహమనఁగా నెద్ది? సంపన్నుఁ డనఁగా నెవరు? దరిద్రుఁడెవఁడు? కృపణుఁ డెవఁడు? ఈశ్వరుఁడు (ఏలిక) యెవఁడు? సత్పతీ! నే నడిగిన యీ యమాదులను విపరీతములగు నయమాదులనును నాకుఁ జెప్పు మని యడిగెను.

శ్రీ భగవంతుఁడు—అహింస (భూతద్రోహము దలంప కుండుట), సత్యము (భూతహితముగాఁ బలుకుట), అస్తేయము (మనస్సుచేతను బరులసొమ్ము గయికొనకుండుట), అసంగము

(దేనియందును దగులు లేకుండుట), హ్రీ, అసంచయము (పరి
గ్రహము లేకుండుట), ఆస్తిక్యము (శాస్త్రార్థములందు విశ్వా
సము), బ్రహ్మచర్యము (స్త్రీ సంగము లేకుండుట), మౌనము
(వృథాలాపము వీడియుండుట), స్థైర్యము (చాంచల్యము లేమి)
క్షమ (ఓర్పు), భయము,ననెడి యీపండ్రెండును యమములు.
శౌచమును, జపమును, తపమును, హోమమును, శ్రద్ధయు,
ఆతిథ్యమును, నన్నర్చించుటయు, తీర్థాటనమును, పరుల కుప
కారము సేయుటయు, దొరకినదానితోఁ దుష్టి నొందుటయు,
ఆచార్యుని సేవించుటయు ననెడి యీ పండ్రెండును నియమ
ములు. వీనిని బూరుషు లుపాసించిరేని కోరిన కోర్కులు పిదుకు
చుండును జుమీ. శమమనఁగా బుద్ధి నాయందు నెలకొని
యుండుట (శాంతి మాత్రముగాదు). దమమనఁగా బాహ్యము
లయిన యింద్రియముల నడంచుట (చోరాదులను నడంచుట
మాత్రముగాదు). తితిక్షయనఁగా దుఃఖముల సయించుట
(గాని బరువు మొదలయిన వానిని సహించుటగాదు). జిహ్వోప
స్థలయురవడిని గెలుచుటయె ధృతిగాని (యూరక మిట్టిపాటు లే
కుండుట కాదు). భూతద్రోహమగు దండమును ద్యజించుటయె
దానము (గాని ధనమునొసంగుట కాదు). భోగములనపేక్షింప
కుండుటయె తపము (గాని కృచ్ఛ్రాదులుగావు). ఆఁకలిదప్పి
మొదలగుస్వభావములకుఁ గ్రిందుపడకుంటయె శౌర్యము(గాని
శత్రువులను జయించుట మాత్రముగాదు). తారతమ్యము
మాని సర్వమును బ్రహ్మాత్మకమని కనుఁగొనుటయే సత్యము
(గాని యథార్థమును జెప్పుటమాత్రముగాదు.) కన్నదానిని

గన్నట్టి చెప్పుట ఋతము (గాని యింపుగాఁ జెప్పుటమాత్రము గా) దని కవులు కీర్తించియున్నారు. కర్మములందుఁ గర్తృత్వ ముగల దని తప్పుదలఁపకుండుటయె శౌచము (గాని స్నానా దులవలనఁ గలుగుశుద్ధిమాత్రము గాదు.) కర్మఫలములను త్యజించుటయె త్యాగము (గానికర్మములనుద్యజించుటగాదు.) మనుష్యులకు మద్భక్తినిగావించు ధర్మమే యిష్టంబగు ధనము (గాని విత్తమాత్రముగాదు) అతిశయములగుజ్ఞానభక్త్యాదులు గలవాఁడగునేనేయజ్ఞము. జ్ఞానోపదేశము సేయునదియె దక్షిణ (గాని హిరణ్యాదిదానములుమాత్రముగాదు). ప్రాణాయామమే పరమంబయినబలము (కానిదుర్మదబలముగాదు.) భగమనఁబడి నయైశ్వర్యవీర్యాదికము నాయీశ్వర సంబంధియగు స్వభావము. (పరులదుఃఖముల నిరసింపఁగోరుటయే దయ). ఉత్తమమయిన నాయందలి భక్తియేలాభము (గాని పుత్రాదులు గారు.) ఆత్మ యందు దేవమనుష్యాదిభేదభావము నుడుగుటయె విద్య (గాని జ్ఞానమాత్రముగాదు). నిషిద్ధకర్మములను హేయములుగాఁ దలఁచి రోయుటయే హ్రీ యనఁబడునుగాని (లజ్జామాత్రము గాదు). అపేక్షలేకుండుట దొరకినదానితోఁ దృప్తినొందుట మొదలయిన గుణసముదాయమే యలంకారము (గాని కిరీటా దులుగావు). దుఃఖమిశ్రమయిన సుఖముతొలఁగుటయె సుఖము (గాని భోగముగాదు.) శబ్దాదివిషయ సుఖాపేక్షయే దుఃఖము. బంధమోక్షకారణములను దెలిసినవాఁడే పండితుఁడు (గాని విద్వాంసుఁడు మాత్రముగాదు). దేహాదులనే తన్నుఁగాఁ (ఆత్మగా) దలంచువాఁడు (అనఁగానహంకారమమకారములు గలవాఁడు) మూర్ఖుఁడు. నన్నుగుఱించిన జ్ఞానమే మంచిమార్గ

ముగాని (ముల్లు మొదలగునవి లేనట్టిమార్గముగాదు), శబ్దాది విషయములందుఁ జిత్తము దగులుపడుటయే చెడ్డమార్గము (గాని దొంగలు మొదలగువానిచే నెరసినట్టిమార్గముగాదు). సత్త్వగుణము నభివృద్ధియే స్వర్గము (గాని యింద్రాది లోకము గాదు.) తమస్సు నభివృద్ధియె నరకముగాని (తామిస్రాదినరకములుగావు.) గురుఁడేబంధుఁడు (కాని తండ్రితోఁబుట్టువులు మొదలగువారు గారు). ఆగురుఁడును నేనే. మనుష్యశరీరమే గృహము (గాని మేడలుప్పరిగలు మొదలగు భోగస్థానములు గావు). సద్గుణశాలియే సంపన్నుఁడు (గాని ధనికుఁడుగాఁడు). దొరకినదానితోఁ దృప్తినొందనివాఁడే దరిద్రుఁడు (గాని ధనహీనుఁడుగాఁడు). ఇంద్రియములనుజయింపనివాఁడే కృపణుఁడు (గాని దీనుఁడుగాఁడు). శబ్దాదులందు బుద్ధి దగులకుండువాఁడే యీశుఁడు. (రాజాదులు); అందుఁ బుద్ధిగలిగినవాఁడో యనీశుఁడు. ఉద్ధవా! నీవడిగిన విషయములెల్ల నిట్లు చక్కఁగా నిరూపింపఁబడినవి. ఊరక పెక్కులు నిరూపింపనేల? విషయసుఖములే గుణములుగాను దుఃఖములు దోషములును గాంచుటయే దోషము. అట్టి సుఖదుఃఖములు రెంటిని దోషములుగా నెన్ని వర్తించుటయే గుణము. ఇది పందొమ్మిదవయధ్యాయము.

---

శ్రీకృష్ణుఁ డుద్ధవునకు భక్తిజ్ఞాన కర్మములను నందు భక్తియతిశయమును వర్ణించుట.

ఉద్ధవుఁడు—అరవిందాక్షా! "ఈశ్వరుఁడవగు నీదుశాసనము వేదము. అది విధినిషేధరూపముననున్నది. కనుక విధించుకర్మ

ములుగుణములుగాను *నిషేధించుకర్మములు దోషములుగాను నది యపేక్షింపవలసి యున్నది. మఱియు నది వర్ణాశ్రమభేదములనును,నందుఁబుట్టినప్రతిలోమజాతులను ననులోమజాతులనును, ద్రవ్యమును దేశకాలములను,వయస్సును స్వర్గనరకములనును నపేక్షించుచున్నది. ఇది గుణ మిది దోష మని కనుఁగొనుట లేనిచో నీవు విధినిషేధరూపముగాఁ జెప్పియున్న వచనములు మనుష్యులకెట్లు నిశ్శ్రేయసమును బ్రతిపాదింపఁగలదు? గుణదోషభేదమును దెలిపి ప్రవృత్తినివృత్తు లేర్పఱచి కదా నీ వచనము పురుషార్థ మొసఁగూర్పనేర్చును. కావున గుణదోషదృష్టి యావశ్యకమై యుండఁగా దానిని దోషమని నీవు చెప్పుట యెట్లు? అలౌకికమగు స్వర్గాదులును వానికి సాధనములయిన యర్థములును బ్రత్యక్షాదులకు గోచరింపవు

ఇట్లు సాధ్యములగు స్వర్గాదులును సాధనములగు యజ్ఞాదులును దెలియకుండినపు డీశ్వరా! పితృదేవ మనుష్యులకు శ్రేష్ఠంబయిన చక్షువు నీ యాజ్ఞారూపమగు వేదమేయగును. కాఁబట్టి గుణదోష భేదమునందు దృష్టి, నీ యాజ్ఞారూపమగు వేదము

---

* పూర్వాధ్యాయమున భగవంతుఁడు విషయములందలి సుఖము లను గుణములుగాను దుఃఖములను దోషములనుగాను గనుఁగొనుట దోషమనియు రెంటిని దోషములుగాఁ గనుగొనుట గుణమనియుఁ జెప్పెను. అందుల కిందు నుద్ధవుఁడు వేద'మిది గుణము ఇది దోష'మని కర్మములను నిరూపించుచున్నది. వేదమో నీ యాజ్ఞ. అట్టిది చెప్పుగుణదోషములను దెలియనిచో సిద్ధి గలుగుట యెట్లు? కానగుణదోషదృష్టిని నీవిట్లు దోషమనుట చెల్లునా? అని యడుగుట తెలియునది. దీనికే భగవంతుఁడు బదులు చెప్పువాఁడై ముందు కర్మజ్ఞాన భక్తుల స్వరూపమును తదధికృతులగువారి నిష్ఠలను జెప్పుచున్నాఁడని తెలియునది.

వలననే కలుగవలయును గాని పురుషునకుఁ దనంతటఁ గలుగ నేరదు చుమీ. ఇట్లుండఁగా నిపుడు 'గుణదోషదృష్టి దోష' మని గుణదోషదృష్టిభేదము నపవాదము సేయుట యెందుల కని తెలియక నాచిత్తము తబ్బిబ్బు పడుచున్నది" యని యడిగెను. శ్రీ భగవంతుఁడు —* మనుష్యులకుఁ గైవల్యము స్వర్గ మపవర్గమను శ్రేయస్సును బోధింపఁగోరి జ్ఞానము కర్మము భక్తియని మూఁడుయోగములు నాచేఁ జెప్పఁబడియున్నవి. కర్మములయందు నిర్వేదము నొందినవారై (యనఁగా వాని ఫలములు దుఃఖము లని విరక్తులై వానికి సాధనమయిన కర్మములను త్యజించిన వారికి జ్ఞానయోగము చెల్లును. ఆ కర్మములందు మనస్సు విరక్తినొందక యుత్సాహము గలిగినవారై స్వర్గకాము లగువారికిఁ గర్మయోగము చెల్లును. ఒకానొక

* ఏ వస్తువుగాని తనంతట గుణమనియుఁ దోషమనియుఁ జెప్ప వలను పడదు. నరకముతోఁ బోల్పఁగా స్వర్గము గుణమగుచున్నది. ఒకదానితోఁ బోల్చి నిరూపించుటనుబట్టి మఱియొకటి గుణమో దోషమో యగుచున్నది. ఆయా నిరూపకుని చొప్పున ఆయావస్తువుల గుణదోషము లేర్పడుచున్నవి. కనుక విధినిషేధశాస్త్రమునిరూపించువానికి స్వర్గమునరకము రెండునుదుష్టము లని గుణదోష భేదము అపవాదము చేయఁబడినది. మోక్షోపాయమో నిరూపకునకుఁగూడ గుణవత్తరమైనది; కాన గుణదోషభేదము తగినదనుట సామాన్యముగాఁ జెప్పినను మోక్షోపాయమునందుఁ జెప్పుటతగదు. కనుక మోక్షోపాయము గుణమనియె గ్రాహ్యము. దీనినే ప్రపంచించుటకై ముందాయా యధికారుల భేదమున కనుగుణముగా ఆయా పురుషార్థ సాధనములేర్పడి యున్నవని చెప్పుచున్నారు. దీనిమూలమున ఆయాయధికారులకు గుణదోషముల నేర్పఱచి ముముక్షువునకు గుణమయినదాని నిరూపించుచున్నారని తెలియునది. ఇచట జ్ఞాన మనఁగా ప్రకృతి వివిక్తమైనయాత్మ స్వరూప చింతనము. ఫలాభిసంధిలేని కర్మయోగమే యిచట కర్మము. భక్తియోగమే భక్తియని చెప్పఁబడినది.

భాగ్యవిశేషమువలన నా కథలను వినుట మొద లగువాని యందు నాదరముపుట్టి పూర్వవాసనచేత నిప్పుడును కర్మఫలములందు విరక్తి పూర్ణముగాఁ గలుగక, యపేక్ష వాసనామాత్రముగా నుండియు వానియందలి దోషమును గనుఁగొనుటచేత నాసక్తియంతగాలేక, యున్నవానికి భక్తియోగము తన్ననుష్ఠింపఁగా నపవర్గసిద్ధిగలిగించుచున్నది. ఎంతవఱకుఁ గర్మములందు మిక్కిలియు నిర్వేదము గలుగకుండునో, యెంతవఱకుమత్కథాశ్రవణాదులందు శ్రద్ధపుట్టకుండునో, యంతవఱకు ఫలాభిసంధిమాని వర్ణాశ్రములకుఁ [1]దగినకర్మములను జేయుచుండవలయును. ఇట్లు మోక్షముగలుగువఱకును స్వధర్మములగు సంధ్యోపాసనాద్యాచారములందు నిష్ఠ గలిగి పంచమహాయజ్ఞములచే నన్ను యజించుచు ఫలములం దాశమానియుండువాఁడు స్వర్గనరకములను బొందఁడు; నాయందలిభక్తియోగము పుట్టినవాఁడై నన్నే పొందును. కనుక ఫలాభిసంధితోఁ గూడిన కర్మము ననుష్ఠింపరాదు. స్వర్గనరకములను బొందఁడేని మఱి దేనిని బొందునందువా? వాఁడీదేహముతో వర్తించుచు నిషిద్ధకర్మములువదలి స్వధర్మము లనుష్ఠించుచు శుచియై విశుద్ధంబగు [2]జ్ఞానయోగమును గాని యేదేనొకభాగ్యవిశేషము

1. మోక్షము గలుగువఱకు వాసనమాత్రము అనువర్తించుచుండును గాన ఫలాభిసంధిలేక కర్మము ననుష్ఠించుచునే యుండవలయునని తెలియునది.

2. జ్ఞానయోగమందు శ్రద్ధ గలుగునంతవఱకును జ్ఞానయోగాధికారికిం గూడ ఫలాభిసంధిలేనిదియువర్ణాశ్రమోచితమైనదియునగు కర్మమనుష్ఠించియే తీరవలయునని యిందేర్పడియున్నది. జ్ఞానయోగము భక్తియోగమున కుపకారకమే. ఐనను జ్ఞానయోగము పరిపక్వముగాకమునుపే యొకానొక భాగ్యవిశేషముచే మొదటనే భక్తియోగమును బొందుటయుఁ గలుగవచ్చును.

చేతనైవికముగా మద్భక్తియోగమునుగాని పొందుచున్నాఁడు. **ఈదేహము** జ్ఞానభక్తులు రెంటిచేతఁ గైవల్యమోక్షములకు సాధకమయినది. కాఁబట్టి స్వర్గస్థులును నరకస్థులును నీ మనుష్యదేహమును గోరుచున్నారు. అయినను స్వర్గస్థులదేహమును నరకస్థులదేహమును రెండును నాకై వల్యమోక్షములకు సాధకములుగా నేరవు కుశలుఁడగువాఁడు నరకోపాయమును వలె స్వర్గోపాయమునుగూడఁ గాంక్షింపరాదు. దృష్టాదృష్టసుఖసాధనమున కుపయుక్తమయిన యీదేహమును మరలఁ గాంక్షింపరాదు. అట్లు కాంక్షించినచో దృష్టాదృష్టములగు దేహసుఖములం దభినివేశము గలుగుచున్నది. దానివలన మోహము నొంది కడపట స్థావరత్వమును బొందుచున్నాఁడు. 'నేనడుగని దిదియేల చెప్పుచున్నా'వనవలదు. ఎవఁడు మరణమునకుఁ బూర్వమే శరీరము దృఢముగా నుండునపుడే యీమనుష్యశరీరము క్షణశీలమయ్యును నిరతిశయ పురుషార్థసిద్ధికి నుపయుక్తమని తెలిసి యవహితచిత్తుఁ డగునో యా విద్వాంసుఁడు మోక్షమునకై ప్రయత్నించును. కనుక నేను జెప్పిన యీవిషయములనెఱుంగుట యసంగతముగాఁ జెప్పలేదు. ఒకపిట్ట తాను గూఁడుకట్టుకొనియున్నవృక్షమునొకఁడుయమునివ లెదయమాలి నఱకుచుండఁగాఁ జూచి తన యునికిపట్టును వీడి యాశవాలి సుఖము నొందుచున్నది. అట్లె శరీరమనెడు వృక్షమునందు హృదయ మనుగూఁట నున్నపక్షివంటిజీవుఁడు కామమువీడి తనపట్టునువీడి (నశ్వరమగు శరీరపు సంబంధమును వదల్చుకొను వెరవు నెఱింగి) క్షేమము నొందుచున్నాఁడు. మనుజుఁడు

త్వన యాయువును, రేలును బగళ్లును ద్రుంచుచుండుటను జూచి భయముచే వడంకుచు సంగముపీడి ప్రకృతిపురుషవిలక్షణుం డగు నన్ను నెఱింగి యుపాసించి ప్రకృతి సంబంధమునుండి విరతి నొందుచున్నాఁడు. మనుష్యదేహ మిది సర్వఫలములకు మూలమైనది. కోట్లకొలఁది ప్రయత్నములుచేసినను దీనిని బడయుట యశక్యమయినను, దైవికముగాఁ గలిగియున్న దగుటచే సులభమైయున్నది; అన్ని సాధనములకు నర్హమయినది. ఇది సంసారసముద్రమును ద్ాఁటుట కొక తెప్ప యైనది. దీనికి మాలిమి గురుఁడు. నేను దీని కనుకూలవాయు వై నడపుచుందును. ఇట్టి తెప్పచేత సంసారసముద్రమును దాఁటని వాఁడాత్మ నాశము చేసినట్టివాఁడే యగును. ఎప్పుడు కామ్యకర్మములను దుఃఖములుగాఁ గనుఁగొనుటచే మిక్కిలియు వాని యందు వెగటునొంది వానిఫలములందును కడువిరక్తుఁ డగునో యపుడీ యోగియగువాఁడు బాహ్యాభ్యంతరము లయినయింద్రియముల నడంచి యభ్యాసముచేతఁ దనమనస్సును నచలముగా నుండునట్లు నాయందు నెలకొలుపవలయును దాని నట్లు పట్టుకొలుపుచున్నను నది యితర విషయములందుఁ దిరుగుడు వడుచు వేగ నిలుకడలేనిదే యగును. అప్పుడు వాఁడు పరాకువడక యామానసముపోయినదారి ననుసరించుచునే యుపాయముచే దానిని దనవశము చేసికొనవలయును. ఎంత నడఁచి పుచ్చినను మనస్సు నిలువలేదే యని యూరకుండరాదు. మఱి ప్రాణములను నింద్రియములను జయించి సాత్త్వికాహారమువలనఁ బుష్టి నొందిన సత్త్వముచేతను బరిశుద్ధమయిన బుద్ధిచేతను దానిని మెల్లమెల్లగాఁ దనవశమునకుఁ దెచ్చుకొన

వలయును. సులువుగాఁ బనుపడరాకున్న గుఱ్ఱమును సారథియగువాఁడు తాను మనస్సులోఁ దలఁచిన రీతిని బోవునట్లు చేయఁ గోరి మొదట నది పోయినదారినే పోయి మెల్ల మెల్లగా దాని నడంచి తన త్రోవకుఁ ద్రిప్పునుగాని యూరకుండఁడు. అట్లె మనస్సును మొదట నది పోయినదారినే యనుసరించుచు మెల్లమెల్లగా దాని నడంచి లోపఱచుకొనవలయును. ఇట్లు మనస్సును లోపఱచుకొనుట యాత్మ వశీకరణమునకు సాధనము గనుక బరమంబయిన యోగమగును. తత్త్వముల వివేకముచేసి మహత్తు మొదలుగాఁ బృథివి వఱకుఁ గల సమస్తభావములును బ్రకృతిని మొదలుచేసి యనులోమముగా నుత్పత్తియుఁ బృథివిని మొదలుచేసి ప్రతిలోమముగా లయమును బొందుచుండుటను మనస్సు ప్రసన్నముగా నుండు నంతవఱకు ధ్యానించుచుండవలయును. ఇట్లు తత్త్వవిచారముచేతఁ జింతితములయిన సృష్టి ప్రలయాదులనే మరలఁ జింతించుటవలన సంసారమునందు వెగటు నొంది విరక్తుఁడయి మనస్సును నిగ్రహించుటకై చెప్పఁబడిన మార్గమును నెఱింగిన వాఁడు మనస్సునకు శబ్దాది విషయములందుఁగల యాసక్తిని దిగవిడుచుచున్నాఁడు. యమము మొదలయిన యోగమార్గములచేతను తత్త్వ విమర్శనంబగు విద్యచేతను మదర్చనధ్యానాదులచేతను మఱి యట్టి యుపాయములచేత యోగ్యుం డగు పరమాత్ముని నన్ను స్మరింప వలయును. ఇట్లు చేసిననే మనస్సు తన విషయాసక్తిని వదలును గాని మఱి యితరములచేత వదల నేరదు. 'మనస్సు విషయాసక్తినొందుటకు దురితమే మూలము కనుక యోగికిఁ గూడ నట్టి దురితము

గలుగుట గలదు గాన దానిని బోఁగొట్టుటకుఁ బ్రాయశ్చిత్తా దు లగు నితర ప్రయత్నములు చేయవలసియుండఁగా మఱి యితరములను జేయరాదనుట యెట్టు' లందువా? యోగి ప్రమాదవశమున నిషిద్ధ మగు కర్మము చేసెనేని, యప్పు డా దురితము దాని యనుధ్యానమనెడి యోగాభ్యాసముచేత నే కాల్చిపుచ్చవలయును గాని యితరములగు కృచ్ఛ్రాదియ త్నము లొకప్పుడు దానికి వలదు. [1] తన తన వర్ణాశ్రమాను గుణమయిన యధికారధర్మమునందు నిష్ఠ గలిగియుండు టయే గుణము. [2] అట్లధికారమున కనుగుణమయిన నిష్ఠ లేకుం డుటయే దోషము. గుణదోషముల రెంటికి నిదియే స్వరూప నిర్ణయము. స్వభావముచే నశుద్ధములగు కర్మములను నశుద్ధిని గలిగించు సంగములను వదలునట్లు చేయఁ గోరి ముముక్షు వగువానికే యిట్లు ' విషయసుఖములను గుణములనియు దుఃఖములను దోషములనియుఁ గాంచుట దోషము. రెంటిని దోషములుగాఁ గాంచుట గుణము' అని గుణదోషములను విధించి నియమము గావించితిని. ఇది [3] ము

---

1. ఇంతవఱకు ఆయాయధికారులకుఁ గల ఆయాసాధనముల యేర్పా టును జెప్పి యిప్పు డడిగిన ప్రశ్నమున కుత్తరము చెప్పువాఁడై మొదటగుణ దోషముల స్వరూపముల నిరూపించుచున్నాఁడు.

2. శూద్రునకు బ్రాహ్మణ ధర్మమును, విరక్తి లేనివానికి సన్న్యాస ధర్మమును, విరక్తునకు బ్రాహ్మణధర్మమును దోషములని తెలియునది.

3. ఉద్ధవుఁడు 'వేదములు గుణదోషములను విధించుచున్నవి. కాన యా గుణదోషభేదమును బాటింపక ముక్తిఁ జెందుట యెట్లని యడుగఁగా భగ వంతుఁ డింత వఱకు నాయాయధికారుల సాధన భేదమును జెప్పి యిట్లు తాను జెప్పిన గుణదోషభేదదృష్టి యింతవఱకు వర్ణించిన యా యాయధి

ముముక్షువునకే కాని బుభుక్షువునకుఁ గాదు గాన విరోధము లేదు. కామ్యకర్మములందు వెగటు గలిగియు దానియందు విరక్తి యింతకును బొందక, కామములను దుఃఖాత్మకము లని యెఱింగియు దానిని విడుచుటకు సమర్థుఁడు గాక, యుండిన ను నాదుకథలయందు శ్రద్ధ పుట్టినవాఁడై నన్ను భజింపవల యును. ఆ భక్తివలననే సర్వమునొడఁగూడునని దృఢనిశ్చయ ముగలవాఁడై యా నిశ్చయమందును శ్రద్ధ గలిగి, యిట్లు కామముల ననుభవించుచున్నవాఁ డయినను వానికి మీఁద దుఃఖములే ఫలములని వానిని నిందించుచునే నన్ను భజింప వలయును. ఇట్లు చెప్పఁబడిన భక్తి యోగముచేత మునియగువాఁడు నన్ను మాటిమాటికి భజించుచున్నాఁడు. అట్టి వానికి హృదయమందు నేను నెలకొనియుండుటం బట్టి యందుఁ గల కామములన్నియు నశించుచున్నవి. అనఁగా వాఁడు భక్తిచేత నన్ను హృదయమందు నెలకొలుపఁగానే నే నందుఁగల కామములనెల్ల నాశము సేయుచుందును. వాని హృదయమందు నెలకొనియున్న యఖిలాంతరాత్ముఁ డగు నేను దృష్టుఁడను గాఁగానే (యనఁగా దర్శనసమానాకార మగు భక్తికి * విషయభూతుఁడు కాఁగానే) యట్లు భజించు వానికి

కారుల సాధనతారతమ్యమువలన బుభుక్షువునకే కావలసినది గాని ముముక్షువున కక్కఱలేదని తెలియఁదగు ననియు ముముక్షువును గుఱించియే యట్లు తాను దాని కపవాదము చెప్పినట్లును విశదీకరించి యాప్రశ్నమునకు సమాధానము చెప్పినవాఁడయ్యెను.

* భక్తియోగమున భగవద్దర్శనము లేకున్నను ఆభక్తి తైలధారవలె అవిచ్ఛిన్నమై దర్శన సమానమై యుండును గాన భగవద్దర్శనముతో సాటి యే యగునని భావము.

హృదయము నందలి గ్రంథి (అనఁగా ముడివలె విడిపింపరాక పెనఁగొనియున్న దేహాత్మాభిమానస్వతంత్రాభి మానములు) ప్రిదిలి పోవుచున్నవి. కావుననే 'నేనేమి దేహమునకన్న వేఱా? దేహమే నేనా? పరతంత్రుఁడనా? స్వతంత్రుఁడనా? యని యిత్యాదులగు సంశయము లెల్ల ఛిన్నములగుచున్నవి. మత్ప్రాప్తికిఁ బ్రతిబాధకములయిన వాని పుణ్యాపుణ్యకర్మ ములన్నియును క్షయించుచున్నవి. ఇట్లు భక్తి యోగము సర్వ సిద్ధిప్రదము. కాఁబట్టి మద్భక్తితోఁ గూడినవాఁడై కావుననే నిరతిశయప్రీతి విషయుం డగు నాయందుఁ జిత్త మిడి యున్నయోగికిఁ బ్రకృతి వియుక్తాత్మోపాసనరూపం బగు జ్ఞానయోగముగాని దాని కుపయుక్తమగు వైరాగ్యముగాని శ్రేయస్సాధనములుగావు. ఇఁకఁ గర్మయోగము నట్టిది గా దన నేల? కర్మములచేతను దపస్సుచేతను జ్ఞానముచేతను వైరా గ్యముచేతను యోగముచేతను దాన ధర్మములచేతను తీర్థ యాత్ర వ్రతములు మొదలుఁగాఁగల తక్కిన శ్రేయస్సాధన ములచేతను నేదేది కలుగఁగూడునో దాని నంతయు, మఱి స్వర్గమును గైవల్యమును నాస్థానంబగు మోక్షమును, నాభ క్తుఁ డగు వాఁడు కోరిన యెడల వీని నంతయును నాయందలి భక్తియోగముచేత సులభముగానే పొందుచున్నాఁడు. సాధు వులును ధీరులు నై నన్ననుభవించుట మాత్రమే ప్రయోజన ముగాఁ గలిగియున్న యేకాంతులగు *నాభక్తులు కైవల్యమును

---

* భక్తులకు భగవదనుభవమే ముఖ్యప్రయోజనమై భక్తి మోక్షాదుల కంటె స్వాదుతమముగా నుండుటంబట్టి కైవల్యాదులనుభగవంతుఁడే యిచ్చి నను వారొల్లరనిభావము. మోక్షమునందును భగవదనుభవమేక ద్యాఫలము. ఆ ఫల

మోక్షమునను నేనై యిచ్చినను గోరనుగూడఁగోర నొల్లరు. ఏకాంతభక్తియే నిశ్శ్రేయసమునకు సాధనము. కాఁబట్టి, యట్టి భక్తులు ముక్తి నెంత మాత్రమును గోరక మిక్కిలియు గొప్ప నిరపేక్ష గలిగియున్నను నదియె వారికి ముక్తి గలిగించు చున్నది. కాఁబట్టి దృష్టాదృష్ట ఫలములం దాశ యుడిగి యపవర్గమునందు నయిత మపేక్ష లేక యుండువానికి నాభక్తి యంతరాయములచేఁ గొట్టు వడక చెలంగు చుండును. కనుక భక్తియోగమును మిక్కిలియు నిరపేక్షుఁ డగువానియందే నెలకొనియుండును. నాయం దనన్యప్రయోజన మగు భక్తిగలవారై గుణదోషములు రెంటను సమం బగు చిత్తము గలిగి గుణదోషములను రెంటిని వర్జించుటయే ధర్మముగాఁ గలవారు నగు సాధువులకు గుణదోషములను దెలియుచుండుట వలననే పుట్టునవయిన రాగద్వేషాదిగుణము లెంత మాత్రము గలుగ నేరవు. నే నిట్లుపదేశించిన యీమోక్ష మార్గముల ననుష్ఠించు నట్టివారు పరమబ్రహ్మంబని తెలియంబడు నాదు స్థానమును సుఖముగాఁ బొందుదురు. ఇది యిరువది యవయధ్యాయము.

---

భగవంతుఁ డుద్ధవునకు దేశకాలాదుల శుద్ధత్వా శుద్ధత్వముల విధమును జెప్పుట.

శ్రీభగవంతుఁడు—నాప్రాప్తికినుపాయమార్గము లయినకర్మ యోగ జ్ఞానయోగ భక్తియోగములను విడిచి యెవరు చంచల

---

మీభక్తియోగమందే సిద్ధమైయుండఁగా దాని నేల కోరవలయునని వారి కందు వాంఛ లేకుండుటకుఁ గారణముగాఁ దెలియునది.

ము లగు నింద్రియములచేత క్షుద్రము లగు శబ్దాదివిషయము
లను ననుభవించుచుందురో వారు సంసారమునొందుదురు. తన
తన వర్ణాశ్రమముల కనురూపమయిన యధికార మగు నాయా
ధర్మమునందు నిష్ఠ గలిగియుండుటయె గుణమని చెప్పఁబడి
నది. అట్టి నిష్ఠ లేనిచో నది దోషమనఁబడినది. గుణ దోషములు
రెంటికి నిట్లు స్వరూపములు నిశ్చయింపఁబడినవి. దేశము కాల
ము ద్రవ్యము కర్త మంత్రము కర్మము ననెడి పదార్థము లన్ని
యుఁ బంచభూతాత్మకము లగుటవలన సమానములేయగును.
అయినను ద్రవ్యమిదియోగ్యమా? అయోగ్యమా? యని సందే
హము మూలమున దాని స్వాభావిక ప్రవృత్తిని దెలియుకొఱకు
నా దేశకాలాదివస్తువు లన్నిటియందును దాని యోగ్యతా
యోగ్యత్వములు విధింపఁబడుచున్నవి. అట్లు ద్రవ్యమును విచి
కిత్స చేయుటవలననే వారివారి యధికారములును అధికారములు
గానివియు గుణదోషములును దెలియుచున్నవి. మఱియుధర్మము
కొఱకును నిది యుపాదేయ మిది యనుపాదేయ మని వ్యవహ
రించుకొఱకును ధర్మమునకు విరోధము లేకయె దానికుపయుక్త
మగు శరీరమును రక్షించుకొఱకును నిది యంతయు శుద్ధి యశుద్ధియను రెంటి వివేకముచేతఁ గలుగుచున్నది. తమ యధి
కారమనెడు ధర్మమును వహింపఁగోరువారికి శుద్ధిని నశుద్ధిని
వేఱువేఱఁ దెలిసికొని ప్రవర్తించుట యనెడి యీ యాచారము
తెలుపఁబడినది. బ్రహ్మ మొదలుకొని స్థావరములవఱకుఁ గల
ప్రాణుల శరీరములను గావించిన వగు భూమి, యప్పు, తేజస్సు,
వాయు, వాకాశ, మనెడి ధాతువులైదు గలవు. దానితోఁగూడ
నంతరాత్ముఁడనై నేనుగూడియున్నాను. కనుక సమస్తములయిన

పదార్థములు చిదచిదీశ్వరులను మూఁడు తత్త్వములు శ్రేష్ఠ నయినవిగానుండుటచే నొకటి కొకటి సమానములే ; యగు చున్నవి. ఇట్లు బ్రహ్మ మొదలు స్థావరములవఱకుఁ గల పదార్థ ములు సమానాకారములై యున్నను వాని శరీరములను గావించు ధాతువులయిన భూమి మొదలయిన భూతములకు వివిధములయిన నామరూపములు వేదముచేత [1] విధాతవలనఁ గల్పింపఁ బడుచున్నవి. ఇటు కల్పించుట సంసారులయిన యీ జీవులకు స్వార్థసిద్ధి కుపయుక్తమగు నధికారనిష్ఠ కల్గు టకొఱకని తెలియునది. దేశకాల ద్రవ్యకర్తృ మంత్రాద్ది రూపమున వస్తువుల శుద్ధియును నశుద్ధియును నేను. కర్మము లకుఁగల దేశకాలాదినిష్ఠలను నియమించుకొఱకును విపరీతాధి కారములకుఁ బోక తమతమయధికారములనే యనుష్ఠించుకొఱ కును వానిని వేఱవేఱ తెలుపుచున్నాను. కృష్ణమృగము తిరుగుట లేనిదియు బ్రాహ్మణభక్తి శూన్యము నగు దేశ మశుచి యగును. ఆ రెండు గలదేశము శుచియగును. కృష్ణమృగ ముండినను [2]సౌవీర దేశమును గీకట దేశమును సంస్కారము లేక మ్లేచ్ఛులు మిక్కిలిగాఁగల దేశమును ఊషర దేశమును నశుచియెయగును. మంచి కర్మముతోఁగూడినకాలము శుచియగును. అది ద్రవ్య సంపత్తిచేతఁగాని పూర్వాహ్ణమగుట మొదలగు వానిచేఁ దనం

1. బ్రహ్మసృష్టి కాలమున మనస్సునందున్న వేదమునఁగల దేవమనుష్యాది శబ్దములను దలంచి వానియాకారమును ఆదేవమనుష్యాదులనును సృజించు చున్నాఁడను శ్రుతి యిట యనుసంధించునది.

2. సౌవీర మనఁగా సౌరాష్ట్రము. మగధ కళింగాదులు కీకట దేశము. 'అంగవంగకళింగేషు సౌరాష్ట్ర మగధేషుచ। తీర్థ యాత్రాం వినాగత్వాపు నస్సంస్కారమర్హతి' అనుట స్మరించునది.

తటనే కాని, గుణవంతమై యుండును. ఏకాలమందు ద్రవ్యము దొరకనందుచేతనో, రాష్ట్రవిప్లవము చేతనో యారంభించిన కర్మము సమాప్తినొందకుండునో, యేది సూతకాదులందు దశాహాది రూపముననుండునో *యట్టి కాలము కర్మముల కనర్హముగాన యశుచి యగును. వస్త్రము మొదలైన ద్రవ్యములకు, మృత్తు జలము ఎండ యగ్గి మొదలయిన ద్రవ్యముచేత శుద్ధి గలుగుచున్నది; మూత్రాదులచేత నశుద్ధిగలుగుచున్నది. ఒకటి శుద్ధమా యశుద్ధమా యని సందేహము గలిగినపుడు శాస్త్రబలముచేతఁగాని శుద్ధమే యని బ్రాహ్మణుఁడు చెప్పినను గాని శుద్ధియగును. పుష్పములు మొదలయిన వానికిఁ బ్రోక్షణాది సంస్కారముచేత శుద్ధిగలుగును; మూర్కొనుట మొదలగు వానిచేత నశుద్ధి గలుగును. పర్యుషితాన్నము మొదలగువాని కట్లు సంస్కారముచేత శుద్ధి గలుగదు: క్రొత్తజలము మొదలగు వానికి నల్పకాలముచేత శుద్ధి యగును. అట్లు గానిచో నశుద్ధి గలుగును. మహత్త్వము చేతను నల్పత్వముచేతను శుద్ధియు నశుద్ధియుఁ గలుగుచున్నవి. నదీజలము మహత్తగుటచేత చండాలాదిసంస్పర్శము గలిగినను శుద్ధినొందును. వీథులందలి జలమల్పమగుటచేత నశుద్ధి నొందును శక్తిచేతను నశక్తిచేతను శుద్ధియును నశుద్ధియుఁగలుగును. ఎట్లన, గ్రహణాదికాలములందు స్నానముచేయశక్తుఁడగువానికిస్నానాదులచేత నేశుద్ధిగలుగును. రోగికో యశక్తిచేత శుద్ధియగును, బుద్ధిచేతను శుద్ధియు నశుద్ధి

---

* కాలములు కర్మణ్యములగుట ద్రవ్యాంతర సంబంధముచేతఁగాని తమంతటఁగాని యగును. మథురాదిదేశములును జయన్తి మొదలగు కాలములును భగవత్సంబంధయోగముచేత గుణవంతములగు చున్నవి.

యుఁగలుగును. ఎట్లనఁబుత్త్రజన్మాదులు, గలిగినపుడు, దశాహము గడచిపోయిన వను జ్ఞానముచేత నే శుద్ధియుఁ, గడచిపోలేదను జ్ఞానముచేత నశుద్ధియుఁ గలుగుచున్నవి. ఉత్సవముచేతను శుద్ధి గలుగును. ఎట్లన, భగవదుత్సవాదులందు స్పృశింపఁదగని వానిని స్పృశించినను నాయుత్సవముచేత నే శుద్ధి గలుగుచున్నది. మఱి శోధకు లగు వారు దేశము కాలము వయస్సు మొదలగు వాని ననుసరించి యశుద్ధమగు ద్రవ్యమునకుఁ [1]జాలినంతశుద్ధి గావించుచున్నారు. కావున వానివలనను శుద్ధి గలుగుచున్నది. ధాన్యములు, దారువులు, అస్థులు, తంతువులు, క్షీరాదిరసములు, కంచు మొదలగు తైజసములు, తోళ్లు, ననెడివీనికిఁ,గాలము వాయువగ్ని మృత్తు జలములనెడు వీనిచేత శుద్ధి గలుగుచున్నది. మఱి పార్థివములగు వాని కొండొంటి తోడిసంయోగముచేతను శుద్ధి గలుగుచున్నది. ఎట్లన, నన్నమునకుఁ గేశాదుల యసంయోగముచేతను, ఆజ్యాదుల సంయోగముచేతను, శుద్ధిగలుగుచున్నదికదా. రాగి వస్త్రము మొదలయిన వాని కమేధ్యము తగిలినయెడల వాని కాదుర్గంధమును నాయ

1. 'దేశంకాలం వయశ్శక్తిం ద్రవ్యంద్రవ్య ప్రయోజనమ్। ఉపపత్తి మవస్థాంచ జ్ఞాత్వా శౌచం ప్రకల్ప యేత్' యని స్మృతియందు ద్రవ్యవచనాదులు దెలియునది. అవియె యిట ననుసంధింపఁబడినవి.

2. ధాన్యమునకు గాలి యెండ మొదలగు వానివలన శుద్ధి. దారు పాత్రాదులకు మన్నుచే జలములచేతను శుద్ధి. గజదంతము మొదలయిన యస్థులకు గాలి యెండ మొదలగువానిచే శోషణముగలుగుటవలన శుద్ధి. తంతువులకు జలములచేత శుద్ధి. పాలు మొదలగు రసములకు కేశాది సంస్పర్శముగలిగినను గాఁచుటచేత శుద్ధి. కంచు మొదలగు తైజసములకు నగ్నిచేతశుద్ధి. తోళ్లకు తైలము చేత శుద్ధి.

మేధ్యపు పూఁతయుఁ దుదముట్టఁబోయి తనతనయొప్పటి స్వరూపమునొందువఱకుఁ జింతపండు నీళ్లు మొదలగువానిచేత మాటిమాటికి శుద్ధిచేయవలయును. ద్విజుఁడగువాఁడు స్నానదానతపస్సులచేతను, కర్మానుష్ఠానమున కుపయుక్తమయిన వయస్సు చేతను, శక్తిచేతను, నుపనయనాది సంస్కారముచేతను, సంధ్యోపాసనాది సంస్కారముచేతను, నన్నుస్మరించుట చేతను, దనకు శుద్ధిని గావించుకొనుచున్నాఁడు. ఇట్లు శుద్ధుండై తన యధికారం బగు కర్మము నాచరింపవలయును. ఆ మంత్రమున కాచార్య ముఖమునఁ గల రూపునఁ బ్రయోగము నెఱుంగుటయె శుద్ధి యగును. కర్మమునకు భగవదారాధనములని తలంచి నాయం దర్పణముసేయుట శుద్ధియగును. ఇట్లు దేశము కాలము ద్రవ్యము కర్త మంత్రము కర్మ మనెడి యీ యేడును విశుద్ధములయిననే పురుషునకును నిజాధికారం బగు ధర్మముసిద్ధించుచున్నది. ఇవి యశుద్ధములయ్యెనా యధర్మమె కలుగుచున్నది. ఒక్కయెడ గుణము (శుద్ధి) గూడ విశేషవిధి బలము వలన దోషము (అశుద్ధి) అగును. ఎట్లన రోగికి స్నానాదులు నిషిద్ధములగుచున్నవి. అట్లె దోషమును (అశుద్ధియును) గుణము (శుద్ధి) అగుచున్నది. ఎట్లన యజ్ఞముసేయువాని పశుహింస గుణమే యగును. కనుక విశేషశాస్త్రముచేత గుణదోషములకుఁ గల నియమము సామాన్యశాస్త్రమువలనఁ గలిగిన గుణదోషవిభాగమును బాధించుచున్నది. అనఁగా సామాన్యశాస్త్రమునం దేర్పడు గుణదోషభేదములను విశేషశాస్త్ర మపవదించుచున్నది. పతితు లగువారికి సహ సంభాషణము మొదలయిన కార్యములు పాతకములుగావు. అపతితులకే యా పతితుల

తోడిసంభాషణాదులు పాతకములగును. ఒక్క యెడ గుణమైనదే మఱి యొకచోట దోష మంటినిగదా. అట్లే, శబ్దాది విషయములతోడి కూడిక గృహస్థునకుఁ (బూర్వమె కయికొనఁబడియుండున దగుటచే)స్వాభావికముగా నుండును. కనుక,నతని యెడ నది దోషము గాక గుణమెయగును. అదియె యతికి దోషమగుచున్నది. ఎట్లనఁ గ్రిందఁ బరుండియున్న వానికిఁ బతనము గలుగదు. మీఁదనున్న వానికే యట్టి పతనము గలుగఁగూడును. గదా. మనుష్యుఁ డేయేవిషయము నుండి నివర్తించునో యా యాదానినుండి విముక్తుఁ డగుచు రావలెనుగాని దానితోఁ గూడరాదు. ఇదియే నరులకుఁ బరమధర్మము; మఱి శోక మోహ భయములన్నుఁ బోఁగొట్టునది. శబ్దాది విషయములను గుణములుగాఁ జింతించుచు వానియం దభినివేశము గలిగియుండుటవలనఁ బురుషునకు వానియందు మరలమరల సంగము గలుగుచున్నది. సంగమువలన నావిషయములందుఁ గామము గలుగుచున్నది. కామమువలనఁ గలహము పుట్టుచున్నది. దానివలన దుస్సహమయిన క్రోధము గలుగుచున్నది. క్రోధమువలనఁ గార్యాకార్యములు దెలియని సమ్మోహము గలుగుచున్నది. ఆ సమ్మోహమువలనఁ బురుషునందు వ్యాపకమైయుండు ధర్మ భూత జ్ఞానము, సంకుచిత మగుచున్నది. సాధూ! అట్టి జ్ఞానములేని జీవుఁ డసత్ప్రాయుఁడగుచున్నాఁడు. అట్లు శూన్యత్వమును బొందుటవలన మూర్ఛితుఁ డైనవానివలెను, మృతుఁ డయినవానివలెను; విషయాసక్తుఁడు * స్వార్థమునుండి విభ్రంశము నొం

---

* స్వార్థభ్రంశ మనఁగా స్వపరవివేకజ్ఞానములేకుండుటయని తెలియనది.

దుచున్నాఁడు. వాఁడు విషయములం దభినివేశముచేతఁ దన్ను నెఱుంగఁడు; పరుల నెఱుంగఁడు. మఱి వృక్షము స్వపర వివేకములేక బ్రతుకునట్లు తానును బ్రతుకుచుఁ దోలుతిత్తి వలె వ్యర్థముగా నూర్పుచ్చుచు వర్తించు చుండును. "యజేత స్వర్గకామః" ఇత్యాది రూపమున వినంబడుచుండు స్వర్గాధి ఫలము పురుషార్థమును బ్రతిపాదింపఁ దలంచినవి గావు. మఱి మోక్షసాధనములందు రుచిని బుట్టించుటకై యట్లు ఫలముకీర్తింపఁ బడుచున్నది. "అదృష్టసుఖ మగు స్వర్గాదిక మతిశయించినది. దాని కంటె నపవర్గసుఖ మతిశయించినది" యని యిట్లు మోక్షసుఖము నిరతిశయ పురుషార్థ మని చెప్పు తలంపున స్వర్గాదిఫలము చెప్పఁబడినది. ఔషధము నందు రుచిగల్పించుటకై బెల్లము చక్కెర మొదలగునవియుఁ బోలె మోక్షమునందు రుచికై స్వర్గాదుల ఫలము * కీర్తింపఁ బడెడిని. జన్మమాదిగాఁ దమకు బంధహేతువు లగు కామాద్యులందు మనస్సులు దగిలి వానియందు డిందుపడి తమ శ్రేయము నెఱుఁగక జనులు దుఃఖావహ మగు సంసారమార్గము నందు భ్రమించుచు దానం జేసి తమస్సును జొచ్చుచు స్థావరత్వము నొందువారై యుండఁగా నట్టిమనుష్యులను మరల ననర్థావహములయిన యాకామములందే వేద మెట్లు ప్రవర్తింపఁ జేయును? అట్లేని యది యాప్తమగునా? ఇట్లు ఫలశ్రుతి రుచి గలిగించుటకు మాత్రమే యగుటం బట్టి వేదతాత్పర్యము నెఱింగినవారు ఫలశ్రుతి పువ్వులుమాత్రము పూచి పండ్లు

* 'పిబ నిమ్బం ప్రదాస్యామి ఖలు తే ఖణ్డలడ్డుకాన్। పిత్రైవముక్తః పిబ నఫలంతావదేవతు' అనుట యిట యనుసంధించునది.

పండనిచెట్టువలె పయికిఁ జెవి కింపుగామాత్ర ముండునది గాని నిజమునకు సార్థకమైనదిగాదని తెలియుదురు. కనుక వారు దాని నుపదేశింపరు శబ్దాది విషయములందుఁ గామముగల వారు గాన కృపణులును దృష్టాకులును నైనవారు, కర్మజన్య ము లగు స్వర్గాదులు పట్టిపువ్వులవంటి వయినను బండ్ల వలె బుద్ధి నెంచి యగ్నిసాధ్యము లగు కర్మములం దభిని వేశముచేత వివేకముదూలి యెడతెగని హోమధూపముచేత బడలి సడలి తమ ప్రత్యగాత్మస్వరూపమును దెలియకుం దురు. ఉద్ధవా! అట్టివారు కర్మ విధి ప్రేరితులు నింద్రియ తర్పణ పరులు నగుటంబట్టి యుపాదాన నిమిత్తకారణభూ తుండగు నెవ్వని వలన నీజగత్తు పుట్టుచున్నదో, కనుక నెవ్వఁడీ జగత్తగునో, యెవ్వఁడులేనిచో నిది కలుగనే నేరదో, యట్టి నన్నుఁ దమహృదయమందున్నవాఁడ నయినను దెలియరు సుమీ. చీఁకటి కన్నులఁ గ్రమ్మినవారికి నెదుట నున్నవస్తువులు కూడఁ దెలియవు గదా. మూఢులు, స్ఫుటము గానందున దురవ హమైయుండు మతమును దెలియక కేవలము విషయము లందు మనస్సు దగిలిన వారై యాగ మను నెప మిడి మాం సభక్షణము కొఱకు వ్యర్థముగాఁ బశువులను హింసించుచు న్నారు. కనుక వారు నాస్తికు లగుదురు. వారు మృతినొం దిన పిదపఁ దా మట్లు హింసించినపశువులే తోఁడేళ్లు మొద లగు రూపముల నొంది పరలోకమందుండఁగా వానిచేత నందు హింసింపఁబడుచున్నారు. వారికి హింసించి మాంస భక్షణము సేయుటయం దిచ్ఛయుండెనేని, యందులకు యజ్ఞమే యనుమతి యని తలఁచి హింస సేయుచుందురు. వారికి హింస

యొక వేడుక. కనుక మాంసముదినెడి సుఖమును గోరి పశువులను జంపి యజ్ఞములు చేసి పిత్రాది దేవతలను యజింతురు. ఇట్లు యాగమును నెపము చేసికొని తమ సుఖముననే కోరునట్టివారు గాన వారు ఖలులే యగుదురు నాస్తికులఫల మిది. ఆస్తికుల ఫలము వినుము. ఒకానొక వర్తకుఁడు మిక్కిలి ధనమును గడింపవలయు నని కోరి యంతకుమునుపే నంతరించి యున్న ధనమును విడిచి సముద్రమును దాఁటం గోరి రెంటికిని భ్రష్టుఁడగుచున్నాఁడు. అట్లె ప్రకృతి పరిణామమైనది గాన స్వప్నము వలె ననిత్యమై కావుననే చెవికి మాత్ర మింపైయున్న పరలోకమును మఱియుఁ దక్కిన కామములను హృదయమునం దుద్దేశించి తమకుఁ గలధనములను గామసాధనము లగు కర్మము లందు వినియోగించుచున్నారు; తుదకు నుభయభ్రష్టు లగు చున్నారు. వారు రజస్తమస్సులను గుణములచేఁ గలుగు కర్మములందు నిష్ఠగలిగి రాజససాత్త్వికతామసాహారాదులను సేవించుచు వాని యందుఁ బ్రీతిగలిగి తమ తమగుణములకు ననురూపులయిన యింద్రుఁడు మొదలగు దేవతల నుపాసించు చున్నారు. కాని యాదేవతలను భగవదాత్మకులని యుపాసించుటయే సరియైనయుపాసన మగును గాని యట్లు చేయమిచే వారింద్రాది దేవతలను యథారీతిని నుపాసింపనివారే యగుదురు. అట్లె నన్నును యథావిధి నుపాసించినవారు గాకుందురు. వారు హృదయమందు మన మిహలోకదేవతలను యజ్ఞములచే నారాధించి స్వర్గలోకమును బ్రాపించి స్వర్గమున రమించుచుందుము. ఆ భోగము ముగియఁగా మరల నిహలోకములందు

గోష్ఠగృహములగల కధిపతుల మయి గోష్ఠకులమునందుఁ బుట్టి నవారమైయుండఁగల'మని యిట్లు వేద పూర్వభాగమందు వట్టి పువ్వువలె నున్న యిట్టి వాక్యముచేత మనస్సు వ్యాక్షిప్తమగుటచే మిక్కిలియు దురహంకారులై తమ్ముఁ బరిపూర్ణులుగాఁ దలంచుకొనుచు నుందురు కాన, వారికి నావార్త సయితము రుచింపకుండును. దీనినిఁ బట్టి వారు నిత్యసంసారులు గూడ నగుదురు. కర్మకాండ దేవకాండ జ్ఞానకాండము లను మూఁడుకాండములరూపమున నున్న వేదము లివి యన్నియును సమస్తమున కంతరాత్మభూతుఁ డయిన పరబ్రహ్మమును గుఱించినవే యగును. (అనఁగా నది పరబ్రహ్మమును దద్గుణములను దద్విభూతులను దత్ప్రాప్తి కుపాయములను నుపేయములను నుపేతలను గూర్చిన స్వరూపములను గుఱించినవి). వేదములు పరోక్షవాదములు (అనఁగాఁ దమయభిప్రాయముల నస్ఫుటముగాఁ జెప్పుచున్నట్టివి). కనుక వాని తాత్పర్యము నందఱు నెఱుంగరు. లోకోజ్జీవనముగా వేదరూపమగు వాక్కును నొసంగిన నీకుఁ బరోక్షవాదము గావింపనగునా యందువా? పరోక్షముగాఁ బలుకుటయే నాకుఁ బ్రియమయినది. ఏలన శుద్ధాంతఃకరణు లగువారికే యీ వేద తాత్పర్యము తెలిసికొనఁ దగినది; అనధికారులకుఁ గాదు. వారును దెలిసికొనిరేని వ్యర్థముగాఁ గర్తృత్యాగముచేసి భ్రంశము నొందుదురు గాన పరోక్షమే నాకుఁ బ్రియముగా నున్నది. శబ్దబ్రహ్మం బగు వేదస్వరూపము మిక్కిలి దురవగాహము. అది ప్రాణముతోఁ గూడినవాగింద్రియము చేత నుచ్చరింపఁ దగినది. సముద్రమువలె దాని యవధికిఁ గొలఁదిలేదు; అందలి

యర్థములు దురవగమములు. దానిని యుక్తులచేతను నిరూపింప శక్యముగాదు. అనంత జ్ఞానవీర్యాదిశక్తులు గల భూముండనగు నాచేత నది విస్తరింపఁ బడినది. తామరతూఁడుల యందుఁ బోఁగులువలె మనుష్యులయం దది యుచ్చరింపఁ దలంచు వారికిఁ, జెవులు రెండును మూసి కొనఁగా వినఁ బడు ప్రాణఘోషరూపమునం జూపట్టుచున్నది. సాలె పురుఁగు హృదయమునుండి ముఖముదారిని నూర్ణను వెలి గ్రక్కునట్లు, ఉచ్చరింపఁ గోరు పురుషునికిఁ బ్రాణవాయు ఘోష మాకాశమునుండి (నాభినుండి ఱొమ్ము వఱకుఁ గల లోపలి రంధ్రను మూలమున) స్పర్శరూపి యగు మనస్సు తోఁగూడి ఛందోమయమును స్థాయియు దేహేంద్రియాది ధారణసమర్థమును శబ్దబ్రహ్మాత్మకమును నగు వాక్కును సృజించుచున్నది. ఇట్టి ప్రాణము వాగింద్రియము నొంది బృహతి యగు వాక్కు నావిష్కరించుచున్నది. ఆ బృహతీవాక్కు వలన శ్రేయోమార్గములు వేయి తెలియనగును. ఓంకారము నుండి వ్యంజితము లగు స్పర్శములును స్వరములును నూష్మములును నంతస్థములు నను వీనితో నది భూషితమై యుండును. విచిత్రములగు శ్రుతులయం దది విస్తరింపఁబడి యుండును దాని యవధికి మితి గలుగదు; చతుశ్చతురక్షరాధికము లగు గాయత్రి మొదలగు ఛందములతోఁ గూడియుండునది. ఇట్టి బృహత్త్వముగల వాక్కును బ్రాణము తానే సృజించు చున్నది; పిదపఁ దన వ్యాపారము నుడుగుటచే దానిని వ్యక్తముగాకుండను జేయుచున్నది. ఆఛందస్సులుగాయత్రి, ఉష్ణిక్కు, అనుష్టుప్పు, బృహతి, పంక్తి, త్రిష్టుప్పు, జగతి, అతిచ్ఛన్ద, అత్యష్టి,

అతిజగత్తు, విరాట్టు నగును. ఆ వేద మేమి విధించుచున్నది? ఏ తత్త్వమును విశదీకరించుచున్నది ? దేనిని సముచ్చయించి విధించుచున్నది? దేనిని సామాన్యముగా విధించుచున్నది? దేని నపవదించుచున్నది? యని యీ వేదమునకుఁ గలతాత్పర్యమును నేను దప్ప మఱియెవ్వఁడు నెంతమాత్రము నెఱుఁగఁడు. దాని హృదయమిది. అది నాయారాధన మనెడుధర్మమును విధించుచున్నది. నన్నే సర్వశరీరకుఁ డని యభిధావృత్తిచేతఁ బ్రతిపాదించుచున్నది. అది వికల్పించి యపవదించునదియు నేనే. వేదమునకుఁ దాత్పర్యమైన యర్థము సర్వమును నింత మాత్రమే. అది యేదన-వేదము నన్నే తాత్పర్యముగా నాశ్రయించి దేవమనుష్యాది భేదమును ప్రకృతిమాత్రమునకుఁ గలిగినది గాని జీవస్వరూపమునకుఁ గలిగినదిగాదని యను వదించి జీవగతం బయిన యాకారమును గాష్ఠాభూతుఁడ నగు నాయందుఁ బ్రతిషేధించి (అనఁగా నాకు లేదని ప్రతిపాదించి) సర్వతత్త్వవిలక్షణునిఁగా నన్నుఁ బ్రతిపాదించి యంతఁ దన వ్యాపారమునుండి విరమించు చున్నది. ఇదియె * వేదతాత్పర్యము. ఇది యిరువదియొకండవయధ్యాయము.

---

## శ్రీ కృష్ణుఁ డుద్ధవునకుఁ దత్త్వముల సంఖ్యాస్వరూపములను నిర్ణయించుట.

ఉద్ధవుఁడు—"విశ్వేశా! ప్రభూ! తత్త్వము లెన్ని? కొందఱు ఋషులు తత్త్వములు తొమ్మిదనియుఁ గొందఱు పదునొకం

---

*ఇందు వేదతాత్పర్యము 'ప్రకృతికే దేవమనుష్యాది భేదము, జీవునకుఁ గలుగదు. జీవుని యాకారము ఈశ్వరునకుఁ గలుగదు. ఈశ్వరుఁడు సర్వతత్త్వవిలక్షణుఁ' డని తెలియనది.

డనియుఁ గొంద ఱయిదనియు లెక్కించియున్నారు. నీవు మూఁడని చెప్పితివి. ఇట్లీ తత్త్వవిషయమందు వాదములు వెక్కులు వినుచున్నారము. కొంద ఱిరువదియాఱనియుఁ గొంద ఱిరువదియైదనియుఁ జెప్పిరి. మఱికొంద ఱేడనియుఁ దొమ్మిదనియు నాలుగనియుఁ బదునొకండనియుఁ జెప్పిరి. కొందఱు పదియేడనియుఁ బదియాఱనియుఁ బదుమూఁడనియుఁ జెప్పిరి. ఆయుష్మంతా! ఋషు లిట్లు తత్త్వములను వేఱువేఱువిధముల గణనము సేయుట యేప్రయోజనము నుద్దేశించి చెప్పెదరో మాకు నీవు చెప్పఁదగును" అని యడిగెను. శ్రీభగవంతుఁడు- ఋషులు చెప్పునట్లే సమస్తము లయిన పక్షములును యుక్తియుక్తములై యున్నవి. నాదుప్రకృతి యెక్కుడు సంఖ్యగల తత్త్వములకుఁ గారణమని కాని తక్కువసంఖ్యగల తత్త్వములకుఁ గారణమని కాని గ్రహించి యెట్లు చెప్పినను బాగుగనే యుండునే కాని విరోధమేమియు నుండదు. కనుక నీవు తత్త్వముల గణనము విరుద్ధముగా నున్నదని చెప్పితివే. అది యట్లు విరుద్ధముగాదు. ఆ గణనము విరుద్ధముగాకుండువిధమున నేను జెప్పుచున్నాను. ఇట్లనేకవిధములయిన వాదములకెల్ల హేతువు నాశక్తులయిన ప్రకృతిపురుష మహదహంకారాదులే యగు నని యందఱు నొప్పుకొనియే తీఱవలయును. ఆశక్తు లొకటియం దొకటి యంతర్భవించియుండుటఁబట్టి తత్త్వముల సంఖ్యనుగుఱించి వాదించువారికిఁ బక్షభేదములు వెక్కులు గలిగినవి. అనఁగా తత్త్వము లొకటిలో నొకటి యంతర్భవించుటవలనను నంతర్భవింపకపోవుటవలనను దత్త్వములసంఖ్యను గొంద ఱెక్కువగాను మఱికొందఱు దక్కువగాను వాదించువా

తయిరి. శమమును దమమును గలుగఁగా నీ పక్షభేదము లడు
గంటును. వాదములెల్ల నుడిగిపోవును. ఏలన శమదమాది
సంపన్నుఁ డగువాఁడు చిదచిదాత్మక మగు జగత్తునంతయు నా
శరీరముగాఁ గనుఁగొనుచున్నాఁడు గాన, వికల్పమును వాద
మును రెండునుగలుగవు. పురుషతిలకా! తత్త్వములొకటియం
దొకటి చొచ్చుటవలన వాదులు చెప్పఁదలఁచిన ట్లెల్లఁ
దత్త్వము లెక్కుడు సంఖ్యగలవిగాను దక్కువసంఖ్య గలవి
గానునగుచున్నవి. క్షితియ మొదలగువానియం దొక్కట నగ్ని
జలము మొదలగు నితరములు పెక్కులు ప్రవేశించియుండును
గదా. కాఁబట్టి యొక్కదానియందుఁదక్కినవి పెక్కులు చొచ్చి
యుండుట చూపట్టుచున్నది. మఱియుఁగారణమగుమృత్తునందు
ఘటాదులు సూక్ష్మరూపమునఁ జొచ్చియుండును. కార్యభూతము
లగు ఘటాదులందుఁగారణం బగుమృత్తును ననుగతమైచొచ్చి
యుండును. కాన కారణంబగు తత్త్వమునందుఁ గాని కార్య
భూతంబగుదానియందుఁ గాని సమస్తములయిన తత్త్వములు
చొచ్చియుండును. కాఁబట్టి యీతత్త్వములసంఖ్య యెక్కువ
యనియుఁ దక్కువయనియుఁ దాము కోరినట్లు లెక్కించుచున్న
వాదులనోర వారు చెప్పఁదలఁచిన ట్లేదేదివచ్చునో దానినంత
యు సరియని నే ననుమతించుచున్నాను. ఏలన నాతత్త్వము
లొకటియం దొకటి చొచ్చియుఁ జొరకయునుండు యుక్తివలన
నెట్లు లెక్కించినను బొసఁగుచునే యుండును. జీవునకు దేహమే
తాననియుఁ దాను స్వతంత్రుఁడనియు నిట్టి యజ్ఞాన మనాదిగా
నుండియున్నది. అట్టి జీవునకుఁ దన స్వరూపమును బరస్వరూ
పమును నెఱుంగుట తనంతటఁ గలుగనేరదు. మఱి వానికంటె

నన్యుండును దనంతటనే సర్వజ్ఞుండును నగు పురుషుఁడే యట్టి జ్ఞానమునొసంగువాఁడగును. జీవునకును నీశ్వరునకును నణు వంతయైనను వైలక్షణ్యము గలుగదు. ఏలన నిరువురును జ్ఞానస్వరూపులును జ్ఞానగుణకులు నగుదురు. కావున జీవుఁ డజ్ఞుఁడు; ఈశ్వరుఁడు సర్వజ్ఞుఁ డని యా యిరువురకును వైష మ్యము గల్పించుటయెల్ల నిరర్థకమే యగును. వారికి స్వరూప మందు భేదముగలుగదు. జీవునందుఁ గనపట్టు నజ్ఞత్వమా ప్రకృతి కార్యముగాని జీవునిదిగాదు. ప్రకృతియనఁగా రజ స్సత్త్వాదిగుణములు సమముగా నుండుటయే కాని మఱి యొకటిగాదు. కనుక జగత్తు నుత్పత్తికిని స్థితికిని నాశమునకును హేతువులయినరజస్సత్త్వతమస్సు లనుగుణములు ప్రకృతికిఁగల గుణములేకాని యాత్మగుణములు గావు. ఇట్లు సత్త్వాదులు ప్రకృతిగుణములై దానితో నడంగినవగుటచే నవి కాకయే తత్త్వము లిరువదియైదగుట తేలుచున్నది. సత్త్వము జ్ఞాన మును గలిగించునది. రజస్సు కర్మమును దమస్సు అజ్ఞానమును గలిగించునది. గుణము లొండొంటితోఁ గలయుటచేఁ గాలము పుట్టుచున్నది. అదియే స్వభావమనియు సూత్రమనియుఁ జెప్పఁ బడుచున్నది. కానదేనినిగూడఁ గూర్చుకొనఁగాఁ దత్త్వము లిరు వదియే డగుచున్నవి. జీవుఁడును గుణసామ్యావస్థ యగు ప్రకృతి యును మహత్తును నహంకారమును నాకాశమును వాయువును జ్యోతియు నప్పులును భూమియు నని తత్త్వములు తొమ్మిది చెప్పబడియున్నవి. శ్రోత్రము త్వక్కు దర్శనము ఘ్రాణము జిహ్వయని జ్ఞానేంద్రియము లయిదును, వాక్కు పాణిపాయువు ఉపస్థము పాద మని కర్మేంద్రియములయిదును, జ్ఞానకర్మేం

ద్రియమగు మన స్సొక్కటియు, శబ్దము స్పర్శము రసము గంధము రూపమను విషయ సమూహమును, గతి ఉక్తి ఉత్సర్గము శిల్పమని కర్మేంద్రియ కార్యములును గలిగినవి. ఈ ప్రపంచ సృష్టికిఁ బూర్వ మాకాశము మొదలు మనస్సు వఱకును గల కార్యములుగాను, ప్రకృతి వ్యక్త మహంకార మనుకారణములుగాను . రెంటి రూపమున నున్న ప్రకృతి సత్త్వాదిగుణములతోఁ గూడినదై ప్రత్యక్షాది ప్రమాణముల కగోచరుండును వేదాంతైక వేద్యుండు నగు పరమపురుషుఁ డీక్షింపఁగా, నీ ప్రపంచమును విధించిన దయ్యె. ఇట్లాతని వీక్షణము వలనఁ బుట్టిన వ్యక్తము మొదలగు తత్త్వము లాతని యీక్షణము వలన సృష్టిసేయు సామర్థ్యము నొందినవై యొక్కటిగాఁగూడికొని వికారములనొందుచుఁ దమకుఁ గారణమగు ప్రకృతి బలమువలన బ్రహ్మాండము సృజించుచున్నవి.తత్త్వము లేడే యని చెప్పఁబడెనుగదా! అది యెట్లనిన-ఆకాశాదులైదును, జ్ఞానస్వరూపుండగు జీవుండును, ఆకాశాదులకును జీవునకును నుభయులకు నాధారభూతుఁ డయిన పరమాత్మయు,నని తత్త్వములేడే యగుచున్నవి. ఆ యేడు తత్త్వములవలన నుండియే * దేహమును నింద్రియములును బ్రాణములును గలుగుచున్నవి. దేహేంద్రియాదులం దేతత్త్వముగాని యాకాశాదులం దొక్కటినైన విడిచియుండుట గనుపట్టదు. కాఁబట్టి యవి యెల్ల

* ఇంద్రియములు దేహమున కంతర్భూతములు. ప్రాణములును దేహాకారణములగు ధాతువులం దంతర్భూతములు. ప్రకృతి మొదలయిన కారణములనుగార్యములయినయాకాశాదులందంతర్భూతములు. కావున తత్త్వములేడనుట సిద్ధము.

నొకటియం దంతర్భవించియుండుటయొప్పుచున్నది *ఆకాశాదు లయిదును బరమపురుషుండొక్కఁడును గూడఁగాఁదత్త్వములా అగుచున్నవి ఆపరమపురుషుఁడు తనవలననుండిపుట్టినభూతము లతోఁగూడి యీ వ్యష్టి జగత్తును సృజించి దానికి స్థితి గలు గుటకై లోపలఁ బ్రవేశించినవాఁ డయ్యెను తత్త్వములు నాలుగే యనెడిపక్షమునందుఁ బరమాత్మునివలననుండి తేజ స్సు అప్పులు అన్నము (భూమి) అను మూఁడు పుట్టెను. ఆత్మ తోఁగూడిన మూఁడును జేరి తత్త్వములు నాలుగగుచున్నవి. † పరమాత్మయుఁ దేజస్సు నప్పును నన్నమును గూడి యీ జగత్తు పుట్టినది. స్థూలము లగు కార్యములు సూక్ష్మము వలన నుండి పుట్టుట తప్పకగలుగునుగదా. తత్త్వములు పదునొకం డనుపక్షమునందు ఈ పరమాత్మయు మహాభూతము లయిన యాకాశాదులయిదును శ్రోత్రాదులగునింద్రియము లయిదును గూడి పదునొకండయినవి. తత్త్వములు పదియే డనుపక్షము నందు నాకాశాదులయిదును శబ్దాది తన్మాత్రలయిదును నింద్రి యాదు లయిదును గూడి పదియేనగుచున్నవి మనస్సు పది యాఱవది. ‡ ఆ పరమాత్మ పదియేడవవాఁ డగుచున్నాఁడు. పదియే డనుపక్షమునందుంబోలెఁ బదియాఱు అనెడు లెక్క యందును నాత్మయు భూతములు తన్మాత్రలును నింద్రియములు నని పదియాఱు సమానముగా నున్నవి. అయిన నిం ద్రాత్మయే

* ఇందు జీవుఁడు పరమాత్మయందుశరీరరూపమున నంతర్భూతుఁడగును. దేహేంద్రియాదు లాకాశాదులం దంతర్భూతములు.

† ఇం దాకాశాదులు తక్కిన తేజస్సు మొదలగువానియం దంతర్భూత ములు. తక్కినవి మునుపటివలెనే తక్కిన వానియం దంతర్భూతములు.

‡ ఇందును జెప్పఁబడిన వానియందుఁ జెప్పఁబడనివి యంతర్భూతములు.

మనస్సనఁబడుచున్నది. అనఁగా నాత్మయం దంతఃకరణ మడఁగి యున్నది. ఆకాశాదిభూతములును జ్ఞానేంద్రియములును బంచ వృత్తి ప్రాణమును మనస్సును బరమాత్మయునని తత్త్వములు పదుమూఁ డగుచున్నవి. * (ఇక్లె తత్త్వములు మూఁడనుట యు నయిదనుటయును దెలియునది) ఇట్లు ఋషులు తత్త్వము లను నానావిధముల లెక్కపెట్టియున్నవారు. అన్నియునొం డొంటిలో నడఁగియున్న యుక్తిచే నొప్పియుండుటచే న్యాయ ములే యగుచున్నవి. కావున విద్వాంసు లగువారికి దుర్ఘట మయిన దేదిని ఏదియు లేదు' అనెను.

ఉద్ధవుఁడు—'ప్రకృతియును బురుషుఁడు నిరువురునుదమంతట విలక్షణమగు స్వరూపము గలిగియుందురు. అయిన వానిలో నొకటి విడిచి మఱి యొకటి కనుపట్టకుండుటవలన నా రెంటి కిని భేదము గానరాకున్నది. ప్రకృతియందు (అనఁగాఁ బ్రకృతి కార్యమగు దేహమునందు) నాత్మయు నాత్మయందుఁ బ్రకృ తియుఁ గనుపట్టుచున్నది. (ఒకటిని విడిచి మఱియొకటి కనుపట్ట కుండుటవలనను 'నేను దేవుఁడ'నని దేహమునకును నాత్మకును నభేదము తెలియుటవలనను దేహమునకును నాత్మకును భేదము కానంబడకున్నది. నాహృదయమందుఁ బెద్దసందేహమిదియొకటి నాటుకొని యున్నది. నీవు సర్వజ్ఞుండవు గాన యుక్తులందు నిపుణములయినవచనములచేత దీనిని ద్రుంపఁదగుదువు. జీవు లగు మాకు నాయా యర్థములను గలయూపునఁ గనుఁగొనునట్టి

* ప్రకృతి పురుషుఁడు ఈశ్వరుఁడని తత్త్వములు మూఁడు. నాలుగు తత్త్వముల పక్షమునఁ జెప్పఁబడిన నాలుగును వాయువును గూడి తత్త్వము లయి దగుచున్నది.

జ్ఞానము నీ ప్రసాదమువలననే కలుగుచున్నది. వారికి స్వభావముచేత నీశక్తివలన జ్ఞానము సంకుచితమై యుండును. నీ వొకఁడవే సర్వజ్ఞుఁడవు; నీదు మాయకుఁగల స్వరూపమును నీవే యెఱుంగుదువు కాని నీదు మాయచేత నితరు లెల్లవారును మోహితులుగాన యెఱుంగ నేరరు' అనెను.

భగవంతుఁడు—ప్రకృతి పురుషుఁడను రెండును భిన్నములే కాని యొక్కటిగావు. ఁదధిభూతము మొదలుగా సృజింపఁబడిన యివి యెల్లఁ బ్రకృతివికార మగు నహంకారము చేతఁ గావింపఁబడినవి. అందుఁగోరుచున్నాను ద్వేషించుచున్నాననెడి పురుష (ఆత్మ) గుణములును, బలుపు పలుచన యను ప్రకృతి (దేహ) గుణములును నొక్కటనే గజిబిజిగాఁగలసి యొకదాని గుణములు మఱియొక దానివిగాఁ గనుపట్టుచుండుట యీ యహంకారము స్వరూపము. ఉద్ధవా! నామాయ తన యహంకారము మూలమున నిట్లు దేహాత్మలగుణములను గలపి వానికి భేదము తెలియకుండునట్లు చూపుటయే కాక మఱి యాత్మ దేవుఁడనియు మనుష్యుఁడనియు స్వతంత్రుఁడనియు నిట్లు భేదబుద్ధులఁ బెక్కులుగలిగించుచున్నది. అధ్యాత్మము,అధిదైవము అధిభూతమనఁబడు నీ మూఁడును వైకారిక (అహంకార) సర్గమనఁబడును. కన్నధ్యాత్మము. రూపమధిభూతము. సూర్యశరీరమధిదైవము. ఈ దేహమందలి కంటిరంధ్రమునం దీ మూఁడు నొకటి కొకటి యుపకరించుటంబట్టి జ్ఞానమును బుట్టింప నేర్చుచున్నవి. 'అధ్యాత్మాదులు పరస్పరముగూడుటవలన రూపాదుల ప్రకాశము గలుగునేని, యాత్మ ప్రకాశమెక్కడి' దందువాని హృదయాకాశమందుఁగల యాత్మ తనంతటఁదానే ప్రకాశించు

చున్నది. * ఎట్లన, ఆత్మ యగు దృక్కు మొదలగు మూఁడేసిం టికి సాధ్యమైనది గాన వానిని బ్రకాశింపఁజేయుట కదియే హేతువు. దృగాదు లుడిగినపిదపఁగూడ నది నెల కొని యుండునది గాన వానికంటె విలక్షణ మయినది. తనకు మాత్రము గలిగి యుండు జ్ఞానము చేత నది ప్రకాశింపఁ జేయఁదగువాని కెల్లఁ బ్రకాశకమై యున్నది. పరస్పరముకూడిక చేతఁ జక్షువు సిద్ధించినట్లె త్వక్కు మొదలయినవియు శ్రవణము మొదలైనవియు, జిహ్వ మొదలయినవియు నాసిక మొదలయినవి

---

* ఇంద్రియములు ఆత్మయందు (దేహమునందు) ఉండుటంబట్టిఅధ్యాత్మములనియు, విషయములగు రూపాదులు తేజస్సు మొదలగు భూతములయం దుండుటంబట్టి అధిభూతమనియు, అధిష్ఠించియుండు దేవతదేహము క్షేత్రజ్ఞుఁడగు సూర్యుఁడను దేవతారూపముగలిగియుండుటచే అధిదైవమనియుఁ జెప్పఁబడినవి. రాజసాహంకారముతోఁగూడిన సాత్త్వికతామసాహంకారములు రెంటివలన దృగాదులగు ఇంద్రియములును రూపాదులగువాని విషయములును వాని కధిష్ఠాతలగు దేవతలునుసృజింపఁబడినట్లు సృష్టిప్రకరణములందుఁ జెప్పఁబడుచున్నవి. కావున నేఅధ్యాత్మాదు లహంకారసర్గమనఁబడుచున్నవి.అధ్యాత్మాదులు మూఁడును, అనఁగా ఇంద్రియము విషయము అధిష్ఠించియున్న దేవతాశరీరము మూఁడును, పరస్పరము ఉపకరించిననే జ్ఞానమను కార్యము పుట్టఁగూడును.కాఁబట్టిమూటికిని ఉపకార్యోపకారక భావముగలదు. ఎట్లన సూర్యుని దేహము తనకిరణముల ద్వారావచ్చి చక్షువునందును దాని విషయమగు రూపమునందును అధిష్ఠించుచున్నది. అపుడా రెంటిలో చక్షువు గ్రహించునదియు రూపము గ్రహింపఁబడునదియు అగుచున్నవి. కాఁబట్టి అధిదైవమునకు ఆరెండును ఉపకార్యము లగుచున్నవి. రూపము మిక్కిలి దూరముగాకయు నడుమ నేమియడ్డులేకయు నుండిననే చక్షువునకు గ్రాహ్యమగుచున్నది. కాన చక్షువున కది ఉపకార్యమగుచున్నది. ఇట్లు మూటికి ఉపకార్యోపకారకభావము తెలియునది.

యు సిద్ధించుచున్నవి. * ఇవియన్నియు మనస్సుతోఁ గూడియే కార్యకరములగు చున్నవి. ఇవంతయు నహంకారము చేసినసృష్టి యగును. ఈయహంకారము సత్త్వరజస్తమస్సులు సమత్వము వీడి విషమములై కలఁతనొందుటవలనఁగలిగిన వికారము; మఱి ప్రకృతి మూలకారణముగాఁగల మహత్తత్త్వమునుండిచక్కఁ బుట్టినది. ఇట్టి యీయహంకారము దేహమేయాత్మ యనెడిభేదమునుగలిగించుభ్రమమును, ఆత్మయే దేవుఁడు మనుష్యుఁ డను వికల్పమును గలిగించుచున్నది. ఇది వైకారికము(సాత్త్వికము) ఐంద్రియము (తైజసము) తామస మనిమూఁడు విధములగును, ఆత్మ పరిపూర్ణముగా జ్ఞానస్వరూపమయినది. దేహమో పరిపూర్ణముగాజడమైనది. నేననుటకునాత్మయెంతయునొప్పియుండునుగాని యందులకు వివాదమేమియుఁగలుగదు. ఉన్నదనియు లేదనియుదాని నిట్లుభేదముగాఁజెప్పుటగలదుగదా. అభేదముగాఁ జెప్పుట దానిదేవమనుష్యాది రూపములకే చెల్లునుగాని యాత్మకుఁజెల్లదు. ఈ భేదభ్రమ మాత్మయందు లేకున్నను స్వరూపసాక్షాత్కారము గలిగించు నావలనబుద్ధినుంపని పురుషుల కది యుడుగకయే యుండును గనుక వారి ననువర్తించుచునేయుండును' అనెను.

---

* మొదలయినవి యనుటచే ఆయా ఇంద్రియములయొక్క అధిభూతమును (విషయమును) అధిదైవమును దెలియునది. త్వక్కు అధ్యాత్మము; దాని కధిభూతము స్పర్శము; అధిదైవమువాయువు. శ్రోత్రమధ్యాత్మము; దాని కధిభూతము శబ్దము; అధిదైవము దిక్కులు. జిహ్వఅధ్యాత్మము; దాని కధిభూతమురసము;అధిదైవము వరుణుఁడు. నాసికఅధ్యాత్మము;దానికధిభూతముగంధము; అధిదైవ మశ్విదేవతలు. మన స్సధ్యాత్మము; దాని కధిభూతము ధ్యేయవిషయము; అధిదైవము చంద్రుఁడని తెలియునది.

ఉద్ధవుఁడు—ప్రభూ! 'నీ వలనబుద్ధి యుంపక మరల్చుకొన్న వారు తమతమ చేసికొన్న కర్మములచేత గొప్పదేహములును దక్కువ దేహములును నేవిధమునఁ గయికొందురో మఱి యేప్రకారమున విసర్జింతురో, (యనఁగాఁ బూర్వదేహమును విడిచిన ట్లింద్రియములను గూడ విడిచి, దేహాంతరమును బొందినట్లు వేఱింద్రియములను గూడఁ బొందుదురా? లేక మునుపటి యింద్రియములతోఁ గూడియే దేహాంతరమును గయికొనుచును విడుచుచు నుండెడిదా?) చెప్పుము. గోవిందా! ఈ విషయమున నిశ్చితమయినది నాకుఁ జెప్పుము. అల్పబుద్ధులకిది యెంతమాత్రము నిశ్చయింపరానిది; దీని నెఱింగినవారు బహుతరముగా లోకమునందుఁ గలుగరు. ఏలన నందఱును నీ మాయచేత వంచితులై యున్నవారు. కావున,దీనిని నీవే నిశ్చయించి చెప్పవలయును' అని యడిగెను.

భగవంతుఁడు—'మనస్సు పూర్వకర్మవాసనలతో నిండినదై జ్ఞానేంద్రియములయిదింటితోను భూతసూక్ష్మములతోను గూడి యేయొకదేహమునుండి మఱియొక దేహమునకుఁబోవుచున్నది. దానికంటెను వేఱయినయాత్మ యా మనస్సు ననుసరించి పోవుచున్నది. మనస్సు కర్మవాసనలకు వశమై తాను గన్నట్టియు విన్నట్టియు విషయములను జింతించుచు నుండును; పిదప నా విషయములు కలిగినపుడు హర్షించుచుండును; కలుగనప్పుడు దుఃఖించుచుండును. దాని వెనుకనే మునుపటి స్మృతులనెల్ల నుడిగిపోవును. ఒక్క జన్మమందే యిట్టిమఱపు గలుగఁగా దేహమును విడిచిపోయినపుడు మునుపటిస్మృతులను మఱచుటనుగుఱించి చెప్పనేల? ఎవ్వనిమనస్సు విషయములం దభినివే

శము గలిగియుండుటచే నాత్మ దేహ విలక్షణమయినదని యను సంధింపదో యట్టి ప్రాణికి నోకానోక కారణమువలన మరణ కాలమందు మిక్కిలియు జ్ఞానలోపము గలుగుచున్నది. అట్లు జ్ఞానము లోపించినను జన్మాంతరము నొందునపుడు మునుపటి యింద్రియము లాఱు ననువర్తించుటవలనఁ బూర్వజన్మస్మృతి గలుగదా యందువా? భూరిదా! పురుషునకు సర్వవిధములగు మనోవృత్తులచే దేహము నాత్మగా స్వీకరించుటయే జన్మ మందురు. జన్మకాలమునుండి దేహామే యాత్మ యని వానికిఁ దోఁచుచుండును. ఇట్లు దేహామే యాత్మ యని తప్పఁదలఁచు చుండుటంబట్టి దేహమునకు విలక్షణ మైనదియుఁ బూర్వో త్తరజన్మముల ననుసంధించునదియు నగు నాత్మ తోఁపకుం డును గాన, తొంటిస్మృతిని నిప్పటిదేహ స్వీకారమునుగూర్చి స్మృతి గలుగనేరదు దేహామే యాత్మయని తలంచుట యెల్ల స్వప్నము నందలి మనోరథములవలె భ్రాంతియే యగును. ఈ పురుషుఁడు స్వర్గమున నేవేవో మనోరథములను గావించు చుండి తన మునుపటి బ్రాహ్మణత్వాదు లగు నాకారములను స్మరింపఁడు. మఱియొక స్వప్నము గనుచో మునుపటి స్వప్న మును, నొక మనోరథమును గోరుచో మునుపటి మనోరథ మును స్మరింపఁడు. మరణమువలనను మఱియొక దేహమును బొందుటవలనను జ్ఞానము మిక్కిలియు లోపించుటంబట్టి పూర్వము తాను దేహమునే యాత్మయని మనస్సునఁ దలఁచుట నీ జన్మమందు స్మరింపఁడు. జన్మాంతరము కలి గినపుడు పూర్వ జన్మమందుఁ దాను నున్నవాఁ డయినను నపుడు లేకుండినట్లును, ఈజన్మమందే తాను గ్రొత్తగఁ గలిగి

నట్లును గనుఁగొనుచున్నాఁడు ఏక రూపమున నున్న యాత్మ స్వరూపమునందు నింద్రియముల కునికి పట్టయిన శరీరము పుట్టుచున్నది. ఆ పుట్టుటచేత శరీరము నింద్రియము లు నంతఃకరణము నని యీ మూఁడు విధములును దోఁచు చున్నవి. ఈ మూఁటివలన వెలుపల దేవత్వము మనుష్యత్వము బాలత్వము యువత్వము మొదలయినవియు, లోపల లోభము భయము మొదలగునవియు నగు భేదములు, చెడు పుత్త్రునిఁ గన్నపురుషునికింబోలె, ననర్థహేతువులై కలుగు చున్నవి. ఉద్ధవా! భూత పరిణామములయిన శరీరములు నిత్యమును వేఱొక పరిణామమును బొందుచును మునుపటి యవస్థ విడుచుచును నుండును. ఈ రెండును నలక్ష్య వేగంబగు కాలము మిక్కిలి సూక్ష్మమగుట చేతఁ దెలియఁ బడ కున్నవి. అగ్నియందు మునుపటిజ్వాలలు పోయి వేఱు వేఱు జ్వాలలు వచ్చు చుండుటయుఁ, బ్రవాహము లందు మునుపటి జలములు పోయి క్రొత్త క్రొత్త జలములు వచ్చుచుండుటయు, దెలియఁబడవు. వృక్షమునందుఁబండ్లు ప్రతి క్షణమును బక్వ మగుచుండుటయుఁ దెలియరాదు. అట్లె సర్వభూతములకును గాలముచేతఁ గావింపఁబడిన బాల్య ము మొదలయిన యవస్థలు మిక్కిలి సూక్ష్మములగుటం జేసి తెలియఁబడ కుండును. ఇట్లాయాయవస్థలు ప్రతిక్ష ణమును బరిణామ మొందుచుండుటం బట్టి 'వాఁడే యీబా లుఁడు' 'వాఁడే యీ వయసుకాఁ' డని మునుపటియవస్థ వా నినే యిప్పటి యవస్థ వానినిగాఁ దలంచుటయుఁ జెప్పుటయు నెట్లు పొసగుఁ నందువా? అగ్నికిఁ గల మునుముందటి

జ్వాలలును వెనువెనుకటి జ్వాలలును సదృశము లగుటంబట్టి వానికిఁ గల భేదమును దెలియక పురుషుఁడు తన కంటికిఁ గనఁబడుచున్నదానినే యూఁది 'అదియే యీదీప' మని తలంచి చెప్పుచున్నాఁడు. అట్లె ప్రవాహమునందు మునుపటి జలములకును బిమ్మటి జలములు సమానముగా నుండుటను బట్టి భేదము తెలియనందున 'అదియే యీజల' మని తలంచి చెప్పుచున్నాఁడు. అట్లె 'వాఁడే యీపురుషుఁడు, వాఁడే యీబాలుఁ' డని తలంచుటయుఁ జెప్పుటయు నస్థిరాయుష్కులగు మనుష్యులకు భ్రాంతిమూలమునఁ గలుగునవే కాని మఱియొకటిగాదు. ఈ దేహము నుత్పత్తికిఁ గర్మము బీజము. అట్టి కర్మముచేత దేహాత్మాభిమాని యగు జీవుఁడు దేహము వలె నెప్పుడును బరిణామము నొందుచుండు స్వభావము గలవాఁడు గాకుండఁ గాక; అయినను వాఁడు భ్రాంతిచేతఁ బుట్టుచును జచ్చుచు నున్నాఁడు. ఆత్మకు నుత్పత్తి మరణములు భ్రాంతిచేత సిద్ధములయినవి గాని స్వాభావికములు గావు. ఏలనఁ బురుషునకుఁ బుట్టుకయు లేదు, చావును లేదు. వాఁడు దేహము గలుగుటకుఁ బూర్వమును నది నశించిన పిదపను నుండియున్నాఁడు. దారువునందుఁ గూడియున్న యగ్ని చిలుకుటచేతఁ దోఁచుచున్నది గాని దారువుతోఁ గూడ నుత్పత్తి నాశములు పొందదు గదా! అట్లె యాత్మయు దేహమునందుఁ దోఁచినను దానితోడి యుత్పత్తి వినాశములకుఁ బాలుగా కుండును. అవి గలసియుండునట్లు దోఁచుటయెల్ల భ్రాంతిమూలము. దేహమునకు రేతోనిషేకము, గర్భము, బాల్యము, కౌమారము, యౌవనము,

మధ్యవయస్సు, జర, మృత్యువని యవస్థలు తొమ్మిది గలుగుచున్నవి. నిషేకము మొదలయిన యీ యవస్థలును మఱియు శయనాసనాదు లయిన యితరావస్థలును నానావిధములు నుండును. ఇవి యెల్ల నొకఁడు (బద్ధుఁడు) తానొకా నొకప్పుడు కర్మపరిపాకదశయందుఁ గయి కొనుచున్నాఁడు. మఱి యొకప్పుడు వానిని విడుచుచున్నాఁడు. గుణపరిణామము లగు శబ్దాది విషయములను మనస్సునందు ధ్యానముసేయు చుండుటయే వీనినెల్లఁ గయికొనుటకును విడుచుటకును గారణమగుచున్నది. వీనిని గయికొనుటయు విడుచుటయుఁ గంటికిఁ గనఁబడవు గాని తమకుఁ గలుగు జననమునుఁ దన పుత్త్రునిజననమునుబట్టియుఁ దన మరణమును దన పిత మరణమునుబట్టియు ననుమానముచేతఁ దెలియవలయును గాని, తన జననమును మరణమును నపుడు తాను మోహగ్రస్తుఁడై యుండుటవలనఁ గన్నారఁ గనుఁగొన నేరఁడు. అట్లు తాను జననమరణముల నొందినను నవి తన దేహమును సంబంధించినవే కాని తన్నుఁ గావు. బీజము వలన వృక్షపు జన్మమును గాలపరిణామమువలన వృక్షపు నాశమును బురుషుఁడు తెలియుచున్నాఁడు. అట్లు వానిని దెలిసిన పురుషుఁ డావృక్షముకంటె వేఱుగాఁ గనుపట్టుచున్నాఁడు. ఇట్లె దేహమునకుఁ బంచభూతసంఘాత మనెడు బీజము వలన నుత్పత్తియు విపాకమువలన నాశమును జూచునట్టి యాత్మ యీదేహమునకంటె వేఱే యగును. ప్రకృతివికారమగు దేహమునకంటె నాత్మ వేఱయినది; దాని కల రూపును వివేచించి తెలియనేరక శబ్దాది విషయముల ననుభ

వించుటచేత దేహమే యాత్మ యని రెంటి నొక్కటిగాఁ దలఁచి మోహము నొందినట్టి వాఁడు సంసారమును బొందుచున్నాఁడు. సత్త్వకార్యము లగు శమ దమాదులం దభినివేశము గలిగి వాని కనురూపము లయిన కర్మములచేత దేవత్వమును ఋషిత్వమును బొందుచున్నాఁడు. రజఃకార్యము లగు కామాదులం దభినివేశముచేతఁ దదనుగుణము లయిన కర్మములచేతను నసురయోనిని గాని మనుష్యయోనిని గాని పొందుచున్నాఁడు. తమఃకార్య మగు శోక మోహాదుల చేతను దానివలని కర్మములచేతను బిశాచత్వమో పశుపక్ష్యాది జన్మమునో పొందుచున్నాఁడు. ఇట్లు కర్మములచేత జీవుఁడు ప్రకృతి మండలమందుఁ ద్రిప్పఁబడుచున్నాఁడు. 'ఆత్మకుఁ జేష్టలేకలుగవు. వాఁ డెట్లు తిరుగుచున్నా' డందువా? ఆడుచును బాడుచునుండు జనులను జూచి పురుషుఁడు తానును బుద్ధియం దాడుచుఁ బాడుచునున్నవానివలె నగునట్లు, ఆత్మ క్రియలులేనివాఁ డయ్యును బుద్ధిచేతఁ దనయం దుంపఁబడిన చేష్టలు మొదలగు ధర్మములను జూచి తనవిగా నిశ్చయించి వానిని జేష్టించువానివలె వర్తించుచున్నాఁడు. నీళ్లు కదలుచుండఁగా గట్టునం దున్నవృక్షములును గదలుచు నుండునట్లు కనఁబడుచున్నవి. కన్నులు గిరగిరం ద్రిప్పఁగా, భూమియుఁదిరుగుచున్నట్లు తోఁచుచున్నది. అట్లె దేహమే యాత్మ యని బుద్ధియధ్యసించుచుండుటంబట్టి దేహధర్మము లాత్మయందుఁ దోఁచుచున్నవి. దాశార్హా! స్వప్నమందుఁ గాంచిన విషయానుభవము లనిత్యము లగునట్లు, ఆత్మ దేహధర్మములను దనయం దధ్యసించెడి సంసారమువృథయే యగును; దానికి హేతువు

నివర్తింపఁగా నదియు నివర్తించుచున్నది. శబ్దాదివిషయములు సన్నిహితములు గాకుండినను శబ్దాదులను ధ్యానించు చుండుట వలన నీజీవునకు సంసారము నివర్తింపకుండును; మఱి బలవత్తరమై వాని ననువర్తించుచునే యుండును. స్వప్నము జరుగుచునుండఁగా నందలి దేశాంతరగమనము శిరశ్ఛేదము మొదలయిన యనర్థపరంపరలు నివర్తింపక యనువర్తించుచునేయుండు నట్లదియు ననువర్తించుచునే యుండును. విషయములను ధ్యానించుచుండుటవలన సంసారము వర్ధిల్లుచుండును గావునఁ, జెడువిషయములం దగిలినయింద్రియములచేత విషయములను ననుభవింపకుము. ఏలన వాని ననుభవించితివేని వానిని ధ్యానించుటకు హేతువగుచున్నది. ఆత్మయందు జన్మమరణాదు లయిన యవస్థలను గల్పించుటకు నిమిత్తమగు భ్రమము దేహవిలక్షణము లగు నాత్మపరమాత్మలస్వరూపమును గ్రహింపమి చేతఁ గలిగినదిగా నిశ్చయింపుము. దుర్జనులు నిన్నాక్షేపించినను, నిందించినను, వంచించినను, దోషములు చెప్పినను, గొట్టినను, జెఱఁబెట్టినను, నీబ్రతుకును బోకార్చినను, ఉమ్మివేచినను, మూత్రము విడిచినను, ఇట్లజ్ఞులగువారు పెక్కువిధముల నిన్ను మిక్కిలియుఁ జలింపఁజేసినను నీవు శ్రేయమునే కోరువాఁడవేని, యిట్టియాపదలనెల్ల బొందినను నాత్మస్వరూపదర్శనముచేత నిన్నుద్ధరించుకొనవలయును' అనెను.

ఉద్ధవుఁడు—మాటకారులందు మేటీ! నే నీ యాక్షేపాదులన్నియు సహించి యాత్మ పరమాత్మలను గలరూపున నెఱుంగునట్లుగా నాకు వలయు నుపాయము నుపదేశిం

పుము. ఏలనఁగా, అసజ్జనులు తమయందుఁ గావించునాక్షేపాదు లను దుడుకులను సహించి యుండుట మిక్కిలియుఁ గష్టమైనదని తలఁచు చున్నాను. కావుననే వానిని సయించుట కుపాయ మడుగుచున్నాను. విశ్వాత్మా! విద్వాంసులకుఁ గూడఁ బ్రకృతిసంబంధమువలన దేహాత్మాభిమానమును రాగ ద్వేషాదులును బలీయము లయినవి. విద్వాంసులందఱకునుగా దు. భగవద్ధర్మనిరతు లయి నీచరణములనే యాశ్రయించి జితాంతఃకరణులై యుండు నట్టివారు తప్పఁ దక్కిన విద్వాం సులకెల్ల నవి బలీయమైనవియే యగును' అనెను. ఇదియిరువది రెండవయధ్యాయము.

---

{శ్రీకృష్ణుఁడు సుఖదుఃఖములకు హేతువు మనస్సే యని యుక్తిపూర్వకముగా నిరూపించుట.}

శ్రీ శుకులు—— ఇట్లు తన భక్తశ్రేష్ఠుఁ డగు నుద్ధవుఁ డడు గఁగా పీనులకు వింధైన వీర్యములుగల యా ముకుందుఁ డా భృత్యునిమాట నెంతయు గావించుచు నిట్లనియె.

భగవంతుఁడు——బృహస్పతి శిష్యా! దుర్జను లాడు దుర్వ చనములచేత భేదిల్లినమనస్సును సమాధానపెట్టుకొనుటకు సమర్థుఁ డయిన సాధుపురుషుఁడు లేఁడు సుమీ. దుర్జను లాడు పరుసని ములుకులవంటిమాటలు మర్మములం దగిలి పురుషుని నొప్పించునట్లు, మర్మములునాటిన వాఁడి బాణములు సైతము నొప్పింపవు. అట్టి బాణములకుఁగూడ నాపురుషుఁ డంతఁ దపింప కుండును. ఉద్ధవా! మిక్కిలియుఁ బుణ్యాంబయినయొక యితి హాసమును జెప్పుచున్నారు. దానిని నీకు వివరించి చెప్పెదను.

మిక్కిలి యెచ్చరికగలిగి వినుము. ఒక భిక్షుఁడుగలఁడు. వానిని దుర్జను లెల్లను జేరి మిక్కిలి యవమానించిరి. వాఁ డందులకు మనస్సు దిటచెడక తనలో నహంకారమమకారముల వలన నిజకర్మములకు లోనైన యంతఃకరణమే యిట సుఖదుఃఖము లను బరిపాకము సేయుచున్నదని స్మరించుచు నీ యితిహాస మును బాడెను. అవంతి దేశమునందు నొకానొక బ్రాహ్మణుఁ డుండెను. వానికి సంపద నిండి గండరించుచుండెను. వాఁడు సేద్యము వర్తకము మొదలగునవి చేసి బ్రతుకుచుండెను. అయినను వాఁడు తన యుదరపోషణమాత్రమును జూచుకొను వాఁడు, కేవలవిత్తకామి,లుబ్ధుఁడు; అందుచే మిక్కిలియుఁగోపి. జ్ఞాతులను గాని యతిథులను గాని వాఁడు వట్టిమాటచేతఁ గూడఁ బూజించినవాఁడు గాఁడు. అతిథు లెవ్వరును వాని యింట లేకయే యుందురు. అట్టి యింటఁ దానైనను నయ్యేకా లములందుఁ దగుభోగముల ననుభవించినవాఁడు గాఁడయ్యె. దుశ్శీలుఁడును స్వోదరపోషణపరుఁడును నగువానికిఁ బుత్రులును బంధువులును ద్రోహము చేయుచుండిరి. మఱి వానిభార్యయును గూఁతుండ్రును భృత్యులును విషాదమునొంది వానికిఁ బ్రియము గావింపకుండిరి. ఇట్లు వాని ధనము లూరకరక్షింపఁబడుచుండుటన వయ్యేనే కాని పరుల కుపయోగింపఁ బడినవిగావు. కనుక వాఁడు ధర్మమును గామమును లేనందున నుభయలోకముల కును వెలియైయుండెను. కాఁబట్టి దేవర్షులు పితరులు భూత ములు మనుష్యులు బ్రహ్మర్షు లనెడి *పంచమహాయజ్ఞదేవతలు

* 'ఆర్జించిన ధనమునకు పంచ మహాయజ్ఞములచేత ఆయా దేవతలు నారాధించుటయే ప్రయోజన' మని తెలియునది.

దమ తమ యజ్ఞభాగముల నొందకపోవుటచే వానియెడఁగ్రుద్ధు లయిరి. అట్లు భాగము నొందువారల ననాదరము చేయుటం జేసి వాని పుణ్యస్కంధము విధ్వంసము నొందెను. భూరిదా! వెక్కలు కృషి మొదలగుపాట్లుపడి గడించినవానిధన మంత యునుగూడ నాశమునొందెను. వానిధనమును జ్ఞాతులు కొంత పట్టుకొనిరి. దొంగలు కొంత యపహరించిరి. ఇల్లుగాలుట మొద లగు దైవికములవలనఁ గొంత నష్టమయ్యెను. నేలపూడ్చుట మొదలగువానిచేతఁ గాలక్రమమునఁ గొంత నశించెను. రాజు గారి మనుష్యులవలన నా దుష్టబ్రాహ్మణునిధనము నాశము నొందెను. ఇట్లు దైవాదులవలనఁ దన ధనమంతయు నష్టము గాఁగా ధర్మకామరహితుఁ డగువానిని వాని సొంతజనులు నాదరింపక యుపేక్షించిరి. దానివలన వానికిఁ గడవరాని మహాచింత గలిగెను. వాఁ డిట్లు ధనమంతయుఁ బోఁగొట్టు కొని మిక్కిలియుఁ జింతయందు మునిఁగి డగ్గుత్తికవడ దుఃఖిం చుచుండఁగా నంత వానికి మిక్కిలియు గొప్ప విరక్తిపుట్టెను. వాఁడు తనలో 'అక్కటా! నే నిట్లు కష్టపడి ధనము సంపాదిం చితిని గాని దానివలన నొక ధర్మమునుగాని కామమును గాని జేసి యుపయోగింపనయితిని అందులకై వ్యర్థముగా నాయీ దేహమున కనుతాపము పెట్టితిని. ఏమికష్టమిది? తలచు గా నాబోఁటి పిసినిగొట్టులకు ధన మొకప్పుడును సుఖము కొఱకుఁ గానేరదు; మఱి సొంతముగా ననుభవించుటకును గాదు; చచ్చినపిదప నరకము నొందించుటకే యగును. కీర్తి మంతులగు వారి నిర్మలమైన కీర్తి యెంతయుండినను గుణ వంతులకు శ్లాఘ్యములగు గుణము లెన్నియుండినను రవ్వంత

లోభముగూడ నుండెనా, గొనియాడందగిన చక్కఁదనమును దెల్లనికుష్ఠు మూలించినట్లు, అది తక్కిన యా గుణములనెల్ల హాతము సేయుచున్నది. మొదట ధనమును సంపాదించుటకును, అది సంపాదించినపిదప దానిని బెంచుటకును, నాయాసపడ వలయును. పిదప దానిని రక్షించువిషయమున భయము గలుగుచున్నది. దానిని వెచ్చించినను ననుభవించినను జింత గలుగుచున్నది. అది నశించెనా యయ్యో చెడితి నని భ్రమమును మృతియుఁ గలుగుచున్నవి. దానిని సంపాదించునపుడు దొంగతనము, హింస, అబద్ధము, దంభము, కామము, క్రోధము, గర్వము, మదము, దేహానుబంధులగువారికిఁ బ్రియముచేయుట, కారణములేని విరోధము, కలహము, స్త్రీ, జూదము మొదలగు వ్యసనములు ననెడి యీ యనర్థములు పదియేనును ధనమూలమున మనుష్యులకుఁ గలుగు నని చెప్పుదురు. ఇట్లు ధనము పేరికి నర్థ మనఁబడినను గొప్ప యనర్థమే యగును గాన, శ్రేయస్సును గోరినవాఁడు దానిని దూరముననే త్యజింపవలయును. ధన మిరువదిచిల్లిగవ్వ లంత వ్యత్యాసపడినను దనతోఁ బొటియాపదయు సంపదయుఁ గలిగి మిక్కిలిప్రీతితోఁ గూడి యున్నట్టి యన్నదమ్ములును భార్యలును దండ్రులును సుహృదులును దోడనే నెయ్యమునువిడిచి యందఱును శత్రువులుగాఁ జేయఁబడుచున్నారు. అల్పమగు ధనము వ్యత్యస్తము కాఁగానే యా యన్నదమ్ములు క్రుద్ధులై కలకాలము రోషము దిగవిడువక మచ్చరించుచుఁ దోడనే నెయ్యమును దియ్యమును దిగవిడిచి వేగ యొకరినొకరు గొట్టుకొనుచుఁ బ్రాణములను బాయుచుందురు. దేవతలకును బ్రార్థింపఁదగినమనుష్యజన్మము

నొంది యందును గొప్పదియగు బ్రాహ్మణత్వమును గూడఁ బడసి వానివలనఁ గలుగునట్టి శ్రేయమును బాటింపక యెవరు ధన మందుమాత్రము దగులుగలిగి తమ యాత్మహితమును నాశముచేసికొందురో వారశుభం బగునరకగతిని బొందు దురు. ఈ మనుష్యదేహము స్వర్గమునకును నపవర్గమునకును సాధనమయినది. ఇట్టిదానినిబడసియు ననర్థమున కునికిపట్టయిన ద్రవ్యమునం దెవఁడు తగులునొందును? ఎవ్వఁడు నొందఁడు. పంచమహాయజ్ఞముల కుపయుక్త మగుద్రవిణము ననర్థా వహ మని యెట్లు చెప్పెద వందువా? దేవతలకును ఋషుల కును బితరులకును భూతములకును, జ్ఞాతులకును బంధువులకును నిట్లు తనతోడి భాగముగలవారికిని దన దేహమునకును ధన మును బంచి కుడువక యూరక పదిలముగాఁ బెట్టుకొనియుండు వాఁ డధోగతి నొందుచున్నాఁడు. ధనమునకై పాటుపడు చుండువానికిఁ బ్రమత్తత చేఁదుదకు విత్తమును వయస్సును బల మును వ్యర్థముగాఁ బోవుచున్నవి. ఆ విత్తాదులవలనఁ గదాకుశ లము లగు ధర్మకామ మోక్షములు సిద్ధించుచున్నవి. అట్టివి పోయినపిదప నిపుడు ముదిసి ముదుకఁడై యుండఁగా నేమి సాధింపఁగూడును. ఇట్లర్థ మనర్థావహ మగుటంబట్టి యిది దెలిసినవాఁడు గూడ ధన మార్జించుటకు వలయు చేష్టలే కావిం చుచుండును. ఇట్టి జనుఁడక్కటా! పలుమాఱు క్లేశమునొందు చున్నాఁడు. ఏలన నొకానొకని (యీశ్వరుని) మాయ చేత నీ లోకమంతయు మిక్కిలి మోహముపాలై యున్నది. ధనములో, భోగోపయుక్తములగు కామములను దానోపయుక్తములగు ధనములను నొసంగుచున్నవి. అట్టి ధనముచేతఁ బనయేమి?

మఱి కామములచేతఁగాని బనయేమి? ఇఁకఁ గర్మములో జన్మములను గలిగించుచుండునది. కనుక వానివలనఁగాని పనయేమి? ఏలన మృత్యువు పట్టికొని మ్రింగుచుండఁగా నివియెల్ల నేమిపనికి వచ్చును? సర్వదేవమయుండును భగవంతుఁడునగు హరి నాయందు సంతుష్టుఁడయి యనుగ్రహించినాఁ డనుట నిజము. అతఁడేకదా నా కిట్టిదశ కలిగించెను. ఇట్టి స్థితివలన సంసారసాగరమునకుఁ దెప్పవంటి దయిన యీ నిర్వేదము నాకుఁ గలిగినది. ఇట్లు నాకు నిర్వేదము పుట్టియున్నందున శేషించియున్న నా యాయువువఱకు నా శరీరమును దపస్సుచేత శోషింపఁజేసెదను. మఱి సమస్తమునకు నిరతిశయపురుషార్థమయిన యాత్మయందు నేను బ్రీతిరూపమగుభక్తిగలిగి, యం దప్రమత్తుఁడనై వర్తింతునేని యపుడు నా పూర్వవృత్తము దెలిసినవా రనుమోదింపకపోయినను నా యభిప్రాయమును దెలియునట్టిదేవత లేనియు నన్ననుమోదింపక తప్పరు. మిగిలియున్న స్వల్పాయువుచేత నప్రమత్తుఁడగుట యెట్లందువా? ఖట్వాంగుఁడు ముహూర్తకాలమున భగవల్లోకము సాధించెనుగదా' యనెను.

శ్రీభగవంతుఁడు—— ఇట్లాయవంతిదేశపుబ్రాహ్మణుఁడు మనస్సునం దభిప్రాయపడి హృదయమునందు విడిచిపుచ్చరానట్లు ముడివడియున్న రాగద్వేషాదులను బరిహరించి చిత్తము నందలికలుషముల నెల్ల వీడి భిక్షుకుండును మునియు నయ్యెను. వాఁ డాత్మను నింద్రియములను బ్రాణములను నడంచిపుచ్చి యీభూమియందుఁ ద్రిమ్మరుచుండెను. మఱి నగరములందుఁ గాని గ్రామములందుఁ గాని యెందును నాసక్తిలేక యెవరికిని

దా నిట్టివాఁ డనిచక్కఁగాఁ దెలియంబడకుండునట్లు, భిక్షకొఱకుఁ బ్రవేశించుచుండెను. భద్రా! అట్లువాఁడు వృద్ధుఁడై యవధూతయై భిక్షుకుఁడుగా నుండుటను దుష్టు లగువారు చూచి యడియాలములచేతవానిని గుఱుతుపట్టి దర్పితులై వానిని బరిపరివిధములఁ బరిభవించిరి. కొందఱాతని త్రిదండమును లాగికొనిరి.కొందఱాతనిపాత్రమును గమండలువును బెఱికికొనిరి.కొందఱాతని యజ్ఞసూత్రమును గొందఱు బొంతనును నారచీరలనును దీసికొనిరి. మఱి యామునికి వాని నిచ్చెదము రమ్మని చేయిచూపి యతఁడు రాఁగా మరల నియ్యక యేమఱించిరి. అతఁడు భిక్షించి తెచ్చుకొన్న యన్నము నేటిగట్టునఁగూర్చుండి తినుచుండఁగా పాపిష్ఠులగువారు దానియందు మూత్రము విడుతురు. వాని తలయందు ఫూత్కని నిష్ఠీవనముచేయుదురు. వాఁడు పలుకకుండుటను జూచిబలవంతముగాఁ బలికింతురు, పలుకకుండెనా కొట్టుదురు.మఱికొందఱు ''వీఁడుదొంగ'' యని మాటలచేత బెదరింతురు. వేఱు కొందఱు వానిని పాశములచేతఁగట్టి 'చంపుఁడు చంపుఁ'డని పలుకుదురు.కొందఱు పట్టి త్రోయుదురు. కొందఱు 'వీఁడు ధర్మాత్ముఁడని వేషము వేసికొన్న వాఁడు; గూఢముగా విప్రియము చేయును, ధనమంతయు క్షీణింపఁగా సొంతజనులు దిగవిడువఁగాఁ జేయునదిలేక యీ వృత్తిని గయికొన్నాఁ'డని యవమానింతురు.కొందఱు 'ఔరా! వీనిబలమెంత గొప్ప! పెద్దకొండవలెఁ గదలక దిటగలిగి యున్నాఁడు చూడుఁడు. వీఁడు కొంగవలె నేదోయొక నిశ్చయమును లోపలనే పెట్టుకొని మౌనముచేతఁ గోరిన ప్రయోజనములను (అన్నాదులను) సాధించుచున్నాఁడు' అని పకపక

నవ్వెదురు. మఱికొందఱు వానియందపానవాయువును విడుతురు. వానిని ద్రాళ్లచేత బంధింతురు. లేనిపోని యత్ఱాఁకలఁ బెట్టుదురు. ఇట్లాటబొమ్మవలె నతని నాడింతురు. అతఁడీవిధమున దుర్జనులు గావించు భౌతికదుఃఖమును శీతోష్ణాదులవలనఁ గలుగు దైవికదుఃఖమును జరాదులవలనఁ గలుగు దేహదుఃఖమును మాటికి మాటికి వచ్చుచుండఁగా నవన్నియు నిజకర్మములవలననే కలిగినవనియుఁ దా ననుభవించియె తీఱవలయుననియు నిశ్చయించి యే వికారమును లేకుండెను. ఇట్లాతఁడు మనుష్యాధములచేత నవమానింపఁబడినవాఁడై వారు పడఁద్రోయుచుండఁగాఁ దన ధర్మమును దప్పక సత్త్వగుణప్రేరితమగు ధృతిని మూఁది యీగాథను బాడెను.

భిక్షువు—ఈజనులు నాకు సుఖదుఃఖములను గలిగించుటకు హేతువులు గారు. మఱి యీశ్వరుఁడుగాని సూర్యాదిగ్రహములుగాని కర్మములుగాని కాలముగాని, హేతువులు గావు. ఇంతకును ముఖ్యంబగు కారణము మనస్సని సుఖదుఃఖములకుఁ గారణముల నెఱింగినవారు తలంచుచున్నారు. ఆమనస్సేకదా సంసారచక్రమును ద్రిప్పుచున్నది; కావున నదియే కారణము. బలీయంబగుమనస్సు, రాగద్వేషాదిగుణములను సృజించుచున్నది. ఆగుణములవలననుండి శుక్లములగు సాత్త్విక (పుణ్య)కర్మములును గృష్ణములగు తామస(పాప)కర్మములును లోహితములగు రాజస (పుణ్యాపుణ్య) కర్మములును బరస్పరము విలక్షణములై పుట్టుచున్నవి. ఆ కర్మములవలననుండి వాని వానికనురూపములు లయిన * దేవ తిర్యఙ్నరజన్మములు గలుగు

---

*సాత్త్వికకర్మములవలన దైవగతియు తామసములవలనఁ దిర్యగ్గతియు

చున్నవి. వానియందు మరల మనస్సుచేత గుణసృష్టి గలుగుచున్నది. మనస్సను ద్రష్ట నట్టిసంసారచక్రముచేత జీవునికి సుఖదుఃఖము లెట్లు? దేహసంబంధముచేతఁ గలుగు నన్నచో నట్టి సంబంధముగల పరమాత్మకును నవి గలుగ వలదా యని యందువా? లోపలఁజొచ్చి శాసనధారణములు చేయుచున్నను బాయక హిరణ్యమువలె మిక్కుటముగాఁ బ్రకాశించుచుండు పరమపురుషుఁడు మన స్సెన్ని సంకల్పవికల్పములు చేయుచున్నను దా నహంకారమమకారములకుఁ దగు చేష్టలు చేయకుండును. కనుక బుద్ధి సాక్షియై కేవలముండును. ఈజీవుఁడో తన దేహమును నాత్మగాఁ దప్పఁదలఁచి విషయముల ననుభవించుచు శబ్దాదివిషయసంగమువలన బద్ధుఁడగుచున్నాఁడు. * కనుక వానికే సుఖదుఃఖములు గలుగుచున్నవి. దానమును వర్ణాశ్రమోచితమగు ధర్మమును యమమును నియమమును నధ్యయనమును, దక్షిణకర్మములును నేకాదశ్యుపవాసాదులగు మంచివ్రతములును మొదలగు నివి యన్నిటికిని ఫలము మనోనిగ్రహమే. దానాదులు యోగమున కంగము లని శ్రుతి చెప్పుచుండఁగా మనోనిగ్రహమున కంగము లెట్లందువా? విష

---

రాజసములవలన మానుషగతియుఁ గలుగుచున్నవి. మనస్సుచేత గుణములు, గుణములచేత కర్మములు, కర్మములచేత గతులు, గతులయందు మరల మనస్సుచేత గుణములు ననియిట్లు చక్రమువలెఁ బరివర్తించుటచే మనస్సు సంసారచక్రమువలెఁ దిరుగుచున్నది.

* శరీరసంబంధ మాత్రముచేత సుఖదుఃఖములు గలుగవు. గుణకర్మములకు లోనగుటచేత నే యవి గలుగును. పరమాత్మ శరీరసంబంధము గలిగియుండియు గుణకర్మములకు లోనుగాఁడు గాన యతనికి సుఖదుఃఖములు లేవు. జీవుఁడో గుణకర్మములకులోనయ్యునుండుటను గాన సుఖదుఃఖములను బొందుచున్నాఁడు.

యాంతరములనుండి మనస్సు నాకర్షించి పరమాత్మయందే నిలుపుట సమాధి. అదియె మనోనిగ్రహము. అదియె పరంబగు యోగము. ముముక్షుండగు నెవ్వానిమనస్సు సమాహితమై రాగాదులచేతఁ గలుషితముగాకుండునో యట్టి వానికి దానాదులతోఁబనియేమి? చెప్పుము. ముముక్షువగు నెవ్వానిమన స్సడంచి పుచ్చంబడ కుండునేని, యాలస్యాదులచేత మఱిఁగియుండునేని, యీదానాదులవలన మఱివేఱు ప్రయోజనమేమున్నది? వానికి సమాధియే యపేక్షిత ఫలసాధమగును గాన యందులకే యీదానాదు లంగములు గానోపును. అట్టి సమాధి ఫలము గానిచో దానాదులుగావించియుఁ బ్రయోజనములేదు. తక్కిన యింద్రియములుగాని వాని నధిష్ఠించియుండు దేవతలుగాని మనస్సునకు వశమందున్నవి యాయెను. మనస్సో తక్కినవాని వశమును బొందదు. దేనికిని వశముగానిది దానాదులచేత నెట్లు సమాహితమగు నందువా? నిజతేజంబున దీపించుచున్న పరమపురుషుఁడు బలవంతులకంటె బలీయుఁడు. ఏలన నతఁడు మనస్సు మొదలయిన యింద్రియములకును వానినధిష్ఠించియుండు చంద్రాదులకును, దేవుఁడుగాన వానికెల్ల * భీష్ముఁడు (భయంకరుఁడు). కాఁబట్టియతఁడు దానాదులచేత నారాధితుఁడయ్యెనేని, నిగ్రహించుట కలవిగాని మనస్సునుగూడ వశముగావించుకొని తనయందు సమాహితము చేసికొనుచున్నాఁడు. ఇట్లు మనస్సు దానాదులచేత నారాధితుం డయిన పరమపురుషుని ప్రసాదము తప్పఁ దక్కిన యుపాయములచేత జయించుట కలవిగానిది;

* 'నతత్రసూర్యోభాతి నచంద్రతారకం భీషాదస్మా ద్వాతఃపవతే' ఇత్యాది శ్రుతుల నిట యనుసంధించునది.

మఱి శత్రువువలె దుఃఖప్రద మయినది. దానరాగాదుల యురవడి సహింప నలవిగాదు. కావున నదియెప్పుడును హృదయమునకు నొవ్వుగలిగించుచుండును; అట్టి మనస్సును జయింపక మనుష్యులతోడి నిష్ఫలమగు వైరమును బెట్టుకొని మిత్రు లని యుదాసీను లని శత్రువు లని యేర్పఱచుకొని మిక్కిలి మూఢు లగుచున్నారు. దేహమునకు మనస్సొకటిమాత్రమే నిదానము. ఇది దేవుఁడనియుమనుష్యుఁడనియు మఱియుఁ బెక్కుదెఱంగులఁ జూపట్టుచున్నది. ఇందేదేని యొక్కదానిని గయికొని దేహమే నేననియు నాదియనియు నహంకార మమకారముల చేత బుద్ధి తన స్వరూపమును గనుఁగొననేరక గ్రుడ్డి యగుచుండఁగా 'నేను బ్రాహ్మణుఁడను వీఁడుశూద్రుఁ'డని యిత్యాదిభ్రమల పాలై యగాధమగు సంసారమందు భ్రమించుచున్నారు. జనుఁడే సుఖదుఃఖములకు హేతువని చెప్పినచో, జనుఁ డనఁగా దేహమని తలంతము. అపుడు దానివలన నాత్మకేమి? మఱియొకటి సుఖదుఃఖములకుఁ గర్తయగునేని దానివలన నాత్మకు స్పర్శనము గొంచెమైనను గలుగదు. భూవికారము లయిన దేహములకే యాసుఖదుఃఖముల కర్తయగుటయుఁ * వానికిఁ బాలుపడుటయుఁ గలుగుచున్నవి. అచేతనములగుటచేత దేహమును సుఖదుఃఖములకు హేతువు గానేరదు. జనుఁ డనఁగా నాత్మయు దేహము నని తలంతము. ఒకానొకప్పుడు తన పండ్ల

* కర్తృత్వ మొకవిధమైన ప్రయత్నమును యత్నమును సుఖదుఃఖములును జ్ఞానరూపములు. అచేతనములగు భూవికారములకుయత్నాదులు గలుగనేరవు. కనుక భూవికారములనుటచే భూవికారములును అచేతనములు నగు దేహములకును సుఖదుఃఖ హేతుత్వము గలుగనేరదని భావము.

చేతనే తననాలుకను బురుషుఁడు గొఱుకుకొనుచున్నాఁడు. అప్పుడు నొప్పి గలుఁగుచున్నది. అందుల కెవ్వనిని గోపింప వచ్చును? తనయాత్మ యధిష్ఠించియున్న శరీరము నందలి యవయవములు రెంటిలో నొకటి యాదుఃఖమునకుఁ గర్తగాను మఱియొకటి గర్మముగాను గనుపట్టుచున్నది. అం దొకజనుని వలననుండి మఱియొకజనునికి సుఖదుఃఖము లన్వయించుట లేదు. ఇట్లు దేహముగాని యాత్మగాని సుఖదుఃఖములకు హేతువుగా నేరదు. ఆ రెంటికి నంతరాత్ముఁ డయి యున్న * యీశ్వరుఁడే సుఖమునకు దుఃఖమునకు హేతు వగుఁగాత. అప్పుడు దానివలన నాత్మ కేమి? వైషమ్యాదులును సుఖదుఃఖాదులునగు వికారములుఁగలవారికే యట్టి హేతుత్వాదులుగాని, నిర్వికారములయిన యీయంతరాత్మల కిరువురకును నట్టివి గలుగనేరవు. ఒక యంతరాత్మ మఱియొక యంతరాత్మకు సుఖదుఃఖ హేతువుగా నేరదు. ఒకటి తానే తన సుఖదుఃఖములను గలిగించుకొని సుఖించుచు దుఃఖించుచు నుండునందువా? ఒకానొకప్పు డీశ్వరునిచేఁ బ్రవర్తితమగు నొక యంగముచేత మఱియొక యంగము కొట్టువడెనేని, దానివలన వేదన గలుగుచున్నది. పరమపురుషునికిఁ బ్రకృతి పురుషులు రెండును దేహములగుటంజేసి యతఁడు దా నెవనిని గోపింపఁగలఁడు? తన్నే కోపించుకొనవలయును? వెఱ్ఱిలేనివాఁ డెవఁడు గాని

* ముందు 'నాయంజనో మే సుఖదుఃఖహేతు ర్న దేవతాత్మా గ్రహకర్మకాలాః మనః పరం కారణ' మ్మని చెప్పఁబడియున్నది. అందు, జనుఁడు కారణముగాదని నిరూపించి యిపుడు దేవతయుఁ గారణము గాదని నిరూపించుట తెలియునది.

తనకుఁదానే సుఖ దుఃఖములు గలిగించుకొని తన్నే కోపించుకొనఁడు గదా. మఱి నిత్యనిర్వికారుఁడగు పరమపురుషునికి సుఖదుఃఖాది వికారములుగాని యెక్కడివి? ఒకప్పుడును నవి యతనికిఁ గలుగనేరవు. నిర్వికారుఁడగు నీశ్వరుఁడు సుఖాదులకు హేతువుగాకున్న మానెఁ గాని వికారియగుప్రత్యగాత్మ హేతువుగాదాయందు వేమో? దేహియగునాత్మ సుఖదుఃఖములకు హేతువగునేని,—అనఁగా మఱి యొక యాత్మను సుఖపెట్టునదిగాని దుఃఖపెట్టునదిగానియైనను, లేక దానికంటె మఱియొక యాత్మ సుఖించినను గాని దుఃఖించిననుగాని, లేక తానే వానిని గలిగించుకొని సుఖించినను దుఃఖించిననుగాని, యపుడుమఱియొక యాత్మవలనఁ దనకు సుఖదుఃఖములు గలిగిన వని తలంచుట తప్పే యగుచున్నది. ఎట్లన, సుఖదుఃఖాదివికారముల కాశ్రయమగుట నిజస్వభావ మగుచున్నది గదా. అపుడాత్మకు వికారశీలత్వము గలుగును. అది దానికి స్వభావమగును. స్వరూపస్వభావములు నిత్యములు గనుక నాత్మకు స్వభావప్రయుక్త మనియేర్పడిన యీహేతుత్వమునుగూర్చి కోపపడుట కేమున్నది? ఆత్మకంటె మఱి యొకటి హేతువుగాదు. ఆత్మయే హేతువన్నచో నదియు మృషయే యగును. జ్ఞానానందైక రసుండును నిర్వికారుండు నగు నాత్మకుసుఖము దుఃఖమునను వికారములు గలుగనేకలుగవు. సుఖదుఃఖములకు దాద్వాశాష్టమజన్మస్థానము లందున్న సూర్యాదిగ్రహములు నిమిత్తము గావచ్చునన్నచో నాత్మకేమి? ఆత్మకు జన్మమే లేదనఁగా దానికి జన్మమును నష్టమాదులందు గ్రహము లుండుటవలని సుఖదుఃఖములు నెట్లు గలు

గును? ఉత్పత్తికిఁ బట్టయిన దేహమునకు జన్మాదిస్థానములం దుండుట వలన సుఖదుఃఖహేతువు లగు గ్రహములకును నితరగ్రహములచేతఁ బీడగలుగుచున్న దని దైవజ్ఞులు చెప్పెదరు. కనుక గ్రహములకును దేహమునకును నన్యుం డయిన పురుషుఁ డెవనిని గోపింపవచ్చును? ఈ చెప్పిన వారిలో నెవనిని గోపించుటకును లేదు. గ్రహములకును బరస్పరపీడగలదేని కర్మమే యన్నిటికిని హేతువుగాఁగూడదా యందువేమో? దాని వలన స్వయంప్రకాశరూపుండును నిర్వికారుండును నగు నాత్మకు సుఖదుఃఖములుగాని తన్మూలమగు శుభాశుభ కర్మములుగాని గలుగవు. దేహ మచేతనము గాన యే ప్రవృత్తికిని యోగ్యముగాదు. కాన దానికి నవి గలుగ నేరవు. జడ మగు దేహ మజడమైన యాత్మయగునేని యాసుఖ దుఃఖాదులు గలుగును. జడమును నజడమును స్వభావము లందు విరుద్ధములు గనుక నొకటి మఱి యొకటి యగుట పొసఁగదు. కాన సుఖదుఃఖాదులు గలుగవు. దేహము జడము. ఈ పురుషుఁడో (జీవుఁడో) సుపర్ణునివలెఁ బ్రకాశస్వరూపుఁడు కనుక వీనికిఁ గర్మమూలము హేతువు గా నేరదు. కాఁబట్టి యింత వఱకుఁ జెప్పిన జనాదులలోపల దేనిని గారణమని కోపింపవచ్చును? దేనిని కాదు. కాలము సుఖదుఃఖములకు హేతువన్నచో స్వరూపముచేత సుఖదుఃఖముల తోడి సంబంధములేక జ్ఞానైకస్వరూపమై యున్న యాత్మకేమి? దానికి సుఖదుఃఖ కార్యములయందుఁ గర్తృత్వకర్మత్వాదు లేవియుఁ గలుగవు. ఆత్మ పూర్వోక్తమగు స్వరూపముగలవాఁ డగును. (అనఁగాఁ బూర్వము చెప్పినట్లు జడుఁడును

నిర్వికారుఁడును నుత్పత్తి వినాశరహితుఁడును స్వప్రకాశస్వరూపుఁడును నగును.) ఇట్లు స్వరూపమునుబట్టి యాత్మసుఖదుఃఖాన్వయము లేనివాఁడయ్యును గాలమునకు వశ్యుఁడగుటంబట్టి సుఖదుఃఖసంబంధము నొందుచున్నాఁ డనవచ్చును. అట్లేని యీ హేతువును బట్టియే యగ్నికిని స్వరూపసిద్ధమగు తాపము లేక పోవచ్చును. హిమమునకుఁ బ్రసిద్ధమగు శైత్యమును స్వరూపసిద్ధమే కాని కాలవశమున నవియట్లగుటగానరాకున్నది. దీనినిబట్టి కాలమును హేతువు గా నేరదు. ఇట్లు జనాదులాఱింటియందును దేనిచేతఁగాని సుఖదుఃఖములు గలుగుట గానరాదు. కనుక వీనియందు దేనిని గారణమని కోపింపవచ్చును? దేహమునకు విలక్షణమయిన యాత్మకుఁ దక్కిన జనాదులందొక్కదానిచేతను మఱివేఱెద్దానిచేతను నెచ్చటఁగాని యేవిధముననుగాని సుఖదుఃఖములసంబంధము గలుగకుండును. అట్టియెడ సంసారమును గలిగించునట్టి మనస్సును బట్టి యీయాత్మ కహంకారము గలుగఁగా నాయుపాధినుండి సుఖదుఃఖములు గలుగుచున్నవి. స్వరూపముచేతఁగాదు. (అనఁగా సంకల్ప వికల్పాత్మకమగు మనస్సు సమాహితము గాకుండుటవలన నహంకారమమకారములు పుట్టుచున్నవి). వానినుండి ద్వేషాదులును, ద్వేషాదులనుండి కర్మములును కర్మములనుండి జన్మములును, జన్మములనుండి సుఖదుఃఖములునుగలుగుచున్నవి. ఇది యెఱింగినవాఁడు భూతములచేతను పద్రవము నొందినను నెంతమాత్రము భయుపడకుండును. ధన మెల్లఁ బోవఁగా నిర్వేదమునొంది యూరువెడలి వనమునకేఁగి, భూమియెల్లఁ ద్రిమ్మరుచు బడలికవీఁకి మిక్కిలి

పూర్వులగు మనుష్యులెల్ల సుఖదుఃఖనిదానమని పరిష్కరించి గయికొన్న పరమాత్మనిష్ఠను నవలంబించి దుష్టులెంత నిరాకరించినను దన ధర్మము నుండి కొంచెమైనను జలింపక ముకుందపాదారవిందసేవయే యుపాయముగాఁ గొని యపారమును దమకి కార్యమునగు సంసారమును దాఁటుదు నని నిశ్చయించుకొని మునియైన యాబ్రాహ్మణుఁ డీ గాథను జెప్పెను: మనస్సుచేత దేహమే యాత్మయనియుఁ దాను స్వతంత్రుఁడ ననియుఁ దలంచుటయే సుఖదుఃఖములను బురుషున కిచ్చుచుండును గాని మఱి యొకటిగాదు. ఇట్లు మనస్సుచేతఁ దలంచుట వలన నిదియే కాక మిత్రులు శత్రు లుదాసీనులని మువ్వురేర్పడుటయు సంసారమును గలుగుచున్నవి. నాయనా! ఇట్లు మనస్సు తడఁబాటే సుఖదుఃఖములకు హేతువగుటంబట్టి నాయందు బుద్ధిని జొప్పించి మనస్సును సర్వవిధములచేతను విషయాంతరముల నుండి మరల్చి నాయందు సమాహితము గావింపుము. శాస్త్రములందెల్ల ముఖ్యముగాఁ బ్రతిపాదింపఁ బడుచున్న యోగము సంగ్రహమెల్ల 'నాయందు బుద్ధిని జొనిపి నన్ను నిగ్రహించుట' యను నింతయే భిక్షుండుపాడినయీవిషయమును నెవ్వఁడు శ్రద్ధతో మనంబునఁ దాల్చుచు నొకరికి వినిపించుచును స్తుతించుచుచుండునో వాఁడు సమాహితుఁడై బ్రహ్మనిష్ఠుఁడునై సుఖదుఃఖాదిద్వంద్వములకుఁ గీడ్పడక ముక్తి నొందుచున్నాఁడు. ఇది యిరువదిమూఁడవయధ్యాయము.

-----

—●●◆ శ్రీకృష్ణుఁ డుద్ధవునకు సాంఖ్యము నుపదేశించుట. ◆●●—

శ్రీభగవంతుఁడు—ఇపుడు నీకు సాంఖ్యమును (అనఁగాఁ బ్రకృతి పురుషేశ్వరుల స్వరూపవిభాగమును) జెప్పెదను. ఇది పూర్వులగు ఋషులచేత లెస్సగా నిశ్చయింపఁబడియున్నది. దీనిని బురుషుఁ డెఱింగిన యెడల వీఁడు వాఁ డను భేదబుద్ధిని గలిగించు దేహాత్మభ్రమమును దిగవిడుచుచున్నాఁడు. తొల్లి జీవస్వరూపమును బ్రకృతియు రెండును నామరూపవిభాగములేనివై మిక్కిలి సూక్ష్మములై పరమాత్మతోఁ గూడి యంతయు నొక్క వస్తువుగానే కనుపట్టుచుండెను. నిరుపమానమైన తొంటియుగమగు కృతయుగమునందుఁ జిదచిదీశ్వరులను మూఁడుతత్త్వములను వివేచించి తెలియుటకు నేర్పరులగువారు సర్వకారణంబగు బ్రహ్మము నుపాసించుచుండిరి. ఆబ్రహ్మము, గుణవైషమ్యము లేక కేవలమైనది; జాత్యాది వికల్పములును లేనిది. దాని స్వరూపస్వభావములను వాక్కుచేతను మనస్సుచేతను గొలఁదియిడఁ దరముగాదు. అది నిత్యమైనది, బ్రహ్మంబయినది. దానికిఁ బ్రలయదశయందు మాయయు (ప్రకృతియు) ఫలమును (పురుషుఁడును) రెండు విశేషణములై యుండెను. ఆమాయాఫలములు రెంటిలో మాయయనంబడు ప్రకృతి, కార్యము కారణమని రెండువిధముల నున్నది. ఫల మనఁబడు మఱియొకటి పురుషుండని చెప్పఁబడుచున్నది. ప్రకృతికిఁ దమస్సు రజస్సు సత్త్వ మని మూఁడు గుణములు గలవు. నేను బురుషునికి దేహేంద్రియము లొసఁగి యనుగ్రహింపఁగోరి యీ గుణములను విషమము లగునట్లు కలఁపగా, వానివలన సూత్రం బనఁబడుమహత్తు పుట్టినది.

అది పెక్కుమణులందుఁ జొచ్చియున్న సూత్రమువలె బహు కార్యములందు ధారకమై యుండునది. అది వికారమునొందఁగా దానివలన నుండి యహంకారము పుట్టినది. ఇదియే దేహాత్మభ్రమాదులచే మిక్కిలి మోహపెట్టునది. ఆ యహంకారము, వైకారికము తైజసము తామస మని మూఁడువిధములు అది తన్మాత్రములకును నింద్రియములకును మనస్సునకును గారణము. అది[1] చిదచిత్తుల మయమైనది. శబ్దాదితన్మాత్రములకుఁ గారణమయిన తామసాహంకారమువలననుండి యాకాశాది మహాభూత పంచకము పుట్టినది. దేవతలు తమ్మధిష్ఠించియుండుటంబట్టి దేవత లనఁబడునింద్రియము లన్నునో రాజసాహంకారమువలనను సాత్త్వికాహంకారమువలనను బుట్టినవి. మహత్తు మొదలుగా సమస్తములయిన వస్తువులును నే నంతరాత్మనై యుండి పురికొలుపఁగా నొకటిగాఁ గూడి కార్యమునకు సమర్థములయి యండమునుఁ బుట్టించినవి. అది నా కుత్తమమయిన స్థానము. జలములవలననుండి పుట్టిన యా యండమునందు నేను జతుర్ముఖరూపమునఁ బుట్టితిని. ఎట్లన-నా నాభియందుజగత్తనెడి పద్మముపుట్టెను. ఆ పద్మమునందుఁ జతుర్ముఖుఁడు పుట్టెను. ఆ చతుర్ముఖుఁడు రజస్సుతోఁ గూడిన వాఁడై తపస్సుచేసి నా యనుగ్రహమును బడసి భూలోకము భువర్లోకము స్వర్లోక మను[2] మూఁడులోకములనును లోక

1. అచిత్తులయందు నువ్వులయందు నూనెవలె చిత్తు లంతర్గతములై యుండుటను దెలుపుటకై అహంకారమునందు చిదచిత్తు లుండుటను బ్రదర్శించిరని తెలియునది.

2. అతలాదులు భూమియందలి రంధ్రము లగుటంజేసి భూమియందే యంతర్భవించుచున్నది. మహర్లోకాదులు సుఖప్రధాన మగుటంబట్టి స్వర్లో

పాలురనును సృజించెను. అందు స్వర్లోకము దేవతలకు స్థానమయ్యెను. అంతరిక్షము భూతములకు స్థానమయ్యెను. మనుష్యులు మొదలగువారికి భూలోకము పట్టయ్యెను. భృగువు మొదలగు సిద్ధులయిన బ్రహ్మర్షుల కీమూఁడులోకములకు వేఱగు మహర్లోకజనలోకములు నునికిపట్టయ్యెను. సురలకును నాగులకును భూమికిఁ గ్రిందుగా నున్నయతలము మొదలగు వానిని సృజించెను. క్షేత్రజ్ఞులు కావించు సాత్త్వికరాజసతామసకర్మములకుఁ దగిన ఫలములగు లోకప్రాప్తులు ముల్లోకముల లోపలనే (బ్రహ్మాండమందే) కలుగుచున్నవి. ప్రాణాయామాదిరూప మగు యోగమునకును సన్న్యాసాశ్రమమునకును మహస్సు జనస్సు తపస్సనియెడి యీసాత్త్వికములగు లోకప్రాప్తులు గలుగుచున్నవి. మద్భక్తియోగముగలవానికో మద్గతియగు పరమపదమే ప్రాప్తించుచున్నది నే నంతరాత్మరూపమున లోపలఁ జొచ్చి భరించుచు వెలుపలఁ గాలరూపమున మెలపుచును గర్మయుక్తమగు నీ జగత్తును జరుపుచున్నాను. దానినిఁబట్టిగుణప్రవాహరూపమయిన యీప్రకృతియందం దీ జగము నాచేతఁబుట్టుచును గిట్టుచునుండును.
* అయినను దానిదాని కర్మములనుబట్టియె యట్లు చేయుచున్నాను గాని నా యంతటఁగాదు. అణువో పెద్దదియో చిన్నదియో బలసినదియో మఱి యెట్టిపదార్థమయినను,గనఁబడుపదార్థ

కముచేతనే సంగ్రహింపఁ బడుచున్నది. కాఁబట్టి మొత్తమునకు లోకములు మూఁడనియె వ్యవహారము. అవాంతర లోకములనుగూడ వేఱువేఱుగాలెక్కపెట్టినచో నవి పదునాలుగని వ్యవహరింపఁబడుచున్నది

* దీనివలన భగవంతునికి వైషమ్య నైర్ఘృణ్యము లను దోషములుచెప్పుటకు వీలులేదు. కర్మములను గారణముగాఁగొని యిట్లు చేయుచున్నాఁడు

మొక్కొకటియును బ్రకృతి పురుషులు రెంటిలోను గూడియె యున్నది ఏ కార్యవస్తువునకే ద్రవ్య మాదియందును నంత మునను గారణముగా నుండునో యదియె మధ్యమందునునుండు ను కిరీటము మొదలగు కార్యములకు నాద్యంతములందుఁగార ణమగు బంగారమే మధ్యమందునుగారణముగా నుండునుగదా! ఆయా యవస్థలందొక దానికే వేలువేలు నామములు గలుగును. తైజసములగు కటక మకుటములకు నుపాదానము ద్రవ్యము బం గారు. పార్థివములగు ఘటశరావాదులకుఁగారణద్రవ్యమున్మృత్తు. అయినను 'ఘటములో నీరుదెమ్ము' మొదలయిన వ్యవహారము లకును జలమును దెచ్చుట మొదలయిన ప్రయోజనములకునునుప యోగించుటకై ఘటము మొదలగు వికారములు మృత్తునకుఁ గయికొనఁబడుచున్నవి. ఒక యవస్థయందున్న యొక పదా ర్థ, మేద్రవ్యము నుపాదానముగాఁ గలిగి యా యవస్థను బొంది నదో యా ద్రవ్యమేయగును. ఆ యవస్థను బొందినపిదపను గూడ నా ద్రవ్యమే యగును. కనుక నొకానొక ద్రవ్యమందు దాని వికారమున కాదియు నంతమును గనుపట్టుచుండును గాని యా ద్రవ్యముమాత్రము ననంతట స్థాయి యనియే చెప్పఁబడు చున్నది. దాని యవస్థలవలె నదియును వచ్చుచును బోవుచును నుండునదిగాదు. దేవుఁడు మనుష్యుఁడు మొదలగు నానావిధ ములైయున్న యీ దేహజాలమునకు నుపాదానము ప్రకృతి. ప్రకృతికిఁ బరం బగుజీవుఁడు వీనిలోపలఁ జొచ్చి ధారకుండై యుండును. కనుకఁ బ్రకృతివలననే జీవునికి నుత్పత్తి మొద లగు నవస్థలుగాని తనంతట లేవు. ఇట్లు స్వరూపస్వభావముల చేత నిత్యుఁడైయున్న యాత్మకు ధర్మభూతం బగు జ్ఞానము

వెలువబుచునదికాదు. ఏలన సృష్టికాలమునందుఁగదా జీవునకు జ్ఞానవికాసము గలుగుచున్నది. ఇట్టి ప్రకృతియుఁ బురుషుఁడును గాలమును మూఁడును బ్రహ్మం బగు నే నగుచున్నాను. ఇట్లు చిదచిత్తులు రెండును స్వరూపమునందు స్థాయులగును. వాని కార్యమగు జగత్తును బ్రహ్మముచేత నిత్యమగును. ఎట్లన భగవంతునిసంకల్పమందుపర్యంతము మహత్తుమొదలుగాఁగల ప్రపంచము సత్త్వాదిగుణములచేత సృష్టినొంది చిదచిద్రూపములస్థితి గలిగి పిదప సంహారమునొందుచు నిట్లు ముందు వెనుకగా నిత్యమును బ్రవర్తించుచుండును. జనులకు సృష్టిప్రళయాదు లెందేర్పడుచుండునో యట్టి బ్రహ్మాండమును నేను గాలశరీరకుండనై లయము నొందించుచున్నాను. ఆ బ్రహ్మాండము తనలోపలనున్న భువనములతోఁగూడి పంచత్వమనెడి యవస్థా విశేషమును (నాశమును) బొందుచున్నది. [1] శరీర మన్నమునందు లయించుచున్నది. అన్నము ధాన్యములందులయించుచున్నది, [2] ధాన్యములు భూమియందు లయించుచున్నవి. భూమి గంధమునందు లయించుచున్నది. గంధమప్పులయందు లయించుచున్నది. అప్పులు తమగుణమగు రసమునందు లయించుచున్నవి. రసము జ్యోతిస్సునందు లయించుచున్నది. జ్యోతి రూపమునందు లయించుచున్నది. రూపము వాయువునందును, వాయువు స్పర్శమునందును

1. అన్నము లేకపోఁగా శరీరము నశించుచున్నదని భావము. 'ఏష పురుషోఽన్నరసమయః' అని శ్రుతి. ధాన్యములు నశింపఁగా అన్నమును నశించుచున్నదని భావము.

2. ధాన్యములను విత్తఁగా మొలకలెత్తునని భావము.

లయించుచున్నది. స్పర్శ మాకాశమందు లయించుచున్నది. ఆకాశము శబ్దతన్మాత్రమందు లయించుచున్నది. ఇంద్రియములును, మనస్సు దనకారణమందు లయింపఁగాఁ, దమకు యోని భూతములగు సాత్త్వికాహంకారమునందు లయించుచున్నవి. శబ్దము * భూతాదియందు లయించుచున్నది. భూతాదియుఁ బ్రభువగు మహత్తునందు లయించుచున్నది. అధ్యవసాయహేతు వగుటంబట్టి గుణవత్తమంబయిన యామహత్తు తనకుఁ గారణభూతము లగు సత్త్వాదిగుణములందు లయించుచున్నది. (అనఁగా గుణము లుపరతములుగాఁగా మనస్సు లయించుచున్నది.) గుణములును దమవైషమ్యము నుడిగి యవ్యక్తమునందు లయించుచున్నవి. ఆయవ్యక్తము కాలమునందు లయించుచున్నది. అనఁగాఁ గాలముతోఁగూడ సంసర్గము నొందుచున్నది. ఆ కాల మవ్యయమయినది. కాలమును బ్రకృతితోడ సంసృష్టమగు జీవునియందు (సంసర్గమును) నొందుచున్నది. జీవుఁడు కర్తాయత్తమగు నుత్పత్తి లేకయంతరాత్ముఁడనై యుండునాయందు లయించుచున్నాఁడు. సర్వాంతరాత్మభూతుండ నగు నేను నాయందే నెలకొని యుందును గాని మఱియొకచోటను ండువాఁడను గాను. దానిని బట్టి నాకు దేవాదిశరీరభేదము గలుగుటగాని యవి పోవుటగాని లేవు. ఉత్పత్తి వినాశములు నన్ను ముట్టనేరవు. మహదాదికార్యసమష్టి లేక నేను నాయంతట నుండువాఁడను. ప్రకృతిపురుషకాలేశ్వరులవివేకము నిట్లు కనుఁగొనుచున్న పురుషునకును, 'నేను స్థూలుఁడనుకృశుఁడ' ననెడి యిత్యాది వికల్పముల

* ఇచట భూతాదిశబ్దము తైజస వైకారికములకు ఉపలక్షకము.

గుఱించిన భ్రమము మనస్సుచేత హృదయమందెట్లు కలుగఁ గలదు. సూర్యుఁ డుదయింపఁగాఁ జీఁకిట్లు నశించుచున్నట్లు అట్టివివేక ముదయింపగానే యా భ్రమమెల్ల మాని పోవుచున్నది. ఇదియె సాంఖ్యవిధి. ఇది హృదయమందు గ్రంథులవలె విడిచిపుచ్చరాకున్న సంశయముల నెల్ల విడిచి పుచ్చుచుండును, నేను బరాపరతత్త్వములనెల్లఁ గనుఁగొను నట్టివాఁడనుగాన దీనిని * బ్రతిలోమమునను ననులోమమునను నీకుఁ దెలియఁజెప్పితిని. ఇది యిరువదినాలుగవ యధ్యాయము.

---

{ శ్రీకృష్ణుఁడుద్ధవునకునిర్గుణత్వమునుబ్రతిపాదించు
చిత్తవృత్తి మొదలగు వానిని బ్రతిపాదించుట. }

శ్రీభగవంతుఁడు—సత్త్వాది గుణములు కలసి యుండినపుడు గాని వేఱువేఱుగానుండు నపుడుగాని వానియందు నే గుణము చేతఁ బురుషుఁడెట్టివాఁడగునో (యెట్టి యభినివేశముగల వాఁడ గునో) దానిని నేను జెప్పుచున్నాను. పురుషవర్యా! వినుము.

శ్రీభగవంతుఁడు—శమము (అంతఃకరణజయము), దమము (బాహ్యేంద్రియ జయము), తితిక్షము (ద్వంద్వములను సహించుట), ఈక్ష (తత్త్వవిమర్శము), తపము, సత్యము, దయ, స్మృతి, తుష్టి, త్యాగము, స్పృహలేమి (వైరాగ్యము), శ్రద్ధ (వైరాగ్యము), హ్రీ (తగనిపనులయందు సిగ్గు). దానము, మఱి యార్జవము వినయము మొదలైనవియు, ఆత్మానుభవము వలనఁ గలిగిన సుఖమును, (సాత్త్వికగుణములు). కామము

---

* ప్రతిలోమమనఁగా సృష్టి మొదలుకొని సంహారమువఱకు;అనులోమము అనఁగా సంహారము మొదలుకొని సృష్టివఱకని తెలియవలయు.

(విషయములనుభవింపనిచో నిలుపోపకుండుట), ఈహా(చేష్ట), మదము, తృష్ణ (సంతోషములేమి), స్తంభము (గర్వము), (ధనాదులు గావలయునను) ఆశ, వైషమ్యము, సుఖము (విషయభోగము), సాహసకర్మములం దుత్సాహము, స్తోత్రప్రియత్వము, అపహాసము, వీర్యము, నెఱపుట, బలిమిచేతం బూనుట (రాజసము)-ఇవిరాజసగుణములు. క్రోధము (సహింపకుండుట), లోభము (వెచ్చము సేయమి) అనృతము (ప్రమాణము శాస్త్రీయము గాదనుట) హింస, ద్రోహము, యాచన, దంభము (వంచనము), శ్రమము, కలహము, శోకము, మోహము దుఃఖము, దైన్యము, (ఇది నాకుఁ గలుగఁ గలదనెడి) అపేక్ష, భయము, జాడ్యము ఇవి-తామసగుణములు. (సత్త్వాదిగుణములుమూఁడును బెరుఁగఁగా నీగుణములును గ్రమముగాఁ బెరుఁగుచున్నవి. ఈ గుణములనుబట్టియే పురుషుఁడుసాత్త్వికుఁడనియు రాజసుఁడనియుఁ దామసుఁడనియుఁ జెప్పఁబడుచున్నాఁడు. ఇట్లు సత్త్వమునకును రజస్సునకునుగల వృత్తులు క్రమముగా నన్నియు నించు మించుగా వర్ణింపఁబడినవయ్యెను. ఇవి యా యా గుణములు వేఱు వేఱ నుండినపుడు వానివలనఁ గలుగు కార్యములను, గుణము లొకటినొకటిగలసినపుడు గలుగువానిని, వినుము. ఉద్ధవా! నేను నాదియని యహంకారమమకారప్రయుక్తమగు మతి గుణమిశ్రమమువలనఁ బుట్టినకార్యము, ఆయహంకారమమకారముల మూలమునఁ మనస్సును దేహమును నింద్రియములను బ్రాణములనును బట్టి కలుగు వ్యవహారమంతయు గుణమిశ్రముల వలనఁ గలిగిన కార్యమే యగును. ఈపురుషుఁ డర్థమునందును ధర్మమునం

దును గ్రామమందును, నిష్ఠగలవాఁడయినపుడు. అట్టిమూఁటికై చేయు వ్యాపారము గుణసన్నిపాతమువలనఁ గలుగునదగును. మఱి యది శ్రద్ధనును బ్రీతిని ధనమును గలిగించును. పురుషుఁడెవ్వఁ డెప్పు డట్టి త్రివర్గానుకూలమగు వ్యాపారమునందు నిష గలవాఁడగునో యపుడు వాఁడు గృహాశ్రమధర్మమునందును నిజవర్ణ ధర్మమునందును నిష్ఠగలవాఁ డగుచున్నాఁడు. అట్టి ప్రవృత్తినిష్ఠ, గుణముల సన్నిపాతమువలనఁ గలుగునదగును. ఒక పురుషుని శమదమాదులచేత సత్త్వము మిక్కిలి గల వాఁడనియుఁ, గామాదులచే రజస్సు మిక్కిలి గలవాఁడనియుఁ, గ్రోధాదులచేతఁదమస్సు మిక్కిలి గలవాఁడనియు ననుమానించుకొనవలయును. ఎప్పుడు ఫలాపేక్షవిడిచి స్వవర్ణాశ్రమములకుఁ దగిన కర్మములచేత నన్ను భక్తితో భజించునో యప్పుఁడు వాఁడు పురుషుఁడయినను స్త్రీయైనను సత్త్వప్రకృతి గలవాఁడని తెలియవలయును. అట్లుగాక యిహపరభోగముల నుద్దేశించి నిజవర్ణాశ్రమకర్మములచేత నన్ను భజించువాఁడు రాజస ప్రకృతియనియు శత్రువులను జంపుట మొదలగు హింసల నుద్దేశించి యట్టివిచేయువాఁడు తామసుఁడనియుఁ దెలియుము. సత్త్వము రజస్సు తమస్సుననెడి యీగుణములు జీవునికే బంధకములుగాని నాకుఁగావు. ఇవి జీవునికిఁ జిత్తమునందు దమ తమ కార్యములను బుట్టింపఁగా వానిచేత వాఁడు భూతపరిణామములయిన దేహములందును వానిని సంబంధించిన విషయములందును నిబద్ధుఁడగుచున్నాఁడు. సత్త్వము తక్కిన రజస్తమస్సుల రెంటిని జయించి యడఁచివుచ్చునేని యపుడు చిత్తము సూక్ష్మార్థములను గ్రహించుచు నందులకుఁ

బ్రతిబంధకములైన కలుషములేవియులేక రాగాదులు నుడిగి శాంతమై యుండును. అపుడు పురుషుఁడు సుఖముతోను ధర్మము జ్ఞానము శమము దమము మొదలగువానితోను గూడి యుండును. రజస్సు తక్కిన తమస్సును సత్త్వమును రెంటిని గెలిచి యడంచునేని యపుడు చిత్తము విషయాసక్తమై శబ్దాదులగు వేఱు వేఱు విషయములందుఁ జలించుచు నుండును. అపుడు పురుషుఁడు దుఃఖముతోడను రాజస దైవతారాధనములగు కర్మములతోడను ధనాదిసంపదలతోడను దానివలనఁ గలుగు కీర్తితోడను గూడినవాఁ డగుచున్నాఁడు. తమస్సు తక్కిన రజస్సును సత్త్వమును గెలిచి కీడ్పఱచునేని చిత్తము, వివేకముమాలి ప్రసరింపక జడమై యే పూనికయు లేకుండును. దానివలన శోకముతోను మోహముతోను, నిద్రతోడను హింసతోడను విషయ తృష్ణతోడను గూడియుండును. చిత్తము శాంతమైనపు డింద్రియములు విషయము లందుఁ జొచ్చుతుందుడుకు లేక సుఖముగానుండును. దేహమునందు రోగాదులవలన భయము లేకుండును. మనస్సునకు భయనిమిత్తములగు నట్టిరోగాదులను గలిగించు వస్తువు లందుఁ దగులు లేకుండును. దీనివలన సత్త్వ ముద్రేకించియున్నదని తెలియుము. అట్టిసత్త్వమే నన్నుఁ దెలియుటకుఁ బట్టుచుమిగా నెప్పుడెప్పుడు మంచిదో చెడ్డదో యేదిగాని చేయుచు వానికి ఫలములగు హర్షశోకాది వికారము లొందుచు దానివలన మనస్సు కలఁతపడఁగా, జ్ఞానేంద్రియములు విషయము లందుఁజొచ్చుటకుఁ దుందుడుకుపడఁగాఁ, గర్మేంద్రియములును గుదురులేక పీడనొందఁగాఁ, జంచలమగునో, యపుడీక్రియల

చేతరజస్సు దేకించియున్నదని తెలియుము. చిత్తమెపుడు తిరోహితమై జ్ఞానేంద్రియవిషయము లగురూపాదులను గ్రహింపనేరక లయించునో యపుడు సంకల్ప వికల్పాత్మక మగుమనస్సు లయించును. అజ్ఞానమును విషాదమునుగలుగును. అప్పుడు తమ స్సుత్కటముగా నున్నదని నిశ్చయింపుము. ఉద్ధవా! సత్త్వగుణము పెరుఁగుచుండగా దేవతలకును, రజస్సు పెరుఁగు చుండఁగా నసురులకును, దమస్సు పెరుఁగుచుండఁగా రాక్షసులకును, బలము పెరుఁగుచుండును. జననమరణాది స్వభావమగు దేహముతోడి సంసర్గముగలయీజీవునకు సత్త్వముచేత జాగరము గలుగునని తెలియుము. రజస్సుచేత స్వప్నావస్థయుఁ, దమస్సుచేత సుషుప్తియుఁ దెలియుము. ఈ మూఁడవస్థలతోను గూడియున్నట్టు తోఁచుచున్న యాత్మస్వరూపము తురీయమైనది. కనుక దానికి స్వభావముచేత నీమూఁడవస్థలును గలుగనేరవు. (సత్త్వము కొంచెముల్లసితమైనపుడు స్వర్లోకమును మఱింత యుల్లసించినపుడు మహాదాదిలోకములును మఱియు నెక్కుడుగా నుల్లసించినపుడు సత్యలోకమునగును) జనులు సత్త్వముల్లాసమగుకొలఁదిని బ్రహ్మలోకపర్యంతము మీఁదుమీఁదుఁగా బోవుదురు. తమస్సుల్లసిలుకొలఁదిని గ్రిందు క్రిందుగామిక్కిలి హీనమైనలోకమువఱకుఁ బోవుదురు. రజస్సుచేతనీరెంటికినడుమ సంచరించుచుందురు. సత్త్వము ప్రకర్షము గలిగి యుండఁగా మరణించినవారు స్వర్గమునకుఁ బోవుదురు. రజస్సు మిక్కుటమై యుండఁగా లయించినవారు నరలోకమునకుఁ బోవుదురు. తమస్సు మిక్కిలిగా నుండినపుడు

మరణించినవారు నరకమునొందుదురు. [1] నిర్గుణులగు వారు నన్నే పొందుదురు. నాయందర్పించి నాయారాధనమనితలంచి ఫలము నుద్దేశింపక చేయునట్టికర్మము సాత్త్వికము. అభ్యుదయ ఫలమును సంకల్పించిచేయుకర్మము సాత్త్వికము. శత్రుహింసమాత్సర్యము మొదలగునవిమిక్కిలిగాఁగలుగుకర్మము తామసము. ఆరోపితమైన రూపముయొక్క కలరూపునుగుఱించినజ్ఞానముఁసాత్త్వికము ఆరోపితమైనరూపునుగుఱించినజ్ఞానము రాజసము ప్రాకృతమగు(దీనిని గుఱించినదని తెలియకుండు) జ్ఞానము తామసము. నన్నుగుఱించినట్టిజ్ఞానము నిర్గుణము. (సత్త్వోద్రేకము మిక్కిలియుఁ గలది) యని స్మరింపఁబడెడివి. వనము సాత్త్వికమైన యునికి పట్టు గ్రామము రాజసమయిన పట్టు జూదపుటిల్లు తామసమైనపట్టు. నే నుండెడి దివ్య స్థానములో నిర్గుణమైనవి. అర్థకామములందు సంగములేని కర్త సాత్త్వికుఁడు. రాగాంధుఁడై మిక్కిలి కార్యమం దభినివేశముఁగల కర్త రాజసుఁడు. విషయము లనర్థములు గలిగించినవని కనుఁగొనుచున్నను నట్టి తలంపుమాలిన కర్త తామసుఁడు. నాధ్యానాదులయందు వర్తించు కర్త [2] నిర్గుణుఁడు అధ్యాత్మవిషయమగు శ్రద్ధసాత్త్వికి. కర్మములందు శ్రద్ధరాజసి

1. నిర్గుణులనఁగా మిక్కిలి ప్రవృద్ధమైన సత్త్వముగలవారని య్యాప్రకరణమునఁదెలియవలెను. సత్త్వముమిక్కిలి యుల్లాసితమైనపుడు గుణసంబంధము బోఁగొట్టుచున్నది. 'సత్త్వం రజస్తమ ఇతి గుణాబుద్ధేర్న చాత్మనః। సత్త్వే నాన్యతమౌ హన్యాత్ సత్త్వం. సత్త్వేనచైవహి' అనుటచే నిర్గుణశబ్దముచే నైర్గుణ్యమును గలిగించు అతిప్రవృద్ధసత్త్వమగును.

2. ఇట నిర్గుణ శబ్దముల కెల్ల నిరతిశయ సత్త్వోల్లాసము గలుగుటగా తెలియునది.

అధర్మమందుఁ గల శ్రద్ధ తామసి. నాసేవయందుఁ గల శ్రద్ధ నిర్గుణమైనది హితమై దోషము లేక పరిశుద్ధమైయాయాసము లేకప్రాప్తించినట్టి యన్నాదులు సాత్త్వికములు. ఇంద్రియసుఖావహమై యాయాసముచేత లభించినది రాజసము. దేహేంద్రియములకుఁ బీడకలిగించునదియు నశుద్ధమును (శాస్త్ర ప్రతిషిద్ధము) నయినది తామసము. ఆత్మానుభవమువలనఁ గలుగు సుఖము సాత్త్వికము. శబ్దాదులగు సుఖస్పర్శములైన విషయములవలనఁ బుట్టు సుఖము రాజసము. మోహముచేతను (మునస్సునకు మోహకములగు వస్తువులచేతఁ గలుగు పారవశ్యము చేతను) దైన్యముచేతను (బుత్ర కళత్రాదుల యుపచ్ఛందనముల చేతను) బుట్టు సుఖము తామసము. నాధ్యానాదుల వలనఁ గలుగు సుఖము నిర్గుణము. ఇట్లు ద్రవ్యమును (అన్నాదులును), దేశమును (వనగ్రామాదులను), ఫలమును (సుఖములు), కాలమును, జ్ఞానమును, కర్మమును కారణమును, శ్రద్ధయు, అవస్థయు, లయమును (సత్త్వమందు లయించుట మొదలయినవియు), అవస్థయు (జాగరణాదులును), * ఆకృతియు, నిష్ఠయు నివియన్నియును సత్త్వాదులగు మూఁ

* ఇందు కాలమును కారణమును ఆకృతియును పూర్వము చెప్పఁబడినవి గావు. అందుకాలమున ప్రాతర్మధ్యందినసాయంతనములు సాత్త్వికము. రాత్రి ప్రహరపర్యంతము రాజసము. నిశీథము మొదలయినవి తామసము. కారణమనఁగా సమీహితము లగు వానికి సాధనములను గుఱించిన జ్ఞానమునకుఁ గారణమనియర్థము. అందు ఊర్ధ్వగమనమునకు సాధనములను దెలుపు శాస్త్రము సాత్త్వికము. దైహికసుఖసాధనములను దెలుపునది రాజసము. అభిచారాదులను దెలుపునది తామసము. భగవత్ప్రాప్తి సాధనములను తెలుపునది నిర్గుణము. ఆకృతియనఁగా వేషము. అందు వైదికమైనది సాత్త్వికము. అర్థకా

దుగుణములమయమై యుండును. సమస్తములయిన యీ పదార్థములు గుణములవలన నుండి వచ్చినవే; అచిత్తుతోడి సంసర్గముగల పురుషునిగుఱించి వర్తించు చుండునవి. పలుమాట లేల! పురుషసింహా! కన్నారఁ జూచునైహికాదులును, వినెడి పారలౌకికాదులును, బుద్ధియందుఁ జింతించునవియు, నగు సుఖములన్నియును, గుణమయములే కాని వేఱుగావు. పురుషుని కీద్రవ్యాదులెల్లను గుణముల వలనను గుణములకుఁ దగిన పురాతన పుణ్యాపాపకర్మముల వలనను బుట్టిన నరుచులచేతఁ గలుగుచుండునవి. మఱి సంసారమునకును హేతువులయినవి. సౌమ్యా! చిత్తమున నుల్లసిల్లుచుండెడి యీగుణములను జీవుఁ డెవఁడు నిర్గుణముచేత (అతి ప్రవృద్ధమైన సత్త్వముచేత) జయించునో వాఁడే సత్త్వము వలన మిక్కిలి వర్ధిల్లిన భక్తి గలిగి నాతోడ సాధర్మ్యమునకుఁ బాత్రుఁ డగుచున్నాడు. కాబట్టి జ్ఞానమునకును విజ్ఞానమునకును హేతువయిన యీ దేహమును బడసి, విచక్షణులగు వారు శబ్దాదివిషయములందుఁ దగులును దూలఁబుచ్చి నన్ను భజించుచుందురు. ఇంద్రియములను వశముగావించుకొన్నను వానిని విశ్వసించిన యెడల మరల విషయములందుఁ దగులుపుట్టించి యనర్థములుగలిగించు నని తెలిసి

---

మార్జనములకు అనుకూలమైనది రాజసము. పాశుపతాదులైన ఆగమములందుఁ జెప్పబడినది తామసము. భగవచ్ఛాస్త్రమునందుఁ జెప్పఁబడినది నిర్గుణము. ఇట్లన్నియు త్రిగుణముల కార్యములనికాని త్రిగుణముల వుల్లాసకరములగునని కాని యర్థము.

యెవఁ డింద్రియములను విషయములనుండి మరల్చి తనవశ
ముచేసికొన్నను మరల వానియందు విశ్వాసమిడక యప్రమ
త్తుఁడయి సంగము మాలి నన్ను భజించునో యట్టి ముని
యగువాఁడు సత్త్వమును మిక్కిలియు నుల్లసిలఁజేయు ద్రవ
ములను సేవించి రజస్సును దమస్సును జయించుచున్నాఁ
డు. మిక్కిలి యుల్లసితమైన సత్త్వము గూడ ప్రకృతి సం
బంధియే కాన యది యుండువఱకుఁ బ్రకృతిసంబంధమును
వీడుట యెట్లుండువా? అనన్యప్రయోజనమై మిక్కిలి యుల్ల
సితమగు సత్త్వమువలనఁ బుట్టిన యుపాసనాత్మకమగు జ్ఞాన
ముచేత నట్టి సత్త్వమువలన రాఁగాది కలుషములడింగి యు
న్నచిత్తముగలవాఁడు యుక్తుఁడై సత్త్వమును జయించుచు
న్నాఁడు. అతిశయించిన సత్త్వమువలనఁ బుట్టినజ్ఞానము
చేత మూఁడు గుణములు నివర్తింపఁగా సత్త్వమును దనంతట
నివర్తించుచున్నది. ఇట్లు గుణముల నెల్ల వీడిన జీవుఁడు
దేహమును విడిచి నన్నుఁ బొందుచున్నాఁడు. మనస్సునం
దుల్లాసము నొందునట్టి గుణములను దేహమును వీడి జీవుఁ
డు బ్రహ్మంబగు నేను దనయందంతర్యామి నై వ్యాపించి
యుండుట సాక్షాత్కరించుచు వెలుపల సంసారనిమిత్తమైన
కర్మముల నాచరింపఁడు. లోపలను మోక్షసాధన మగు జ్ఞాన
యోగమును నాచరింపఁడు; అనఁగా ముక్తిదశయందు శా
స్త్రమునకు వశ్యుఁడు గాకయుండును. ఇది యిరువదియేనవ
యధ్యాయము.

-----

స్త్రీసంగము దూష్యమని తెలుపుటకై యైలగీతలు.
సాధుసంగప్రభావము.

శ్రీభగవంతుఁడు—నాదర్శనమునకు సాధనమైనయీమనుష్యదేహమును బొంది ప్రవృత్తిధర్మము నొందక మదారాధనరూపమగు నివృత్తిధర్మమునే యవలంబించి, యానందమయుండును జీవాత్మయందు నెలకొనియుండువాఁడు నగు పరమాత్మను నన్నుఁ బొందుచున్నాఁడు. గుణత్రయమయ మైన ప్రకృతికార్యములగు దేవాదిదేహములందు జీవపరమాత్మల స్వరూపములను దృఢముగాఁ దెలియుట వలన నేను నాది యనెడి యభిమానమును వదలినవాఁడు ప్రకృతికార్యము లగు శబ్దాదులను విహితములయిన వాని ననుభవించుచున్నను,ఆ వస్తువులచేతఁ గాని గుణములచేతఁ గాని పట్టు వడకుండును. శిశ్నోదరసుఖములయందు మిక్కిలి తగులు గలిగియున్న దుష్టులతోడ సంగము చేయరాదు. వాని ననుసరించు వాఁడు గ్రుడ్డివానిని ననుసరించు మఱి యొక గ్రుడ్డివానివలె నంధతమస్సునందుఁ (నరకమునందుఁ) బడుచున్నాఁడు. పురూరవుఁడు తొల్లి సార్వభౌముఁడై యుండి మిక్కిలియుఁ గీర్తిని సంపాదించెను అతఁ డూర్వశియందు మిక్కిలియు మోహము నొంది తన తెలివి యంతయు దానిచేఁ గోలుపోయినవాఁ డయ్యెను. అందు వలన నతఁ డాసుందరితోఁ గలసి మెలసి యేండ్లు పూండ్లుగా రాత్రులు పోవుటయు వచ్చుటయుఁ దెలియఁడయ్యెను. మఱి యతఁడు దానం జేసి నీచములగు విషయములందుఁ దృప్తినొందక యనుభవించుచునే యుండెను. ఇట్లుండఁగా

నోకప్పుడాపురూరవుఁడీ యతనిని దిగవిడిచిపోఁగా రాజును దానివెంటం బడి దిస్సమొలతో వెఱ్ఱిపట్టినవానివలె 'జాయా! ఎంత మనస్సున బెట్టిదురాలవే' నిలునిలు పోకువే' యని విలపించుచు దిటవెడిపోయెను. అట్టియూర్వశి నెడఁబాయుట వలన మోహము నొంది (కురుక్షేత్రమున దానిని గలసి గంధర్వులొసంగిన యగ్నిచేత యజించి దాని లోకమునకుఁ బోయి బహుకాలము దానితో రమించిన పిదప) నతనికి శోకమంతయుఁ దొలంగెను. అప్పుడు విషయము లనర్థహేతువు లని యాలోచించి వైరాగ్యము పుట్టఁగా నతఁడీగాథను బాడెను.

ఐలుఁడు-కామముచేత నామనస్సు కశ్మలమైయున్నదిగాన నాకౌరా' యీమోహమెంత విస్తామిగా నున్నది! ఆయూర్వశి నన్ను నిత్యము నెడ తెగక మెడగాఁగిలించుకొని చొక్కించుచుండఁగా నాయాయువుభాగము లయిన యీ యహోరాత్రములను దలఁపనే తలఁపనయితిని. ఈ యూర్వశిచేత నా వివేకమంతయుఁ గోలుపోయి యిపుడె దాని నుండి విముక్తుఁడ నయితిని. నేను దానితో రమించుచుండునపుడు సూర్యుఁ డుదయించి నదియు నస్తమించి నదియుఁ దెలియకుంటిని. మఱి యేండ్లు పూండ్లుగా దినములు గడచిపోయినవియు నాకుఁ దెలియవయ్యెను గదా! నేను జక్రవర్తిని. నరదేవశిఖామణిని. ఇట్టివాఁడనై యుండియుఁ దుద కామోహముచేత యబలలకుఁ గ్రీడామృగము గావింపఁబడితినిగదా! ఔరా! నామోహమెట్టిది! సమార్జిట్టయిన నన్నును నాభోగోపకరణములనుగూడ గడ్డిపఱకవలెఁ దలఁచి దిగనిడిచి యాయాఁడుది పోయినదే! అట్టిదానివెంటదిస్సమొలతో వెఱ్ఱిపట్టిన

వానివలె మేద్చుచును నేను బోయితినిగా? ఎవ్వఁడు తన్ను విడిచి పోవుచున్న యాఁడుదానిని గాడిదవలెఁ గాలంకన్నినను విడువక వెంబడించిపోవునో యట్టి వానికి మహత్త్వము గాని తేజస్సుగాని ప్రభుత్వముగాని యెక్కడివి? ఎవ్వనిమనస్సు స్త్రీలచేత నపహరింపఁబడినదో యట్టివానికి వివేకముచేతను దపస్సుచేతను దానముచేతను నధ్యయనముచేతను ఏకాంతముగా నుండుటచేతను మౌనముచేతను బ్రయోజనమేమి ? నేను భూమీశ్వరత్వమునుబొంది యుండియుఁ గడపట నొక యాఁడుదానికి నావువలెను గాడిదవలెను నోడిపోయితినే ! నా మేలు నే నెఱుంగనివాఁడనై మూర్ఖుఁడనై పండితుఁ డని మాత్రము తలంచుకొనుచున్న నన్నుఁ గాల్పనా ! ఇస్సీ ! నాదొక బ్రతుకా! నేను సంవత్సరములకొలఁది నూర్వశి క్రిందివెదవి యాసవమును జుఱ్ఱుచున్నను, అగ్ని యాహుతులచేతఁ దగ్గక మఱి మఱి మండునట్లు, కామములచేత మన్మథుఁడు తృప్తి నొందియుడుగక పయిపయిని బెరుఁగుచునే యున్నాఁడు. విట కత్తియ యుపహరించిన మనస్సును దానినుండి విడిచిపుచ్చుటకు నింద్రియవృత్తులకు లోఁబడనివాఁడును నాత్మస్వరూపమందే రమించుచుండు వారికి నిర్వాహకుండును నగు భగవంతుఁడు తప్ప మఱి యితరుఁ డెవ్వఁడు సమర్థుఁడగును ? ఆ యూర్వశియు నాకు సూనృతవాక్యముచేత * బోధించినది. దానియందుఁ దప్పులేదు. నేను దుర్మతిని; యింద్రియములను జయింపనివాఁడను. కనుక నా మనస్సునందలిమోహము

---

* 'నవై స్త్రైణాని సఖ్యాని సన్తి సాలావృకాణాం హృదయాన్యేతాః' అని శ్రుతి యీబోధమును ప్రతిపాదించుచున్నది.

నన్ను విడిచిపోయినది గాదయ్యెను! ఈ యూర్వశి నాకపకార ముచేసిన దేమున్నది ? ఏమియు లేదు. త్రాడని కలరూపు దెలి యక పాముని చూచి పాముగ్గానే మనస్సునఁ దలఁచునేని వాని కాత్రాడు చేసినయపకార మేమి? అట్లె యింద్రియము లను జయింపనందున దేహాత్మస్వరూపములను దెలియక దేహము నే యాత్మగాఁ గనువానికి నాదేహము చేసిన కీడేమి ? ఈ కాయము మిక్కిలి మలినమైనది. దుర్గంధము మొద లయినవానికిదిపట్టు, అనుచితమైనది, ఇట్టికాయ మెక్కడ ! మంచిగంధము మొదలయిన యింపారు గుణము లెక్కడ ! మిక్కిలి హేయమైన కాయమును భోగ్యముగాఁ దలంచుట యెంతయు నొప్పదు. అట్టి కాయమునం దిట్టిమంచిగుణములు, కలరూపును దెలుపనియవిద్యచేతఁ గావింపఁబడినవే కాని మఱియొకటి గాదు. 'ఈ దేహము కన్నతండ్రికి సొంతమా! లేక యనుభవించు భార్యాదియా? లోపఱచుకొనియున్నయొడ యనిదా? చితియందుఁ గాల్చు నగ్నిదా? కడపటఁ బెఱికితిను కుక్కగ్రద్దలదియా ? లేక తనకైనసొంతమా ? దాని కుప కరించు సుహృదులదియా ?' యని యాలోచించి యెవఁడీది పరకీయ మని తలంచునో వాఁడు దీని యందలి మోహము నొంది యుండఁడు. ఇట్లపరిశుద్ధమై తుదకేమియుఁగాక పోవు నట్టి యాకళేబరమునుజూచి. 'ఓరా! ఆ సుందరి ముఖ మేమి సొంపుగానున్నది! దాని ముక్కెంత నిక్కగా నున్నది! ఆచిఱునవ్వేమి?' యని యందుఁ దగులుపడి కడపట మోహ మునఁ గుందుచున్నాఁడు. ఇది తోలు కండ నెత్తురు నరములు నెనడు మజ్జయెమ్ములునను నివిగూడినదైనది. మూత్రపురీషముల

చేతనిండినది. ఇట్టిదానియందు రమించువారికిని దీనిని దిను క్రిములకును భేద మేమియున్నది ? ఇట మీఁదనయినను నాత్మ హితమును దెలిసినవాఁడు స్త్రీలయందును స్త్రీవశ్యులగువారి యందును దగులుగలిగి యుండరాదు. మనస్సు, విషయముల కు నింద్రియసంబంధము గలుగుటచేతనే కలంగుచున్నది కాని, మఱి యొకటిచేఁ గలఁగదు విషయములను జూడకయు వినకయునుండినయెడల మనస్సు గలంకపుట్టదు. అట్లు పురుషుఁ డింద్రియములను విషయములందు నిగిడింపక యుండినచో మనస్సు నిశ్చలమై శాంతి నొందుచున్నది. కాఁబట్టి స్త్రీల యందును స్త్రీవశ్యులగువారియందును సంగము చేయరాదు. ఇంద్రియము లాఱును విద్వాంసులకుఁగూడ నమ్మఁదగనివనఁగా నిఁక మాబోంట్లకుఁ జెప్పనేల" యని పాడెను.

శ్రీభగవంతుఁడు—ఇట్లు రాజరాజగు పురూరవుఁడు పాడుచు నూర్వశీలోకమును విడిచి తన యాత్మ యందున్న పరమాత్ముండ నగు నన్నునుపాసనముచేత సాక్షాత్కరించి యుపాసనాత్మకమయిన యా జ్ఞానముచేత దేహాత్మాభిమానరూపమగు మోహమునంతయుఁ దూలించి ముక్తుండాయెను. కాఁబట్టి తన శ్రేయస్సును గోరువాఁడు దుష్టులతోడిసంగమును దిగవిడిచి సజ్జనులతోడ సంగము చేయవలయును. సజ్జనులగు వారు వాని మనస్సునకు విషయములందుఁ గలసంగమును మాటలచేతఁ జెప్పి త్రుంతురు. సజ్జనులు నాయందే మనస్సు గలిగి నన్నుదప్ప మఱి యొక్కటి నపేక్షింపక మనస్సునందలి రాగాదికలుషము లేక శాంతినొంది చిదచిత్తులనెల్లఁ బ్రహ్మాత్మకము లని సమముగాఁ గనుఁగొనుచు మమకారమును నహం

కారమును లేక ద్వంద్వములనును వీడి. పరిగ్రహములను మాని యుందురు. మహాభాగా! ఆ మహాభాగులయందు నా కథలు నిత్యమును సంభవించుచునే యుండును. అవి మనుష్యులకు హితములైనవి. అవి, వినువారికిఁ బాపములెల్లఁబటాపంచలు కాఁగా వారిని బరిశుద్ధులను గావించుచుండును. ఎవ్వరు మదారాధనపరులయి శ్రద్ధతోడ నాకథలను నాదరమున వినుచును బాడుచును ననుమోదించుచును నుందురో వారు నాయందు భక్తిని బొందుదురు. అనంతకల్యాణగుణుండును బరబ్రహ్మమును నిరతిశయానందజ్ఞానరూపుండును నగు నాయందు భక్తిని బొందినసాధుపురుషునకు నిఁకఁ బడయవలసినదేమున్నది? ఏమియులేదు. భగవంతుఁడగు నగ్నిని నాశ్రయించుపురుషునకుఁ జలిగాని చీకటిగాని దానివలనభయముగాని లేక పోవునట్లు, సాధువులను మిక్కిలి సేవించుచుండుపురుషునికి నజ్ఞానమును దానివలనఁ గలుగు సంసారభయమును దొలఁగి పోవుచున్నవి. భయంకరమయిన సంసారసముద్రము నందు మునుఁగుచును దేలుచునుండువారికి బ్రహ్మవిదులును శాంతులునగు సాధువులు, నీటియందు మునిఁగిపోవుచున్నవారికిదృఢమైన యొక నావవలెఁ, మిక్కిలియుఁ బ్రాపైయుందురు. బ్రతుకుఁగోరు ప్రాణులకన్నమె జీవింపఁజేయు ప్రాణము. తాపత్రయముచేతఁ బీడితులగువారికి నీశ్వరుండ నగు నేను శరణము. పరలోకమందు ధర్మము రక్షకము. ఇహమందు మనుష్యులకు ధనము శరణము. అట్లె యీ సంసారమునకు భయపడు పురుషునికి సాధువులే శరణము. సజ్జనులు జ్ఞానాత్మకములగు కన్నులనిచ్చుచున్నారు. సూర్యుఁడుదయింపఁగా వెలి కన్నులే

యిచ్చుచున్నాఁడు. కనుక సజ్జనులు * దేవతలును బాంధవులు నగుదురు. వారు నా కాత్మ. నేనే వారు సుమీ! వీతసేనుని పుత్త్రుఁడయిన యాపురూరవుఁడు స్త్రీలయు స్త్రీవశ్యులయు సంగమునుండి విముక్తుఁడై తన యాత్మయందే రమించుచు నీ భూమియందు సంచరించినవాఁడాయెను - ఇది యిరువది యాఱవయధ్యాయము.

---

## భగవంతుఁ డుద్ధవునకు భగవతారాధన క్రమమును జెప్పుట.

ఉద్ధవుఁడు— 'ప్రభూ! నీ యారాధనరూపమగు క్రియా యోగమును నాకు వివరింపుము. సాత్త్వతులగువారు ని, న్నే యుపకరణములనుగొని, యే యధికరణములం, దే యే విధమున నర్చింతురో పురుషర్షభా! నాకుఁ జెప్పుము. ఈ నీ యారాధనమును నారదుఁడును భగవంతుఁడగు వ్యాసుఁడును అంగిరముని కొడుకగు బృహస్పతియు మొదలగు మునులు మనుష్యులకు గొప్ప నిశ్శ్రేయసమైనదని చెప్పెదరు. ఇది నీముఖారవిందమునుండి మొదట వెలువడి బ్రహ్మకుపదిష్టమైనది. భగవంతుఁడా బ్రహ్మయుఁ దన పుత్త్రులయిన భృగువు మొదలగు వారికి దీని నుపదేశించెను. భగవంతుఁడా శివుఁడు దీనిని దన దేవి యగు పార్వతికినుపదేశించెను. సత్తమా! ఇది సమస్త వర్ణములవారికిని నాశ్రమములవారికిని, ఇంతేల! స్త్రీలకును శూద్రులకును నుత్తమంబయిన శ్రేయముగాఁ దలఁచుచున్నాను. కమలపత్త్రాక్షా! కర్మబంధములనెల్ల విడిచిపుచ్చునట్టి

---

* దేవతలవలెఁ బూజింపఁదగినవారును బంధువులవలె ఉపకరింపఁదగినవారు నగుదురని భావము.

దీనిని, నీభక్తుఁడును నీకనురక్తుఁడునైన నాకుఁ జెప్పుము. ఇది బ్రహ్మాదులవలనఁ బ్రాప్తించియున్నదేకదా; నే నేల చెప్పవలెనని యందువా ! నీ వాఖిలేశ్వేశ్వరుల కెల్ల నీశ్వరుఁడవుగాన నీవే చెప్పఁ దగును' అని యడిగెను.

శ్రీ భగవంతుఁడు—ఉద్ధవా ! మదారాధనమగు కర్మమును బోధించు శాస్త్రమునకుఁ బారములేదుగాన దాని కంతములేదు. దానిని సంక్షేపించి గలరూపునఁ గ్రమముగాఁ జెప్పుచున్నాను. నన్నారాధించు యజ్ఞము వైదికము తాంత్రికము మిశ్రమని మూఁడువిధము లయినది ఈ మూఁటియం దిష్టమైన విధిచేత నన్నర్చింపవచ్చును. త్రైవర్ణికుఁడగు పురుషుఁడు తన యధికారమును బ్రతిపాదించు వేదముచేతఁ జెప్పఁబడినట్లు(జన్మించిన యెనిమిదవయేఁటనో, పదునొకండవయేఁటనో, పండ్రెండవయేఁటనో) యుపనయనము పొందినపుడు నన్ను భక్తితోను శ్రద్ధచేతను నెట్లు యజింపవయునో దానిని వినుము. అర్చయందును (ప్రతిమయందును) స్థండిలమునందును (చక్రాబ్జమండలాదులందును) అగ్నియందును, సూర్యునియందును, జలములందును, హృదయమందును, ద్విజునియందును, గంధకుసుమాది ద్రవ్యములచేత భక్తియుక్తుండై తనగురుండగు నన్నుఁ గపటములేక యర్చింపవలయును. మొదటఁ బలుదోముకొని, దేహశుద్ధికి స్నానముచేయవలయును. అంతమృత్తుగోమయము మొదలగువాని లేపముచేత వైదిక తాంత్రికములగు నుభయ మంత్రములచేతను స్నానముచేయవలయును, పిదప, నేను వేద ముఖమునఁ జోదితముగావించియున్న సంధ్యోపాసనాది కర్మములను గావింపవలయును. పిదప ఫలాభిసంధి లేకుండున

చక్కఁగా సంకల్పించుకొని ప్రాప్యప్రాపకవిరోధియుఁ బ్రాచీనములునగు కర్మములనెల్లఁ దూలించునట్టి పూజను నాసంధ్యోపాసననాదులతోఁ గూడనే కల్పింపవలయుఁ గాని దానిని విడిచి చేయరాదు. శిలామయము దారుమయము లోహమయము (మృచ్చందనాది)లేపమయము. లేఖ్యామయము, సికతామయము మనోమయము మణిమయము నని ప్రతిమయెనిమిది విధములు. అదిమఱియుఁ జలమనియు నచలమనియు రెండువిధములగును. అవి భగవంతునికి స్థానములు. ఉద్ధవా! అచలమైనదానియం దర్చనచేయునపుడు,ఉద్వాసమును నావాహమును రెండునుగలుగవు. చలమం దారెంటిలోనేదియేని యొకటి గలుగుచున్నది. స్థండిలమందు రెండును గలుగుచున్నవి. విలేప్యమందు (లేఖ్యమందును సైకతమందును) స్నపనముమాత్రముచెల్లును. తక్కిన వానియందుఁబరిమార్జనముచెల్లును. శాస్త్ర ప్రసిద్ధములయిన ద్రవ్యములచేత నాయాగము (అనఁగా మదారాధనము) ప్రతిమలయందు మాయలేకకావింపవలయును. భక్తుఁడగువాఁడో దొరకినవానితోఁగాని, నాద్రవ్యములను గేవలముహృదయమందుసంకల్పించుకొని కాని నన్నారాధించినఁ జాలును. ఉద్ధవా! అర్చయందు స్నానమును నలంకరణమును నాకు మిక్కిలియుఁ బ్రియములైనవి. కాఁబట్టి యారెండును దప్పక చేయవలయును. స్థండిలమునందు, అయా యంగప్రధానదేవతలను వాని వాని స్థానములందు మంత్రములచేత స్థాపనముచేయుటయు, అగ్నియందు నాజ్యముతోఁ గూడిన హవిస్సును,నాకుఁ బ్రియతమములు. సూర్యునియందుస్తుతులచేనారాధించుటయు జలమునందు సలిల గంధపుష్పాదులచేత నర్చించుటయు శ్రేష్ఠ

మైనది. నట్టిజలమైనను భక్తితోడ సమర్పించిన యెడల నాకు మిక్కిలియుఁ బ్రియమగు ననఁగా గంథము ధూపము పుష్పములు దీపము అన్నము తాంబూలము మొదలగువాని యందు దేనితోనైనను భక్తితో నారాధించినఁ జెప్పవల యునా? భక్తిలేక నాకెంత పెద్దకానుక పెట్టినను సంతో షము కలిగింపనే చాలదు. పూజాక్రమము వినుము:—

మొదటఁబూజకు వలయునుపకరణముల నెల్లసమకట్టుకొన వలయును. పిమ్మటఁ దూర్పుమొనలగు దర్భలచేత నాసనము కల్పించుకొని తూర్పుమొగముగానో యుత్తరదిక్కుమొగము గానోలేక యర్చావిగ్రహమునకు నభిముఖముగానో కూర్చుండి మాటిమాటికి లేవక యర్చింపవలయును. అర్చించువాఁడు మొ దటఁదనయంగములందు మంత్రన్యాసము చేసికొని నాయర్చా ప్రతిమయందును నట్లెన్యాసముచేసి చేతితోఁదడువవలయును. పిదపఁ దనకు నెడమప్రక్క ప్రోక్షణకలశము నుంచుకొనవల యును. ఆకలశమునందలి జలముచేత యాగభూమినిని బూజా ద్రవ్యములనును దనదేహమును బాద్యము మొదలయిన మూఁడు పాత్రములనును బ్రోక్షించి యంత నాకలశోదక ముల చేతను దులసి దర్భమొలకలు విష్ణుక్రాంత యెఱ్ఱగలు వలు మొదలైన యాయాద్రవ్యములచేతను బూజింపవల యును. ఆరాధకుఁడు పాద్యముకొఱకును నర్ఘ్యముకొఱకును నాచమనీయము కొఱకును గల పాత్రములు మూఁటిని హృద యమంత్రము చేతను శిరోమంత్రముచేతను శిఖామంత్రము చేతను విష్ణుగాయత్రిచేతను నభిమంత్రింపవలయును. శోష ణముచేతను దాహనముచేతను బ్లావనముచేతను బరిశుద్ధమయి

యున్న శరీరమునందలి హృదయపద్మమునందు జ్ఞానస్వరూప మగు జీవుఁడున్నాఁడు. వాఁడు మదాత్మకుఁడు, దేహేంద్రియ ములకు విలక్షణుఁడు, అణుస్వరూపుఁడు, ఉదాత్తస్వరయుక్త మగు ప్రణవమందలి కడపటి వర్ణమగు మకారమునందుఁ బ్రతిపాద్యుఁడని యోగులువానిని ధ్యానింప వలయును.

దీపము ప్రభ చేత గృహమునవ్యాపించినట్లు స్వరూపభూతుం డైన జీవుఁడుధర్మభూత జ్ఞానముచేత వ్యాపించియున్నట్లు శరీర మునుధ్యానించి, యిట్లునంస్కరింపఁబడిన శరీరమందలిహృత్పద్మ మున మొదట మానసోపచారముల చేతనర్చించి,యంతయర్చ స్థండిలము మొదలగు వానిలో దేనియం దయినను [1] నా వాహనముచేసి స్థాపనముగావించి, నాకు నంగన్యాసముసలిపి యంతఁ బూజింప వలయును. పిదప [2] ధర్మము మొద లయిన యెనిమిదిపాదముల తోఁగూడిన మఁదుఁ [3] దొమ్మి ది మూర్తులతోఁ (పీఠదేవతలతోఁ) గూడినదియుఁ గర్ణి కతోడను గేసరములతోడను గూడినదియు నెనిమదిదళములు గలదియు నగు పద్మము నాసనముగాఁ గల్పించి యందుఁ

1. ఇచట ఆవాహనస్థాపనమున చేత సన్నిధాపన ము మొదలగు వానినిగూడ గ్రహింపవలయును. ఆవాహనము మొదలగు అణుముద్రలను బ్రదర్శించుట చేత ఆవాహనాదులు కావించుట యని తెలియునది.

2. ధర్మము జ్ఞానము వైరాగ్యము ఐశ్వర్యము అధర్మము అజ్ఞానము అవై రాగ్యము అనైశ్వర్యము అనిపీఠమునకు పాదములెనిమిది.

3. పీఠదేవతలు 'విమలోత్కర్షిణీ జ్ఞానా క్రియా యోగాతతః పరమ్। ప్రహ్వీసత్యాతథేశానాఽనుగ్రహా నవ మూర్తయః; విమల, ఉత్కర్షిణి, జ్ఞాన, క్రియ, యోగ, ప్రహ్వ, సత్య, ఈశాన, అనుగ్రహ యని తొమ్మండ్రు తెలియునది.

నర్ఘ్యమును బాద్యమును నాచమనము మొదలగునుపచార ములను వేదవిధులచేతను బంచరాత్రోక్తవిధులచేతను మంత్ర ములచేతను స్వర్గాపవర్గములు రెండును సిద్ధించుకొఱకు నాకుఁ గావింపవలయును. పిదప సుదర్శనమును బాంచజన్యమును, గదను, అబ్జమును, ఇషువును, శార్ఙ్గధనువును, హలమును ముసలమును, కౌస్తుభమును వనమాలికను, శ్రీవత్సమును, వెంటనే పూజింప వలయును * అంతఁ బార్షదులగునందుని, సునందుని గరుడునిఁ, బ్రచండుని, జండునిని, మహాబలునిని, బలునిని, గుముదునిఁ, గుముదేక్షణునిని బూజింపవలయును. పిదపఁ దమ తమ స్థాన ములయందు నా కభిముఖములుగా నెలకొల్పఁబడియున్న దుర్గ నను, వినాయకునిని, వ్యాసుని, విష్వక్సేనుని, గురువులను నింద్రాది దేవతలనును బ్రోక్షణము పాద్యము మొదలగు వాని చేతఁ బూజింపవలయును. చందనము, వట్టివేరు, కర్పూరము, కుంకుమపువ్వు, అగరువు ననెడివీనిచే జలమును వాసింపఁ జేసి మంత్రములచేతఁ, బ్రతిదినమును మంచి కలిమియున్న యెడల స్నానము చేయింపవలయును. కలిమి లేనిచో దొరకిన

---

* సుదర్శనము మొదలుగా ముసలముఱకుఁగల యాయుధములను అష్ట దిక్కులయందును, కౌస్తుభ వనమాలా శ్రీవత్సములను వక్షమునందును, నందా దులను అష్టదిక్కులందును, గరుడుని ముందటను, దుర్గాదులను కోణము లందును, గురువులను భగవంతుని దక్షిణపార్శ్వమందును, ఇంద్రాదులను తూర్పు మొదలుగా అష్టదిక్కులందును నుంపవలయును. దుర్గ, భగవన్మా యాభిమాని దేవతయగుటంబట్టియు, వినాయకుఁడు విష్వక్సేనుని పార్షదుఁ డగుటంబట్టియు, వ్యాసుఁడు వేదశాఖలను విభజించి వానిని బ్రవర్తింపఁ జేసి యుపకరించుటంబట్టియు, దేవతలు భగవద్విభూతులగుటంబట్టియు, వీరి నెల్లభగవంతుని పరివారములలోఁ జేర్చి పూజ విధింపఁబడినది.

పఱకుఁ జందనాదులుగలిపి స్నానముచేయింపవలయును. *సువర్ణ ఘర్మానువాకమంత్రముచేతను మహాపురుషవిద్యచేతను బురుష సూక్తముచేతను, సామాశ్రయములగు నీరాజనము రౌహిణ ము మొదలగుమంత్రములచేతను స్నానముచేయింపవలయును. పిమ్మట వస్త్రములు యజ్ఞోపవీతము భూషణములు తులసీదళము లు పుష్పమాలికలు చందనలేపనములు మొదలగువానిచేత నా భక్తుఁడగువాఁడు నన్నుఁ బ్రేమతోడ యథోచితముగా నలం కరింపవలయును. అర్చకుఁడు నాకుఁ బాద్యమును నాచమ నీయమును గంధమును బుష్పములను నక్షతలను ధూపదీప ములను నుపహారములను శ్రద్ధతో నొసంగవలయును. పిదప బెల్లము, పాయసము, నెయ్యి, చక్కిలములు, పిండివంటక ములు, కుడుములు, గోధుమపిండి, వంటకములు, పెరుఁగు, వండిన పప్పు, మొదలగు వానిని నైవేద్యము చేయ వలయును. ఏకాదశి మొదలగు పర్వదినములయందు, నా కభ్యంగనము, ఉన్మర్దనము, అద్దముచూపుట, దంతధావ నము, పంచామృతముచేత నభిషేకించుట, అన్నాదులు, గీతము, నృత్యము, వాద్యము, మొదలగునవియుఁ గావింపవలయును. సంపదయుండెనా ప్రతిదినమును నివి చేయవలయును. అగ్ని యందుఁ బూజాప్రకారము వినుము. మేఖలాగర్తవేదు లగు

* 'సువర్ణం ఘర్మం పరివేద వేనం, ఇత్యాదులు సువర్ణ ఘర్మానువాకమంత్ర ములు 'జితన్తేపుణ్డరీకాక్షనమస్తే విశ్వభావన। నమస్తేऽస్తుహృషీకేశ మహా పురుష పూర్వజ' అనుమంత్రము మహాపురుషవిద్య. పురుషసూక్తము ప్రసి ద్ధము. 'ఇన్ద్రంమఘవానే మథితాహవన్తః' ఇత్యాదులగు ఋక్కులు నీరా జనాదులు ఇవి సామము నాశ్రయించినవని తెలియునది.

వారి చేతఁ దంత్రోక్తవిధిప్రకారము నిర్మింపఁబడిన కుండ మందో లేక స్థండిలమందో యగ్ని నునిచి, మండిన వెనుక నాయగ్నిని జేత నలుప్రక్కలనుండి యొకటిగాఁ జేర్పవల యును. పిదప దర్భలు పఱచి పరిషేచనము చేయవలయును. అంతఁ దన గృహ్య విధి చెప్పిన నగ్నిముఖ మనెడి కర్మము నెల్ల సంకల్పము చేసికొని ప్రోక్షణపాత్రజలముచేత, నాజ్య ముస్థాలిమొదలైనయుపకరణములను బ్రోక్షించియగ్నియందు నన్ను మేలిబంగారుకాంతి గలవాఁడుగను శంఖచక్రగదాం బుజములు నాలుగును నాలుగుజేతులయందు వెలుంగుచున్న వాఁడుగను, శాంతుఁడుగను, తామర కింజల్కములవలె నెఱ్ఱని వస్త్రముగలవాఁడుగను, గిరీటమును గటకములును గటి సూత్రములును నంగదములును వెలయుచుండువాఁడుగను, శ్రీ వత్సవత్సుఁడుగను, వనమాల ధరించి యున్నవాఁడుగను భావనచేయవలయును. ఇట్లు ధ్యానించి యర్చించి నేతఁ దడి సిన సమిధలనును హవిస్సులనును నగ్నియందు వైచి, అఘార ములనెడి యాజ్యాహుతులను వేల్చి తెలిసినవాఁడు శ్రీమ దష్టాక్షరస్వాహాంత మగుమూలమంత్రముచేతను, బురుషసూ క్తమునుఁ బదియాఱు ఋక్కులచేత నగు నవదానములచేతను, నాజ్యమందుఁ దోఁగిన హవిస్సును హోమము చేయవలయును. అంత న్యాయము చెప్పిన ధర్మాదుల కొఱకును, విమలాదులు అంగదేవత లావరణదేవతలు నస్త్రభూషణపార్షదులు మొద లగు వారికొఱకును హోమముచేయవలయును. అంత స్విష్టకృతము వేల్పవలయును. పిదప నగ్నియం దావా హనము చేయఁబడియున్న భగవంతు నర్చించి పార్షదు

లయిన నందాదులకు నష్టదిక్కుల యందును బలి నొసంగవల యును. బ్రహ్మంబగు నన్ను ధ్యానించుచు నారాయణాత్మక మగు మూలమంత్రమును జపింపవలయును. పిదప విష్వక్సేను నకు నాచమనము సమర్పించి భగవంతునకు నివేదించిన వాని నతనికి నర్పింపవలయును. అవ్వల, కర్పూరాదులచే వాసిత ములయిన తాంబూలము మొదలగు ముఖవాసములను సమ ర్పింపవలయును. మరలఁ బుష్పాదులచేతఁ బూజింపవల యును. అంతఁ బాడుచును బొగడుచును, నాడుచును, నాచే ష్టితముల నభినయించుచును, నాకథలను వినుచును, వినిపించు చును, ముహూర్తము సేపు లబ్ధావసరుండై యుండవలయును. అంత శ్రుతి ప్రతిపాదితములును బురాణోక్తములును ద్రవిడాం ధ్ర భాషాత్మకములును బ్రాకృతములునగు నానావిధ స్తవముల చేత స్తుతించి 'భగవంతా! ప్రసన్నుఁడవగు' మని దండమువలె బడి వందనము చేయవలయును. నా పాదములయందు శిరస్సునిడి రెండుచేతులచేత నా రెంటిని బట్టికొని 'ఈశా! నేను శరణుఁ జొచ్చితిని. మృత్యువువలెను బిశాచమువలెను సముద్రము వలెను నున్నసంసారమునకు భయపడియున్న నన్ను రక్షింపు' మని పలికి నే ననుభవించిన తులసి మొదలగువాని నే నిచ్చినట్లు గాఁ జేకొని యాదరముతోడ శిరస్సునందుఁదాల్చి జ్యోతియగు నాస్వరూపమును నుద్వాసనము చేయవలయు నేని యాజ్యోతిని మరల జ్యోతి యగునంతగాత్మయం దుద్వాసనము చేయవల యును. అర్చ మొదలగు వానిలో నెప్పుడు దేనియందు శ్రద్ధ గలుగునో దానియందపుడు నన్నర్చింపవలయును. మఱియు సర్వాత్ముండగు నేను భూతములయందును దనయందును నెల

కొనియుండునట్లు భావింపవలయును. పురుషుఁడిట్లు వేదములం దును దంత్రములందును జెప్పఁబడిన క్రియాయోగమార్గ ములచేత నన్నర్చించి యిహమందునుఁ బరమందును దాను గోరినట్టి ఫలమును నావలనఁ బొందుచున్నాఁడు. శక్తి గలి గినవాఁడు నాకు దృఢమైన మందిరమును గట్టింపవలయును. అందు నాప్రతిమను బ్రతిష్ఠాపించి రమణీయములయిన పుష్పో ద్యానములను బూజలను యాత్రలను నుత్సవములను జేయిం పవలయును. మహాపర్వములయందును బ్రతిదినమును బూజా దు లెడతెగక జరుగుచుండుటకై యాపూజాదులకుఁగాను నారాధించు వారికో నాకో క్షేత్రములను బురములను గ్రామ ములను మాన్యములనిచ్చి నాతోఁడి సమానైశ్వర్యమును బొం దుచున్నాఁడు. నాప్రతిమను బ్రతిష్ఠించుటచేత సార్వభౌముఁ డగుచున్నాఁడు. మందిరము నిర్మించుటచేత ముల్లోకముల కధి పతి యగుచున్నాఁడు. పూజాదులచేత బ్రహ్మలోకమును బొం దుచున్నాఁడు. ప్రతిష్ఠాదులు మూఁటిని జేసిన యెడల నాతోఁడి సాధర్మ్యమును బొందుచున్నాఁడు. ఎవ్వఁడు ఫలాభిసంధిలేక నన్నిట్లు పూజించునో వాఁడు భక్తియోగమును బడయుచు న్నాఁడు. ఆభక్తియోగముచేత నన్నే పొందుచున్నాఁడు. ఎవ్వఁడు దేవతలకును బ్రాహ్మణులకును గల వృత్తులను దాని చ్చినవానినిగాని పరు లిచ్చిన వానినిగాని యపహరించునో వాఁడు వేలకోలఁదిసంవత్సరము లమేధ్యమును దినుచుండును. ఈ దానముఁగాని యపహారముగాని చేయువాఁడును జేయిం చు వాఁడును నందులకు దోడుపడువాఁడును వానియందు భాగముగలవారు గాన దానివలని ఫలము లనుభవింతురు. ఆ

ఫలమే పరలోకమందు వారికిమఱిమఱి పెచ్చుపెరిఁగిన దగును.
ఇది యిరువదియేడవయధ్యాయము.

---

## భగవంతుఁ డుద్ధవునకు జ్ఞానయోగమును మరల సంగ్రహరూపమున వర్ణించుట.

భగవంతుఁడు—పరులకు స్వభావానుగుణముగా నిచ్చుట యో యపహరించుటయో యిత్యాదికార్యములు గలిగియుండ వచ్చును. కాని యందులకై వారిని స్తుతించుటయు నిందించు టయుఁ దగదు. ప్రకృతితోడను బురుషుని (జీవుని) తోడను గూడియున్న యీ ప్రపంచమెల్ల నంతర్యామి యైన నాకు శరీర భూతమై యున్నదని కనుఁగొనవలయును. ఎవఁడు పరుల స్వా భావికములగు కర్మములను బొగడుచును దెగడుచు నుండునో వాఁడు దేహము తీఱఁగానే తనయాత్మాభిమానమును బట్టి స్వార్థంబగు జ్ఞానయోగమునుండిభ్రష్టుఁడగుచున్నాఁడు. దేహ మునకంటె నాత్మ వేఱయినదని తెలియమిచేత దేహమే యా త్మయని భ్రమించుట గలుగుచున్నది. అపుడు దేహమందున్న జీవుఁడు యెఱుక చెడి మృత్యువునకు సాటియు సూక్ష్మరూపము నగు ప్రకృతిచేత మఱుఁగుపడుచున్నాఁడు. అట్లె నానావిధ దేహములుగల యట్లుగా భ్రమించుపురుషుఁడును బ్రబుద్ధుఁడ యినను దత్త్వజ్ఞానము లేనందున నిదురపోయినవానితో సాటి యగుచున్నాఁడు. దేహములన్నియును దేవాదులవియైనను గ్రిములవియైనను నొక్కరూపముననుండక ప్రకృతిచేత వికార ముల నొందుచునే యుండును. వాని కన్నిటికి నిషేకముగర్భము మొదలగు కాలకృతములైన యవస్థలును సమానములుగానే

యుండును. మఱి యవియన్నియు నాత్మకు వేఱైనవియగును. ఇట్లన్నియు నభద్రములై యుండఁ గొన్ని భద్రములనియు మఱి కొన్ని యభద్రములనియుఁజింత యేల? దేవాదిశబ్దములచే నా యాశరీరములు చెప్పఁబడుచున్నవి. మఱి యాయాశరీరములే యాత్మ యనియుఁ దప్పఁ దలంపఁబడుచున్నది. అట్టి దేవత్వము క్రిమిత్వము మొదలయినవి యాయా దేహములయం దేయున్నది గాని యాత్మయందుఁగలుగవు. కనుక దేహములను బట్టి కాని యొక దానిని స్తుతించుటయు మఱొక దానిని నిందించుటయు యుక్తములు గావు. దేహమునకుఁ గల దేవాద్యాకారము లాత్మయందు లేవు గనుక నట్టి లేనివానియం దభినివేశమున్న మాత్రనే యనర్థము లెట్లు కలుగునందువా? ఒక నీడను జూచి రాక్షసుఁ డని భ్రమించినపు డది భయముకలిగించుచున్నది. అది తన నీడయే యని సరిగా గ్రహించినపు డట్లుగాదు. ఒక ప్రతిశబ్దము విన్నపు డది కొండగుహ యందలిజంతువు శబ్దముగాఁ దలంచినపుడు భయమును దన ధ్వనియే యని తెలిసినపు డది లేకపోవుటయుఁ గలుగుచున్నది. స్వప్నమందు బాధించునవిగాఁ గొన్నితోఁచుచున్నవి. అవి మేలుకొన్నప్పటి వానివలెనే భ్రమించుటవలన భయము గలిగించుచున్నవి. వట్టి కలలోని వని తెలియఁగా నట్లు గాకుండును. ఇట్లు రాక్షసత్వాదులు లేనివిగాన తమంతట ననర్థము లేనియుఁ గలిఁగింపజాలవు గాని వాని కలరూపును గ్రహింప నపుడు భయాదులను గలిగించుచున్నవి. అట్లే దేహాదులను వాని కలరూపునగ్రహింపక యాత్మగా భ్రమించిన యెడల నవి ప్రలయమువఱకును సంసారభయము గలిగించు

చున్నవి. ప్రపంచమంతయుఁ బరమాత్మయే యగును. మఱి యుఁ బ్రభుండును విశ్వాత్ముండు నగు నీశ్వరుఁడు సృజించుచును రక్షించుచును హరించుచు నుండుటయె కాక తానే చిదచిత్తుల రూపమున సృజింపఁబడుచును రక్షింపఁబడుచును సంహరింపఁ బడుచును నుండును. ఇట్లు ప్రపంచమునందుఁ గలవానిరూప ములనెల్లఁ బరమాత్ముఁడే యుండుటనుబట్టి "వానినుండి యాత్మ వేఱుగా నేర్పడినది; ఆ యాత్మనుండి యాజడము వేఱుగా నేర్పడిన'దని నిరూపించుటకు శక్యముగాదు. ఇట్లు పరమాత్మ యందు దానికంటె వేఱయినవస్తు వొకటి నిరూపించుట కల విగానందున నన్నివస్తువులు నతఁడే యగుటంబట్టి దేనినిగాని నిందించుట పొగడుట యుపేక్షించుట యనెడి యీ మూఁడును బ్రమాణశూన్యములు; వట్టి భ్రమరూపములు. ఈ జగమున కెల్ల నుపాదానము పరమాత్ముఁడే యైనచో దాని వికారము యాతనికిఁ గలుగునేయందువా? నిందకును బ్రశంసకును నుపేక్ష కును విషయమైయున్న యీ జగముప్రకృతిగుణములయిన సత్త్వాదుల వికారమే యని తెలయుము. కనుక వికారము లా గుణములతోఁ జేరినవే యగును. గుణమయమైన జగత్తు నకు నుపాదానము పరమాత్ముఁ డెట్లన్నచో వాఁడు సంకల్ప రూపమున గుణములందుఁ బ్రవేశించి యుపాదాన మగు చున్నాఁడు. ఇట్లతఁడు సర్వాత్మకుఁ డగుటవలన గుణము లందును జొచ్చియుండుటంబట్టి గుణమయమగు జగమును నతనిమయమే యగును గాన నతఁడు దాని కుపాదానమగుట విరుద్ధము కానేరదు. ప్రకృతిపురుషులు పరస్పరము విలక్షణుఁ లనెడిజ్ఞానమును పరమపురుషుఁడాయుభయమునకును విలక్షణుఁ

డనెడి విజ్ఞానమును గుశలముగా నెఱింగినవాఁడు దేనిని నిందింపఁడు, స్తుతింపఁడు; మఱి సూర్యునివలె గుణదోషములను బాటింపక లోకమందు సంచరించుచుండును. బ్రహ్మ మొదలుగాఁ గీటమువఱకుఁగల దేహసమూహమంతయును నుత్పత్తి మరణము లొందుననియును నాత్మకంటె వ్యతిరిక్తమైనవనియుఁ బ్రత్యక్షము చేతను ననుమానము చేతను నిగమము చేతను నాత్మబుద్ధిచేతను దెలిసికొని దేనియందును దగులులేక యీ లోకమందుఁ జరింపవలయును' అనెను

ఉద్ధవుఁడు—ఈశా! ద్రష్టయగు నాత్మయును దృశ్యమగు దేహమును రెండును బరస్పరము విలక్షణము లగుటంబట్టి యిందు దేనికి సంసారము? దేనికి లేదు? అయినను సుఖ దుఃఖము లనుభవించుచుండుట ప్రత్యక్షముగాఁ గనఁబడుచున్నది. కాన సంసారము లేదనుటకును శక్యముగాదు. ఆత్మ తనంతట స్వభావముచేతనే శుద్ధుడు; ఒకనిచేతఁ గాక తనంతటనే ప్రకాశించుచుండువాఁడు. కర్మము లతని నావరింపవు. సత్త్వాదిగుణములకాశ్రయముగాఁడు. వాఁడుజన్మమరణాది వికారములు లేనివాఁడు. దేహమో జడము. ఇట్టు లాత్మయు దేహమును విజాతీయములై యున్నను రెండును, నగ్నియును దారువులుంబలెనే, కలసియున్నవి. అయినను జడము గాని యాత్మ తనంతటఁ బరిశుద్ధమగుటచేత, దానికి సంసారము గలుగనేరదు. అశుద్ధమైన దేహము జడమగాన దానికి సంసారము గలుగఁజాలదు. కనుక నిందు సంసారము దేనికి? యని యడిగెను.

శ్రీభగవంతుఁడు—ఆత్మకు దేహాదులతోడ నెంతవఱకు సంబంధము గలదో యంతవఱకు దానికి సంసారావహము లయిన దేహాదిరూపములు తనంతట లేకున్నను నున్నట్టివాని వంటివై యాత్మకు సుఖదుఃఖములు కలిగించుచుండును. ఏలన నా యాత్మ దేహమునకంటెఁ దాను విలక్షణమని తన స్వరూప మును దెలియనందున దానితోడి సంబంధమునొంది యశుద్ధి నొందుచున్నది. ఆత్మకు దేవమనుష్యాద్యాకారములు లేకు న్నను నవి 'నేను స్థూలుఁడను. నేను గృశుఁడను. వీరు నా యాలుబిడ్డలు. వీరు నాకు ప్రతికూలురు. వీరనుకూలు'రని యిట్లు విషయములను జింతించుచుండువానికి సంసారము నివర్తింపదు. కల గనునపుడు స్వప్నదేహము తన యాత్మ కాదనుట యొప్పి యున్నను నప్పటి కాదేహమె యాత్మయని భ్రమించుటవలన సుఖదుఃఖము లనుభవించుట గలుగుచున్నది గదా! అట్లే యాత్మకు దేహాదిరూపములు లేకున్నను నవి యున్న ట్లెంచి విషయములను జింతింపఁగా సంసారము విడువక యను భవింపవలసివచ్చుచున్నది. మేలుకొనినవానికి స్వప్నమె మిక్కిలి యనర్థము గలిగించుచున్నది. ఆస్వప్నమె దానినుండి మేలుకొన్నవానికి దేహాభిమాన మనెడు మోహమును గలిగింపఁ జాలదు. దానిమూలమున సుఖదుఃఖములును గలుగనీయదు శోకమును హర్షమును భయమును గ్రోధమును లోభమును మోహమును స్పృహయు జన్మమును మరణము మొదలగు నవియెల్లఁబ్రకృతి పరిణామమై యాత్మగానిదానిని నాత్మగా భ్రమింపఁజేయు నహంకారమువలనఁ గలుగునవే కానియాత్మ కు స్వభావసిద్ధములుగావు. దేహము, ఇంద్రియములు, ప్రాణము,

మనస్సు, అభిమానము (ఆత్మ గాని దానియం దాత్మయనెడు భ్రమము), (కర్మానుష్ఠాతయగుటవలన)జీవుఁడును,గుణములును గర్మములును దనకు లోనై యుండు పరమాత్మయును, సూత్ర మగు మహత్తును, ననెడి వీనివలన బహుప్రకారములు సంసారము కాలవశమై ప్రవర్తించుచున్నది. మనస్సుచేతను వాక్కుచేతను బ్రాణములచేతను శరీరముచేతను జేయంబడిన కర్మము వెక్కు దేహాదిరూపములచేత రూపింపఁబడుచున్నది. సంసారమున కిది మూలము. దీనిని వేరు లేకుండునట్లుగా నాయుపాసన మెడ తెగక చేయుటచే వాడియైన జ్ఞానమనెడి కత్తిచేతఁ ద్రుంపఁబూనినవాఁడై శబ్దాదులయందుఁ దృష్ణవదలి శుభాశ్రయమగు నావిగ్రహమును మననముసేయుచు భూమియందు సంచరింపవలయును. వేఱువేఱుధర్మములచేత నాత్మకును దేహమునకునుగల వేఱుపాటు తెలియునట్టి వివేకముచేతను తపము (కర్మయోగము) చేతను (శాస్త్రాధ్యయనమువలనఁ బుట్టిన జ్ఞానమగు) నిగమముచేతను 'నేను ఇది'యని యాత్మను దేహమును దెలియు ప్రత్యక్షముచేతను, ఐతిహ్యము (ఉపదేశము) చేతను, అనుమానముచేతను, జ్ఞానమును సాధింపఁదగినది. *ఆ జ్ఞానస్వరూప మెట్టిదనఁగావినుము. ఈ దేహమునకు మొదటను గడపటను నేది శరీరరహితమై యుండునో యా యాత్మస్వరూపమె దానికి నడుమనుగూడ నుండును. కాని శరీరమాత్మగాదు. భగవంతుఁడు దాను వెక్కులగునట్లు సంక

* సంసారనివృత్తి కుపాయమైన యీజ్ఞానము ఇచట 'దేహమునకు మునుపును వెనుకను నడుమను ననువర్తించునదై దానికి విలక్షణముగా నాత్మస్వరూపముండు' ననుటను గూర్చినది.

ల్పించుకొన్న కామమె యిటువంటి యాత్మకు దేహసంబంధము గలుగుటకు నిమిత్తమని తెలియుటయే జ్ఞానము * పుటము చేఁ బరిశుద్ధమయిన బంగారము కటకమకుటాదులగు బంగారు నగ లెన్నియైనను వెండి మొదలగువానితోఁగూర్పఁబడుచున్నది. అది కటకమకుటాదులగుటకుఁ బూర్వమును, దానికిఁ బిదపను, నడుమ రజతాదులతోఁ జేరి కటకాదులయి యుండునపుడును, 'నచ్చము కలపడ'మని నానావిధములయిన పేళ్లనువ్యవహరింపఁ బడుచున్నది. ఇట్లచ్చపుబంగారు రజతాదులతోఁ గలసి నగలై యుండునప్పుడు గూడ బంగారమని చెప్పఁబడుచున్నది. అట్టియెడ దానిని బంగారమని వ్యవహరించుట వట్టిభ్రాంతియె. నిరూపకులగువారు రజతాదులతోఁ గలియక మునుపును నగ్నియందుఁ బుటము పెట్టినవెనుకను గల యచ్చపుబంగారమునే బంగారమనునట్లు, నగలతో నడుమఁగూడియుండునపుడు నందలి యచ్చపుబంగారమునే బంగారమందురు గాని కలసి యున్న రజితాదులను గూడ నట్లు చెప్పరు. అట్లు చెప్పకుండుట భ్రాంతిమూలముగాదు. అట్లె నేననెడి యాత్మ దేహముతో సంబంధించుటకు మునుపును వెనుకను నెట్లో యట్లే నడుమ దేహముతోఁ గలసియుండునపుడును దేహవిలక్షణమైన దేకనుక దేహముతోఁగూడి యుండినపుడు దానినిమాత్రము గాక దానితోఁ గూడియున్న దేహమును గూడ నేనని తలంచుట భ్రాంతియె యగును. ఇట్లైటుఁగుటయుఁ బూర్వోక్తమగు

* ఇచట జ్ఞానము, ఆత్మ దేహముతోఁగూడియున్నపు 'డా దేహమును నే' ననుటచే భ్రాంతిరూపమని నిర్ణయించునదగును.

జ్ఞానమే. ఉద్ధవా! [1] కారణభూతమగు నింద్రియవర్గమును గార్యమగు శరీరమును గర్తయగు నహంకారము ననెడి మూఁడవస్థలు గలదై త్రిగుణపరిణామమైయున్న యచేతనము 'ఆత్మ దేహములోపలనుండఁగా నింద్రియములు ప్రవర్తించుచున్నవి' యని యన్వయముచేతను 'ఆత్మ లోపలలేనిచో నింద్రియములు ప్రవర్తింప' వను వ్యతిరేకముచేతను నా మూఁడవస్థలు లేని తురీయమగు దేనిచేతఁ బ్రవర్తించుచున్నదో యదియే యాత్మతత్త్వము. ఆ యాత్మ పరిణామములేనిది యని తెలియుటయె యావిజ్ఞానము. [2] శరీర ముత్పత్తికిఁ బూర్వమాత్మగాదు; లేక నశించినపిదపను నాత్మగాదు, రెంటికినడుమను నాత్మగాదు. నేను స్థూలుఁడని యూరక చెప్పికొనుటయె కాని యది భ్రాంతిమూలము. దేహమునకుఁ బూర్వమందును బిదపను గూడను నుండునదియుఁ బ్రమాణముచేతఁ బ్రసిద్ధమునునైన యాత్మతత్త్వమె యెప్పుడు నేకరూపమై యుండునని తెలియుటయే జ్ఞాన మని నామతము. [3] మఱియుఁ బ్రకృతికారమై రజోగుణ ముద్రేకించుటచేతఁ బ్రవృత్తిస్వభావమై యున్న యీ సృజ్యపదార్థమగు శరీర మాత్మయందులేనిదైనను దానే యాత్మయని తోఁచుచున్నది. పరిశుద్ధంబగు జీవాత్మస్వరూ

1. ఇచట జ్ఞాన మన్వయవ్యతిరేకములచేత దేహాదులను బ్రవర్తింపఁజేయుచున్న దనుటను గుఱించినది.

2. ఇచట జ్ఞానము 'దేహము ఆత్మగా'దని నిశ్చయించుచున్నది.

3. పరిశుద్ధాత్మస్వరూపము దేహమును వీడి యవభాసించుటను విచారించునదై యిచట జ్ఞానమున్నది. ఇట్టిజ్ఞానము సంసారమునకుమూలమైన దేహాత్మాభిమానమును ఛేదించునదిగాఁ జెప్పఁబడినది. ఇట్లై తక్కిన ఛేదకములను జెప్పి యీజ్ఞానము నుపసంహరించుచున్నారు.

పమో యీ దేహమును మరలి రాకుండునట్లు దిగవిడిచి స్వయం ప్రకాశమై వెలుంగును. ప్రకృతియో, యింద్రియ రూపములు శబ్దాదివిషయరూపము లనువికారము లొంది చిత్రముగా వెలయుచున్నది. ఇది యెఱుఁగుటయు విజ్ఞానమగును. ఇట్లుపరమాత్మ ప్రకృతిపురుషు లిరువురకంటె విలక్షణుఁ డని స్పష్టముగా నిర్ణయించుటకు హేతువులయిన జ్ఞానముల (విచారముల) చేతను, ఇతరములగు దేహేంద్రియప్రాణాదులకు నాత్మత్వమును నిపుణముగాఁ బోఁగొట్టుటచేతను తానే దేహమనియు స్వతంత్రుఁడనియుఁగల మోహమును ఛేదించి బ్రహ్మాత్మకస్వాత్మానుభవానందముచేఁ బరితుష్టుఁడై సమస్తకర్మజనులతోడ సంగముగావింపకుండవలయును. పృథివీమయమైన యీ దేహ మాత్మగాదు. దేవతలని చెప్పఁబడు నింద్రియములును బ్రాణమును, వాయువును, జలమును, అన్నముచేత నాప్యాయితమగు మనస్సును, బుద్ధియు, నంతఃకరణమును, నహంకారమును, నాకాశమును, ఆత్మగావు. ఇట్లు దేహము మొదలగు నవన్నియును సమముగాఁ బ్రకృతిపరిణామములై యున్నవి. ప్రకృతియె యాత్మకంటె వేఱైయుండఁగా దాని పరిణామములయిన దేహాదు లాత్మ యెట్లగును? నాస్వరూపము వివిక్తముగాఁ దెలిసికొన్న యాత్మకు సత్త్వాది గుణపరిణామములయిన యింద్రియము లెచ్చరిక గలిగియుండుటవలన నపూర్వగుణ మేమి కలుగఁగలదు! ఆ యింద్రియములను విచ్చలవిడి నిగిడించినను దానికి దోషమేమి? సూర్యుని మబ్బులుగ్రమ్మినను బాసినను దానివలన నతనికొక దోషముగాని గుణముగానికలుగదుగదా? సూర్యునికిని మేఘములకును గూడిక గలుగదుగాన

వానివలన నతని కొకదోషమును గలుగదు. ఆత్మకును నింద్రియములకును నట్లుగాదే యందువా ? వాయువు శోషింపఁజేసినను నగ్ని దహించినను జలము దడిపినను భూమి దుమ్ముగ్రమ్మినను ఆకాశము వాని గుణములచేతఁగాని మఱి ఋతు గుణములగు శీతోష్ణాదులచేతఁగాని లేపమునొందకుండు నట్లె,ప్రకృతి విలక్షణమును సదాయేకరూపమును నహంశబ్దవాచ్యమునగు నాత్మస్వరూపముగూడ సంసారమునకు హేతువులు గాఁదలంపఁ బడురజస్తమస్సత్త్వాదులతోడను వానికార్యముల తోడను సంబంధింపదు. కాఁబట్టి, వారికిఁగాముకులతోడిసంగమమున దోషముగలుగదు. అయినను మనస్సునకుఁగషాయము వంటిదగు రజస్సును దాని కార్యములగు కామక్రోధములును దృఢమగునాభక్తియోగము చేత నిరసింపఁబడినంతవఱకును బ్రకృతిచేతఁగలిగింపఁబడు శబ్దాది విషయములందుసంగము లేకుండవలయును.రజస్సును నిరసింపక భక్తియోగము పెరుఁగఁజాలదు. అట్టి భక్తియోగము నిష్పన్నమగుటకు దానికి విరోధియగు రజస్సునుదూలించుట, యుపాయముగానసంగము లేనివాఁడై యుండవలయును. మనుష్యులకు రోగము చక్కఁగాఁ గుదుర్పఁ బడనియెడల నది మరలమరల దేహమును బాధ పెట్టుచుండును. అట్లె యపక్వమగు కషాయమువలె విడిచి పుచ్చరానిదై యుపాయ విరోధియగు ప్రాచీనపుణ్యాపుణ్యకర్మము గలిగి యుండు చెడ్డ యోగికి మనస్సు విషయములందుఁ దగిలినదై యోగమునుండి భ్రంశము గలిగించుచున్నది. పరులపెంపును దేవతలు చూడనోపరుగాన వారు మనుష్యరూపములచేఁ గాముకులను సృజించిపంపుదురు. ఆకాముకులు వచ్చివిఘ్నములుగలిగింపఁగా

యోగులు పూర్వ మభ్యసించినవిషయవాసనల బలముచేత మరల యోగము ననుష్ఠింపరు; కర్మతంత్రమునే యనుసరించి సంసారమునఁ బడుదురు. జంతువు శరీరము పడి పోవువఱకును దనంతట నేదేని యొకకార్యముచేయుచును లేక మఱి యొకజంతువువలన దా నేదేని కార్యము చేయింపఁబడుచునే యుండును. సంగమిట్టి యనర్థము గలిగించుచుండు నని తెలిసిన వాఁడు స్వానందానుభవముచేత విషయములందలి యభిలాష మునుడిగి దేహమునందే యున్నను దానియందునుండనివానివలె నేమిచేయుచున్నను జేయనట్టివాఁడే యగుచున్నాఁడు. వాఁడు బలుకుచున్నను వెంటఁబడుచున్నను బరుండియున్నను మూత్ర పురీషములు విడుచుచున్నను నన్నముదినుచున్నను స్వభావమును నిట్టి చూచుట తాఁకుట మొదలగు నితరకార్య మేదేని చేయు చున్నను నాత్మయందే మతి గలిగినవాఁ డగుటంబట్టితన దేహమును సంబంధించిన స్థితిగమనాది వ్యాపారములను నాత్మ ను సంబంధించినవిగాఁ దలంపఁడు. ఎఱుకగలవాఁడు ప్రతికూల ములగు శబ్దాది విషయములను మఱిపెక్కిన శరీరమును,నను కూలములగు శబ్దాదివిషయములను బెక్కింటిని జూచుచున్నను స్వప్నమునుండి మేలుకొనఁగా నందుఁ గన్నపదార్థముల నెల్ల మఱఁగుపడుటవలన స్థిరములయినవని తలంపనియట్లు, వానినెల్ల ననిత్యములని యనుమానించుటచేత నిత్యములయిన విగాఁ దలంపకుండును. సత్త్వాదిగుణముల కనుగుణములుగా నుండు పుణ్యాపుణ్యకర్మములచేత నానావిధములై యుండు దేవ మనుష్యాది శరీరములును దేహాత్మాభిమానరూప మయిన యజ్ఞానమును జ్ఞానముపుట్టుటకు మునుపు నాత్మయం దవివిక్త

ముగా గ్రహింపఁబడినవి. అదియే మరల జ్ఞాన ముదయించిన పిదప నన్నుగుఱించిన జ్ఞానముచేత నివర్తించుచున్నవి. అప్పు డాత్మ మరలమునుపటివలె 'నేనుస్థూలుఁడ'నిత్యాదులగు దేహాకారములచేత గ్రహింపఁబడదు. అదిసంహారాదుల నుబొందదు. సూర్యునియుదయము మనుష్యులకన్నులకుఁ గలఁచీఁకటినిదూలించునే కాని కలిగింపనట్లు, నన్నుగుఱించినజ్ఞానము గలుగఁగానే పురుషుని 'నేను స్థూలుఁ డ'నిత్యాదికమగు బుద్ధినిని దన్మూలమైన సంసారమునును, నాశము సేయుచున్నది. అపుడుపరిశుద్ధుండయిన యీజీవాత్మ స్వయంప్రకాశుండును జన్మాదివికారరహితుండును బ్రత్యక్షాది ప్రమాణములచేఁ దెలియరానివాఁడును, నపరిచ్ఛిన్నమగు ధర్మాభూతజ్ఞానముగలవాఁడును, సర్వార్థములను దెలియుజ్ఞానము గలవాఁడును, నేకద్రవ్యమయుండును, బ్రాకృతదేహరహితుఁడును, దేవమనుష్యాది శబ్దములకువిషయముగాని వాఁడు నై యుండును. వీనిచేతనే కదా మునుపు వాగాదు లయిన యింద్రియము లును బ్రాణములును బనులు చేయుచుండెను. దేహము ప్రకృతి నవలబించుటయు దేవాదులయిన యాకారములును దేనికిఁ గలుగవో యట్టి తన యాత్మను మఱచి కేవలజ్ఞానైక స్వరూపంబయిన యీయాత్మయందు 'నేను దేవుఁడను మనుష్యుఁడను స్థూలుఁడను కృశుఁడ' నని యిత్యాది విధమున నభిమానము గలిగియుండుట యను నింత మాత్రమే యాత్మసమ్మోహ మగుచున్నది. అట్లు దేవమనుష్యాది నామరూపములచేత గ్రాహ్యమును బంచభూతములచే రచితమగుటం జేసి పంచవిధమును నగుదేహమును వివిధములగు స్వర్గాదిభోగ్యవిషయములను నిత్యమని తలంచుట

యు నాత్మసమ్మోహమగుచున్నది.అట్లైనేను దేవుఁడనుగృశుఁడ ననెడి యీ రెండుదమ్ముఁబండితులుగాఁదలంచుకొను చుండువారికి నర్థవాదమె. వాస్తవమునకు రెండును భ్రాంతిరూపము లని తెలియునది. యోగము పరిపక్వము గాకున్న యోగికియోగము చేయు చున్నపుడతని దేహమునకు రోగాదులయిన యుపద్రవములు పుట్టి విఘాతము చేయుట కలదు. అపు డందులకుఁ బ్రతికార మిదివిధింపఁబడియున్నది.అది యేదనఁగా- సోమసూర్యాగ్నిధారణముచేతఁ గొన్ని కాఁకలను జలుబులనును, వాయుధారణముతోఁ గూడిన యాసనములచేత వాతాదిరోగములనును,దపస్సుచేతను మంత్రముచేతను నౌషధములచేతను బాపములు గ్రహములు సర్పములు మొదలగు నుపద్రవములనును నిర్వహింపవలయును. నన్ను ధ్యానించుటవలనను సంకీర్తనాదులచేతనును మఱియుఁ దక్కినవానిచేతనును గామాదులను, యోగనిష్ఠు లగు సదాచార్యుల ననువర్తించుటచేత దంభము మొదలగువానిని,నిట్లుశుభములయిన యుపాయములచేతనశుభప్రదములగు విఘ్నము లను నాశముసేయవలయును. ఇట్లు విఘ్నములను దూలించు యోగమును నిష్పన్నము గావించుకొనవలయును. కొందఱు ముదిసినశరీరమును స్థైతము మంత్రౌషధాదు లయిన వివిధోపాయములచేత మిక్కిలి పటుతరమైనదికావించుకొని కాయసిద్ధికొఱకై, యద్వంద్వపరకాయప్రవేశాదులకై యోగము నాచరించెదరు. అదిప్రాజ్ఞులగువారించుకయు నాదరింపఁ దగినదిగాదు. అట్లు దేహము స్థిరముగానుండుటకై పడు పాట్లన్నియు దేహమంతయుఁగలదిగాన నిష్ఫలమే యగుచున్నది. ఇంద్రియపాటవ మెంత యుండినను నా

యువు మంత్రౌషధాదులచేత నొనఁగూడి రానేరదుగదా! కనుక దేహమును దృఢము గావించుటకై కాలమును బుచ్చుటను దిగవిడిచి యా కాలమును యోగమునకై వినియోగింపవల యును. వృక్షమునందలిబంకువలె దేహ మంతముగలది చుమీ. ఇట్లు యోగము నిత్యమును మిక్కిలి యనుష్ఠించుచుం డువానికిఁ గాయము మిక్కిలి పటుత్వమునొందెనేని, మతి మంతుఁ డగువాఁడు యోగమును దిగవిడిచి మత్పరుఁడై యాకాయ మట్లు దృఢముగా నున్నదని దాని స్థితిని యెంత మాత్రము నమ్మరాదు. యోగియగువాఁడు యోగచర్యనను ష్ఠించుచు నన్నె శరణముగా నాశ్రయించి, యణిమాదుల యందు స్పృహలేక నాకు శేషమై యుండు తనయాత్మయందలి సుఖము ననుభవించుచుండును గానయట్టివాఁ డంతరాయముల చేత విఘాత మెంతమాత్రము నొందకుండును జుమీ. ఇది యిరు వదియెనిమిదవయధ్యాయము.

---

{*భగవంతుఁ డుద్ధవునకు మరల సంగ్రహముగా భక్తియోగమును వర్ణించుచున్నాఁడు.}

ఉద్ధవుఁడు—అచ్యుతా! అనాత్మయగు వానికి నీయోగ చర్య మిక్కిలియు దుష్కరమయినదని తలంచుచున్నాను. కనుకఁ బురుషుఁడు సులభముగా సిద్ధి నొందు ప్రకారమును నాకుఁ జెప్పుము. పుండరీకాక్షా! శ్రీకృష్ణా! మన స్సును వశీకరించుకొనుచును గాఁబట్టి మనస్సును నిగ్రహించు టకై యుపవాసాదులుండి చిక్కి మనస్సెప్పటికిని సమాధా

---

* ఇందుఁ జెప్పినదే కాక మరల మొదటియధ్యాయమునందును భక్తి యోగమును సంగ్రహముగాఁ జెప్పుట తెలియునది.

నము నొందక యోగులు తఱచుగాఁ గీడ్పడుచున్నారు. కనుక యోగచర్య మిక్కిలియు దుష్కరముగా నున్నది. కాఁబట్టి సారాసారములు వివేచించి తెలిసికొనువారు కొందఱా నందమును బిదుకునట్టి నీపదారవిందమును హాయిగా నాశ్రయింతురు. విశ్వేశ్వరా! వారు తమ యోగకర్మములకు గర్వపడకుందురు గాన నీచేత వంచింపఁబడ కుందురు. తక్కిన వా రన్ననో విఱ్ఱవీఁగుచు విఘాతము నొందుదురు. అచ్యుతా! ని న్నాశ్రయించిన మాత్రముననే నీ వీ మాయనుండి నన్ము దాఁటించుటయు నిన్నే శరణొంది యుండు నీదాసులకు నీ వధీనుఁడవై యుండుటయు, అశేషబంధూ! నీయం దొక చిత్రముగాదు. ఏ లందువా? తమంతట నీశ్వరులై యుండు బ్రహ్మాదిదేవతలు తలతల మెఱయుచున్నతమ కిరీటముల మొనలచేనీపాదపీఠమునకునొత్తుడుగలిగించుచుందురు. నీ విట్టివాఁడయ్యు బృందావనమునందు నీ పిల్లంగోవికిఁజిక్కి వచ్చిన మృగములతోఁ గూడి మాడి యుండుటకు నిష్టపడిన వాఁడవుగదే. ఇఁక నీభక్తులగు మనుష్యులకు లోనయియుండుట చెప్పవలయునా? ఇట్లు పరత్వమును వాత్సల్యమును సౌలభ్యమును సౌశీల్యమును గలిగి సకలమయినయాత్మలకును బ్రియతముఁడై స్వామివై యాశ్రితులు గోరినపురుషార్థముల నెల్ల నిచ్చుచుండు నిన్ను, నీవు చేసినయుపకారము నెఱింగిన మనుష్యుఁ డెవఁడు విడుచును? పురుషుఁ డెవఁడు తన్నుఁదానే మఱచునట్లు చేసెడి యైశ్వర్యమును గోరి నిన్నుఁ దప్ప మఱియొకదైవమును భజించును? ఆరోగ్యాదులకు సూర్యాది దేవతాంతరములనుభజింపరాదా యందువా? నీపాదపద్మముల

ధూళిని సేవించుచుండు మాకు శ్రేయమేది గలుగదు? కోరిన వన్నియుఁ గలుగుచుండఁగా నితరదేవత లెందులకు? ఈశా! బ్రహ్మవిదు లగువారు నీవు చేసినయుపకారమును దలంచుకొని మిక్కిలి యుబ్బుచుఁ దమకానందము వెచ్చువెరుఁగఁగా నీకుఁ బ్రత్యుపకారము బ్రహ్మాయుష్య మంతకాలమునకుఁ జేయుటకు శక్తులుగాకున్నారు. నీవు వెలుపల నాచార్యరూపముననను, లోపల హృదయమందు మేము చింతించుచున్నరూపముననను, నెల కొని దేహధారులకుఁ గల యశుభమును దూలించుచు నీరూపును మాకు వెలువఱచు చున్నావు' అనెను.

శ్రీశుకుఁడు—ఇట్లుద్ధవుఁడు మిక్కిలి మనస్సునం దనురక్తి మీఱ నడుగఁగా, జగమంతయుఁ దన కాటబొమ్మగాఁగల యా దేవుఁడు, తన సృష్టిస్థితి సంహారశక్తులచేత బ్రహ్మవిష్ణు శివమూర్తులు మూఁటిని దాల్చు నాప్రభువు, ఈశ్వరులగు బ్రహ్మాదులకును నీశ్వరుండయిన యాభగవంతుఁడు, సొగసయిన చిఱునవ్వుతోఁ బ్రేమ దొలఁకుపలుకుల నుద్ధవున కిట్లనియె. శ్రీభగవంతుఁడు—'ఓయీ! నాభాగవతధర్మములను మిక్కిలి మంగళకరము లయిన వానిని జెక్కింటిని నీకుఁ జెప్పెదను వినుము. ఆధర్మముల శ్రద్ధతో ననుష్ఠించిన యెడల మిక్కిలి జయింపరాని దియు మృత్యురూపము నయిన సంసారమును మనుష్యుఁడు జయించుచున్నాఁడు. వర్ణాశ్రమోచితము లయిన కర్మముల నెల్ల మదారాధనరూపములుగా ననుసంధించుచును మనస్సును జిత్తమును నాయం దర్పించి క్రమముగా వానిని జేయుచుండవలయును. అట్టి వాఁడు నాధర్మముల కొఱకే తన మనోవృత్తి నంతయుఁ జెల్లించుచుండవలయును. మద్భక్తు లగు సాధుజను

లుండు నట్టి పుణ్యదేశములను సేవింపవలయును. దేవతలయం దును నసురులయందును మనుష్యులయందును నాభక్తులెవరో వారిచరితములనుగూడ సేవింపవలయును. జనులు వేఱువేఱ గానియొక్కటిగాఁగూడికాని నాకొఱకు నృత్తములు గీతములు వాద్యములు మొదలయిన మహారాజోపచారములతోడ యాత్రలనును మహోత్సవములనును జేయింపవలయును. నిర్మలాంతఃకరణుఁడు లోపలను వెలుపలను నంతటను నాకాశ మును జూచునట్లు, నేను సర్వభూతములయందును దనయం దును లోపలను వెలుపలను నావరణములేక వ్యాపించి యున్న పరమాత్మునిఁగాఁగనుఁగొనవలయును. ఇట్లు నేను సర్వమున కంత రాత్ముఁడనై వర్తించుచుండుటంబట్టి మహాద్యుతీ! సమస్తభూత ములును నేను లేకనిలుపోపవుగాన నా శరీరముగాఁ దలంచుచుఁ దానినిబట్టియే వాని నెల్ల బహుమానించుచు, సమస్త భూత ములయందును వైషమ్యము లేకుండునట్టి జ్ఞానము నాశ్ర యించినవాఁ డగుచున్నాఁడు. బ్రాహ్మణునియందును బుల్క సునియందును, బ్రాహ్మణధనము నపహరించువానియందును, బ్రాహ్మణులయందు భక్తిగలవానియందును, సూర్యునియందు ను, మిడుఁగుఱునందును, సర్వభూతహితము సేయువానియం దును, సర్వభూతములకు ద్రోహి యగువానియందును, వీఁడు బ్రాహ్మణుఁడు వీఁడు చండాలుఁడని యెక్కువతక్కువలు తలంపక యందఱను సమానముగాఁ గనుఁగొనువాఁడే పండితుఁ డని యెన్నఁబడుచున్నాఁడు. ఏలనఁగా వీరందఱిశరీరములును బ్రకృ తిపరిణామములే. వీరి యాత్మ లన్నియును జ్ఞానైకాకారములే. వీరిదేహములును నాత్మలును రెండును బరమాత్మునికి శరీరమే

కావున నందఱును సమానులనియె పండితుఁడగు వాఁడు తలం
చును. మనుష్యు లందఱును మహాత్మకులని మాటికిఁ దలంచు
నట్టి పురుషునకుఁ గలహమును నసూయయును నవమానమును
నహంకారమును దనయందుఁగాని పరులయందుఁగాని త్వరిత
ముగానే నివర్తించుచున్నవి. 'సమస్తభూతములను నిన్నుగా
భావించుట దృఢముగానుండిన నేకదా కలహాదు లుడిగిపోవును.
అట్టి భావనమును సంపాదించువిధ' మెట్లందువా? గ్రామమృగ
ములలోశునకమువఱకును, మనుష్యులయందుఁ జండాలురవఱ
కును బశువులయందు గాడిదలవఱకును, మఱి యితరజాతుల
యం దాయానిహీనము లగువానివఱకును, గల సమస్తమున
కును దండమువలెఁబడి మ్రొక్కుచుండవలయును. అప్పుడు
బంధువులు పరిహాసింతురేని యట్లు నవ్వుచున్న తనవారిని దిగ
విడువవలయును. మఱియు నే నెక్కువ వీఁడు తక్కువ యను
గర్వమును మానవలయును. అప్పటికినా దేహమెక్కుడు వానిది
తక్కువయని యనుసంధింపఁగా లజ్జ కలుగుచున్నదేని, దేహ
మునుగూర్చియా లజ్జయును దిగవిడచి, జీవుని శరీరముగాఁ జేసి
యతనియందంతరాత్ముఁడై భగవంతుఁడు ప్రవేశించియున్నవాఁ
డుఁ గాన సర్వము నీశ్వరశరీరమే యని తలంచి మ్రొక్కవల
యును. ఇట్లు సమస్తములయిన భూతములందును నేననెడి
భావము మిక్కిలి దృఢముగాఁ గలుగ కుండునంతవఱకు, సర్వ
భూతములనుజూచి 'భగవతేనమః' యని వాక్కనుచ్చరించు
చును, 'ఈశ్వరుఁడు జీవశరీరకుఁడై భూతములందుఁ బ్రవేశించు
చున్నాఁ'డని మనంబునఁదలంచుచును, గఱ్ఱవలెఁబడి దేహము
చేత మ్రొక్కుచును నిట్లు మనోవాక్కాయ వృత్తులుమూఁటి

ళోడ నుపాసింపవలయును. ఇట్లుపాసించుచుండువానికి సమస్తమును బ్రహ్మాత్మకమే యని దృఢతర మగు నధ్యవసాయము గలుగుచున్నది. ఇట్లుసర్వమును భగవదాత్మకమనెడి బుద్ధిచేత నన్నిటిని గనుగొనుచుండఁగా నీపురుషుఁడు 'ఆత్మయే దేహమా? లేక దేహమునకంటె వేఱా ? జీవుఁడు స్వతంత్రుఁడా? పరమాత్మునకుఁ బరతంత్రుఁడా ?' యనెడియిట్టి సంశయములను వీడి సంసారమునిమిత్తములయినవాని యన్నింటినుండి విముక్తుఁడగుచున్నాఁడు. సమస్తభూతములందు నేనే యని మనోవాక్కాయవృత్తులు మూఁటిచేతను మద్భావము గలిగి యుండుట యనునదియె సమస్తములయిన యుపాయములందును మిక్కిలి సమీచీనమైనదని నామతము. ఉద్ధవా! ఇట్లు సర్వమును బ్రహ్మాత్మకముగా నుపాసించుట యనెడి యీ నాధర్మము నుపక్రమించినచో దానికి ఫలములేక నశించుట గలుగదని *నా నిశ్చయము. ఏలనఁగా ధర్మముపక్రమించిన మాత్రమున నప్పటికో కాలాంతరముననో గుణత్రయ సంబంధమును దొలఁగించుచుండును. దానినే నిష్కామముగా ననుష్ఠించినయెడ దానికి ఫలనాశము గలుగదని చెప్పనేల? లోకమందాయావ్యాపార మూరక తలంచుచున్నంతమాత్రము గాని కనుమూసినంతమాత్ర ముండునది గానియైనను మిక్కిలి యాయాసకరమైనదిగా నుండినను నిష్ప్రయోజనమే యగుచున్నదిగదా. అట్టివానిని బరమపురుషుఁడగునాయందు ఫలాభి

* ఇదియె గీతయందు 'నహికల్యాణకృత్కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి' అనియు 'నేహాభి క్రమనాశోఽస్తి ప్రత్యవాయో నవిద్యతే' అనియుఁ దెలియునది.

సంధిని విడిచి యుపర్థముగా ననుసంధించినయెడల నవి ధర్మమే (యనఁగా ఫలమును వీడనిదే) యగుచున్నవి. ఎట్లనఁ గంసుఁడు భయముచేతను, గోపికలనురాగముచేతను, శిశుపాలుఁడు ద్వేషముచేతను ఫలమునొందరా? అనిత్యమగు మనుష్యశరీరముచేత నిత్యుఁడును స్వభావముచే నిర్వికారుఁడును నగు నన్నుఁ బ్రాప్తించుటకు వలయుసాధనములను సమర్థించుటయే బుద్ధిమంతులకుఁ గలబుద్ధి (అధ్యవసాయము); ఇదియె మనుష్యునకుఁగల మనీష (హితాహిత వివేకము) వేదాంతసిద్ధము లగు నర్థములకెల్ల సంగ్రహ మిదియె, దీని నీకు విస్తరించియు సంక్షేపించియు సంపూర్ణముగాఁ జెప్పితిని. ఇది దేవతలకు సైతము పొందరానిది సుమీ: నీకుఁ దత్త్వత్రయ వివేచనరూపమును నీశ్వరోపాసనరూపము నగు జ్ఞానముప్రకారమును మిక్కిలి స్పష్టములగు యుక్తులతోఁగూడ మాటిమాటికిఁ జెప్పితిని ఈ జ్ఞానమును గలరూపునఁ దెలిసి పూర్వోక్తములయిన సంశయములను వీడిన పురుషుఁడు ముక్తినొందుచున్నాఁడు. నీవడిగిన దానిని నేను జక్కఁగా వివేచించి యుపపాదించితిని. దాని నెవఁడు మనస్సునందుఁ దాల్చునో వాఁడు సనాతనమగు వేదాంత రహస్యమును బరబ్రహ్మము నగునన్నుఁ బొందుచున్నాఁడు. ఎవఁడు దీనిని నా కనుకూలురగునవారియందు మిక్కిలియుఁ బుష్కలముగా నుపదేశించునో యా బ్రహ్మోపదేశము చేసినవానికి నన్ను నేనే యిచ్చుకొనుచున్నాను. ఆత్మకుఁబరిశుద్ధి గలిగించునదియు వినువారికిని శుచిగావించునదియు నయిన దీని నెవ్వఁడు పఠించునో వాఁడు ప్రతిదినమును బెరుఁగుచున్న జ్ఞాన దీపముచేత (అనఁగా యోగ్య పరిశుద్ధమైన మనస్సు

చేత) నన్ను సాక్షాత్కరించుచు నాప్రాప్తికిఁ బ్రతిబంధకములగువాని నెల్ల విడిచి శుద్ధుఁ డగుచున్నాఁడు. ఏ నరుఁడుదీనిని సమాహితుఁడై శ్రద్ధతోడ నిత్యమును వినుచున్నాఁడో వాఁడు నాయందలి భక్తిని గలిగించుకొనుచు నా ప్రాప్తికిఁ బ్రతిబంధకములగు కర్మములచేత బద్ధుఁడుగాక యుండును. ఉద్ధవా! సఖా! నీకు బ్రహ్మమును దానికి సాధనములునుజక్కఁగా దెలిసినవా! తెలియనియెడల మరల నుపదేశించెదను. దేహాత్మభ్రమాదిరూప మగు మోహము వీడినదా? తాపత్రయము వలనను జ్ఞానము లేమివలనను నీ మనస్సునఁబుట్టిన శోకము దూలినదా? నీవు దాంభికుఁడగువానికిని నాస్తికునకును మూర్ఖునకును వినవలెనని యిచ్ఛలేనివానికిని భక్తుఁడు గానివానికిని దుర్వినీతుఁ డగువానికిని, దీని నొసంగవలదు. ఈ చెప్పంబడిన దోషములు లేనివానికిని, బ్రాహ్మణులయెడ మంచివానికిని,దనయందుఁ బ్రీతి గలవానికిని, బరుల కుపకరించు వానికిని జెప్పవలయును. శూద్రుఁడు గాని స్త్రీగాని శ్రద్ధ గలిగియున్నయెడ వారికిని జెప్పవచ్చును. తెలియఁగోరినవానికి దీనిని తెలిసిన పిదప నిఁకఁ దెలియవలసిన దొక్కటియుఁ గలుగదు. తియ్యని యమృతమును గ్రోలినపిదపఁ ద్రాగవలసినది మఱేమియుఁ గలుగదుగదా. (ఆత్మోపాసన రూపంబగు) జ్ఞానమందును గర్మమందును యోగమందును గృషియందును (సామాద్యుపాయరూపమగు) దండ ధారణమందును ధర్మార్థకామమోక్షము లని నాలుగువిధము లయినపురుషార్థము లెంతయున్నదో * యంత

* జ్ఞానమందు మోక్షమును, కర్మమందు ధర్మమును యోగమం దణిమాదిరూపమయిన కామమును, కృషియందును దండ ధారణమందును అర్థము

యు నాయనా! నీవంటి భక్తునికి నేనేయగుదును. ఇట్లను గ్రహింపఁగోరుచున్న నాకునట్టివాఁడు దనయాత్మను సమర్పించుకొనిదానిని రక్షించుభారము నాయందిడి నాకారాధనములు గాని కర్మములనెల్లఁ ద్యజించినవాఁ డగుచున్నాడు. అపుడు నాచేత ముక్తినిబొంది తనకు స్వభావసిద్ధములయిన యపహాతపాప్మత్వాదులు పొడసూపుటకుఁ బాత్రుఁ డగు చున్నాఁడు; మఱి మత్సాధర్మ్యమును బొందుచున్నాఁడు' అనెను.

శ్రీ శుకులు—భగవంతుఁ డిట్లు న్యాసోపాసనరూప మగు జ్ఞానయోగ మార్గమును జూపఁగా నుద్ధవుఁ డా యుత్తమశ్లోకునివచనమునువిని చేతులు మోడ్చి యానందాశ్రువులచే డగ్గుత్తికవడి కన్నీరు కన్నుంగవను గ్రమ్ముచుండఁగా నొక్కటియుఁ బలుకకుండెను. రాజా! అంత నతఁడు ప్రణయము చేతఁ గలంగిన మనస్సు మెల్లగా ధైర్యముచేతఁ గుదురుపఱచి వశము చేసికొని తన్నుఁ గృతకృత్యునిఁగాఁ దలంచుచుఁ దన శిరముచేత యదుప్రవీరుఁడయిన యాకృష్ణు పాదారవిందములను ముట్టుచు 'బ్రహ్మజనకా! న న్నాశ్రయించినమోహా మనెడి మహాంధకారము నీసన్నిధానమువలనఁ దఱుమఁగొట్టఁబడినది. సూర్యుని సమీపమును బొందినవారికి శీతముగాని చీఁకటిగాని దానివలన భయముగాని కలుగునా? నీ సన్నిధానమాత్రము చేతనే యా చీఁకటి తొలఁగింపఁబడినను నీ వనుగ్రహించి విజ్ఞానమనెడు దీపమును నీ భృత్యుండనగు నాకర్పించితివి. ఇట్లుపకరించుచున్న వాఁడవని నిన్నుఁ దెలిసినపురుషుఁ డెవఁడు నీ పాద

---

నున్నవి. ఈ చతుర్విధపురుషార్థములు భక్తునకు భగవంతుఁడే యని భావము.

మూలమునువిడిచి మఱియొకరిని శరణుఁజొచ్చును? దాశార్హు లందును వృష్ణులందునునంధకులందును సాత్త్వతులందునుసంసారము వృద్ధినొందుటకై నీవు నీ మాయచేత మిక్కిలి దృఢమైన స్నేహపాశమును వైచితివి. ఆ పాశమును నీవే యాత్మజ్ఞానమనెడి కత్తిచేతఁ ద్రుంచితివి. మహాయోగీ! నీకు నమస్కారమగుఁగాక, నిన్ను శరణుఁజొచ్చితిని. నీ చరణారవిందమునందు నా కనురాగమయ మైనభక్తి యెప్పుడు నెడ తెగకుండునట్లుగా ననుగ్రహింపుఁ' డనెను.

శ్రీ భగవంతుఁడు—— ఉద్ధవా! నే నాజ్ఞాపించినట్లు నా యాశ్రమంబగు బదరికావనమునకుఁ బొమ్ము. అచ్చట నాపాద తీర్థమయిన గంగయందలి జలములందు స్నానముచేసి యాచమించి శుచివై యా గంగదర్శనముచేత సమస్తమయినకల్మషములను బాఱఁజిమ్మి వల్కలములనుదాల్చి వనమునం బుట్టు కందమూలఫలాదు లనుభవించుచు నాత్మానుభవసుఖముచేత విషయాభిలాష మాని ద్వంద్వమాత్రము లగు శీతోష్ణాదులను సయించుచు నార్జవము మొదలయిన స్వభావముతోఁ గూడి బాహ్యము లగు నింద్రియముల నడంచి యంతరింద్రియములను గూడ గెలిచి తత్త్వత్రయస్వరూపవివేచనరూప మగు విజ్ఞానమును బ్రహ్మోపాసనరూప మగువిజ్ఞానమును బుద్ధి సమాధానముచేతఁ బడసినవాఁడై నేను నీకు వేఱు వేఱ స్పష్టముగా బోధించినదానిని మనస్సునందు దృఢముగా నెలకొలుపుచు నా యందు వాక్కును నిలిపి (నా గుణనామములను వాక్కుచేఁ గీర్తించుచు) మనస్సునునిలిపి కాయముచేత నన్నారాధిం

చుచు నుండి ప్రారబ్ధము ముగియఁగా * సాత్త్విక రాజస తామసము లనెడి మూఁడుగతులను గడచి 'యీ ప్రకృతిమండలమున కవ్వల నున్నవాఁడును నిత్య ముక్తులచేత ననుభవింపఁబడుచున్నవాఁడు నగు నన్నుఁ బొందఁగలవు' అనెను. సంసారబుద్ధినెల్ల హరించునట్టి యాభగవంతుఁ డిట్లు చెప్పఁగా నుద్ధవుఁడతనికిఁ బ్రదక్షిణముగావించి పాదములయందు శిరసిడి ప్రియ సంయోగవియోగములకు హర్ష శోకములు రెండును లేకుండువాఁడయ్యును నాహరిని విడిచిపోవునపు డాభగవంతుని యందు మిక్కుటమైన రాగమువలన హృదయము కరంగఁగా నశ్రుబిందువులు దొరఁగినవాఁ డయ్యెను. భగవంతుని యందలి స్నేహమును దిగవిడుచుట మిక్కిలియుఁ గష్టమైనది. అట్టి హరి నెడఁబాయఁగలుగుటకు భయపడి దీనుఁడై యతనిని విడనాడి పోవఁ నాల్లాడక మిక్కిలి సంకటమునొందెను. అంత నతఁడు భర్త పాదుకలను మాటి మాటికి శిరమునందుఁ దాల్చుచు నమస్కరించి వెడలిపోయెను. ఆమహాభాగవతుఁ డుద్ధవుఁడంత నా భగవంతుని హృదయమందు ధ్యానముచేత నెలకొల్పి యా జగదేకబంధుఁ డానతిచ్చినప్రకారము బదర్యాశ్రమమునకుఁ బోయి యచ్చట నా కరుణాసముద్రుఁడు తన కుపదేశించిన ప్రకారము తపస్సును సలిపి హరిగతిని బొందువాఁడయ్యెను. యోగీశ్వరు లెవ్వనిపాదములను సేవింతురో యా భగవంతుఁడుహరి నిరతిశయానందమగు పరబ్రహ్మస్వరూపమును దెలుపు వేదాంతసముద్రము నుండి యెత్తినదియు భాగవతుం డగు నుద్ధవునకుఁ జెప్పినదియు నైన యీ

* 'ఊర్ధ్వంగచ్ఛన్తి సత్త్వస్థాః' ఇత్యాదు లిట యనుసంధించునది.

భాషితమునునాజ్ఞానమనెడియమృతము వర్షించుదానిని, బురుషుఁడెవ్వఁడు సేవించుచుండునో యట్టి వానినిసంబంధించినజగత్తు కూడవిముక్తినొందును. ఇఁకనతఁడు విముక్తుడగుట చెప్ప నేలని? తుపిరిచేతసకలనిగమములును వెలిపుచ్చినభగవంతుఁడుజ్ఞానవిజ్ఞానసారమునున మృతతుల్యమునగు వేదసారమును వేదాంతసముద్రమునుండి యెత్తి తనభృత్యవర్గమునుద్రావించిన వాఁడయ్యె; అట్టి యాద్యుండును విష్ణుసంజ్ఞుండునగుపరమపురుషునికిమ్రొక్కనవాఁడ నయ్యెదను. ఇది యిరువదితొమ్మిదవయధ్యాయము.

---

(బ్రాహ్మణశాపమువలన యదువులుపరస్పరము కలహించి నాశమునొందుట. బలరామనిర్యాణము.)

పరీక్షిత్తు—అంత మహాభాగవతుండయిన యుద్ధవుఁడు బదరికావనమునకు వెడలిపోయినపిదప భూతభావనుఁడయిన భగవంతుఁడు హరి ద్వారకయందేమి గావించెను? ఆయాదవసింహుఁడు బ్రాహ్మణశాపముచేతఁ దనకులము కీడ్పడినపుడు సమస్తేంద్రియములకును మిక్కిలిప్రియమైనతనదేహము నిందే విడిచెనా? లేక కూడఁ దీసికొనిపోయెనా? పూఁబోండ్లెవ్వని దేహమునందుఁ దగిలిన చూపులను మరలఁ దివిచికొనఁజాలరయిరో, యెవ్వనిరూపము వినికిచేతఁ గర్ణరంధ్రములందుఁ జొచ్చి సత్పురుషుల హృదయములందుఁ జిత్తరువు వ్రాసినట్లు నిలిచి యందుండి వెలువడిపోవకుండునో యెవ్వని దేహకాంతి కీర్తించుచుండుట కవులవాక్కుల కింపు గూర్చుచుండునో, దేనిని యుద్ధమునం దర్జునిరథమునం దుండఁగా జూచి హతులైనవారు దానిసామ్యమును బొందిరో యట్టిదేహము నేమి చేసెను? అని యడిగెను.

శ్రీశుకుఁడు—కృష్ణుఁడు భూమియందును దివియందును నంతరిక్షమునందును బొడసూపినట్టి పెద్ద యుత్పాతములను జూచి యప్పుడు సుధర్మాసభయం దాసీనులై యున్న యదువులతో 'యదునందనులారా! మన ద్వారకయం దివిగో ఘోరము లయిన మహోత్పాతములు పెక్కు కనఁబడుచున్నవి. ఇవి నాశహేతువులయినవి. ఇం దిఁక ముహూర్తమునే పయి నను మన ముండరాదు. మనస్త్రీలును బాలురును వృద్ధులును నిచటనుండి కదలి శంఖోద్ధారమునకుఁ బోదురుగాక. మనము ప్రభాసమునకుఁ బోవుదము. అందుఁ బ్రత్యగ్వాహినియైన సరస్వతి సముద్రమును బ్రవేశించుచున్నది. మన మందు స్నానము చేసి శుచులమై యుపవసించి మిక్కిలి సమాహితులమై దేవతలను నభిషేచనముల చేతను జందన చర్చలచేతను బూజోపకరణములగు కుసుమాక్షతాదులచేతను బూజింతము. మహాభాగులయిన బ్రాహ్మణులను, మనము గోవులను భూములను బంగారములను వస్త్రములను, గజములను నశ్వములను రథములను గృహములను నొసంగి పూజించి వారిచేత శాంతి కర్మము చేయించుకొందము. ఈవిధియె యరిష్టములనెల్లఁ బోఁగొట్టునది; మఱి యుత్తమంబగు మంగళకరము. దేవతలను బ్రాహ్మణుల గోవులను బూజించుట యారాధించువారికి మిక్కిలి యభ్యుదయకరము' అనెను.

శ్రీ శుకులు—ఇట్లు కృష్ణుండు చెప్పినదానిని యదువృద్ధులందఱును విని యట్లె యని యియ్యకొని యోడలచే సముద్రమును దాఁటి రథము లెక్కి ప్రభాసతీర్థమునకుఁ బోయిరి. అచ్చట యాదవులు భగవంతుఁ డానతిచ్చినట్లు పరమంబగు

భక్తితోడ సమస్తములయిన శ్రేయములతోడ గూడిన కర్మములను మఱియు భగవంతుఁడు చెప్పని శ్రేయములతోడఁ గూడిన వానిని గావించిరి. అంతవారచ్చట దైవముచేత బుద్ధులు దూలినవారగుటచేత మిక్కిలి చవిగలైన మైరేయకమను మద్యమును ద్రావిరి. ఆరసములను ద్రాఁగఁగా మతియంతయుఁ దూలిపోవుచున్నది. వారు వీరలయినను భగవంతుఁడగు కృష్ణుని మాయచేత మూఢులగుటవలన మిక్కిలి మద్యపానముచేసి మత్తులై మనస్సులందు విజ్రుంభీఁగుటచే వారికి నడుమఁ బెద్దకలహముపుట్టెను. పిదప వారు సముద్రతీరమునం దొకరి నొకరు చంపఁబూని కోపముచేత సంరంభించి విండ్లను గత్తులను బల్లెములను గుదియలను దోమరములను బుష్టులను గొని యుద్ధముచేసిరి. వారు పతాక లల్లలాడుచుండురథములను నేనుంగులను గాడిదలను లొట్టియలను నెద్దులను బత్తైలను మనుష్యులను గఁచరగాడిదలను గూడి యొండొరులపయిని దలపడి యేనుఁగులు దంతములచేత నడవిని బాఁడుచేయునట్లు, బాణములచేత మిక్కిలియు మదించియున్నవారిని వధించిరి. ప్రద్యుమ్నుఁడును సాంబుఁడును అక్రూరుఁడును భోజుఁడును అనిరుద్ధుఁడును సాత్యకియును సుభద్రుఁడు సంగ్రామజిత్తును సుచారుఁడును గదుఁడును సుమిత్రుఁడును సురథుఁడును మచ్చరము పెచ్చుపెరిఁగి యొకరి నొకరు తలపడిరి. మఱి తక్కినవారగు నిశఠుఁడు నుల్ముకుఁడు మొదలగువారును సహస్రజిత్తు శతజిత్తు భానుఁడు మొదలగువారును కృష్ణునిచేత మిక్కిలియు మోహితులగుటవలన మదమనుచీఁకటి క్రమ్మఁగా నొకరినొకరు మార్కొని హతులం గావించిరి. దాశార్హులును

వృష్ణులును నంధకులునుభోజులును సాత్త్వతులునుమధువులును అర్బుదులును మాధురులును,శూరసేనులును,వితర్జనులును, కుకురులును, కుంతులును మంచిమనస్సువిడిచి యొకరినొకరు కొట్టుకొని కూలిరి. పుత్రులును దండ్రులును నన్నదమ్ములును మేనల్లుండ్లును గూంతుల కొడుకులును బిన్నతండ్రులును మేనమామలును నొకరినొకరు చంపిరి. ఇట్లు * మిత్రులతోడ మిత్రులును సుహృదులతోడ సుహృదులును జ్ఞాతులతోడ జ్ఞాతులును మూఢులై తలపడిచంపిరి,బాణములన్నియుందఱిఁగి, విండ్లన్నియు విఱిగి, యాయుధములెల్ల వ్యయమైనపిదప వారు పిడికిళ్లయం దచ్చట నున్న యేరకలను బెఱికి కొట్టసాగిరి. అవి వారి పిడికిళ్లయందుఁ బట్టుకొనఁగా, వజ్రములవంటి పరిఘములాయెను. కృష్ణుఁడు వలదని యెంతవారించుచున్నను వారు వినక యొకరినొకరే కాక కృష్ణునిఁగూడఁ గొట్టసాగిరి. వారా కృష్ణుని బలభద్రునిని దెలివిదూలి శత్రులుగాఁదలఁచుచు వారిని గొట్ట నిశ్చయించి యాతతాయులై వారిపయినిఁబడిరి. అంత నాయిద్దఱును మిక్కిలి క్రుద్ధులై పరిఘములుగానున్న యేరకల పిడికిళ్లను నెత్తికొని తిరుగుచు యుద్ధమున వారిని జంపిరి. కృష్ణునిమాయచేత మనస్సు మోహితములై దానిచేత బ్రాహ్మణశాపమునఁ గీడ్పడియున్నవారుగాన వారికి మచ్చరమువలనఁ గ్రోధముపుట్టి, వెదుళ్ల యొరయికవలనఁ బుట్టిననిప్పు వనమునంతయు దహించునట్లు, కులక్షయమును బొందించెను. ఇట్లు తనకులమువా రందఱును నశింపఁగా హరి తా నొక్కఁడు

---

* మిత్రులనఁగా సమానవయస్సును బట్టి పరస్పరహితము గోరువారు. సుహృదులనఁగా వయస్సు సమానముగాకున్నను నట్లు హితముఁగోరువారు.

మాత్రము మిగిలి యుండి భూమి భారమును దింపినదైనదని తలంచెను. రాముఁడు సముద్రతీరమందుఁ బరమపురుష ధ్యానరూప మగు యోగమును నూఁది తన స్వరూపమగు సంకర్షణుని యందుఁ దనసంకర్షణాంశము నొక్కటిగాఁ గూడినట్లు ధ్యానించి మనుష్యరూపమును బరిత్యజించెను. దేవకీసుతుఁడు భగవంతుఁడు రాముని నిర్యాణమును దెలిసి యంత భూతలమున నొక మఱ్ఱిచెట్టుక్రింద మౌనియై కూర్చుండెను. అప్పు డతఁడు చతుర్భుజములు గల రూపమును దాల్చెను. ఆరూపము ధగధగ మెఱయుచున్న తన ప్రభచేతఁ బొగలేని యగ్నివలె దిక్కుల చీఁకట్ల నెల్లఁ బాపుచు వెలుంగుచుండెను; శ్రీవత్సమను మచ్చగలిగి మేఘమువలె నల్లనై మేలి యపరంజి కాంతిని దులఁకించు పట్టుపుట్టములు రెండు దొడిగి మిక్కిలియు మంగళమై ప్రకాశించుచుండెను. మఱియు నది సొగసైచిఱునవ్వుగులుకు ముఖారవిందము గలిగి నల్లని ముంగురులచే నలంకృతమై తెల్లతామరలవలెఁ జెలువయిన కన్నులతోను నల్లలాడుచున్న మకరకుండలములతోను గండరించుచుండెను. అది మొలనూలును జందెమును గిరీటమును గడియములును బాహుపురులును హారనూపురములును నంగుళీయకములును గౌస్తుభమును గలిగి వెలుఁగుచుండెను. అతని దేహమందు వనమాలిక వెలయుచుండెను. ఆయుధము లెల్లఁ దమ తమమూర్తులు ధరించి యాతనిని బలసియుండెను. అతఁడు తామరవలె నెఱ్ఱనయిన డా కాలిని గుడితొడపయి నిడికొని కూర్చుండియుండెను. అప్పుడు జర యనెడి యొక వేఁటకాఁడు ముసలమందు మిగిలిన యినుపదునియలతో నొక బాణమును

గావించుకొని యాకృష్ణుని చరణము మృగమువలెఁ దోఁచినం దున మృగమని శంకించి యాబాణమును గాఁడనేసెను. అంత వాఁడు దగ్గఱి చతుర్భుజములతోఁ గూడి యున్న యాపురుషునిఁ జూచి యతని యెడ నాకిల్బిషము చేసినందులకు భయపడి యామురాంతకుని పాదములయందుఁ దలసోఁక వ్రాలి 'మధుసూదనా! పాపాత్ముఁ డగు నేను దెలియక యిట్లుచేసితిని. ఉత్తమశ్లోకా ! అనఘా ! కాఁబట్టి నాపాపమును క్షమింపఁ దగును. ఎవ్వని యనుస్మరణము పురుషుల కజ్ఞానమనెడి చీఁకటిని బోఁగొట్టు నందురో యట్టి విష్ణుం డగు నీకుఁ బ్రభూ! నే నీయపరాధము గావించితిని. కాఁబట్టి పాపాత్ముండయిన యీమృగముల వేఁటకానిని, వైకుంఠా! మరల నిట్లు సజ్జనులకుఁ దప్పుగావింపకుండునట్లుగా వేవేగ చంపి పుచ్చుము. బ్రహ్మ రుద్రాదులును బ్రహ్మపుత్త్రులును వేదార్థములను గనుఁగొనువారును నీయాత్మసంకల్పముచేతఁ బరిగ్రహించిన యీరూపమును, నీయవతార రహస్యమును దెలియరు. ఏలనఁగా వారు నీమాయచేతఁ గన్నులు గప్పంబడి యుందురు. అట్టి వారికిని దెలియరాకున్న యీ నీరూపరహస్యమును నసద్గతులగు మే మెట్లు వర్ణింపఁగలము' అనెను.

భగవంతుఁడు—'జరా ! భయపడకుము, లెమ్ము. ఇవి నా యిచ్ఛచేతనే కలిగినది చుమీ. నీవు నాయనుజ్ఞచేత సుకృతాత్ములపదవియగు స్వర్గమును బొందు'మనెను. ఇట్లు కర్మము చేతఁగాక తన యిచ్ఛచేత శరీరమును దాల్చిన యాభగవంతుఁడు కృష్ణుఁ డానతియ్యఁగా, నతనికి ముమ్మాఱు ప్రదక్షిణముచేసి దేవతలు పంపిన విమానమెక్కి దేవలోకమునకుఁ

బోయెను. దారుకుఁడును గృష్ణుఁ డున్నచోటును వెదకుచు వచ్చితులసివాఁడు వాసనలతోఁ గూడియున్న వాయువును మూర్కొనియతఁ డది వచ్చినచోట నుండునని యాలోచించి గాలి కభిముఖముగాఁ బోయెను అట్లుపోయి యచ్చట నతిశయించిన కాంతితోఁ గూడి మూర్తులు ధరించిన యాయుధములు బలసి యుండ మఱ్ఱిచెట్టుక్రింద వసతిఁగొని యున్న పతిని జూచి రథమునుండి గొబ్బునఁ గ్రిందికి దూకి మనస్సునందు నెయ్యము పొంగారఁ గన్నులయందు బాష్పములు గ్రమ్మ నతని యడుగులపయినిబడెను. అట్లు పడి యతనితో 'ప్రభూ ! నీచరణారవిందములను జూడలే కుండినందున నాచూపు చెడి చీఁకటియందుఁ బడినది. కాఁబట్టి రాత్రియందుఁ జంద్రుఁడు మఱుఁగు వడఁగా నెట్లో యట్లు నాకు దిక్కులు తెలియకున్నవి. నా మనస్సునఁ గూఱటగలుగకున్నది' యనెను. ఇట్లాసారథి పలుకుచుండఁగా గరుడధ్వజము గల యారథమును రాజేంద్రా ! దారుకుడు చూచుచుండఁగానే, యశ్వములతోను ధ్వజముతోను నాకాశమున కెగసెను. దాని వెంట విష్ణుదేవుని యస్త్రములును నాయుధములును బోయెను. అందులకు మనస్సునందు మిక్కిలి యాశ్చర్యపడిన యా దారుకునితో జనార్దనుఁ డిట్లనియె— 'సూతా! నీవు ద్వారకకుఁ బొమ్ము. పోయి జ్ఞాతులు పరస్పరము వధించుకొనుటయు బలరాముని నిర్యాణమును నాస్థితిని బంధువులకుఁ జెప్పుము. ద్వారకయందు మీకును మీబంధువులు నిఁక నెంత మాత్రము నిలిచి యుండఁ గూడదు. ఆపురమును నేను విడిచిన పిదప సముద్రము ముంచివైవఁగలదు. మీరు మీ మీ దేహానుబంధులనును మా

తలి దండ్రులగు దేవకీవసుదేవులను నెల్లవారిని బిలుచుకొని యర్జునుఁడు కాపుదలయై వచ్చుచుండఁగా నింద్రప్రస్థమునకుఁ బొండు. నీవు భాగవతధర్మము ననుష్ఠించి మద్భక్తియోగమందు నిష్ఠగలిగి శబ్దాది విషయముల నుపేక్షించి యీజగత్తు నా మాయచేత రచింపఁబడిన దని యెఱింగి రాగాదులచేఁ గలుష మొందక (శాంతిని వహించి) యుండుము' అనెను. ఇట్లతఁడు చెప్పఁగా దారుకుఁ డతనిని వలగొని మాటి మాటికి నమస్కరించుచు నతని యడుగులు శిరసునందు మోపుకొనుచు మనంబున దుఃఖము మల్లడి గొనుచుండ ద్వారకాపురమునకుఁ బోయినవాఁ డయ్యెను. ఇది ముప్పదియవయధ్యాయము.

---

## (శ్రీకృష్ణ నిర్యాణము. వసుదేవాదులును బరలోకమున కేఁగుట.)

శ్రీశుకులు—అంత నక్కడికి బ్రహ్మయు శివుఁడును బార్వతియు నింద్రుఁడు మొదలగు దేవతలును మునులును మరీచి మొదలగు ప్రజాపతులును బితృదేవతలును సిద్ధులును గంధర్వులును విద్యాధరులును నురగులును జారణులును యక్షులును రక్షస్సులును గిన్నరులును నప్సరసలును గరుడులును భగవంతుని నిర్యాణమును జూడఁ గోరి మిక్కిలి కుతూహలముతో హరి కర్మములను జన్మమును బాడుచును గీర్తించుచును వచ్చిరి. వారు మిక్కుటమయిన భక్తిగలవారై తమ విమానములచే నాకాశమంతయు నెరసి పెరసి యుండఁ బుష్పవర్షములు గురిసిరి. భగవంతుఁడును దనకు విభూతులయిన యాబ్రహ్మాదులను జూచి తా నవతరించిన యాత్మయందుఁ దా నేకీభవించి నట్లుగా ధ్యానించి తామరరేకులవంటి కన్నుంగవను మొగి

డ్డెను. ఆదేవుఁడు ధారణాధ్యానములకు శుభాశ్రయభూత మును నిట నుపాసించి ముక్తులయిన వారికి మనోహరము నయిన తనదేహమును నాగ్నేయియగు యోగధారణచేత * ద హింపకయే యాదేహముతోనే తనధామమగు వైకుంఠమును సుఖముగాఁ బ్రవేశించినవాఁడయ్యెను. అపుడు దివియందు దుం దుభులు మ్రోఁగెను. ఆకాశమునుండి పువ్వులు గురిసెను. భూ మి నుండి సత్యమును ధర్మమును ధృతియుఁ గీర్తియు నాదేవు ని వెంటఁ బోయినవి. కృష్ణుఁ డట్లు తనగతి యెవ్వరికిని దెలియ కుండ, నిజధామమును బ్రవేశించుటను బ్రహ్మ మొదలగు దేవ తలు చూడనేరక మిక్కిలి యాశ్చర్యభరితులయిరి. మెఱపుఁ దీఁగ యాకాశమందు మేఘమండలమును విడిచి పోవునపుడు దానిగతి మనుష్యులకుఁ దెలియనట్లు కృష్ణునిగతియు దేవత లకుఁ దెలియరాదయ్యెను. బ్రహ్మరుద్రాదులుహరియోగగతిని జూచి మిక్కిలి విస్మితులై యతనిని బొగడుచుఁ దమ తమ నెలవులకుఁ బోయిరి. రాజా! పరమపురుషుఁడు యాదవాది దేహ ధారుల యందుఁ బుట్టుట మరణించుట యనెడి యీచేష్టలు నటునివేషములవలె వట్టి మాయావిడంబనమే యగు నని తెలి యుము. ఆపరమపురుషుఁడు చిదచిదాత్మకమయిన యీజగత్తు నుసృజించి దీనిలోపలఁ జొచ్చి వెలుపల నవతారములచే విహ రించి రెండు పరార్ధములు ముగిసినపుడు జగమునంతయు సం హరించి స్వానుభవవిషయ మగు మహిమచేత జగద్వ్యాపార

---

* స్వచ్ఛంద మృత్యువులగు యోగులు తమదేహము నాగ్నేయి యగు ధారణచేతదహించి లోకాంతరములు బొందుదురు. భగవంతుఁ డట్లుదహిం పకయే పొందెనని భావము[?]హ్యాము.

మును నుడిగి యూరకుండును. అట్టి యపారమహిమునికి నిది యెంత మాత్రము! ఈయవతారమందే యెవఁడు యమ లోకమునకుఁ బోయిన గురుపుత్రుని వాని మర్త్య దేహముతో నే మరలఁ దీసికొనివచ్చెనో యెవఁడునీతల్లికి శరణ్యుఁడై బ్రహ్మా స్త్రముచేత దగ్ధుఁడవగు నిన్ను (పరీక్షిత్తుని) రక్షించెనో,యె వఁడు మృత్యువునకు మృత్యువయిన రుద్రుని బాణాసురయుద్ధ మునందు జయించెనో, యెవఁడు వేఁటకానిని దేహముతోడనే స్వర్గమునకుఁ బంపెనో, యాభగవంతుఁడు తానెవరికిని దెలియ కుండఁబోవుటకుసమర్థుఁడు గాఁడా? ఈశ్వరుఁడు తా నశేషశక్తు లను ధరించినవాఁ డయ్యును, గావున నే జగమున కెల్ల జనస్థితి నాశములు మఱియొకరి నపేక్షింపక తానే చేయువాఁడయ్యును, దనదేహమునుమాత్ర మిచ్చట నే మిగిలియుండు నట్లు చేయ నొల్లఁడయ్యెను. ఏలన నాత్మస్వరూప మందు నెలకొని యుం డు యోగికి మరణశీలమైన శరీరముచేతఁ బురుషార్థమేమియులే దనియు నుత్పత్తి గలదాని కెల్లఁ గాలాంతరముననైన మృత్యు వుగలుగుననియు, గనుక దీనితోఁ బనియేమి యనియుఁ దెలుపు కొఱకే యతఁ డా దేహమును నిలుపక కొనిపోవుటకునిష్టపడెను. ఎవఁడు ప్రాతః కాలమున లేచి కృష్ణుఁడు పొందిన యుత్కృష్ట మైన యీ గతిని భక్తితోడఁ బ్రయతుఁడై కీర్తించునో వాఁడాతనియుత్తమగతి యగు వైకుంఠమునేపొందుచున్నాఁ డు. దారుకుఁడు ద్వారకకుఁ బోయి వసుదేవుని పాదములను నుగ్రసేనుని పాదములను బడి కృష్ణు నెడఁబాసినందునకు పై పక యశ్రువులచేఁ దడిపెను. రాజా! అతఁడు వృష్ణులెల్లనుఁ బూర్ణముగా హతులగుటను జెప్పెను. అది విని యక్కడ

నున్న వారందఱును హృదయములు భయమొంద శోకంబున మూర్ఛితులైరి. అంత వారు కృష్ణవియోగమునకు విర విరఁ బోవుచు, జ్ఞాతులు మొగముల నిటునటు గొట్టుకొనుచుఁ బ్రాణములు వీడి పడి యున్న చోటికిఁ ద్వరితముగాఁ బోయిరి. దేవకియు రోహిణియు వసుదేవుఁడును గృష్ణునిని రామునిని జూడ లేక శోకార్తులై తెలివిదప్పి యాభగవంతునితోడివిరహమునకు సైఁపక ప్రాణములను దిగవిడిచిరి. ఆయాస్త్రీలు తమతమపతుల దేహములను గౌఁగిలించుకొని చితనారోహించిరి. రామునిపత్నులతని దేహమును గౌఁగిలించికొని యగ్నిఁ జొచ్చిరి. వసుదేవుని పత్నులతని దేహమును గౌఁగిలించియుఁ బ్రద్యుమ్నాదులను వారివారి పత్నులు గౌఁగిలించుకొనియు నగ్నిఁ జొచ్చిరి. కృష్ణపత్నులు రుక్మిణి మొదలగు వారు మనస్సులతనియందే నిలిపి యగ్నినిజొచ్చిరి. అర్జునుఁడు తనకనుఁగుచెలికాఁడయిన కృష్ణుని విరహమునకు దుఃఖితుఁడై కృష్ణగీతములచేతను సజ్జనులగు లితకుల యాఁటమాటలచేతను దన్నూరార్చు కొన్నవాఁడయ్యెను. అర్జునుఁడు సంతానములేక నశించిన యా బాధువులకు విధ్యుక్తముగా వరుసచొప్పున పిండోదకదానాదికర్మములు చేయించెను. హరి దిగవిడువగానే ద్వారకను సముద్రముక్షణమాత్రమున ముంచివైచెను. అయినను నది శ్రీమంతమగుభగవంతుని గృహమునుమాత్రము విడిచిపెట్టెను. అచ్చట భగవంతుఁడు మధుసూదనుఁడు నిత్యమును స్మరించిన మాత్రమున సమస్తములైన యశుభములను నపహరించుచుసన్నిహితుఁడై యుండును. కాన యది సమస్తమంగళములయందును మంగళమై యొప్పుచుండును. అర్జునుఁడు బాలికలును వృద్ధులు నగు

స్త్రీలును నందఱును జావఁగా మిగిలిన వారిని దోడుకొని యింద్రప్రస్థమును బ్రవేశించి యందు (భగవత్సంకల్పము చేత నశింపక మిగిలియున్న) వజ్రుడను వానిని నభిషేకము చేసెను. రాజా! నీ పితామహులయిన ధర్మరాజాదులు బంధువు లెల్ల హతులగుట నర్జునునివలన విని నిన్ను వంశోద్ధారకునిఁగా నిలిపి యందఱును మహాప్రస్థానమునకు బోయిరి. దేవదేవుఁడయిన విష్ణుని యీ కర్మములును జన్మమును మనుష్యుఁడెవ్వఁడు శ్రద్ధతోడఁ గీర్తించుచుండునో వాఁడు సర్వపాపములనుండి విడివడుచున్నాఁడు. ఇట్లు భగవంతుఁడగు హరి యెత్తిన మనోహరములయిన యవతారములను నతని వీర్యములు దెలుపు చేష్టితములను బాల్యపౌగండ యౌవనచరిత్రములను నితర పురాణములందును నీ పురాణమందును విన్నవానిని మిక్కిలి మంగళావహము లగువానిని మనుష్యుఁడు కీర్తించుచుఁ బరమ హంసులకు గతి యగు భగవంతునియందుఁ బరంబయిన భక్తిని బొందుచున్నాఁడు. ఇది ముప్పదియొకండవ యధ్యాయము.

శ్రీ మహాభాగవతమున నేకాదశస్కంధము

సమాప్తము.

శ్రీ రామచంద్రార్పణమస్తు.

శ్రీరుక్మిణీ సత్యభామాసమేత శ్రీగోపాలకృష్ణ పరబ్రహ్మణేనమః.



శ్రీ శుభమస్తు.
శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః.

# శ్రీమద్భాగవతము.

## ద్వాదశస్కంధము.

---

పరీక్షిత్తు— మునీ! యదువంశ భూషణుఁడయిన కృష్ణుఁడు తన ధామమునకు వేంచేసిన పిదప భూమియందుఁ జెప్పఁబడిన యదువంశమువారిలోను జంద్రవంశమువారిలోను నెవ్వని వంశము పరంపరగాఁ బ్రవర్తించెనో నాకు వివరింపు' మని యడిగెను.

శ్రీశుకులు— రాజా! మగధరాజగు బృహద్రథుని వంశమందు మార్జారి యనువాని కడపటికొడుకు పురంజయుఁడను వాఁడు పుట్టఁగలఁడు. వాని మంత్రి శునకుఁ డనువాఁడు తన స్వామిని వధించి యతని పుత్త్రుఁడగు ప్రద్యోతనుని రాజుగాఁ జేయఁగలఁడు. అతనికి నలకుఁడును నలకునకు విశాఖపుత్త్రుఁడును విశాఖపుత్త్రునకు రాజకుఁడును రాజకునకు నందివర్ధనుఁడును బుట్టుదురు. ఆనందివర్ధనునకుఁ బ్రద్యోతనులను రాజులయిదుగురు పుట్టుదురు. ఈ రాజులందఱును భూమిని నూటముప్పది యెనిమిది సంవత్సరము లనుభవింతురు. ఆ ప్రద్యోతనులకు శిశునాగుఁడును నతనికిఁ గాకవర్ణుఁడును నతనికి క్షేమధర్ముఁడును నతనికి క్షేత్రజ్ఞుఁడును క్షేత్రజ్ఞు

నకు విధిసారుఁడును విధిసారునకు నజాతశత్రుండును నజాతశత్రునకు దర్భకుండును దర్భకునకు నజయుఁడును ఆనజయునకు నందివర్ధనుఁడును, నందివర్ధనునకు మహానందియుఁబుట్టుదురు. ఈశిశునాగులు మొదలగు రాజులు కలియుగమందు మున్నూటడెబ్బదియేండ్లు భూమిని ననుభవింతురు. రాజా! మహానందికి శూద్ర స్త్రీ గర్భమందు బలవంతుఁడగు మహాపద్మపతి యను పుత్త్రుఁడు పుట్టును. వాఁడే నంద డనఁబడును. వాఁడు క్షత్రియులనెల్ల నాశముచేయును. ఆనందునివలననుండి శూద్ర ప్రాయులును న ధార్మికులు నగు రాజులు పుట్టఁగలరు. ఆమహాపద్ముఁడును తన యాజ్ఞ యప్రతిహతముగా భూమినంతయు రెండవ పరశురామునివలె నేకచ్ఛత్త్రముగాఁ బాలింపఁ గలఁడు. అతనికి సుమాల్యుఁడు మొదలయిన పుత్త్రు లెనమండ్రుపుట్టఁగలరు. ఆ రాజు లీ భూమిని నూఱుసంవత్సరములు పరిపాలింపఁగలరు. ఒకానొక బ్రాహ్మణుఁడు (కౌటిల్యవాత్స్యాయనుఁ డను వాఁడు) తన్నీ*తొమ్మండ్రు నందులును నమ్మియుండఁగా వారిని నాశము చేయఁగలఁడు. అట్లానందులు లేకపోవఁగా మౌర్యులు కలియుగమునందు భూమిని ననుభవింపఁగలరు. ఆతొమ్మండ్రను నాశము చేసిన ద్విజుఁడే మౌర్యుఁ డను పేరుగల తన పుత్త్రునిఁ జంద్రగుప్తుని రాజ్యమున కభిషేకము సేయును. ఆ చంద్రగుప్తునికి వారిసారుఁడును వారిసారునకు నశోకవర్ధనుఁడును అశోకవర్ధనునకు సుయశుఁడును సుయశునకును సంగతుఁడును సంగతునకు శాలిశుకుండును శాలిశుకునకు సోమశర్ముఁడును

* తండ్రియగు నందుఁడును నతనిపుత్త్రు లెనమండ్రును జేరి తొమ్మండ్రు నందు లనఁబడిరి.

సోమశర్మునకు శతధన్వుఁడును శతధన్వునకు బృహద్రథుఁడును బుట్టిరి. ఈ మౌర్యరాజులు పదుగురును గలియుగమందు భూమిని నూటముప్పదియేడు సంవత్సరము లనుభవింపఁగలరు. ఆ బృహద్రథుని సేనాని యగు పుష్యమిత్రుఁడు స్వామినిజంపి రాజ్యము సేయఁగలఁడు. అతని కగ్నిమిత్రుఁడు నగ్నిమిత్రునకు సుజ్యేష్ఠుఁడును, సుజ్యేష్ఠునకు వసుమిత్రుఁడును, వసుమిత్రునకు భద్రకుఁడును, భద్రకునకుఁ బులిందుఁడును, బులిందునకు ఘోషుఁడును, ఘోషునకు వజ్రమిత్రుఁడును బుట్టఁగలరు. ఆ వజ్రమిత్రునకు భాగవతుఁడును, భాగవతునకు దేవభూతియును బుట్టుదురు. అగ్నిమిత్రాదులు తొమ్మండ్రును శుంగు లీపదుగురును నూటపండ్రెండేండ్లు భూమిని ననుభవింతురు. అంత నీ భూమి గుణహీనులయిన కాణ్వులను బొందఁగలదు. అంత శుంగుం డయిన దేవభూతి స్త్రీలోలుఁడై యుండఁగా నతనిమంత్రియును గాణ్వుఁ డగు వసుదేవుఁడనువాఁ డతనిని జంపి తానే రాజ్యమును జేయఁగలఁడు. అతని పుత్రుఁడు భూమిత్రుఁడు, భూమిత్రునకు నారాయణుఁడు పుట్టును, నారాయణునకు సుశర్ముఁడుపుట్టును. వసుదేవాదులయిన యీ కాణ్వులు మున్నూటనలువదియైదేండ్లు భూమిని గలియుగమం దనుభవింపఁగలరు. కణ్వుండగు సుశర్ముని వాని భృత్యుఁడగు బలీకుఁ డగువాఁడు చంపి భూమిని గొంతకాలమే యనుభవించును. అతఁ డాంధ్రజాతివాఁడు వాఁడు సత్తముఁడుగాఁడు వాని తమ్ముఁడగు కృష్ణుఁడు రాజు కాఁగలఁడు. వానికి శ్రీ శాంతకర్ణుఁడును, శాంతకర్ణునకు బౌర్ణమాసుఁడును, పౌర్ణమాసునకు లంబోదరుఁడును, లంబోదరునకును జివిలకుండును, జివిలకునకు

మేఘస్వాతియు, మేఘస్వాతికి నటమానుఁడును, అటమానునకు ననిష్టకర్ముఁడును, ననిష్టకర్మునకు హాలేయుఁడును, హాలేయునకుఁ దలకుఁడును తలకునకుఁబురుషభానుఁడును బురుషభానునకు సునందనుఁడును, సునందనునకుఁజకోరుఁడునుబుట్టుదురు. వారియందుఁగడపటివాఁడు శివస్వాతి. వానికి గోమతియు గోమతికిఁ బురీమంతుఁడును వానికి మేదశిరుండును మేదశిరునకు శివస్కంధుఁడును శివస్కంధునకు యజ్ఞశ్రీయును యజ్ఞశ్రీకి విజయుఁడును విజయునకు జంద్రవిజ్ఞుఁడును, చంద్రవిజ్ఞునకు సలోమధియును బుట్టుదురు. ఈ వలీకులను రాజు లిరువదియేగురును నన్నూటయెనుబదియాఱు సంవత్సరములు భూమిని ననుభవింతురు. అవభృత్యులనెడు తొమ్మండ్రాభీరజాతులు గలుగుదురు. పిదప గర్ధభు లనువారు పదుండ్రురాజులగుదురు. పిదపఁగాముకులగు కంకులను పది యాఱుగురు రాజులగుదురు. తరువాత యవను లెనమండ్రును దురుష్కులు పదునాలుగురును మురుండులు పదుముగ్గురును మానులు పదునొకండ్రును రాజు లగుదురు. వీరిలోఁ దప్పఁ దక్కిన రాజులును భూమిని వేయుం దొంబదితొమ్మిది సంవత్సరము లనుభవింతురు. పదునొకండ్రు మానులు మున్నూఱుసంవత్సరము లనుభవింతురు వారు మరణించిన పిదపఁ గిలింకిలయను పురమునందు భూతనందుఁడు యవంహారుఁడు శిశునందుఁడు వాని తమ్ముఁడు యశోనందియుఁ బ్రవీరకుఁడు ననెడి యీ రాజులు టయాఱుసంవత్సరము లుందురు, వారికిఁ బదుముప్పురుపుత్త్రులు బాహ్లికు లనువారు గలుగుదురు. పిదపఁ బుష్యమిత్త్రుఁడు రాజగును. వానికి దుర్మిత్త్రుఁడు పుట్టును. ఆంధ్రు లేడుగురును గోసలు లేడుగురును వైదూరపతులును

నిషధులును, ననువా రాయాపేరుగల చిన్నచిన్న మండలము లకు రాజులగుదురు. వీ రంద ఱించుమించుగా నేకకాలము వారు. వీ రందఱును బాహ్లికులవలననుండి పుట్టినవారు. అంత మగధరాజులలో విశ్వస్ఫూర్జియనువాఁడు పుట్టఁగలఁడు. వాఁడు పూర్వము చెప్పఁబడిన పురంజయునికంటెను మిక్కిలి ప్రసిద్ధుఁడు. వాఁడు బ్రాహ్మణాదివర్ణములను బులిందులు యదువులు మద్రకులనెడి మ్లేచ్ఛప్రాయులనుజేయఁగలఁడు. ఆ దుర్మతియిట్లు చేసి ప్రజలను ద్వైవర్ణ్య లంతగా లేకుండునట్లుగాఁ బాలింపఁగలఁడు. వాఁడు వీర్యవంతుఁడై క్షత్రకులమును నిర్మూలము గావించి పద్మవతియను పురమందుండి గంగాద్వారము మొదలుకొని ప్రయాగపర్యంతముగల భూమిని బాలించి యనుభవింపఁగలఁడు. పిదప సౌరాష్ట్రమందును నవంతియందు నాభీరదేశమందును నర్బుదమాలవములందును గల బ్రాహ్మణులు శూద్రప్రాయులై యుపనయనాది సంస్కారదూరులై యుందురు. సింధుతటమునుజంద్రభాగానదితీరమును గౌంతిదేశమును గాశ్మీరమండలమును నుపనయన సంస్కారములేని బ్రాహ్మణులు గలవారును బ్రహ్మవర్చసము లేనివారు నగు శూద్రులును మ్లేచ్ఛులును ననుభవింతురు. మ్లేచ్ఛప్రాయులయిన యీ రాజులందఱును సమకాలు లగుదురు. మఱి వీర ధర్మమందును ననృతమందును నిష్ఠగలిగి యల్పదాతలై తీవ్రకోపులై యుందురు. మఱి స్త్రీలను బాలురను గోవులను ద్విజులను జంపువారును బరదారధనములను గొనువారును క్షణమునఁ గోపమును క్షణమున సంతోషమును బొందువారును, నల్పబలులును, నల్పాయుష్కులును, గర్భాధానాది

సంస్కారశూన్యులును గ్రియాహీనులునురజస్సుచేతనుదమస్సు చేతను గప్పఁబడినవారలును నగుదురు. ఇట్లు రాజరూపముల నున్న మ్లేచ్ఛులు ప్రజలనుబట్టి పీడించుచుందురు. మ్లేచ్ఛులు నాథులగుటంబట్టి వారి దేశములందు వర్తించు ప్రజలుకూడ వారి శీలములను నాచారములును వాదములునే కలవారై రాజులచేతను దమచేతను దాము బీడితులై నాశము నొందు దురు. ఇది మొదటియధ్యాయము.

---

{శుకుఁడు పరీక్షిత్తునకుఁ గలియుగ ప్రాదుర్భావ లక్షణములను జెప్పుట.}

శ్రీశుకుఁడు—రాజా! అంత బలీయమగు కాలమునుబట్టి ప్రతిదినమును ధర్మమును సత్యమును శౌచమును క్షమయు దయయునునాయువును బలమును స్మృతియును నశింపగలవు. కలియుగమందు గొప్పకులమువానినిగాను నాచారవంతునిఁ గాను గుణవంతునిఁగాను జేయునదిధనమే కాని మఱియొకటి గాదు. ధర్మమును న్యాయమును దీర్చునది బలమేకాని వేఱొకటికాదు. స్త్రీపురుషులను నాలుమగలుగాఁ జేయునది వారి వారి రుచియె కాని యాభిజాత్యాదులుగావు. క్రయ విక్రయాదివ్యవహారములను జరుపునది వంచనమేకాని నిష్కా పట్యముగాదు. ఆఁడుది మగవాఁ డనుటకు లక్షణము రతి కౌశలమే కాని చీరలు ఱవికలు దోవతులు మొదలగు నాయావృత్తులు గావు. బ్రాహ్మణుఁడగుట వట్టి జందెముచేతనే కాని యుపనయనాదుల వలనఁగాదు. ఆశ్రమమును దెలు పునదియు నొక యాశ్రమమునుండి మఱియొక యాశ్రమ

మును బొందినదికాని యొకవర్ణమునుండి మఱియొక వర్ణము గయికొన్నదిగాని తెలుపునదియుదండము నజినము మొదలయిన వేషపుగుఱుతులే కాని దాని దాని యాచారవిశేషములు గావు. ఒకఁడు పట్టిన న్యాయము దుర్బలమగుటకు వాని దారిద్ర్యమె కారణము. పాండిత్యము గలదనుటకు మిక్కిలిమాట లాడుటయె కారణముగాని జ్ఞానము గాదు. నికృష్టుఁడగుట సంపద లేమిచేతనే కాని కులహీనత చేతఁగాదు. ఉత్కృష్టుఁడగుట దేహాలంకారాదిక మగు డంబముచేతనే కాని జాతిచేతఁగాదు. వివాహ మూరక స్వీకరించుటచేతనే కాని శాస్త్రీయవిధిచేతఁగాదు. స్నాన మొదలియందలి ముఱికిఁ బోఁగొట్టుకొనుటచేతనేకానిశుద్ధతీర్థములందు మునుఁగుటచేతఁ గాదు. దూరమం దుండునీటిపట్టెతీర్థముగాని గంగాదులు గాని గురువు మొదలగువారుగాని గారు. లావణ్యము వెండ్రుకలు పెంచుకొనుటచేతనే కాని శాస్త్రవిహితమగు క్షౌరము చేతఁగాదు ఉదర భరణమె సమస్తమయిన పురుషార్థము. సత్యము పలుకువాఁడగుట దిట్టతనముచేతనేకాని యబద్ధమాడకుండుట చేతఁగాదు. సామర్థ్యము కుటుంబమును భరించుటయెకాని ధర్మాది పురుషార్థములను గడించుటగాదు. ధర్మ మాచరించుట యశస్సు కొఱకే కాని పరలోకమునకుఁగాదు. ఇట్లు భూమండలమందు దుష్టులయిన ప్రజలు వ్యాపించియుండఁగా బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రులం దెవఁడు బలవంతుఁడో వాఁడే రాజగును. లుబ్ధులును దయమాలినవారలును దస్యుధర్మములు గలవారును నగురాజులచేత దారములను ధనములను గోలుపోయి ప్రజలు పర్వతములకు నరణ్యములకుఁ

బాఱిపోవఁగలరు. కాయగూరలు వేళ్లు మాంసము మధువు పువ్వులు పండ్లు విత్తులును భుజించుచు నాఁకలి దప్పులచేతను వ్యాధులచేతను సంతాపముచేతను జింతచేతను పీడితులగుచుందురు. కలియుగమందు మిక్కిలి యెక్కుడయిన యాయువు ముప్పది లేక యిరువది సంవత్సరములుగా నుండును. కలిదోషమువలన దేహులకు దేహములు క్షీణించుచుండును. వర్ణాశ్రమాచారముల కర్తలయిన వారి వేదమార్గమును వానియందుఁ జెప్పబడిన ధర్మములును నశించుచుండును. ధర్మములు పాషండమతములు మిక్కిలి గలిగియుండును. రాజులు చోరప్రాయులుగా నుందురు. మనుష్యులు చౌర్యము కల్లలు వట్టిహింస మొదలగు నానా వృత్తులు గలిగియుందురు. వర్ణములెల్ల శూద్ర ప్రాయములుగా నుండును. ధేనువులు మేఁకలవలె నుండును. ఆశ్రమములు గృహములవలె మైథునాదులతోఁ గూడియుండును. యోని సంబంధమును బట్టి చుట్టములయిన వారే ముఖ్యముగా బంధువులగుదురు. ధాన్యము లణువులవలె నతిసూక్ష్మములుగా నుండును. వృక్షములు కొలఁదియందు నీడయందును ఫలములందును జమ్మివలెనుండును. మబ్బులు మిక్కిలి మెఱపులుగా నుండును, గృహము లతిథిభోజనాదులు లేక శూన్యప్రాయములుగా నుండును. ఇట్లు కలి దుస్సహములయిన చేష్టితములు గలదై జనులయందు వచ్చినపిదప భగవంతుఁడు శుద్ధసత్త్వమయమైన దేహముతో ధర్మమును రక్షించుకొఱకు నవతరింపఁ గలఁడు. అఖిలాత్ముండును నీశ్వరుఁడును బరావరగురుండునగు విష్ణుండు జన్మించుట ధర్మమును రక్షించు కొఱ

కును సాధువులకు మోక్షప్రతిబంధకములుగా నుండు కర్మములను దొలఁగించుటకునే యగుచున్నది. శంబల మను గ్రామముగలదు. అందు శ్రేష్ఠుఁడును మహాత్ముఁడునగు విష్ణుయశుండను బ్రాహ్మణుని గృహమందుఁ గల్కి యవతరింపఁ గలఁడు. ఆజగత్పతి యణిమాదులగు నెనిమిది విభూతుల తోను శౌర్యవీర్యాది గుణములతోను గూడినవాఁడై యప్రతిమంబగు కాంతితో దేవదత్తమనెడి యశ్వమును మిక్కిలి వేగముగాఁ బోవుదాని నెక్కి భూమియందతివేగముగాఁదిరుగుచు దుష్టులనెల్ల నడఁచి ప్రచ్ఛన్నులై కర్తింగొని రాజవేషచ్ఛన్నులగుదస్యులను గోట్లకొలఁదిని సంహరింపఁగలఁడు. ఇట్లు దస్యులెల్లను హతులుకాఁగా నంతఁ బౌరజానపదులైన యీ జనులు మనంబులెల్లను వాసుదేవుని మైపూఁతలకుఁ గల మిక్కిలి పుణ్యగంధముతోడి గాలి సోఁకగానే నిర్మలములు కాఁగలవు. అపుడు భగవంతుఁడు వాసుదేవుఁడు సత్త్వమూర్తియై హృదయమందు నెలకొనఁగా వారి మనస్సులును సాత్త్వికములు కాఁగలవు. వారలకుఁ బుత్త్రాది ప్రపంచమును స్థూలముగా నుండును. ధర్మరక్షకుఁడును భగవంతుఁడు నగు హరి కల్కియై యవతరించినపుడు కృతయుగముగలుగును; అప్పుడు ప్రజాప్రసూతియు సత్త్వగుణప్రధానమై యుండును. చంద్రుఁడును సూర్యుఁడును బృహస్పతియుఁ బుష్యయోగమున నేకరాసిని బొందునపుడు కృతయుగముపుట్టును. చంద్రవంశమునందును సూర్యవంశమునందును గల రాజులును జరగిపోయిన వారును జరుగుచున్నవారును జరుగగలవారును నుత్పత్తిక్రమమునఁ జెప్పఁబడిరి. నీవు పుట్టినది మొదలుకొని నందునియభి

షేచనము వఱకు మాత్రమే చంద్రవంశ మనువర్తించుచు వచ్చెను. [1] ఈ రెంటికి నడిమికాలము వేయునూటపది యేను సంవత్సరములు.ఆకాలమునందు సప్తఋషులలో మొదట [2]నెవ్వరిద్దఱుదయించి కనుపట్టుదురో యాపులహక్రతువు లిరువురకునడుమఁ గుడిప్రక్కను సమదేశమందు రాత్రియందుఁ గనుపట్టు నక్షత్రముతోఁగూడ న్లైఋషులు గూడి మనుష్యులనూఱేం డ్లుండఁగలరు. ఆఋషు లిపుడు నీకాలమందు మఘానక్షత్రము నాశ్రయించి యున్నవారు. భగవంతుఁడును బహుప్రకాశుండును విష్ణుండు నయిన యీకృష్ణుఁడు దివమునకుఁ బోయినప్పుడు కలిపురుషుఁ డీలోకమును బ్రవేశించెను. ఆయుగాభిమానిపురుషునివలననే జనులు పాపమందు రమించు

---

1. పరీక్షిత్తుకాలము మొదలుకొని నందునికాలములవఱకును ౧౪౯౮ సంవత్సరములగుచున్నవి. ఎట్లన పరీక్షిత్తునకు సమకాలీనుఁడైన మగధరాజు మార్జారి. అతఁడు మొదలుగా రిపుంజయుని వఱకుఁగల యిరువదిమందిరాజులు వేయి సంవత్సరములు భూమి ననుభవింతురు. 'యేబార్హద్రథ భూపాలాభావ్యా స్సహస్రవత్సరమ్' అని నవమస్కంధమునఁ జెప్పఁబడియున్నది. వారికివెనుక ప్రద్యోతనులు ౧౩౮ సంవత్సరములును శిశునాగులు ౩౬౦ సంవత్సరములు ననుభవింపఁగా ౧౪౯౮ సంవత్సరములగుచున్నవి. ౧౧౧౫ సంవత్సరములని యిటచెప్పుట యేదోయొక వివక్షచేత అసాంతరసంఖ్యగా నుండును.

2. తూర్పుమొనగానున్న శకటరూపముననున్నయెడల నక్షత్రములు సప్తర్షిమండలమగును అందు కొంచెమెత్తుగానున్న యేఁడికోలమూలనుండు వాఁడు మరీచి,అతనికవ్వలవంగినకాఁడి మూఁపువలె నుండువాఁడు వసిష్ఠుఁడు నతని భార్యయు. అతనికవ్వల కొంచెమెత్తుగానున్నయేఁడికోలమూలనుండు వాఁడు అంగిరసుఁడు.అతనికవ్వల చదరముగానున్న నాలుగుతారల యందు ఈశాన్యమున అత్రి. ఆతనికి దక్షిణమున పులస్త్యుఁడు. పులస్త్యునికిపశ్చిమమున పులహుఁడు. అతని కుత్తరమున క్రతువు.వీరిలో ఉదయసమయమున మొదట బుట్టువారు పులహక్రతువులు.

చున్నారు. లక్ష్మీపతి యగు నాహరి యెంతకాలము తన పాద పద్మములచేత భూమిని స్పృశించుచునుండెనో యంతకాలము కలిపురుషుఁడు దీనిని గీడ్పఱచుటకు శక్తుఁడు గాఁడయ్యెను. దేవర్షులు తొమ్మండ్రును మఘానక్షత్రములందు సంచరించుటకెపు డారంభించిరో యపుడు కలియుగము ప్రవర్తించిన దగును. అది దేవమానమున సంధ్యలతోను సంధ్యాంశములతోను బండ్రెండువందలసంవత్సరములకాలఁదిగా నుండును. మహర్షులు మఘానక్షత్రములనుండి పూర్వాషాఢలకు నెప్పుడుపోవుదురో యప్పుడునందుఁడు మొదలుకొనియీకలివృద్ధినొందఁగలదు. ఏదినమునందుఁ గృష్ణుఁడు దివమునకుఁ బోయెనో యాదినమునందాపగటనే కలియుగము ప్రవేశించిన దని కాలాభిజ్ఞు లగువారు చెప్పుదురు. నాలుగవది యగు కలియుగమునందు వేయి దివ్య సంవత్సరములకుఁ గడపటఁ గృతయుగము మరలఁ గలుగఁ గలదు. అప్పుడు మనుష్యుల కది యాత్మస్వరూపమును గోచరింపఁజేయజాలిన దగును. ఇట్లు వైవస్వతమను వంశమునకే యే యుచ్చనీచావస్థలు చెప్పఁబడునో యాయవస్థలు శూద్రులకును వైశ్యులకును బ్రాహ్మణులకును బ్రతియుగమందును గలుగునని తెలియవలయును. ఇట్టి పేళ్లును రూపములును గల మహాత్ములగు పురుషులందఱు నిపుడు చెప్పుకొనుట మాత్రమేకాని యొక్కరును మిగిలియున్నవారు గారు. వారి కీర్తి యొక్కటిమాత్రమే భూమియందు నిలిచియున్నది. చంద్రవంశమందు శంతనునిభ్రాత యగు దేవాపియును నిక్ష్వాకు వంశజుఁడయిన మరుత్తుండును మహాయోగబలముతోఁ గూడిన వారై బదర్యాశ్రమమందు యోగులకు వాసస్థల మైన కలాప

గ్రామమందున్న వారలు. వారు కలియంతమునఁ గృతయుగా దిని భగవంతునివలన వర్ణాశ్రమధర్మము లుపదేశము నొంది యీలోకమునకు వచ్చి వర్ణాశ్రమధర్మములను బూర్వము వలెను వ్యాపింపఁజేయుదురు. కృతము త్రేత ద్వాపరము కలి యని యీనాలుగును జేరియొక చతుర్యుగ మగును. ఈక్రమ ముతోఁ గూడియే ప్రతిచతుర్యుగమును బ్రాణులయందు నిమిత్తమై ప్రవర్తించుచున్నది. రాజా! నే నిపుడు చెప్పినవైవ స్వతమన్వంతరపు రాజులును మఱియుఁ జెప్పని యితరరాజు లును భూమిని నాది నాది యని మమత్వబుద్ధి గలిగియుండి కడపట దానిని భోగింపవలసిన పుణ్యము ముగియఁగా నా మమ త్వముతోఁ గూడియె నిరయమును బొందిరి. రాజను పేరుగాంచిన వాని శరీరము ముగియఁగా పురుగులనియుఁ బురీష మనియు బూడిదయనియుఁ బేళ్లు గలుచున్నవి. వాఁడట్టి దేహముకొఱకై భూతములకు ద్రోహము సేయుచున్నాఁడు, దానివలన నిరయము నొందుచున్నాఁడు గాని తన యాత్మహితము నెఱుఁగడు. ఆరాజులు 'ఈయఖండమయిన భూమిని నాపూర్వజులు దాల్చి యుండిరి. ఇపుడు నేను ధరించియున్నాను. ఇఁక నాపుత్త్రునకుఁ బౌత్త్రునకును నెట్లు కలుగునో' యని చింతించుచుందురు. తేజ స్సు నీళ్లు నన్నము ననెడి యీమూటిమయము దేహము. ఇట్టి కాయమును వారు తెలివిమాలి యాత్మగాను భూమిని దనది గాను గ్రహించి కడపట నాదేహమును నాభూమిని రెంటినిని దిగనాడి ప్రారబ్ధాంతమందు లయమును బొందిరి. రాజా! ఏ యే రాజులు భూమిని బౌరుషముచేత ననుభవింతురో వారంద ఱును గాలము చేత సమాప్తినొందినవారై కడపటఁ గథ

యందుఁ జెప్పంబడుచు మాత్రముందురు. ఇది రెండవ యధ్యాయము.

{మమకారముగల రాజులను భూమి పరిహసించుట
ఆయాయుగములధర్మములు, ప్రజల వర్తనములును.}

శ్రీశుకులు—ఈభూమి తన్ను జయింపవలయు నని తుక తుకపడుచున్న రాజులను జూచి "ఔరా! ఈరాజులు మృత్యువున కాటబొమ్మలు ఇట్టి వీరు నన్ను జయించి భోగింపఁ గోరుచున్నారు. ఈరాజులు తమ తండ్రి మొదలగువారు మరణించుటను బట్టి తాము మృత్యువునకు వశులే యని తెలిసినవారయ్యు నన్ను జయింపవలయునని యువ్విళ్లూరుచున్నారే! ఈకోరిక యంతయు వ్యర్థము. ఏలన వీరికోరికను బట్టి నీటిబుగ్గవలె నున్న యీ దేహమునందు మిక్కిలియు నమ్మిక గలిగియిందులకై పాటుపడుచున్నారు. కనుక వీరి కోరిక నిష్ఫలమే కదా. వీరింద్రియలంపటులకు రాజ్యప్రాప్తి కలుగదను తలంపున 'మొదట నింద్రియము లాఱింటిని జయించి దాని మూలమున దేవతా ప్రసాదమును బడయుదుము. పిదప రాజును మంత్రులను సచివులను బురజనులును వారి యాప్తులను నేనుఁగులయధిపతులను బిదప భూమికిఁ గంటకప్రాయు లగు వారిని జయింతము. ఇట్లు క్రమముగా సముద్రపర్యంత మైన భూమండలముల నంతయు గెలుత' మని యిట్టి యాశలకు మనస్సును లోఁబఱచుచుందురు గాని దగ్గఱనున్న మృత్యువును గనుఁగొనరు. నన్నుఁ జుట్టు సముద్రముగల యంత మట్టును జయించి యంత సముద్రము నడుమనున్న ద్వీపములను గెలుచుటకుఁ జొత్తురు. ఇట్లు సమస్త భూమండలమునుద్వీపములను జయించినను వారింద్రియములను

జయించి నందుల కిది యెంత మాత్రము ఫలము? ఇంద్రియ జయమునకుఁ దగిన ఫలము ముక్తియే. దేనినిమనువులును వారి పుత్త్రులును జయించియు దిగవిడిచిపోయిరో యట్టి నన్ను బుద్ధి మాలినవారుగాన యుద్ధమున జయింపఁ దివురుచుందురు. వీరు రాజ్యమందు నాది నాది యనెడి మమకారబుద్ధికిఁ మన స్సులు కట్టుపడియుండుట వలన దుష్టులౌటచే నాకొఱకు వీరిలోఁ దండ్రులకును గొడుకులకును నన్న దమ్ములకును గలహములు పుట్టుచున్నవి. వీరు 'ఈభూమండల మంతయు నాదియే. ఓరీ! మూఢా! నీ దికా' దని పలుకుచు నొకరినొకరు మచ్చరించుచు నాకొసర మొండొరులను జంపుచును జచ్చుచు నుందురు. పృథుఁడు, పురూరవుఁడు, గాధి, నహుషుఁడు, భరతుఁడు, అర్జునుఁడు, మాంధాత, సగరుఁడు, * రాముఁడు, ఖట్వాంగుఁడు, ధుంధుమారుఁడు, రఘువు, తృణబిందుఁడు, యయాతి, శర్యాతి,శంతనుఁడు, గయుఁడు, భగీరథుఁడు, కువలయాశ్వుఁడు, కకుత్స్థుఁడు, నలుఁడు, నృగుఁడు, హిరణ్యకశిపుఁడు, వృత్రుఁడు,లోకరావణుఁడగురావణుఁడు, నముచి, శంబరుఁడు, భౌముఁడు, హిరణ్యాక్షుఁడు, తారకుఁడు మఱియు నితరులైన దైత్యులును రాజులును పెక్కండ్రు భూమికిఁ బతులుగా నుండిరి. వీరందఱును సర్వవిదులు. వీరందఱును శూరులు. సమస్తమును జయించిన వారు; ఎవ్వరిచేతను జయింపఁబడనివారు. అయినను మనుష్య ధర్ములై నాయందు మిక్కుటముగా మమకారమునుగలిగి కొంతకాల ముండినవారైరి కాని' యని భూమి నవ్వుచున్నది. రాజా! ఆరాజులు తమవిషయభోగాభిలాషలు తీఱకమును పే

---

*ఇతఁడు దశరథరాముఁడు గాఁడు. మఱియొకరాముఁడని వీరరాఘవులు.

వారిని గాలము కొంపోయినది. ఇప్పుడు వారు లేరు. వారి కథలుమాత్రమే మిగిలియున్నవి. రాజా! లోకములందు యశస్సును విస్తరింపఁజేసి పరలోకమును బొందిన మాహాత్మ్యనిధులగు రాజులను గుఱించి యీ కథలు నీకుఁజెప్పఁబడినవి. విషయములు నిస్సార మని తెలియుటకును దానినిఁ బట్టి దాని యందు వైరాగ్యము గలుగుటకును జెప్పఁబడినవి. ఇవి వట్టి వాగ్వైభవములే కాని యీరాజు లనుభవించినభోగ్యము లందుఁ బారమార్థికమైన దొక్కటియులేదు. ఉత్తమశ్లోకుం డగు భగవంతుని గుణానువాదములను నమంగళము లెల్లను దూలించువానిని సజ్జనులు పాడుచుందురుగదా. దానినే పురుషుఁ డగువాఁడు నిత్యమును మాటిమాటికి వినుచుఁ గృష్ణుని యందు నిర్మలంబగు * భక్తిని గోరుచుండవలయును'' ననెను.
రాజు 'మహాత్మా! మునీంద్రా! కలియుగమందు జనులు కలిదోషములు పెచ్చుపెరుఁగుచుండఁగా నేయుపాయముచేతఁ దూలింపనేర్తురో దానిని నాకుఁగలరూపునఁ జెప్పుము. మఱియు యుగములను యుగధర్మములను బ్రలయకల్పములకొలఁదులను మహాత్ముండయిన యీశ్వరుని విష్ణుని శరీరంబగు కాలము గతియును జెప్పు'మని యడిగెను.

శ్రీశుకులు—కృతమందు ధర్మము నాలుగుపాదములతోఁ గూడినదై కృతయుగజనులచేఁ దాల్పఁబడుచుండును. రాజా! పూర్ణంబయిన యాధర్మమునకు సత్యము దయ తపస్సు దానము నని యీనాలుగును పాదములు, ఆయుగమందు జనులుసంతు

---

* శ్రవణ పరంపరచే భగవంతునియందు దృఢమైన భక్తి కలుగుచున్నదని భావము.

ష్ఠులును గరుణగలవారును భూతమైత్రిగలవారును శాంతులును దాంతులును ద్వంద్వసహిష్ణులును ఆత్మారాములును జాతిగుణాదితారతమ్యములను బాటింపక సమస్తమును భగవదాత్మకముగాఁ గనుగొనువారును దపశ్చర్యాదులచేతఁ గాయక్లేశముగలవారును నై * బహుతరముగా నుందురు. త్రేతాయుగమందు ధర్మమునకుఁ గల పాదములందు నాలవపాలిని, అధర్మమునకుఁ బాదములయిన అనృతము, హింస, అసంతోషము, విగ్రహ మనెడి యివి మెల్లమెల్లగా హరించుచున్నవి. ఆయుగమందుఁ గ్రియాతపస్సులందు నిష్ఠులయిన వారును మిక్కిలి హింసాస్వభావము లేనివారును మిక్కిలి లంపటులుగానివారును త్రివర్గపరాయణులును వైదికకర్మవృద్ధులునై వర్ణములవారుందురు. ఆవర్ణములందు బ్రాహ్మణు లధికులై యుందురు. ద్వాపరమున ధర్మపాదము లగు తపస్సునందును సత్యమునందును దయయందును దానమందును సగము వరుసగాన ధర్మలక్షణము లగు నసంతుష్టిచేతను, ననృతముచేతను, హింసచేతను, విగ్రహముచేతను, దఱిఁగిపోవును. అపుడు జనులు యశస్వులును మహాయజ్ఞానుష్ఠానశీలురును మహాశ్రోత్రియులునై సంపన్నులును గుటుంబులును దర్పితులునై యుందురు. వారియందు బ్రాహ్మణులును క్షత్రియులు నధికులగుదురు. కలియుగమందు ధర్మపాదములందు నాలవభాగము మాత్రమే మిగిలియుండును. అదియు నధర్మపాదములు పెచ్చు

* అందఱును నిట్టి గుణములుగలవారై యుండినయెడల ముక్తులగుదురు; యుగాంతరము కలుగవలసినది లేకుండును. కావుననే యందఱుగాద నుటకై 'బహుతరముగా' నని కూర్పఁబడినది.

పెరిఁగి క్షీణించుచువచ్చి కడపటఁ బూర్ణముగా నశింపఁగలదు. ఆ యుగమందు జనులు లుబ్ధులును దురాచారులును నిర్దయులును నిష్కారణవైరులును, భాగ్యహీనులును, మిక్కిలి యర్థకామ తృష్ణగలవారును నై యుందురు. వారియందు శూద్రులును కైవర్తకాదిబాశులును బ్రధానులుగా నుందురు. యుగములం దిట్టి వైషమ్య ముండుటకుఁ గారణము వినుము. పురుషునియందు సత్త్వము రజస్సుతమస్సనిగుణములుచూపట్టుచున్నవి. అవియె కాలముచేఁ బ్రేరితమై పెరుఁగుచును దగ్గుఁగుచును మనస్సునందుఁ దమతమ కార్యములు నెఱపుచుండును. మనస్సును దానికి వశములయిన బుద్ధియు నింద్రియములును నెపుడు సత్త్వమునందు మిక్కిలియుఁ బ్రవర్తించునో, యపుడు కృతయుగమని తెలియవలయును. దానివలన జ్ఞానమందును దపస్సునందును జనులకు రుచి కలుగుచున్నవి. ఎప్పుడు దేహికిఁ గామ్యకర్మములందు నభిరుచి కలుగునో యపుడు రజోగుణ ప్రధానమగు త్రేతాయుగమని తెలియుము. ఎప్పుడు లోభమును నసంతుష్టియును మానమును దంభమును మత్సరమును గామ్యము లగు కర్మములం దభిరుచియుఁ గలుగునో యపుడు రజస్తమః ప్రధానమగు ద్వాపర మని తెలియుము. ఎప్పుడు కాపట్యమును, నసృతమును, దరిద్రతయు, నిద్రయును, హింసయు విషాదనమును, శోకమోహములును, భయమును, దైన్యమును గలుగునో యపుడు తామసం బగు కలి యని తెలియునది. మనుష్యులు మందమతులును నల్పభాగ్యులును మిక్కిలి తిండిగలవారును గాములును ధనహీనులు నగుటయు స్త్రీలు సతులు గాక స్వైరిణులై యుండుటయును నా కలివలన నే

యగును. అప్పుడు దేశమందలి ప్రజలు దస్యులచేత నుపద్ర వము నొందుచుందురు. వేదములు పాషండులచే దూషితము లగును. రాజులు ప్రజలనుబట్టి పీడించుచుందురు. ద్విజులు శిశ్నోదరపరాయణులై యుందురు. బ్రహ్మచారులు వ్రత శూన్యులై యశుచులై యుందురు. గృహస్థులు భిక్షులగుదురు. తపస్వులు గ్రామములందు వసించుచుందురు. సన్న్యాసులు విత్తాభిలాషులై యుందురు. స్త్రీలు పొట్టికాయములు గలిగి మీఁదు మిక్కిలి తిండితినుచుఁ బుట్టెఁడు బిడ్డలను గనుచు సిగ్గు నూలి యెపుడును గటువుగా మాటలాడుచుఁ జౌర్యములును మాయలును మిక్కుటమయిన సాహసములును గలిగియుందురు. వణిజు లొక్కటిగాఁగూడి వ్యాపారములు చేయుచుఁ గ్రయ విక్రయాది వ్యాపారములు జరుపుచుందురు. ఏదేని వ్యత్యా సము గలిగెనా క్షుద్రచేష్టలు గలవా రగుదురు. మఱియు నాపద లేకుండునపుడును మిక్కిలి రోఁతపడునట్టి వృత్తిని నుంచి దిగాఁ దలంతురు. భృత్యులు తమపతి సర్వోత్తముఁడుగా నుండినను ధనహీనుఁడయ్యెనా తోడనే దిగవిడుతురు. పతులును భృత్యుఁడు రోగాదులచేత విపత్తినొందెనా వానిని, బరంపరా గతమైన భాగవతధర్మమును బాఁడియుడిగిన యావులను, దిగ విడుతురు. కలియుగమునందు నరులు దంద్రులను దోఁబుట్టు వులను సుహృదులును జ్ఞాతులను విడిచి సురతనివాసమగు భార్యవంకవారే సుహృదులుగాఁ గొని స్త్రీవశ్యులై భార్య వంకవా రయిన వదినలతోను బావలతోను గార్యము లాలోచ నము సేయుచుందురు. శూద్రులు తపస్సుచేతను విద్యచేతను నుపజీవించుచుఁ బ్రతిగ్రహములు పుచ్చుకొనఁగలరు. మఱియు

ధర్మజ్ఞులు గాకుండియు నుత్తమాసనముల నధిష్ఠించి ధర్మములు నుపదేశించుచుందురు. ప్రజలు నిత్యము దుర్భిక్షములచేతను రాజునకుఁ గట్టుకప్పములచేతను జిక్కిసొక్కి మనంబున భయపడుచు నన్నరహితమగు భూతలమునందు ననావృష్టి భయమున దుఃఖించుచు నుందురు. మఱియుఁ గలియందుఁ బ్రజల వస్త్రములు నన్నమును బానములును శయనమును మైథునమును స్నానమును భూషణములును లేనివారై హీనులై పిశాచుల వలెఁ జూపట్టుచుండఁగలరు. కలియందు జిల్లిగవ్వంత యర్థమునకయినను జగడములు పెట్టుకొని సౌహార్దములు దిగవిడిచి యొకరినొకరు సొంతచుట్టముల నయినను జంపుచుఁ దామును బ్రాణములు విడుచుచు నుండఁగలరు. మఱియు జనులు క్షుద్రులై శిశ్నోదరపరాయణు లగుటఁబట్టి ముదిసిన తలిదండ్రులను రక్షింపరు; పుత్త్రులును భార్యలు నన్నిటఁగుశలులై యున్నను వారిని బోషింపరు. రాజా! కలియుగమందు "మనుష్యులు జగములకుఁ బరమగురుండును ముల్లోకములకు నాథుండగు బ్రహ్మ మ్రొక్కిన పాదపద్మములు గలవాఁడును నగు భగవంతుని నచ్యుతునిఁ, బాషండులచేత మనస్సు భేదిల్లి యారాధింపకుందురు. ఎవ్వని నామధేయమును మరణించుచున్నపుడు గాని దుఃఖితుం డయినపుడు గాని పతితుఁడయినపుడు గాని వర్ణాశ్రమాచారములు తప్పి నడచునపుడుగాని పరవశుఁడై యున్నపుడుగాని పురుషుఁడు కీర్తింపఁగానే కర్మబంధము లన్నింటినుండి విడివడి యుత్తమం బగు గతిని బొందునో యట్టి భగవంతుని మనుష్యులు కలియుగమునందుఁ బూజింపరు. జనులు కలివలన నిషిద్ధద్రవములనుబట్టి కాని నిషిద్ధదేశ

మునుబట్టికాని విషయప్రవణమైనమనస్సునుబట్టికాని కాపించు నట్టి దోషములను నన్నిటిని పురుషోత్తముఁడగు భగవంతుఁడు చిత్తమునందు నెలకొన్నవాఁడయ్యేనేని హరించుచున్నాఁడు. భగవంతుని విన్నను గీర్తించినను ధ్యానించినను బూజించినను నాదరించినను నతఁడు మనుష్యుల హృదయములందు నెలకొని యుండి వారు వేలకొలఁది జన్మములను గావించిన యశుభములనెల్లఁదూలించివైచుచున్నాఁడు. అగ్ని, బంగారమునందుండి రాగి మొదలగువాని కలియుటవలన దానికిఁ గలిగిన తక్కువ వన్నెను బోఁగొట్టునట్లు, విష్ణువును యోగుల మనంబుల నెల కొని యందలి యశుభములనెల్ల హరించి వైచుచున్నాఁడు. అంతరాత్మ, హృదయస్థితుండగు భగవంతుఁడనంతునిచేతంబోలె మఱి శాస్త్రాధ్యయనము చేతఁగాని తపముచేత గాని ప్రాణాయామము చేతఁగాని, భూతమైత్రి చేతఁగాని తీర్థస్నానముల చేతఁగాని, వ్రతము చేతఁగాని దానముల చేతఁగాని, మంత్రజపముల చేతఁగాని మిక్కిలియు శుద్ధినొందనేరదు. రాజా! కాఁబట్టి నీవు సర్వవిధములచేతఁ గేశవుని హృదయమందు నెలకొల్పుము. ఏలనఁగా నీ వవహితచిత్తుఁడవై మరణించునపుడు పరమంబగు గతిని బొందుదువు కాన హృదయమందుఁ గేశవుని నిలిపియుంపుము. భగవంతుఁడగుపరమేశ్వరుని మరణించునపు డెల్లవారును దప్పక ధ్యానింపవలయును. అతఁడు సర్వాత్ముఁడు, సర్వమున కాశ్రయభూతుఁడుగాన యట్లు చేయువారినిఁదన సామ్యమును బొందించును. కలి దోషములకు నిధియైనది. రాజా! అయినను దాని యందు మహాగుణ మొక్కటి యున్నది. కృష్ణుని నూరక కీర్తించుట యొక్కటిచేత నే మనుజుఁడు బంధములనుండి విము

క్తుఁడై పరమపురుషునిఁ బొందుచున్నాఁడు. కృతయుగమందు ధ్యానించుటవలనను, త్రేతయందు యజ్ఞములచేత నారాధించుటవలనను, ద్వాపరయుగమందును నర్చించుటవలనను,గలుగు ఫలమంతయును గలియుగమందుఁగృష్ణునిఁ గీర్తించుమాత్రము వలననే కలుగుచున్నది. ఇది మూఁడవయధ్యాయము.

---

## శుకుఁడు పరీక్షిత్తునకుఁ గల్పప్రలయముల కాలపరిమాణములను జెప్పుట.

శ్రీశుకుఁడు—రాజా! నీకుఁ బరమాణువు మొదలుగా రెండు పరార్ధములు కడపటగాఁగల కాలమును యుగముల పరిమాణములును జెప్పఁబడినవి. [1] కల్పములను లయములను గూడ వినుము. వేయిచతుర్యుగములు బ్రహ్మకు నొక్కదిన మనఁబడుచున్నది. ఇదియె కల్పము. ఇందుఁ [2] బదునాలుగురు మనువులు క్రమముగాఁ గలుగుదురు. ఆవేయిచతుర్యుగముల కడపటఁ బ్రలయము. ఈ ప్రలయముకూడ నంత కొలఁదియే (యనఁగా వేయిచతుర్యుగముల పరిమితియె) కలిగియుండు ఇది బ్రహ్మకు రాత్రి యనఁబడును. ఆరాత్రియందు భూమి మొదలయిన యీమూఁడులోకములును ప్రలయము నొందు

---

1. కల్పము—దైనందనకల్పము మహాకల్పమని రెండువిధములు. ఇట దైనందిన కల్పము చెప్పఁబడుచున్నది.

2. మన్వంతరకాలము 'స్వంస్వంకాలం మనుర్భుఙ్క్తే యుగానామేకసప్తతిః' అని తృతీయస్కంధమునఁ జెప్పినట్లు డెబ్బదియుగములు.

3. ప్రలయము—నైమిత్తికము, ప్రాకృతికము, ఆత్యంతికము, నిత్యము అని నాలుగువిధములు. ఇట నైమిత్తిక ప్రలయము చెప్పఁబడుచున్నది. వేయిచతుర్యుగముల పరిమితిగలదినము గడవఁగా బ్రహ్మ జగద్వ్యాపార ముడిగి శయనించును. శయన నిమిత్తమగుటచే ఈ ప్రలయమును నైమిత్తిక మనఁబడుచున్నది.

చున్నవి. ఇది నైమిత్తికప్రలయ మనఁబడును. ఈప్రలయ మందు విశ్వమును సృజించునట్టి బ్రహ్మ విశ్వమును దనయందుపసంహరించుకొని [1] శేషశయ్యాపయినిఁ బరుండుచున్నాఁడు. పరమేష్ఠియగు బ్రహ్మకు [2] రెండుపరార్ధములు కడచిపోఁగా, మహత్తుఅహంకారము పంచభూతములనెడి యీయేడు ప్రకృతులును లయమును బొందుచున్నవి. ఇదియె ప్రాకృతలయము. ఇందు విఘాతము (నాశము)ప్రాప్తించినపుడు, ఏడుప్రకృతులు కూడిన వికారమగు నండకోశము లయమునొందుచున్నది. ఆ విఘాతముకలుగు విధ మిది. రాజా ! పర్జన్యుఁడు నూఱుసంవత్సరములు భూమియందు వానగురియకుండును. అప్పుడు ప్రజలన్నము లేకయొకరినొకరుపట్టి యాఁకటిచే నలఁగి భక్షించుచుఁ, గాలము చేత నుపద్రవమునొంది మెల్లగా క్షీణత్వము నొందుదురు. అప్పుడు ప్రలయకాలసూర్యుఁడు సముద్రమునందును, దేహము లందును, భూమియందును గల రసము నంతయు దుస్సహము లయిన తనకిరణములచేతఁ ద్రావును; కాని యిప్పటివలె మరల నిచ్చుట యెంతమాత్రము గలుగదు. అంతఁ బ్రలయకాలవు వహ్ని సంకర్షణుని ముఖమునుండి పొడమి వాయువేగము చేతఁ జిమ్మిరేఁగి సూర్యుఁడు పీల్పఁగా మిగిలిన జలమును లోకరహితములయిన పాతాలాది భూవివరములను దహించు

1. బ్రహ్మ శేషశయ్యపైఁ బరుండుట యెట్లన 'కృష్ణనాభిహ్రదోద్భూతః కమలోదరశాయినః' అని శేషశయనుం డగు భగవంతుని నాభి పద్మమునందు బ్రహ్మ శయనించునట్లు చెప్పఁబడుచున్నది. కాఁబట్టి ప్రాసాదఖట్వా పర్యంక న్యాయమున బ్రహ్మకు శేషశాయిత్వము పొసఁగుచున్నది.

2. రెండు పరార్ధములు గడచుటనుబట్టి యిదియె కల్పమని తెలియుచున్నది.

చున్నది. అట్లు మీఁదను గ్రిందను నలుప్రక్కలను నగ్ని సూర్యుల శిఖలచేత బ్రహ్మాండము దగ్ధమగుచుఁ గాలిన పేఁడ ముద్దవలె నుండును. అంతఁ బ్రచండమగు ప్రలయవాయువు నూఱేండ్లకుఁగొంచె మెక్కువకాలమే నుడిసి వీచును. అప్పు డా కాశము ధూమ్రమ్ముగ్రమ్మఁగా ధూమ్రముగా నుండును. అప్పుడు చిత్రవర్ణములగు మేఘ సమూహములు వెక్కలు నూఱుసంవత్సరములు వర్షముగురియును;భయంకరధ్వనులతో నుఱుముచు నుండును. అంత బ్రహ్మాండ వివరములోపలఁ గల ప్రపంచ మంతయు జలమయమై యేకార్ణవముగా నుండును. ఇట్లు జలములందుఁ దెప్పఁదేలుచు జగముండఁగా, భూమికిఁగలగంధ గుణమును నప్పులు గ్రసించుచున్నవి. గంధము గ్రసింపఁ బడఁగానే భూమి జలములందు లయించుచున్నది. పిదప నప్పులగుణ మగురసమును తేజస్సు గ్రసించుచున్నది. అప్పు డప్పులు రసము దూలి తేజస్సునందు లయించుచున్నవి. అంతఁ దేజస్సు గుణమగురూపమును వాయువు గ్రసించుచున్నది. అప్పుడు రూపగుణములేని తేజస్సు వాయువునందు లయించు చున్నది. వాయుగుణమగు స్పర్శమును నాకాశము గ్రసించు చున్నది. అప్పుడు స్పర్శము లేనివాయు వాకాశమందు లయిం చుచున్నది.పిదప నాకాశపుగుణ మగు శబ్దమును భూతాదియనఁ బడు తామసాహంకారము గ్రసించుచున్నది. అట్లది తన గుణము గ్రసింపఁబడఁగా భూతాదిని లయించుచున్నది. రాజ సాహంకారముతోఁ గూడిన సాత్త్వికాహంకారముజ్ఞానేంద్రియ ములను వాని వృత్తులను గ్రసించుచున్నది. మూఁడువిధము లయిన యహంకారమును మహత్తు గ్రసించుచున్నది. ఆ

మహత్తు సత్త్వాదులగు మూఁడుగుణములను (అనఁగా గుణమయంబగు ప్రకృతిని) గ్రసించుచున్నది. రాజా! కాలప్రేరితమై యవ్యాకృతమనఁబడిన * యాప్రధానము గుణములను గ్రసించుచున్నది. (అనఁగా విషమములగు గుణములను సమముగాఁ జేయుచున్నది) ఎవ్వని స్వరూప మాద్యంతములు లేనిది గాన కాలావయవములగు రాత్రి పగలు మొదలగు వానిచేఁ బరిణామాదులను బొందకుండునో, కావుననే యేది యింద్రియములకుఁ దేటపడక యవ్యక్తముగా నుండునో, మరి యేది నిత్యంబును నవ్యక్తము మొదలుకొని పృథివివఱకుఁ గల జగమునకెల్లఁ గారణంబును నవ్యయంబునగునో, యెందు వాక్కులును మనస్సును బ్రవర్తింపనేరవో, సత్త్వమును రజస్సునుదమస్సును మఱియు నీమహదాదులను నెందుఁగలుగవో, మఱియుఁ బ్రాణములును బుద్ధియు జ్ఞానేంద్రియములును గర్మేంద్రియములును నెందుఁ గలుగవో-ననఁగాఁ గర్మాయత్తముగా మహదాదులు కూడి యగునట్టి దేహముతోడ సంబంధమును నింద్రియాయత్తమగు జ్ఞానమును నెందుఁ గలుగవో, లోకములు కల్పితమగునట్టి సన్నివేశమగు బ్రహ్మాండ మేస్వరూపము గాదో, మఱియు జీవులకుంబోలె ధర్మభూతజ్ఞానమునకు సంకోచవికాసము లయినస్వప్నము జాగ్రత్తు సుషుప్తియు ననెడి యవస్థలెందుఁ గలుగవో, యేది యాకాశమును జలమును భూమియు వాయువును నగ్నియు సూర్యుండును గాదో, మఱియు మిక్కిలి నిదురయందున్నవానివలె నేది లోపలను

* మహదాది నామరూపవిభాగములేనిదై గుణసామ్యావస్థయం దుండు ప్రధానమై అవ్యాకృత మనఁబడు చున్నది.

వెలుపలను గలుగు బ్రాహ్మణత్వము సుఖముదుఃఖము మొదలగు వికారములకు లోనుగాకయు, నాకాశమువలె సమస్తమును బొందియున్నను వానిదోషముల యంటులేకయు నుండునో అనఁగా నిదురించువానివలె బాహ్యాభ్యంతరవికారములు లేకయు నాకాశమువలె నిర్మలమయ్యు నుండునో, యట్టి పరమాత్మ స్వరూపము, ఇట్టి దట్టి దని వితర్కింప నశక్యమయినది [1] యవ్యక్తమునకు లయస్థానమని వేదాంతములు భావించుచున్నవి. ఇదియే ప్రాకృతికలయము. ఇందుఁ [2] బురుషునకు నవ్యక్తమునకులయముగలుగును. ఇందుఁగాలప్రేరితములై పృథివి మొదలుకొని మహత్తువఱకుఁగలశక్తులుపరవశములై తమ తమ కారణములందు లయమునొందుచున్నవి. జ్ఞానస్వరూపుండగు పరమాత్మ బుద్ధి యింద్రియములు నింద్రియార్థములనెడి యివి శరీరముగా గలవాఁడై శరీరివలె నియమించుచును వాని కాశ్రయమైయాధారకుఁడగుచును నుండుట ప్రామాణికులకుఁదోఁచుచుండును. పరమాత్మకు శరీరముగానుండునట్లు ప్రమాణముల చేతఁ దెలియంబడుచుండుట వలనను, పరమాత్మను విడిచి వేఱుగ నవి యుండనేరని వగుట వలనను, నతఁడు వానినెల్ల శరీరముగాఁగలిగి వెలుంగుచున్నాఁడు, అతనికి శరీరమగు బుద్ధీంద్రియాదులోయాద్యంతములుగలవై యేకరూపముననుండక యెడతెగక పరిణామము నొందుచుండుటవలనఁ బరమాత్మస్వరూప

1. 'మహానవ్యక్తే లీయతే అక్షరం తమసిలీయతే తమః పరేదేవఏకీభవతి' ఇత్యాదులగు వేదాంతము లిట తెలియునది.

2. పురుషునకు లయమనఁగా- అత్యంత జ్ఞానసంకోచముచేత పరమాత్మతోడి సంశ్లేషమునొందుట. అవ్యక్తమునకు లయమనఁగా మహదాదులుగా విభక్తముగాని యవస్థనొంది యుండుట యని తెలియునది.

మువలె నిత్యములుగావు. తేజస్సు కార్యముదీపము. తేజస్సునకను గ్రాహ్యమయినది చక్షువు. తేజఃకార్యమగునహంకారవుఁ గార్యములయినవి యింద్రియములు. తేజస్సు నాశ్రయించిన ధర్మము రూపము. కనుక దీపమును జక్షువును రూపమును దేజస్సునువిడిచి వేఱుగ నేర్పడఁజాలవు. ఇట్లింద్రియములునంతఃకరణములును విషయములును బరమాత్మచేత సృజింపఁబడి యతని కనుగ్రాహ్యములై యతఁడే యాశ్రయముగాఁ గలిగియుండుటంబట్టి యా బుద్ధ్యాదులకను విలక్షణతముండును, జ్ఞానశబ్దవాచ్యుండు నగు పరమాత్మనువిడిచి యవి యెల్లవేఱుగ నెలకొనియుండఁ జాలవు. జీవునిబుద్ధియనెడి ధర్మభూత జ్ఞానమునకు జాగరణము స్వప్నము సుషుప్తి యనెడి యవస్థలు చెప్పఁబడుచున్నవి. ఈ పెక్కు లవస్థలుండుట, ప్రత్యగాత్మయగు జీవునియందు ప్రకృతి సంబంధమాత్రమువలనఁ గావింపఁబడినవే కాని మఱియొకటి గాదు. మేఘము లాకాశమునందుఁ గలుగుచును లేకపోవుచును నుండునట్లు యీ కనఁబడుచున్న ప్రపంచమంతయు నవయవి యగు బ్రహ్మమునం దుదయించుటచేఁ గలుగుచును లయించుటచే లేకపోవుచునుండును. అవయవి యగు వానికెల్ల నవయవములున్నవనుట సత్యమె. * అవయవి యా యవయవములకు

* అబాధితములగు అవయవములయిన తంతువుల సముదాయమే కదా అవయవి యగుపట మనఁబడుచున్నది. అవయవములగు తంతువుల ఒక విధమైన కూడికయే అవయవి యగు పటమగుచున్నది. మఱియు కార్యమైన యాపటము తంతువుల కంటె వేఱయినది కాకుండుటయు తెలియుచున్నది. అట్లె. ప్రమాణప్రతిపన్నములైన చిత్తు అచిత్తు ఈశ్వరుఁ డనెడి వీని సముదాయమే 'సదేవ సోమ్యేద' మిత్యాదులయందు సత్తనఁబడు జగత్తు రూప

వేఱుగానేరదు. వేఱయినచో, పటమనెడి యవయవికంటె వేఱుగా దాని యవయవములగు తంతువులు చూపట్టవలెను. అట్లు చూపట్టవు గదా. అట్లె సచ్ఛబ్దవాచ్యంబగు బ్రహ్మమునకు జగత్తు వేఱుగానేరదు. ఆసత్తే జగత్తునకుఁ గారణమగును. కుండ మూఁకుడు మొదలగువాని యందు 'ఇదిమన్ను ఇదికుండ' యని ప్రతీతి గలుగుచున్నది. అందు సామాన్యశబ్దము చేత మృత్తు మొదలగు కారణములు చెప్పఁబడుచున్నవి. విశేష శబ్దముచేత కుండ మూఁకుడు మొదలగు దాని విశేషాకారములు చెప్పఁబడుచున్నవి. ఆమృత్తునకుఁ గల వికారమే యా సామాన్యవిశేషములచేత దానికంటె వేఱయిన దని బుద్ధిచేతను వేఱు వేఱు శబ్దములచేతను నసత్కార్యవాదులు ద్రవ్యాంతరముగా నెఱుంగుట వట్టి భ్రమమే యగును. కార్యమును ద్రవ్యాంతరముగా నెఱుంగుటయే భ్రమము. ఏలనఁగా, సామాన్యవిశేషములే యొకటి నొకటి యాధారాధేయములుగా నాశ్రయించి యున్నవి. కాన యొకటి కొకటి వేఱు గానేరవు. అట్లె చిదచిదీశ్వరులసంఘాతమును గారణమయ్యును గార్యమయ్యునుండుటయే కాక యా రెండవస్థలయందు వానికి భేదమును గలుగదు. అయిన నాచిదచిదీశ్వర సంఘాతమునందు సమస్తము లగు నచిద్రూపములైన శరీరములు నాద్యంతములు గలవి. కాఁబట్టి యవి చిద్రూపమగు నాత్మవస్తువు గానేరదు. జాతి గుణము క్రియ జన్మము వృద్ధి మొదలగు వికారములు దేహమందాత్మాభిమానము గలవారికిఁ దోఁచుచున్నను

---

మైన పరిణామవిశేషమగు కార్య మని ప్రామాణికులు చెప్పెదరు. మఱియు వారికి నట్లె తోఁచుచున్నది. కాన అసత్కార్యత్వము లేదని భావము.

బ్రత్యగాత్మకది యెంత మాత్రము గలుగునవి గావు. దానికి వానితోడి సంబంధము గలుగదు. ఏలన నావికారములు దానియందు రూపింప శక్యము గాదు నిరూపింపశక్య మగు నేని యణువంతవికారము సైత మాత్మయందుఁ గలుగును. అప్పుడు ముక్తాత్మయు దేహముతో సాటియై యచి జ్ఞాతీయుఁడే యగుచున్నాఁడు. వికారము లాత్మకుఁ దెలియుచున్నను నవి యుపాధిప్రయుక్తములు గాన దానియందుఁ జెప్పఁబడవు. పరిశుద్ధం బగు జీవాత్మ స్వరూపమునకు దేవత్వము మనుష్యత్వము మొదలగునానాత్వము గలుగదు. ఎవఁడుదానికిట్టి నానాత్వముగలదని తలంచునో వాఁడువిద్వాంసుఁడు(దేహమునకంటె నాత్మస్వరూపము విలక్షణమైన దని తెలిసినవాఁడు) గాఁడు. వాఁడు దేహమునే యాత్మయని తప్పఁ దలంచువాఁడగును. [1]రెండాకాశములకును దేజస్సులకును వాయువులకును నానాత్వము గలుగనియట్లెయాత్మకును (అనఁగాఁ బూర్వాపర దేహములందు వర్తించుచుండుటంబట్టి భిన్నములయినవిగాఁ దోఁచునట్టియాత్మలకును) భేదము గలుగదు. కుండలము తెమ్ము కటకము ధరింపుమని వ్యవహరించుటకును ధారణాదిప్రయోజనముల కొఱకును బంగార మొక్కటినే రచనావిశేషములచేతఁగుండలాదులగు నానారూపముల మనుష్యులు గ్రహించుచున్నారు. రచ

1. ఆకాశము లని ద్వివచనముచే ఘటాకాశమహాకాశములనియు రెండు తేజస్సులనుటచే సూర్యాదుల బింబ ప్రతిబింబములు రెండును, రెండు వాయువులనుటచే బాహ్యమును శారీరమునగువాయువులు రెండును గ్రాహ్యము. ఏకకాలమందలి యీరెండిటికి భేదము గలుగనియట్లె భిన్నకాలములయందుండెడి. అనఁగా పూర్వదేహమందును బిమ్మటిదేహమందును వర్తించెడి యాత్మలకును భేదము గలుగదని తెలియునది.

నావిశేషములు మొదలగు క్రియలకొఱకును ధారణాదులగు ప్రయోజనముల కొఱకును కుండల కటకాదులు సత్యమే; మఱి కారణమగు బంగారమునకంటె వేఱుగానివే యగును. అట్లే సూక్ష్మచిదచిత్తులతోఁ గూడిన భగవంతుఁడొకఁడే లౌకికములును వైదికములునగు వచనములచేత విశిష్టాద్వైతవాదులగు జనులచేత నానావిధముల జగద్రూపముగాఁ బరిణమించినట్లు చెప్పఁబడుచున్నాఁడు. అట్లు నానారూపములుగల జగము సత్యమగుటయే కాక కారణమగు భగవంతునికి వేఱుగాదు. [2] సూర్యునివలనఁ బుట్టినదై సూర్యునిచేతనే ప్రకాశితంబగు మేఘము సూర్యాంశమయిన కన్నులకుఁ దమస్సువలె దర్శన

---

1. 'కటకమకుటకర్ణికాది భేదైః కనకమభేదమపీష్యతేయథైకమ్ । సురనరపశుపాదపాదిభేదైర్హరిరఖిలో౾పి దీర్యతేతథైకః' ఇత్యాదులులౌకికవచనములు. 'యథా సోమ్యైకేన లోహమణినా సర్వం లోహమయం విజ్ఞాతం స్యాద్వాచారమ్భణం వికారో నామధేయం లోహమణి రిత్యేవ సత్యమ్' ఇత్యాదులు వైదికవచనములు. కుండల కటకాది దృష్టాంతముచేత కుండలాదులు సత్యమయ్యును గారణమగు బంగారునకు వేఱుగాకయు నుండు నట్లే జగత్తు సత్యమయ్యుఁ గారణమగు భగవంతునకు వేఱుగాకయు నుండునని తెలియునది. జగద్రూపవికారము నిర్వికారుఁడగు భగవంతునకుఁ జెప్పఁదగ దన్నచో భగవంతుఁడు స్వరూపముచేత గాక చిదచిద్విశిష్టంబగు వేషముచేత నట్టి వికారమును బొందుచున్నాఁడనుటచే ఆదోషము గలుగదు. అట్లేని భగవంతుఁడు తాను వ్యాపించియున్న హేయముల దోషములయొక్క స్పర్శము నొందఁడా యన్నచో భగవంతుఁ డనుటం బట్టి యట్టి హేయముల కాస్పదముగాఁ డనియుఁ దెలియునది.

2. ఇచట మేఘము సూర్యకిరణములతో మిశ్రమయిన ధూమాదితమోద్రవ్యములచేతరచితమైన దగుటచే సూర్యుని వలనఁ బుట్టినదనఁబడుచున్నది. కన్నులు సూర్యాధిష్ఠితములగుటచే సూర్యున కంశముగాఁజెప్పఁబడినది. సూర్యునియంశమగు కన్ను సూర్యునిఁజూచునప్పుడు సూర్యునివలనఁ బుట్టిన

ప్రతిబంధకమగును (అనఁగా నా సూర్యుని మఱుఁగుపుచ్చునదగుచున్నది) ఇట్లె యహమభిమానవిషయ మగు దేహము పరమాత్మకు విశేషణమై పరమాత్మచేతఁ బ్రకాశితమై పరమాత్మనియంశ మగు జీవుని జ్ఞానమునకుఁ బ్రతిబంధకమగుచున్నది. సూర్యునివలనఁ బుట్టినయా మేఘము వాయువుచేతఁ జెదరిపోయినపుడు చక్షుస్స్వరూపము సూర్యునిఁ జూచుచున్నది. అట్లె యహంకారపరిణామం బగు దేహమనెడియుపాధి యాత్మయొక్క జిజ్ఞాసచేత (విచారపూర్వకమైనయుపాసనచేత) నశించినపుడు, ఆత్మ పరమాత్మను సాక్షాత్కరించుచున్నది. ఇట్లు వివేకము మొదలయిన సాధనము లేడింటిచేత ననుగృహీత మగు భగవదుపాసన మనెడుఖడ్గముచేత, మాయావికారమైన యహంకారవుఁ బరిణామంబగు దేహసంబంధమనెడి యాత్మబంధమును ఛేదించి తన యంతరాత్మ యగు నచ్యుతు ననుభవించుచుండుటయె, రాజా ! [1] ఆత్యంతిక ప్రలయ మని చెప్పుదురు. పరంతపా ! బ్రహ్మాదులగు సమస్తభూతములకును బ్రతిక్షణమును నుత్పత్తి ప్రలయములు గలుగుచున్న వని (అనఁగా బ్రహ్మ మొదలుగా సమస్తక్షేత్రజ్ఞులశరీరము లెప్పుడును పరిణామము మొందుచునేయుండుట వలన నుత్తరోత్తరావస్థ గలుగుట యుత్పత్తి యనియుఁ బూర్వాపూర్వావస్థాప్రాప్తి [2] ప్రలయమనియు) సూక్ష్మజ్ఞులయిన

మేఘము అడ్డపడునట్లు, పరమాత్మని శరీర భూతుఁ డగుజీవునకు పరమాత్ముని దర్శించినపుడు పరమాత్మునివిశేషణమగు దేహము,అడ్డపడుచున్నదనిభావము.

1. దేహోపాధివిలయమె ఆత్యంతిక ప్రలయమని తెలియునది.

2. ఇవియె నిత్యోత్పత్తి ప్రలయము లనిభావము. ఇది స్థూలదృష్టులకు తెలియదుఁగాన సూక్ష్మజ్ఞులు చెప్పుదు రనఁబడెను.

కొందఱు చెప్పుచున్నారు. నదీప్రవాహవేగమందు విడువం బడుచున్న తృణకాష్ఠాదులు నానావిధములయిన యవస్థలు పొందునట్లు పరిణామస్వభావములయిన దేహములకు నిత్యమును గలుగుచున్న యాయా యవస్థలు సంయోగ వియోగములంబట్టి జన్మప్రలయములకు హేతువు లగుచున్నవి. ప్రతిక్షణమును నవస్థలు గలుగుచుండినచోఁ గనంబడవేల యని యడుగవచ్చును. ఈశ్వరమూర్తి యగు కాలముచేత నిత్యమును గలుగుచుండెడి యవస్థలు, ఆకాశమందు సంచరించుచుండు సూర్యాది జ్యోతులకుఁ బ్రతిక్షణమును దేశాంతరప్రాప్తి గలుగు చుండినను కనంబడని యట్లు, కనబడకుండును. నిత్యప్రలయమును నైమిత్తిక ప్రలయమును ప్రాకృతిక ప్రలయమును, ఆత్యంతిక ప్రలయమును జెప్పఁబడినవి. కాలముగతి యిట్టిది. కురుశ్రేష్ఠా ! జగమును సృజించువాఁడును నరులకుఁ బ్రాప్యప్రాపకములయినవాఁడును సకలసత్త్వముల కాధారమయినవాఁడును నగు భగవంతుని లీలాచేష్టితములను గుఱించిన యీముచ్చటలు నీకు సంక్షేపముగాఁ జెప్పఁబడినవి. దానిని సంపూర్ణముగాఁ జెప్పుటకు బ్రహ్మాదేవుఁడును శక్తుఁడు గాఁడు. నానావిధములయిన దుఃఖములనెడు కారుచిచ్చు దరికొని పట్టి పీడింపఁగా మిక్కిలి దుస్తరమయి యున్న సంసారసముద్రమును, దాఁటఁ గోరుచుండు పురుషునకు భగవంతుఁడగు పురుషోత్తముని లీలాకథలరసమును ద్రావుటతప్ప దానిని దాఁటుటకు మఱియొక తెప్ప పురుషునకుఁ గలుగ నేరదు. పూర్వమనిరుద్ధరూపుఁడును సర్వజ్ఞుఁడు నవ్యయుండు నగు నారాయణుఁడును భాగవతియైన యీపురాణసంహితను నారదునకుఁ జెప్పెను. ఆనారదుండు

దీనిని గృష్ణద్వైపాయనునకుఁ జెప్పెను. మహారాజా! భగవంతుఁ డా బాదరాయణుఁడు ప్రీతుఁడై వేదసమ్మతంబయినయీ భాగవతసంహితను నుపదేశించెను. దీనిచే యీ సూతుఁడు 'నైమిశారణ్యమందు దీర్ఘసత్త్రము జరుగుచుండఁగా శౌనకాదు లడుగునప్పు డా ఋషులకుఁ దాను జెప్పఁగలఁడు'. ఇది నాలుగవయధ్యాయము.

---

భాగవతమునకుఁ బ్రధానప్రతిపాద్యముసు నిష్కర్షించి చూపుచే ముక్తుండగు విధమును శుకులు పరీక్షిత్తునకుఁ జెప్పుట.

శ్రీశుకుఁడు—ఈ భాగవతసంహితయం దాశ్రితబంధహారుండగు భగవంతుఁడు మిక్కిలియు వర్ణింపఁబడుచున్నాఁడు. అతని ప్రసాదమువలనఁ బుట్టినవాఁడే బ్రహ్మదేవుఁడు. అతని కోపమువలనఁ బుట్టినవాఁడు రుద్రుఁడు. అట్టి సర్వకారణుం డగు హరియె యిందు వర్ణింపఁబడుచున్నాఁడు చుమీ. రాజా ! నీకు మరణ మాసన్నమై యున్నది గాన దప్పించుటకుపాయమునాకు లేదని యున్నావు. 'నే' ననెడి యాత్మనిత్యంబగుటచే మరణము గలుగదుగాన నీవు 'నేను జచ్చెదనే' యని యీపశుబుద్ధి యగు నవివేకమును దిగవిడువుము. నీవు దేహమువలెనే మునుపు లేకుండి యిపుడు పుట్టినవాఁడవు గావు. ఇఁక మీఁదఁ జచ్చువాఁడవును గావు. పుట్టి మరల బీజాంకురములవలెఁ బుత్రపౌత్త్రాదిరూపములతోఁ గలుగఁ బోవు. ఏలనఁగా కాష్ఠమునకంటె వేఱయిన యగ్నివలె, నీవు దేహముకంటె వేఱయినవాఁడవు. స్వప్నమందు తనశిరశ్ఛేదమును దానే చూచు

చున్నాఁడు. చూచినను భేదింపఁబడుచున్న దేహమునకంటె దాను విలక్షణుఁ డయినట్లు జాగరమందును విలక్షణుఁడగును; మఱియు దేహమునకుఁ గల మరణాదులను జూచుచుండుట వలన నాత్మ దేహమునకంటె వేఱు, వానికిఁ బుట్టుకలేదు. చావును గలుగదు. ఘటమునందలి యాకాశ మాఘటము పగిలినపిదప మునుపటివలె నిరూపాధికమైనయాకాశ మగు చున్నది, అట్లే దేహమందలిజీవుఁ డాదేహము మరణించిన పిదప (అనఁగాఁ బరమాత్మోపాసనమువలన నిరవశేషముగాఁ బ్రకృతిసంబంధము నశించినపిదప) పరిశుద్ధావస్థను బొందు చున్నాఁడు. మనస్సు జీవునకు సత్త్వాదిగుణమయములగు దేహ ములను దేహమునకు హేతువులయిన పుణ్యాపాపరూపకర్మము లను సృజించుచున్నది. ఆ మనస్సును గర్మమును మాయను సృజించుచున్నది. ఆ మాయచేతను మనోదేహకర్మముల చేతను జీవునకు సంసారము గలుగుచున్నది. చమురు ప్రమిద ప్రత్తినిప్పు నెడి యివి కూడియుండునంతవఱకును దీపము మంట గా వెలుగుచున్నది. * ఇట్లె పంసారమును కర్మారబ్ధములగు దేహేంద్రియము లుండువఱకు వెలయుచున్నది. రజస్సత్త్వ తమస్సుల వ్యాపారముచేత (అనఁగా మూఁడుగుణముల సంస ర్గము కారణముగా) నాత్మకుజననమును మరణమును గలుగు చున్నవి. స్వతస్సిద్ధముగా నవి యాత్మకుఁ గలుగవు. ఎట్లన నా దేహము పుట్టునపుడును జచ్చునపుడును నాత్మ కూడఁ బుట్టు టయు జచ్చుటయు, గలుగదు. ఏలన నది వ్యక్తమగు శరీర

---

* ఇట చమురు కర్మము. ప్రమిద మనస్సు. ప్రత్తి దేహము. అగ్నిసంయో గము దేహాత్మాభిమానము. దీపము సంసారమని తెలియునది.

మునకును నవ్యక్తమగు మూలప్రకృతికిని వేఱయినది. వాని కంటె విజాతీయమైనది గావుననే యది స్వయంప్రకాశమైనది. ఘటము మొదలయిన యుపాధులకంటె నాకాశము వేఱయి నటు దేహమునకంటె వేఱయినయాత్మ దేహమునకు ధారక మైనది, స్వభావముచేత నపరిచ్ఛిన్నమైనది. స్వరూపముచేత వికారములేనిది. ఇట్లు పరమాత్మయందును దేహమునందును నెలకొనియున్న యాత్మను నాత్మచేతనే విచారముసేయుము. శాస్త్రజన్యమగు జ్ఞానముతో నాత్మ విమర్శనముచేయు బుద్ధితోఁగాని, వాసుదేవుని చింతనసేయుచుండు బుద్ధితోఁగాని కూడియుందువేని తక్షకుఁడు బ్రాహ్మణవాక్యముచేతఁ బ్రేరితుఁడయినను నిన్ను దహింపఁజాలఁడు. (అనఁగా నీకు వేదనఁ బుట్టింపనేరఁడు), ఈశ్వరుఁడు మృత్యువులకును మృత్యువు. కాఁబట్టి యతనిని మృత్యుహేతువయినవి దహింపఁజాలవు. అట్టివానిని నిన్నుగూడ నవి దహింపనేరవు సుమీ. 'నేను బరమధామంబగు బ్రహ్మము;పరమప్రాప్యంబగు బ్రహ్మము నేను' అని యి ట్లనుసంధించుచుఁ బ్రాకృతశరీరరహితుం డగు పరమాత్మయందుఁ బ్రత్యగాత్మను శేషత్రైకరసునిఁగా ధ్యానించుచు నుండుఁడు. అపుడు విషముఖములతో నాలుకలు గ్రోయుచుఁ దక్షకుఁడు నిన్నుఁ గఱవఁగా, వానిని, బరమాత్మకు వేఱయినశరీరమును .బ్రపంచమును (భగవత్స్మరణానందమగ్నుండవగుటంజేసి కనుఁగొనవు. రాజా! హరి చేష్టలను గుఱించి నీవేమేమి యడిగితివో యదియంతయు నీకుఁ జెప్పితిని. మఱియు నేమి వినఁగోరుచున్నావు.?' అనెను. ఇది యేనవయధ్యాయము

{శుకులు పరీక్షిత్తు నివిడిచి పోవుట. తక్షకదష్టుఁడై పరీక్షిత్తు మృతుఁడగుట. జనమేజయుని సర్పయాగము. వేదవిభాగ ప్రచారాదికము.}

సకలమైన యాత్మలను సామ్యమునఁ గనుఁగొనునట్టి యామuని వ్యాసపుత్త్రుఁడు శుకుఁడు చెప్పిన యీభాగవత సంహిత నంతయును విని యతనికిశిరనువంచి పాదకమలములకు మ్రొక్కి యంజలి గీలించి పరీక్షిత్తు 'నీవు కరుణాత్ముఁడవై యాద్యంతరహితుఁడయిన యా భగవంతుని హరిని నతనిఁ బొందించు నుపాయమును వినిపించితివి గాన యెంతయు ననుగ్రహించితివి. కాఁబట్టి సిద్ధార్థుఁడనయితిని అచ్యుతునియందే చిత్తము నెలకొనియుండు మహనీయులకు సంసారతాపతప్తులయి యజ్ఞులయియున్న ప్రాణులయం దనుగ్రహము గలిగియుండుట మిక్కిలి యాశ్చర్యముగాదని నాకుఁ దోఁచుచున్నది. ఉత్తమశ్లోకుండయిన భగవంతుఁడు మిక్కిలియుఁ వర్ణింపఁబడెడి యీ భాగవతపురాణసంహితను నీవలన మేము విన్నవారయితిమి. మహాత్మా! అభయంబై యానందరూపమైన బ్రహ్మమును నీవు చూపఁగా నందు జొచ్చి యనుభవమున మునిఁగియున్నవాఁడనుగాన తక్షకుఁడు మొదలయిన మృత్యువులకు నెంత మాత్రము వెఱవను, బ్రాహ్మణోత్తమా! నేను మానముపూని మనంబునందలి కామములనుండియుఁ గామవాసనలనుండియు విడివడి దాని నధోక్షజునియందుఁ జొనిపి ప్రాణములను విడుచుచున్నాను. అందులకై నాకనుజ్ఞయిమ్ము ఉపదేశము వలన జ్ఞానమును భగవదనుభవాత్మకమగు జ్ఞానమును గట్టిగా నాశ్రయించుటవలన దేహాత్మభ్రమము మొదలయిన యజ్ఞా

నము దూలింపఁబడినది. మఱియు మీరు కేవల సుఖరూప మయియున్న భగవంతుని స్వరూపమును జూచితిరి' అనెను.
సూతుఁడు—పరీక్షిత్తిట్లు చెప్పఁగా భగవంతుఁ డాశుకుఁడు రాజువలన సెలవుఁ బుచ్చుకొని యాతనిచేతఁ బూజలంది యంత మునులంగూడి తన నెలవునకుఁ బోయెను. రాజర్షి యగు పరీక్షిత్తును బరమాత్మయందుఁ దన యాత్మ శేషత్త్రైకరసమై నదిగా ధ్యానించి గంగాతీరమందుఁ దూర్పు మొనలుగల దర్భల యం దుత్తరాభిముఖుఁడై కూర్చుండి మ్రానివలెఁ గదలక మెదలక సకలేంద్రియవ్యాపారములను మాయముచేసి దేహ మందును దాని యనుబంధులయందును నభిమానము లేక సంశ యము లెల్లఁ ద్రుంచి మహాసమాధినొంది పరిశుద్ధముక్తావస్థఁ జెందినవాఁ డయ్యెను. బ్రాహ్మణులారా! అప్పుడు బ్రాహ్మణ కుమారుఁడు శృంగి క్రుద్ధుఁడై పురికొలిపిన తక్షకుఁడు రాజును జంపఁగోరి పోవుచు మార్గమునఁ గాశ్యపునిఁ జూచెను. అతఁడు విషచికిత్సచేసి పరీక్షిత్తుని రక్షించి ద్రవ్యమును గడించుటకై పోవుచుండెను. అతఁడు తక్షకుఁడు గఱవఁగా నీఱయినవృక్షమును మరల మొలకెత్తి పొడసూపునట్లు చేయుటంబట్టి విషమును హరించువాఁ డగునని తెలిసి యావిప్రుఁడుకోరినధనముల నిచ్చి తృప్తిగావించిమఱల్చియంత నా సర్పరాజు బ్రాహ్మణరూపమున మఱుఁగుఁ జేసికొని పరీక్షిత్తునిఁ గఱచెను. రాజా తక్షకుఁడు గఱవకమునుపే ముక్తావస్థ నొందియుండెను. అట్టి రాజర్షి దేహము సర్పవిషాగ్నిచేత నెల్లవారును జూచుచుండఁగా తోడనే నీఱయ్యెను. భూమియందును నాకాశమందును దిక్కు లయందు నెల్లయెడల మిక్కుటమయిన హాహాకారము చెల

రేఁగెను, దేవతలును నసురులును మనుష్యులును మొదలగువా రెల్ల మిక్కిలియు నాశ్చర్యపడినవా రయిరి. దేవదుందుభులు మొరసెను. గంధర్వులు నప్సరసులును బాడిరి. దేవతలు బాగుగా గనుచుఁ బువ్వులవానలు కురిసిరి. జనమేజయుఁడు తన తండ్రి తక్షకునిచేత భక్షితుండయ్యెనని విని మిక్కిలి క్రుద్ధుఁడై యప్పుడు మేటి బ్రాహ్మణులనుగొని యాగముచేయుచు నందు సర్పములనెల్ల వేల్వఁదొడఁగెను. సర్పయాగమునందు జ్వలించుచున్న యగ్నిహోత్రమున మహా సర్పములెల్ల దగ్ధము లగుచుండుటను జూచి తక్షకుఁడు భయమున వడఁకుచు నింద్రుని శరణుజొచ్చెను. జనమేజయుఁ డగ్నిహోత్రమునకుఁ దక్షకుఁడు రాకుండుటనుజూచి బ్రాహ్మణులతో 'సర్పాధముఁ డా తక్షకుఁ డేల పడి దగ్ధుఁడు గా కున్నాఁ'డని యడిగెను. బ్రాహ్మణులు 'రాజేంద్రా! వాఁడింద్రుని శరణుజొచ్చినందున నతఁడు వానిని రక్షించుచున్నాఁడు. ఇంద్రుఁ డట్లు వారించుచున్నాఁడు గాన యా సర్ప మగ్నియందుఁ బడకున్నాఁడు' అనిరి. జనమేజయుఁ డది విని యుదారబుద్ధిగాన ఋత్విజులతో 'బ్రాహ్మణులారా! ఇంద్రునితోఁగూడ నాతక్షకుని నగ్నియం దేల కూల్పరు' అనెను. అదివిని బ్రాహ్మణు లాయజ్ఞమందు తక్షకా! ఇంద్రునితోడను నతని నావరించియున్న మరుద్గణములతోను గూడ వేగవచ్చి పడు'మని యింద్రునితోఁగూడఁ దక్షకుని వేల్వసాగిరి. ఇట్లు బ్రాహ్మణులు పలికిన పరుషవాక్యములచేత నింద్రుఁడు తనవిమానముతోడను దక్షకునితోడను స్థానమునుండి కదల్పబడెను. అందుల కతఁడు మనంబున భీతినొందెను. అట్లాయింద్రుఁడు విమానములతోడను దక్షకునితోడను నాకాశమునుండి పడు

చుండఁగాఁ జూచియాంగిరసుఁడగు బృహస్పతి రాజుతో 'మను జేంద్రా! నీవలన నీ సర్పరాజు వధమునొందుట కర్తుఁడు గాఁడు. ఇతఁ డమృతము ద్రాగియున్నాఁడు. వీనికి జరామరణ ములు గలుగవు, రాజా! ప్రాణికిఁ బుట్టుకయును జావును స్వర్గ నరకాదిగతులునుఁ దనతనకర్మముచేతనే కలుగుచున్నవి. కావున నొకనికి సుఖదుఃఖములు మఱియొకనివలనఁ గలుగవు అన్నిటిని సొంతకర్మములే కలిగించుచున్నవి. జంతువు, సర్పము, దొంగ లు, శత్రువులు, నిప్పు,జలము, ఆఁకలి, దప్పి, తెవులు మొదలగు వానివలన మరణము నొందుచున్నది. ఇట్లు వానివలన మర ణమునొందుట తన ప్రారబ్ధకర్మము ననుభవించుటయే కాని మఱొకటి గాదు. కర్మమువలననే యామరణము కలిగెనని తలంపవలయును గాని యీ సర్పాదులవలన ననికాదు. రాజా! కాఁబట్టి యాభిచారికమైన యీ సత్త్రమును ముగింపుము. నిరప రాధములయిన సర్పములు దగ్ధము లయినవి. ఏలనఁగా 'జనులు ప్రారబ్ధమును గుడువకతప్పదుగదా' యనెను. బృహస్పతి యిట్లు చెప్పఁగా రాజా మహర్షివచనమును బహూకరించుచు సర్ప సత్త్రము నుడిగి యాతనిని బూజించెను. (బ్రాహ్మణకోపము వలనఁ బరీక్షిత్తునకును జనమేజయ కోపమువలన సర్పములకును మృత్యువు గలిగినదిగదా. ఇట్లు విద్వాంసులకుఁగూడ సమ్మో హము గలుగుటకుఁ గారణమేమి' యన్నచో) ఇట్లొకని బాధించువానిని గాను మఱొకనిని వానిచే బాధింపఁబడు వానినిగాను గలిగించినదెల్ల విష్ణువు మహామాయయేకాని మఱియొకటి గాదు. ఆ మాయనుబట్టియె యీ యాత్మ విషయములందు గుణవ్యాపారములచేత మోహమునొందు

చున్నది. పరమాత్మ స్వరూపనిరూపకులగువారు పరమాత్మ స్వరూపము నొక్కసారియైనను జేయుచుండునపుడు మాయ తన కార్యమును జేయ నేరదనఁగా నిఁక వారికి విషయమైన పరమాత్మస్వరూపమునందది తన కార్యమును జేయ నేరదని చెప్ప నేల? మఱి యా పరమాత్మునియందు మాయాప్రయుక్త మోహమువలన నానావిధములయిన కుతర్కరూపములగువికారములు గలుగవు. ఏలన వాని కది గోచరము గానేరదు. మఱియు నా పరమాత్మయందు మనస్సు సంకల్ప వికల్ప వ్యాపారములతోఁ గూడి ప్రవర్తింప నేరదు. అట్టి మనస్సునకును నది గోచరము కానేరదు. ఏలన సంకల్ప వికల్పము నెల్ల నివర్తించి యోగముచేఁ బరిశుద్ధమయిన మనస్సునకే యది విషయమగునది మఱియు నా పరమాత్మయందుఁ గర్మమును నది సృజించుశరీరమును గలుగవు. కర్మమువలనను నదికల్పించు దేహమువలనను సాధ్యము లగు సుఖదుఃఖాదిఫలములును గలుగవు. దేవుఁడు మనుష్యుఁడు మొదలయిన శబ్దసమూహమును నందువర్తింపవు. పరమాత్మ స్వరూప మిటువంటిది. జీవుఁడు తాను దనంతట మూఁడుగుణములకు వశ్యుఁడయినను నట్టి పరమాత్మ స్వరూపమును మననము చేయుచుండినచోఁ బృథివి మొదలయిన మాయచిత్తత్త్వమును బరిహరించి యాఁకలి దప్పి మొదలయిన యూర్ములను నిరసించి మనస్సును సమాహితము చేయుటచే, నొకటి నొకటి గలిగించుచును నడఁగించుచు నుండు మూఁడు గుణములు రూపుమాయునట్లుగా, వ్యాపారము లెల్ల నుడిగినవాఁడగును. 'నేతి నేతి' యని ప్రకృతి ప్రాకృత జడాజడవస్తువు లెట్టివో యట్టిది కాదు కాదని దానికంటె నితరము

లయిన చేతనాచేతనములనెల్ల వ్యావర్తింపఁ గోరుచుండునట్టి వారు దానిని బ్రకృతి పురుష విలక్షణమై వైష్ణవంబగు స్వరూపముగా నెన్నుచుందురు. మఱియు నట్టివారు రాగద్వేషాదులను విడిచి భగవంతుఁడు తప్పఁ దక్కినవానియందు సౌహార్దము లేక ధ్యానాదులచేత దానినిసంశ్లేషించి సమాధినిష్ఠులై యిట్టిదిగా నిశ్చయించియున్నవారు. ఎవ్వరికి గేహదేహములను గూర్చికలుగు 'నేను' 'నాది' యనెడు దౌర్జన్యము గలుగదో యట్టివారా విష్ణువు పరమంబగు పదమును నుపాసనముచేత సాక్షాత్కరించుచున్నారు. పరుసములయినమాట లెవరేనిపలికిన సహించుకొనవలయును. ఎవ్వరిని నవమానింపరాదు. ఈ మనుష్యదేహము నాత్తగా నుద్దేశించి యెవ్వనితోడను వైరము పెట్టుకొనరాదు అసంకుచిత బుద్ధియగునాభగవంతునికి వేదవ్యాసులకు నమస్కారము. ఆతనిపదాంబుజముల ధ్యానము వలననే నీసంహిత నధిగమించితిని' అనెను. శౌనకుఁడు వేదాచారనిరతులును వేదప్రవర్తకులును మహాత్ములునగు పైలుఁడు మొదలగు వ్యాసశిష్యులచేత వేదము లెన్నివిధముల విభజింపఁబడినవి? సౌమ్యా! వీనిని మాకుఁ జెప్పు'మని యడిగెను. సూతుఁడు—బ్రాహ్మణోత్తమా! భగవంతునియందు నెవ్వని మనస్సు సమాహితమైయుండునో యా పరమేష్ఠి యగు బ్రహ్మదేవుని హృదయమందలి యాకాశమునుండి నాదము (అనఁగా నాయాకాశముతోఁ గూడిన వాయువుపరిణామంబగు ప్రాణఘోషము) ఆవిర్భవించినది. ఆనాదము చెవులను మూసికొనుటవలన వినఁబడుచున్నది. ఆనాదము నుపాసించుట వలన యోగులు శరీరమువలనను ద్రవ్యా ఫుణ్యాకర్మముల

వలనను నింద్రియముల వలనను గలుగు కర్మమలమును దూలించి యా యుపాసనము జ్ఞానోత్పాదకమగుట వలన మోక్షమును బొందుదురు. ఆ నాదమువలన నుండి యకారోకార మకారములు మూఁడువర్తించుచున్న యోంకారము పుట్టినది. యోగులు గానివారికి దానికిఁ బుట్టుక తెలియుట యశక్యము. అది తనంతటనే ప్రకాశించుచుండునది. అది భగవంతుఁడును బరబ్రహ్మంబునగు పరమాత్మునకు వాచకమయినది. ఎవ్వఁడీ ప్రణవరూపంబగు శబ్దమును జెవులు గట్టిగామూసి కొనియున్నను గూడ వినుచున్నాఁడో వాఁడు పరమాత్ముఁడే; జీవుఁడివలె నింద్రియాయత్తజ్ఞానము గలవాఁడు గాఁడు. ఆ ప్రణవము చెవులు మూసికొనుటవలన విషయాంతరములు కనుఁగొనకుండఁగా వినబడుచుండునది. దానిచేత లౌకికవైదిక శబ్దరాశి యంతయు వ్యక్తమగుచున్నది. ఆప్రణవస్వరూపమునకు హృదయాకాశము వెలువడుస్థాన మగును. అది స్వమహిమమందు నెలకొనియున్న బ్రహ్మమునకుఁ బరమాత్మునకు సాక్షాద్వాచక మయినది. అది సమస్తములయిన మంత్రములకును నుపనిషత్తులకును వేదములకును బీజమయినది.* అది సనాతనము. భృగూద్వహా! ఆ ప్రణవమునకు నకారము మొదలయిన మూఁడువర్ణములు కలిగెను. ఆయకారాదులు మూఁటిచేత (ననన్యార్హశేషత్వము అనన్యశరణత్వము అనన్యభోగ్యత్వ మనెడి) మూఁడర్థములు ప్రకాశింపఁ జేయఁబడుచున్నవి. మఱియుఁ బ్రాప్యత్వము ప్రాపకత్వము మొదలయిన గుణము

* ప్రణవము సనాతనమయిన దనుటంబట్టి యది హృదయాకాశమందు అభివ్యక్తమైనదే కాని యుత్పన్నమయినదని కాదని తెలియునది.

లను బ్రతిపాదించు నారాయణాదినామములు నభిధ వృత్తిచేత స్వార్థములందే వర్తించుచుండుటయు, వానివలన దెలియఁబడుచున్నవి. చతుర్ముఖశరీరకుఁ డగు భగవంతుఁ డ ప్రణవమునుండి నక్షరసమామ్నాయమును సృజించెను అవి హ్రస్వములును దీర్ఘములు నయినయంతస్థము లూష్మములు స్వరములుస్పర్శములు నని యొప్పుచుండును. చతుర్ముఖశరీరకుం డయిన యావిభుఁ డా యక్షరసమామ్నాయముచేత యజ్ఞ ములను బ్రకాశింపఁ జేయుతలంపునవ్యాహృతులతోను సప్రణ వముగాను నాలుగువేదములను నాలుగుముఖములనుండి యా విష్కరింపఁ జేసెను.ఆ బ్రహ్మయానాలుగువేదములను వేదోచ్చా రణాదులందు నిపుణులును బ్రహ్మర్షులునయిన మరీచి మొదలగు పుత్రులను జదివించెను. వైదికధర్మముల నుపదేశించెడియా మరీచిమొదలగువారు తమపుత్రులయిన కశ్యపాదులకువానినుప దేశించిరి. ఇట్లావేదములు ధృతవ్రతులయిన వారివారి శిష్యు లకు నుపదేశించుచురాఁగాఁ బ్రతిచతుర్యుగమునను బరం పరగా వచ్చుచుండెను. అందుఁ బ్రతిద్వాపరము తొలు సంధి యందును మహర్షులగువారు యుగధర్మమును బట్టి జను లాయుష్యమందును సత్త్వమునందును బుద్ధియందును క్షీణించి యుండుటనుజూచి దానిని విభజించిరి. ఆ బ్రహ్మర్షులు తమ హృదయములం దున్న యచ్యుతునిచేతఁ బ్రేరితులై యా వేదములను వ్యస్తములు చేసిరి. కాని, తమంతట నట్లు చేసినవారు గారు. బ్రాహ్మణోత్తమా! ఈ లోపల లోక భావనుం డగు పరబ్రహ్మ మాభగవంతుఁడు బ్రహ్మశివాదు లయిన లోకపాలురు ధర్మరక్షణార్థము తన్ను వేఁడికొనఁగాఁ

బరాశరునివలన సత్యవతియందు నంశాంశ భాగము చేత వ్యాసుండై యవతరించి వేదములను నాలుగు విధములు చేసెను. ఋగ్యజు సామాథర్వములురాసులుగాఁబడియున్న వానినుండి, పోవులుగాఁ బడియున్న మణులగుంపులనుండి యాయా మణులను వేఱువేఱయెత్తి దండలు గ్రుచ్చునట్లు, ఆ యా ఋగాదులను వేఱువేఱ వర్గములుగా నెత్తి నాలుగు సంహితలను జేసెను. ఆ మహామతి తన శిష్యులగు నలువురను బిలిచి యా సంహితలలో నొక్కొక్కదానిని నొక్కొక్కనికి నిచ్చెను. అందుఁ బైలుం డను శిష్యునకు బహ్వృచంబనఁబడు ఋక్సంహితను మొదటిదాని నుపదేశించెను. వైశంపాయనుఁ డను శిష్యునకు నిగదం బనెడి యజుర్గణము నుపదేశించెను. జైమినికి సామములందు ఛందోగసంహిత నుపదేశించెను. అథర్వాంగిరసమను శాఖను తన శిష్యుండగు సుమంతున కుపదేశించెను. పైలుఁడు బహ్వృచం బనెడు తన సంహితను రెండుగా విభజించి తన పుత్రుఁడయిన యింద్రప్రమితికిని శిష్యుఁడయిన బాష్కలునకును నుపదేశించెను. ఆ బాష్కలుఁడు తన సంహితను నాలుగుగా విభజించి శిష్యులయిన బోధ్యునకును యాజ్ఞవల్క్యునకును బరాశరునకును నగ్నిమిత్రునకును నుపదేశించెను. ధీమంతుఁడయిన యింద్రప్రమితి తన సంహితను దనపుత్రుఁడును విద్వాంసుఁడు నగు మణ్డూకేయఋషి చేతఁ జదివించెను. ఆమండూకేయుని శిష్యుఁడు వేదమిత్రుఁడు. దానిని సౌభరి మొదలయిన శిష్యులకు నుపదేశించెను. ఆ మండూకేయుని పుత్రుఁడు శాకల్యుఁడు తన సంహిత నయిదువిధములుగా విభజించి వాత్స్యుఁడు ముద్గలుఁడు శాలీయుఁడు గోఖల్యుఁడు శిశిరుఁ డను

నేవ్వురచేతఁ జదివించెను. ఆశాకల్యుని శిష్యుఁడు జాతుకర్ణుఁడు తన సంహితనుదాని నిరుక్తమును నాలుగుగా విభజించి బాలాకునకును పైంజునకును వైతాలునకును విరజునకును నొసంగెను. బాష్కలుని పుత్త్రుఁ డయిన బాష్కలి యీచెప్పఁబడిన శాఖలన్నింటినుండి యెత్తివాలఖిల్యమనెడు సంహితను రచించెను. పైలాయనుఁడును గార్గియుఁ గాసారుఁడును దానిని జదివిరి. ఇవి యెల్లను బహ్వృచ సంహితలు. వీని నా బ్రహ్మర్షులు ధరించిరి. ఈఛందస్సుల విభాగమును విని జనుఁడు సర్వపాపముల నుండి విడివడుచున్నాఁడు. (ఇది ఋక్శాఖావిభాగము. ఇఁకఁ దైత్తిరీయశాఖ యుత్పత్తి చెప్పఁబడెడిని) వైశంపాయన శిష్యులు అధ్వర్యువులని చరకులనియుఁ జెప్పఁబడుదురు. అధ్వర్యుశాఖ నధ్యయనము చేయుటచేత నధ్వర్యువు లనఁబడిరి. బ్రహ్మహత్యారూపపాపమును నశింపఁ జేయుటకై తమగురు వనుష్ఠింపవలసినవ్రతమును దాము నాచరించినందున చరకులనియుఁ జెప్పఁబడిరి. వైశంపాయనునకు మఱియొక శిష్యుఁడుయాజ్ఞవల్క్యుఁడను వాఁడు గలఁడు. అతఁడు గురువును జూచి 'ఓభగవంతా! ఈయల్పములయిన తపస్సుల నాచరించిన నేమి కలదు? నేను మిక్కిలి దుష్కరమయినవ్రతము నాచరించుచున్నా' ననెను. అందులకు గురువు వైశంపాయనుఁడు బ్రాహ్మణుల నట్లవమానించిన యాజ్ఞవల్క్యునియెడఁ గుపితుఁడై 'నీవిఁకఁజాలును. పొమ్ము నావలన నధిగమించినదానిని వేగ త్యజింపు' మనెను. దేవరాతుని పుత్త్రుఁడగునయాయాజ్ఞవల్క్యుఁడు యజుర్గణములను గ్రక్కి వెడలిపోయెను. అంత మును లాయజుర్గణములనుజూచి గ్రక్కినదానిని బ్రాహ్మణరూపములతోఁ గొనుట యనుచితమని

తలఁచి) వానియందలి చాపలముచేతఁ ది_త్తిరపక్షులై యాయ జస్సులనుమ్రింగిరి. కాఁబట్టియజుశ్శాఖలు తై_త్తిరీయములని పేరొం ది మిక్కిలిరమ్యములయినవి. అంత యాజ్ఞవల్క్యుఁడుగురువువ లనఁజదివిన ఛందస్సులను వెదకినను గానకయాదిత్యమండలములో నున్నయీశ్వరునిట్లుస్తుతించెను.[1] భగవంతుఁడొక్కఁడే యఖి లజగత్తులకు నాత్మస్వరూపమును గాలస్వరూపమునను నుండి (దేవ మనుష్య పశువృక్షము లని) బ్రహ్మ మొదలుగా స్తంబము వఱకుఁగలనాలుగు విధములయిన భూతసమూహములహృదయ ముల లోపలను వెలుపలను నాకాశమువలె నుపాధిచే వ్యవధి నొందక (అనఁగా వ్యాప్యముల దోషములను దానును బొంద క) క్షణము లవము నిమేషము మొదలగు నవయములచేతఁ బెరిఁగిన సంవత్సరగణముచేత జలములను బీల్చుకొనుచు మరల నిచ్చుచును నీలోకయాత్రను నిర్వహించు చున్నాఁడు. అట్టి భగవంతునకు నాదిత్యునకు నమస్కారము. ఓ విబుధర్షభా! సవితా! తపనా! అహరహము మూఁడు సంధ్యలయందును వైదికమార్గమునఁ దన్నుపస్థాపనము చేయుజనులు సమస్తపాప ములను దుఃఖములకు బీజ మగు నజ్ఞానమును భర్జించు నట్టి తేజము గలిగి క్రిందుగాఁ దపించుచుండు నీమండలమును జక్కఁగా ధ్యానించుచున్నాము. నీవు నీ శరీరములగు స్థావర

---

1. ఇందు అఖిలజగదాత్మస్వరూపమునలోపలఁజొచ్చి ప్రేరించుచున్నాఁ డని గాయత్రీ ప్రథమపాదమందలి సవితృశబ్దమునకు నర్థము చెప్పఁబడెను. ఇఁక రెండవపాదమందలి భర్గశబ్దార్థము చేతస్తుతించుచున్నారని తెలియునది.

2. ఇందుగాయత్రీ ద్వితీయపాదమందలిభర్గశబ్దార్థము ప్రతిపాదింపఁబడినది.

3. ఇందు గాయత్రీ తృతీయపాదమందలి సర్వధీ ప్రచోదయి తృత్వము చెప్పఁబడినది.

జంగమసమూహముల మనస్సులకును నింద్రియములకును బ్రాణగణములకును జీవులకును నాధారభూతుఁడవై యంతర్యామివై యుండివాని నెల్లఁ బ్రేరించుచున్నావు. మిక్కిలి భయంకరముఖము గల యంధకారమనెడు నజగరగ్రహము పట్టికొనఁగా మృతిఁ జెందిన దానివలె సంజ్ఞ లేక యున్న యీలోకమును జూచి యనితర సాధారణమైన * కృపాదృష్టిచేత లేపి ప్రతిదినమును మూఁడు సంధ్యలును నిన్నారాధించుటయగు చిత్తసమాధానమనెడి శ్రేయమందుఁ బ్రవర్తింపఁ జేయుచున్నాఁడవు. దేవాధిపతి వగు నీవు భూపతివలె దుష్టజంతువులకు భయమును బుట్టించుచు, నందందు నలుగడల దిక్పాలురు తామరమొగ్గలవంటి చేమోడ్పులఁ బూజగొనంగఁ దిరుగుచుందువు. భగవంతా! త్రిలోకములగురువు లగు బ్రహ్మాదులచే నభివందిత మగు నీవు పదకమలయుగళమును నేను సారము తీసిపోకున్న యజుస్సులను గోరి భజించుచున్నా' నని యుపస్థానము చేసెను. ఇట్లు స్తుతింపఁగా నాభగవంతుఁ డశ్వరూపధరుఁ డయిన విష్ణువు యజుస్సులను సారము చెడకుండఁగనే ప్రసన్నుఁడై యామునికొసంగెను. విభుం డాయాజ్ఞవల్క్యుఁ డపరిమితములయిన యజుస్సులచేఁ బదియేనుశాఖలను గావించెను. అంత నశ్వరూపుఁ డగు హరియాజ్ఞవల్క్యునియం దుంచిన శాఖలను బిదపఁగాణ్వులును మాధ్యందినులును నధ్యయనము చేసిరి. సామగుఁడగు జైమిని మునికి సుమంతుఁడను పుత్త్రుఁ డుండెను. ఆ సుమంతుని కొడుకు సుతన్వుఁడు. జైమిని యాపుత్త్రపౌత్త్రుల కిద్దఱకు నాసంహితను

* ఇందు చతుర్విధపురుషార్థ ప్రదత్వము, తెలుపుచున్నారు.

రెండుగా విభజించి చెఱొకటి యిచ్చెను. ఆ జైమినిశిష్యుఁడు మహనీయుఁడగు సుకర్ముఁడనువాఁడు సామవేద వృక్షమునుండి సామములకు వేయి శాఖాభేదములను గావించెను. ఆ సుకర్ముని శిష్యులు కౌసల్యుఁడగు హిరణ్యనాభుఁడు పౌష్పించుఁడను నిరువురు గలరు. ఆ యిద్దఱును సుకర్ముని మఱి యొక శిష్యుఁడును బ్రహ్మవిత్తముఁడునయిన యావంత్యుఁడును వానిని గ్రహించిరి. పౌష్పింజునకును నావంత్యునకును హిరణ్యనాభునకును సామగులయిన యేనూఱుగురు శిష్యు లుదీచ్యు లనువా రుండిరి. ఆ యుదీచ్యులనుగొంద ఱను బ్రాచ్యులనియుఁ జెప్పుదురు. పౌష్పింజుని శిష్యులయిన లోకాక్షియు జాగలియుఁ గల్యుఁడును గుసీదుఁడును గుక్షియు ననువారు చెఱినూఱేసి సంహితలను గ్రహించిరి. హిరణ్యనాభుని శిష్యుఁడగు కృతుఁడిరువదినాలుగు సంహితలను దనశిష్యులకుఁ జెప్పెను. తక్కిన ప్రసిద్ధములగు శాఖలను నావంత్యుఁడు తన శిష్యుల కుపదేశించెను. ఇది యాఱవయధ్యాయము.

---

అధర్వవేదవిభాగము.

సూతుఁడు— అధర్వవిదుఁడగు సుమంతుఁడు * కబంధుఁడను తనశిష్యునిచేతఁ దన సంహితను జదివించెను. ఆశిష్యుఁడును దానిని రెండుఁగా విభజించి పథ్యునకును వేదదర్శునకును నుపదేశించెను. శౌల్కాయని, బ్రహ్మబలి, మోదగలుఁడు, పిప్పలాయని యను వీరు వేదదర్శుని శిష్యులు. ఇఁక బథ్యునిశిష్యు

* ఇందు కబంధుఁడని చెప్పఁబడకున్నను 'అధర్వవేదంసముని స్సుమన్తు రమితద్యుతిః। శిష్యమధ్యాపయామాస కబన్ధంసోపిచద్విధా' అని వైష్ణవమందుఁ జెప్పఁబడుటంబట్టి యిచటను నట్లె గ్రహింపఁబడుట తెలియునది.

లనువినుము. కుముదుఁడు శునకుఁడు జాజలియు నతని శిష్యులు. బభ్రువును నాంగిరసుఁడగు సైంధవాయనుఁడు ననెడి శౌనకునిశిష్యు లిరువురును నాసంహితల రెంటి నధిగమించిరి. వారిరువుర శిష్యులగు సావర్ణ్యుఁడు మొదలగునితరులును నల్లె యారెంటి నధిగమించిరి మఱియు నక్షత్రకల్పుఁడును శాంతియుఁ గాశ్యపులును నాంగిరసులును నథర్వవేదశాఖను విభజించి వానిని బ్రవర్తింపఁ జేసినవా రగుదురు. ఇఁకఁ బౌరాణికులను జెప్పెదను వినుము. త్రయ్యారుణి, కశ్యపుఁడు, సావర్ణి, అకృతవ్రణుఁడు, వైశంపాయనుఁడు, హారీతుఁడు, నని యీయార్వురును బౌరాణికులు. ఈయార్వురును వ్యాసశిష్యుండును నాతండ్రియు నగు రోమహర్షణుని వలన నొక్కొక్క పురాణసంహిత * నధిగమించిరి. నేను వీరందఱకును శిష్యుఁడనై యన్నిటి నధిగమించితిని. కాశ్యపుఁడును నేనును సావర్ణియుఁ బరశురాముని శిష్యుఁడయిన యకృతవ్రణుఁడును వ్యాసపుత్త్రుఁడగుశుకునివలన నుండి మూలసంహిత లను నాలుగింటిని నధిగమించితిమి. పురాణలక్షణములను వేదశాస్త్రాను సారముగా బ్రహ్మర్షులునిరూపించినవానిని జెప్పెదను. బుద్ధినూఁది వినుము. సర్గము,విసర్గము, వృత్తి, రక్ష, అంతరము, వంశము, వంశానుచరితము, సంస్థ, హేతువు, అపాశ్రయ మని లక్షణములు పది. పురాణలక్షణవిదు లగువారు పురాణము పదిలక్షణములతోఁ గూడినదని తెలియుదురు. కొన్ని మహాపురాణములుగను గొన్ని యల్పపురాణ

* దీనిని బట్టి వ్యాసుఁడు ఆఱుసంహితలను రోమహర్షణునికిఁ జెప్పెననియు నతని వలన నీ యార్గురు పౌరాణికు లొక్కొక్కటి యధిగమించిరనియుఁ దెలియుచున్నది.

మఱుగను నేర్పాటు గలిగియుండుటంబట్టి యల్పపురాణము లకు (సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరము, వంశాను చరిత మని) పంచలక్షణములు గలిగియుండును. అవ్యాకృతం బనబడు మూల ప్రకృతిగుణములయిన సత్త్వ రజ స్తమస్సులు కలగుండు నొందుటవలన నా మూఁడును మహత్తుగాఁ బరిణ మించుచున్నవి. ఆ మహత్తునుండి యహంకారమును, దాని నుండి యాకాశాదిభూతములును వాని సూక్ష్మములయిన శబ్దా దులును నింద్రియములును బుట్టుచున్నవి. వీని పుట్టుకయే సర్గ మనఁబడును. పరమపురుషుఁడు సృష్టిసేయు సామర్థ్య మును గలిగించినపిదప నీ మహదాదితత్త్వములు సంఘాత ముగాఁ గూడికనొంది కారణబీజమునుండి కార్యబీజమువలె యవ్యాకృతమునుండి మహదాదిక్రమమునం బుట్టుచుఁ జరా చరాత్మకంబగు జగత్తగుచున్నది. ఇట్లన్నియుఁగూడి జగత్తగు టయె విసర్గ మనఁబడుచున్నది. ఈ విసర్గమునకు జీవుల కర్మ వాసనయె మూలము. చరములయిన భూతములకు నచరము లయిన భూతములు జీవనోపాయము. అది యీశ్వరుఁడే కావిం చెను. మఱియు నది మనుష్యులకు రాగమువలనను గలుగు నదే కాక శాస్త్రముచేతను విధింపఁబడియున్నది. ఇట్టి జీవనో పాయమే వృత్తి యనఁబడును. అచ్యుతుఁడు ప్రతి యుగమం దును దిర్యక్కులు మహర్షులు దేవతలు మొదలగువానియందు నవతరించుచును నాయా చేష్టితములను జేయుచుండును. ఆ యవతారచేష్టితములే రక్ష యనంబడుచున్నది. ఆ యవ తారచేష్టితములచేత వైదికధర్మ విరోధులు హతు లగు చున్నారు. మనువు, దేవతలు, మనుపుత్త్రులు, ఇంద్రులు, ఋషులు,

హరి యంశావతారములని యీ యేడు గలదిగా మన్వంతరము చెప్పఁబడుచున్నది. మనువులవలనఁ బుట్టిన రాజులచరిత్రము ను గాలత్రయమందలి వానిని జెప్పుట వంశ మనఁబడును. వారివంశమును నిర్వహించువారి చరిత్రము వంశానుచరిత మనఁబడును. కాలకర్మస్వభావము వలన నీ విశ్వమునకు నైమిత్తికము ప్రాకృతికము నిత్యము ఆత్యన్తిక మని నాలుగువిధము లయిన లయమును సంస్థ యని కవులు చెప్పెదరు. అజ్ఞానమూలకమగు పుణ్యాపుణ్య కర్మములను చేయుచుండు జీవులు కర్మఫలానుభవముకొఱకే సృష్టి గావింపఁబడుచున్నది గాన యీ సృష్టి కా జీవులే హేతు వనఁబడును. జీవునిఁ గొంత యనుభవించి మిగిలియున్న కర్మవాసనలతోఁ గూడియున్నవాఁడనియు మఱికొందఱు దేవాదినామరూపములులేనివాఁడనియుఁ* జెప్పుదురు. ప్రకృతికార్యము లగు శరీరములందు జాగ్రత్తు స్వప్నము సుషుప్తియనెడి జీవవృత్తులు గలవుగదా! ఈ జీవవృత్తులందు బ్రహ్మము నిర్వాహకుఁడగుటచే నన్వయముగలిగియు నా యవస్థలచేత స్పృశింపఁబడకుండుటచేత వ్యతిరేకము గలిగి యున్నాఁడు. ఇట్టి యన్వయవ్యతిరేకములు గల యీ బ్రహ్మమే సర్వాధారత్వమునుబట్టి యుపాశ్రయుఁ డనఁబడుచున్నాఁడు. ఆయానామరూపనామములు గల ఘటపటాదిపదార్థములకుఁ బుట్టుక మొదలుకొని నాశముపఱకుఁ గల యాయా యవస్థలు గలుగుచున్నవిగదా. అయినను బదార్థముల ద్రవ్య

---

* అనఁగా సృష్టికిఁ బూర్వము దేవాదినామ రూపములు లేనివారై కర్మవాసనలతోఁ గూడియున్న యా జీవులే యీ సృష్టికి నిమిత్తము గాన హేతు వనఁబడుచున్నారని భావము.

మాత్ర మాయా విశిష్టరూపమున జన్మాదులతోఁ గూడియు విశేష్యమాత్రరూపమున జన్మాదులు లేకయు నుండునట్లు బ్రహ్మము విశిష్టరూపమున జీవావస్థలం * దన్వయమును స్వరూపమున వానినుండి వ్యతిరేకమును గలిగియుండును. చిత్తమెప్పుడు జాగ్రత్తు మొదలయిన వృత్తులు మూఁటి నాశ్రయించుటమాని తనంతటఁ గాని యోగాభ్యాసము చేతఁగాని విషయములనుండి విరమించునో యపుడు సంసారమునుండి నివర్తించుచున్నది. ఇట్లు పదియో యైదో లక్షణములతోఁ గూడియున్న మహాపురాణములును నల్పపురాణములును బురాణవిదులగు మునులుపదు నెనిమిదియని చెప్పెదరు. అవి బ్రాహ్మము, పాద్మము, వైష్ణవము, శైవము, లైంగము, గారుడము, నారదీయము, భాగవతము, ఆగ్నేయము, స్కాందము, భవిష్యము, బ్రహ్మకైవర్తము, మార్కండేయము, వామనము, వారాహము, మాత్స్యము, కౌర్మము, బ్రహ్మాండ మని పదునెనిమిది. బ్రాహ్మణోత్తమా! బాదరాయణమహర్షి శిష్యులును బ్రశిష్యులును వేద పురాణసంహితలను నిట్లు ప్రవర్తింపఁజేయుట నీకుఁ జెప్పఁబడినది. ఇది వినువారికి బ్రహ్మవర్చసము నుద్దీపింపఁ జేయును'. ఇది యేడవయధ్యాయము.

---

**మార్కండేయ చరిత్రము.**

శౌనకుఁడు—సూతా! సాధూ! చిరకాలము జీవింపుము. మాటకారులందు మేటివి. సంసారమునందు భ్రమించు మను

---

* బ్రహ్మము చిద చిద్విశిష్టరూపమున నా యవస్థలందెల్ల నన్వయమును స్వరూపమున వానినుండి వ్యతిరేకమును గలిగియున్నాఁడని భావము తెలియునది.

ష్యులకు నీవు గట్టు చూపువాఁడవు. 'మృకండునికొడుకగు మార్కండేయుని జనులు చిరాయువని చెప్పెదరు. అతఁడు కల్పాంతమందును శేషించియుండె ననియు జగత్తునంతయు గ్రహించిన పరమపురుషుని దర్శించె ననియుఁ జెప్పెదరు. ఆ మార్కండేయుఁ డీ కల్పమునందే స్వకులమునందుఁబుట్టినాఁడు. ఇంతవఱకును బ్రలయమేదియుఁ గలుగకున్నది. ఈ కల్పమందే పుట్టినవాఁడింకను బుట్టని ప్రలయము నెట్లు చూడఁగలిగినాఁడని సందేహముగా నున్నది. అతఁ డేకార్ణవమయి యున్నప్పుడందు భ్రమించుచుండి మఱ్ఱియాకు దొన్నెయందుఁ జిన్నబాలుఁడై పరుండియుండిన పురుషునిఁ గాంచెనఁట. సూతా! ఇది పెద్ద సందేహముగా నున్నందున దీనిని వినఁగుతుకము గలిగియున్నది. మహాయోగీ! నీవు పురాణములను గూడఁ జక్కఁగా నెఱుంగుదువని యంద ఱొప్పుకొన్నవాఁడవు గాన యీ సందేహమును ద్రుంపుము' అనెను. సూతుఁడు 'మహర్షీ! నీవు శోకమలములనెల్లఁ బోకార్చునట్టి యీ ప్రశ్నను జేసితివి. ఏలననిందుఁగలిమలాపహంబగు నారాయణకథ వర్ణింపఁబడియున్నది. మార్కండేయుఁడు తండ్రివలన గర్భాధానాది సంస్కారక్రమమున నుపనయనసంస్కారమును బొంది శాస్త్రోక్తవిధిని వేదముల నధ్యయనముచేసి స్వవర్ణాశ్రమోచిత మగు తపస్స్వాధ్యాయములతోఁ గూడినవాఁ డయ్యెను. అతఁడు తన ధర్మము పెంపునకై నైష్ఠికబ్రహ్మచర్యవ్రతమును బూని శాంతుఁడును జటిలుఁడునై వల్కలముఁలుగట్టి కమండలువును దండమును నుపవీతమును మేఖలనుదాల్చి కృష్ణాజినమును నక్షసూత్రమును గుశలను గయికొని రెండు సంధ్యలయందును నగ్ని

సూర్య గురు విప్రులయందును దనయాత్మయందును హరి నర్చిం చుచు వాఙ్నియతిగలిగి రేపుమాపునుగురువుకొఱకు భైక్షము తెచ్చి గురువు ననుజ్ఞ చేసినయెడల దానిని దినుచు లేనిచో నుప వసించుచు నుండెను. ఇట్లు తపస్స్వాధ్యాయములు గలిగి వేల కొలఁది సంవత్సరములు హృషీకేశుని నారాధించుచుండి యెవ్వరికిని జయింపరాని మృత్యువును జయించినవాఁడయ్యె. ఇట్లతఁడు తపస్స్వాధ్యాయములచేతను సంయమముచేతను నైష్ఠిక బ్రహ్మచర్యమును దాల్చి యోగమున రాగాదిక్లేశము లను ధ్వంసముచేసి మనస్సును విషయములనుండి మరల్చి యధోక్షజుని ధ్యానముచేసెను. ఇట్లా యోగి మహాయోగ మువలన మనస్సును సమాధియం దుంచియుండఁగా నాఱు మన్వంతరముల మహాకాలము కడచనెను. ఈయేడవమన్వంత రమున నింద్రుఁ డతని యోగనిష్ఠను నెఱిఁగి యతని తపంబు నకు 'ఇతఁడేమి నాపదవిని గోరుచున్నాఁడా' యని శంకించి దానిని జెఱుపుట కారంభించెను. అతఁ డామునికడకు గంధర్వు లను నప్సరసలను గాముని వసంతుని మలయానిలమును రజ స్సును లోభసుతను మదమునను బంపెను. వారుహిమాచలము నుత్తరపార్శ్వమం దున్న యతని యాశ్రమమునకుఁ బోయిరి. అచటఁ బుష్పభద్ర యనునదియు, చిత్ర యనెడు శిలయునొప్పు చుండెను. వా రాపుణ్యాశ్రమముచు బోయి చేరిరి. అందుఁ బవిత్రములయిన వృక్షములును లతలును వెలయుచుండెను. మఱియుఁబుణ్యములగు పక్షిగణములును బుణ్యంబయిననిర్మల జలాశయములును నందు విలసిల్లుచుండెను. అందుఁ దుమ్మెదలు మత్తిల్లి పాటలు పాడుచుండెను. కోయిలలు కెరలి కూయు

చుండెను. నెమిళ్లు క్రొవ్వి యాడంబరముగా నాడుచుండెను. అప్పుడు మలయానిలము హిమాలయమందలి సెలయేటితుంపర లతోఁ గూడి పువ్వులతావులతో నెనసి మరులు చెలరేఁగించుచుఁ బొలయుచుఁ బ్రవేశించెను. వసంతుఁడు రాత్రి పొడచెంచు నపుడు చందురుఁ డుదయించుచుండఁగాఁ జిగుళ్లు గుత్తుల జొంప ములను దట్టముగాఁ బెనఁగొన్న మ్రాఁకుతీఁగల గుబురులను వెలయుచు నందువచ్చెను. అప్సరల గుంపులకు గమికాఁడయిన పూవిలుకాఁడు తన్ను గంధర్వులును గీతములును వాద్యము లును వెంబడించి వచ్చుచుండఁగా నచ్చరలంగూడి విలునమ్ములు గొని యచటఁ గనఁబడెను. ఆ యింద్రుని భృత్యు లట్లు వచ్చి, యగ్నినివేలిచి కన్నులుమూసికొని యెవ్వరికిని జెనకరాక యగ్ని యామూర్తిని దాల్చెనో యన్నట్లు కూర్చుండియున్న యా మునిని గాంచిరి. అతనిముందట స్త్రీలు నర్తనము చేసిరి. పిదప గాయకులు పాడిరి. మఱియు మృదంగములను వీణెలను బణవ ములను గొని మనస్సున కింపుగా వాద్యములు వాయించిరి. కాముఁడు తన వింటియందరవిందాదులయిన యైదుముఖములు గల బాణమును దొడిగెను. వసంతుఁడును మదమును రజ స్సును లోభమునును - ఈ యింద్రభృత్యు లతనిని గంపింపఁ జేసిరి. అప్పుడు పుంజికస్థలి బంతులు గొని యాడుచుండఁగా దాని పాలిండ్లబరువున సన్నని నెన్నడుము మిక్కిలి నకనక లాడుచుండెను. దాని కురులనుండి పువ్వులు జలజల రాలెను. ఆవన్నెలాఁడి చూపుల నిటునటు జెళుకులజర నిగిడించుచుబంతి వెంటఁబోవుచుండఁగా నా యురవడిచేత దాని మొలనూలు తెగినదయ్యె. అప్పుడు వాయువు దాని సన్నని వలిపంపువలు

నను దోలఁగఁబుచ్చెను. అప్పుడు మన్మథుఁ డాముని తనకోటు వడినాఁ డని తలఁచి బాణమునతనిపయి నేసెను. వాఁడుచేసిన వన్నియు నాతనియందు, ధనము లేనివానిప్రయత్నము వలె, వ్యర్థములాయెను. మునీ ! వారిట్లామునికి నపకారము చేయు చున్నను నతని తేజముచేత దగ్ధులగుచు, సర్పమును మెయి కొలిపిన బాలురవలె, మరలి పోయిరి. ఇట్లింద్రుని యనుచరు లెంత దలపడి కీడ్పఱచినను నమ్మహాముని యహంకార భావంబగు వికారమునొందఁ డయ్యె. ఇది మహాత్ములయం దొకవింత కాదు. కాముఁడు వాని యనుచరగణమును దేజముదూలి విన్ననై యుండుటనుజూచి భగవంతుఁడింద్రుఁడు బ్రహ్మర్షియగు నతని ప్రభావమును విని మిక్కిలి విస్మయము నొందెను. అతఁ డట్లు తనచిత్తమును దపస్స్వాధ్యాయసంయమముల చేత సమాధి నుంచి యుండఁగా నరసహితుఁడగు నారాయణుఁడు హరియతని ననుగ్రహించుటకై ప్రసన్నుఁడయ్యెను. ఇద్దఱును దెల్లనినల్లని వన్నెలు గలిగి, నాలుగుభుజములతోను గొప్పదామరలవంటి కన్నుంగవలతోను గూడి, వల్కలాజినములు దొడిగి చేతి యందుఁ బవిత్రమును దాల్చి, తొమ్మిదిపేఁటల యజ్ఞోపవీతమును గమండలువును వక్రముగాని వేణుదండమును, పద్మాక్షమాలి కను,దోమలు మొదలగుజంతువులను దుడుచుకొను వస్త్రమును, దర్భముష్టినిగొని తపస్సే యారూపములు దాల్చినట్లు చూపట్టు చుండిరి. మఱియుఁ దలతల మెఱయుచున్న మెఱుపుఁదీగలవంటి కాంతులు దొలఁకుచున్న దేహరుచులతో దేవతావర్యులచేత నర్చితులై వెలయుచుండిరి. భగవంతుని రూపములగు నానర నారాయణఋషులను జూచి ముని లేచి యాదరంబున దండ

ముపలెఁబడి, నమస్కరించెను. అతఁడు వారి సందర్శనము వలనఁ గలిగిన యానందముచేత దేహమును మనస్సును నింద్రియములును నిర్వృతములుకాఁగా మేను గఱుపాఱఁ గన్నులనానందబాష్పములు గ్రమ్ముకొన వారిని దలయెత్తిచూడఁజాలకపోయెను. అతఁడు లేచి చేతులుమోడ్చి వినయవినమితుఁడై యాత్సుక్యముచేతఁగౌఁగిలించు కొనువానివలె మాట డగ్గుత్తికపడ 'నమోనమః' అని యా యీశ్వరులంగూర్చి పలికెను. అంత నతఁడు వారికి నాసనము వైచి పాదకమలములను గడిగి, తగిన చందనముచేతను, ధూపముచేతను, మాల్యముచేతను బూజించెను. అంత నాయిద్దఱును సుఖంబుగ నాసీనులై ప్రసాదింప నభిముఖులై యుండఁగా ముని మరల వారిపాదములయందుఁబడి మ్రొక్కి యా మిక్కిలి గొప్పవారలతో నిట్లనియె.

మార్కండేయుఁడు—విభో! ని న్నేమని వర్ణింతును? ఏలన నాకును దక్కిన దేహధారులకును బ్రహ్మ రుద్రులకును గల ప్రాణములను నీవు ప్రేరించుట వలననే చలనమొంది తన తన వ్యాపారములు చేయఁగలుగుచున్నవి. అట్లు చలనమునొందు ప్రాణముల ననుసరించి వాక్కును మనస్సును నింద్రియములును జలనము నొందుచున్నది. ఇట్టి ని న్నేమని వర్ణింపవచ్చును! ఇట్టి వాఁడ వేని న న్నందఱేల యుపాసింపరందువా? ప్రాణులకెల్ల సామాన్యముగా నీవుప్రాణాదులను జలింపఁజేయువాఁడవే యైనను భజించునట్టి పురుషులకే ని న్నుపాసించునట్టి యభిప్రాయమును స్థిరముగాఁ గలిగింతువు. భగవంతా! ఈ మీ భగవన్మూర్తులు రెండును ముల్లోకముల క్షేమమునకు సంసారతాపమెల్ల నడఁగుటకును మృత్యువును జయించుటకును నగు

చున్నది. ఎట్లన నీవు రాముఁడు కృష్ణుఁడు మొదలుగా నానావిధములయిన యితరదేహముల నీజగమును సృజించుటకై తాల్చుచున్నావు. ఈ సర్వజగత్తును సృజించి మరల సాలెపురుగువలె దీనిని గ్రసించుచున్నావు. ఇట్లు సృష్టిసంహారములు సేయువాఁడై తన యవతారములచేత రక్షించుచుఁ జరాచరములలోపలఁ జొచ్చి ధరించి నియమించుచుండు నీదుపాదమూలమును భజించుచున్నాము. ఆ పాదములను భజించుటవలనఁ బుణ్యాపుణ్యకర్మములందలి రజస్సయిన సుఖదుఃఖములును గుణముల రజస్సయిన కామక్రోధములును, గాలము రజస్సయిన శీతాతపవాతాదులును నంటవు. వేదతాత్పర్యవిదులయినజను లా పాదమూలమును బొందుటకై వానిని మాటికి స్తుతించుచును మ్రొక్కుచును నారాధించుచు నుందురు. నిరతిశయపురుషార్థరూపా! ఈశా! నీయంఘ్రులచేతఁ జుట్టు నలుప్రక్కలనుండి, యే భయమును గలుగనేరదు. అట్టి నీయంఘ్రులప్రాప్తికంటె మఱియొక శ్రేయము నెఱుంగనేరము. బ్రహ్మకుఁ గల లోకము గూడ రెండుపరార్థములకాల ముండునే కాని సతముగాదు. కాన యట్లు స్థాయిగాని బ్రహ్మయుఁ గాలరూపుఁడగు నీకు భయపడుచున్నాఁడు. ఇఁక నతఁడు సృజించినభూతపరిణామములైన దేహధారులు భయపడుట చెప్పనేల! ఇట్లు సత్యసంకల్పుఁడును బరమాత్ముఁడును గురుండును సర్వమునకుఁ బరుండునగు నీదుపాదమూలమును మిక్కిలి యాత్మహితమయినది గనుక మిక్కిలియు దుష్టమై నిష్ఫలమైయున్న యీ దేహాదులను దిగవిడిచి దానినే భజించుచున్నాను. ఎవ్వనికి నీ పాదమూలమును కూర్చిన జ్ఞానము మాత్రముగలదో వాఁడు తన కభిమతము

లయిన సమస్త పురుషార్థములను బొందుచున్నాఁడు. ఈశా !
ఆత్మబన్ధూ ! నీజగత్తునకుఁ గల యుదయస్థితిలయములకు నీ
బ్రహ్మరుద్రాఖ్యములగు దేహములే హేతువులే యనియును,
ఆ దేహములును, సత్త్వము రజస్సు తమస్సన్నియుఁన్ను నీదు
మాయచేత లీలార్థము ధరింపఁబడినవే కాని మఱియొండు
గాఁదనియును దెలియుదుము. అట్లు తెలిసినను వానియందు
సత్త్వమయమగు నీ దేహమే క్షోభయుక్తమగు శాంతిని గలి
గింపఁ జాలుచున్నది కాని తక్కిన బ్రహ్మరుద్రాఖ్యదేహములు
గావు. ఆ రెంటి నుపాసించుచు వచ్చినచో వ్యసనమును
మోహమును భయమును గలుగును. భగవంతా ! కాఁబట్టి
నీదు భక్తులకుఁ బ్రియంబును నీకును గారామునయిన శుద్ధ
సత్త్వమయదేహమునే కుశలు లగువారు భజింతురు. పురుషుం
డగునీదురూపంబయిన యావిశుద్ధసత్త్వమును బంచరాత్రసిద్ధాం
తముల నెఱింగినజను లుపాస్యముగాఁ గోరుచుందురు. పురుష
రూపమైన యాసత్త్వము నుపాసించుచు రాఁగాసంసారభయము
వీడును; మఱి యాత్మసుఖము గలుగును గాని భయమిశ్రమ
యిన యితర సుఖముగలుగదు. ఇట్లు పురుషుండును (చతుర్వి
ధపురుషార్థప్రదుండును) భూముఁడును (సర్వాంతరాత్ముం డగుట
చేత భూమగుణ విశిష్టుండును) కాఁబట్టి విశ్వుండును (విశ్వాకార
మున నెలకొనియున్నవాఁడును) విశ్వగురుండును (విశ్వము
నకు శరీరహితాచరణశీలుం డగుటంబట్టి హితకరుండును)
పరదేవతయును నారాయణుండును ఋషియు నరోత్త
ముండును హంసుండును ( ఆశ్రితదోషనిరాకర్తయు )
సంయతగిరుండును నిగమేశ్వరుండును (వేదాచార్యుండు) నగు

భగవంతునకు నీకు నమస్కారము. నీమాయచేత మఱి యా వరింపఁబడి యున్నందున వ్యర్థములగు నింద్రియమార్గము లందు బుద్ధి దిరుగుడు వడుచున్న దేహాత్మాభిమాని, నీవు తన ప్రాణములందును హృదయమందును దృగ్విషయములం దును నియామకుఁడై నెలకొనియున్నను నిన్నెఱుంగ నేరకు న్నాఁడు. అఖిలగురుండవయిన నీవు మొట్ట మొదటఁ బ్రవర్తిం పఁ జేసిన వేదము నాశ్రయించియున్నవాఁడే నిన్ను వేదాంత విహితమైన యుపాసనచే విశుద్ధంబగు మనంబున సాక్షాత్తుగ నెఱుంగుచున్నాఁడు. నిన్ను దర్శించుట కుపాయంబయినది వేదమే. అదియే పరమాత్మవగు నీదు రహస్యమును బ్రకా శింపఁజేయునది. మఱి హిరణ్యగర్భకపిలాదులు యోగసాం ఖ్యతంత్రములచేత నీస్వరూపమును విమర్శించుటకుఁ బ్రయ త్నించుచున్నను నీవిషయమునఁ దబ్బిబ్బుపడుచుందురు. ఇటు యోగముసాంఖ్యము మొదలయిన వాదముల నన్నింటిని బ్రతి పాదించునట్లు స్వరూపమును స్వభావమును బ్రకృతి పురుషాదు లందుఁ గలుగనివి యెవ్వనికిఁ గలవో, తనయందు గూఢమై వారికిఁ దెలియఁబడకున్న యపరిచ్ఛేద్యజ్ఞానవైభవము గల యట్టి మహాపురుషునకు వందనములు చేయుచున్నాను' అని స్తుతించెను. ఇది యెనిమిదవయధ్యాయము.

---

## మార్కండేయ చరిత్రము.

(అనుబంధము.)

సూతుఁడు:— బుద్ధిమంతుఁ డామార్కండేయుఁ డట్లు స్తుతింపఁగా, నారాయణుఁడును నరసఖుండు నగు భగవం

తుఁడు—'ఓ యోగీ! ఎడతెగని చిత్తసమాధిచేతను నా యందలి భక్తిచేతను తపస్స్వాధ్యాయసంయమముల చేతను నీవు సిద్ధుండవు. బ్రహ్మర్షి శ్రేష్ఠుండవు నగుదువు. నీదు నైష్ఠిక బ్రహ్మచర్యవ్రతమునకు మేము మిక్కిలి సంతుష్టిఁ జెందితిమి. నీకు శుభం బగుఁగాక. వరదులందు మిన్నను గాన నావలనఁ గోరిన వరమడుగుము' అనెను. ఋషి—'దేవదేవేశా! ప్రపన్నార్తిహరా! అచ్యుతా! నీకు జయము జయము. నీవు నాకు దర్శన మొసంగితివే. ఇంత మాత్రము వరమే చాలును. బ్రహ్మాదు లెవ్వని పాదారవిందముల దర్శనము యోగ పరిశుద్ధంబగు మనంబునఁ గేవలము వాంఛించుచున్నారు గాని దర్శింప నేరరయిరో యట్టి నీవు నాకన్నులకుఁ బ్రత్యక్షమైతివే! ఇంతకు మించినవర మేమున్నది? అంబుజపత్రాక్షా! పుణ్యశ్లోక శిఖామణీ! నీదర్శనమే యెక్కుడు; అయినను బ్రహ్మ మొదలుగాఁ గల సకల జనులు సచ్ఛబ్దవాచ్యులయ్యు దేనిచేతఁ దాము దేవ తిర్యఙ్మనుష్యస్థావరములుగా భిన్నులయి యుండు నట్లు తెలియుదురో యట్టి నీయాశ్చర్యశక్తిరూపమగు మాయనుగూడఁజూడ నువ్విళ్లూరుచున్నాను' అనెను. ఇట్లాఋషి మిక్కిలియు స్తుతింపఁగా భగవంతుఁడీశ్వరుఁ డట్లె యగుఁ గాక ని చిఱునవ్వుతోడఁ జెప్పి బదర్యాశ్రమమునకుఁ బోయెను. ఋషి యాభగవంతునిమాయను జూడవలయునను టయే చింతించుచుఁ దనయాశ్రమమందే వసించుచు అగ్ని, సూర్యుఁడు, సోముఁడు, జలము, భూమి, వాయువు, ఆకాశము, హృదయము, గోవు, విప్రులు మొదలగువానియందు హరిని ధ్యానించుచు మానసోపచారములచేతఁ బూజించుచుండెను.

అతఁ డాకానొకప్పుడు ప్రీతిమయమగు భక్తిరసప్రవాహము నందు మునిఁగి యీపూజను మఱచినవాఁ డయ్యెను. ఒకనాఁ డతఁడు పుష్పభద్రానదితటమునఁ గూర్చుండి యుండఁగా సంధ్యాసమయమున పెద్ద వాయు వొకటి పుట్టెను. అది ప్రచండమయిన శబ్దము గలిగించుచుండఁగా దాని ననుసరించి పెద్ద పెద్ద మేఘములు భయంకరములుగాఁ బొడ కట్టినవి. అవి మెఱుములు మెఱయుచు నుఱుములు బిట్టుగా నుఱుముచు బండి కన్నులంతేసి పెద్ద వర్షధారలు నలుప్రక్కలఁ గురియ సాగినవి. అంత నాలుగు మహాసముద్రములును వాయువేగముచేతఁ బెద్ద కరడులెగయ నుగ్రములయిన మొసళ్లు చెలఁగ మిక్కిలి భయంకరములయిన సుడి గండములతో దెప్పరమయి ఘోషించుచు భూతలమును నలుప్రక్కలఁ గ్రమ్మి మ్రింగుచుండుట గానంబడెను. ఆకాశము నతిక్రమించినవై జలములును, వేండ్రములయిన సూర్యకిరణములును, మెఱపులును, గూడి దేవ తిర్యఙ్మనుష్యస్థావరము లని నాలుగు విధముల నుండు జగము నంతయును నామునితోఁగూడఁ దపింపఁజేసెను. ఇట్లు భూమి జలములందు మునుంగుటను జూచి ముని మిక్కిలియు భయము నొందెను. అతఁ డట్లు చూచుచుండఁగానే మహాసముద్రము నలలచే మిక్కిలి భయంకరమై బిట్టు గాలిచే జలమంతయు నల్లకల్లోలపడు చుండఁగా, మేఘములు వర్షించుచు దానిని నింపి పొంగి పొరలఁ జేయుచుండఁగా, నది పొరలి భూమండలమును నందలి ద్వీపములను వర్షములను బర్వతములను నేక కాలమున ముంచి మాయముచేసెను. అప్పుడు భూమియు నంతరిక్షమును దేవలోకమును నక్షత్ర

సమూహమును దిక్కులు నన్నియు మూఁడులోకములును జల మున మునిఁగి యుండెను. ఆమునియొక్కఁడుమాత్రమే బిగత పడి యుండి జడలు విరియంబాఱ జడునివలెను గ్రుడ్డివాని వలెను భ్రమించుచుండెను. అతఁ డాఁకలి దప్పులు పయికొనఁ గా, మకరములును దిమింగిలములును బట్టి యుపద్రవపెట్టు చుండఁగా, అలలచేతను గాలిచేతను గొట్టువడి, అపారమయిన చీఁకటియందు బడి త్రిమ్మరుచు, బడలికవ్యాపింప దిక్కులను నాకాశమును భూమినిని దెలియఁడయ్యె. అతఁ డొక పెనుఁ బల్లమున బడియును, నొకచోట నలలచేత మోఁదంబడు చును, గొన్నియెడల నొకటితో నొకటి పోరాడుచున్న జల జంతువులచేత భక్షితుండగుచును, నుండెను. అతఁడొక్కయెడ మోహమును నొక్కయెడ శోకమును నొక్కచోట దుఃఖ మును నొక్కపట్టునభయమును బొందుచును,నొక్కదెసవ్యాధి మొదలగు వానిచేత బాధితుండై మృత్యువునొందినట్లును, నుం డెను. ఇట్లతఁడు విష్ణుమాయ తనయాత్మను గ్రమ్ముకొనుటయు నందు భ్రమించుచుండఁగా సంవత్సరములు వేల పదివేల కొలఁదిని గడచని పోయెను. అతఁ డొకప్పుడు భూమియందు మెరకయైన యొక పట్టునఁ గ్రుమ్మరు చుండఁగా, పండ్లును జిగు ళ్లును విలసిల్లుచున్న యొక్క చిన్న మఱ్ఱిచెట్టును గాంచెను. దానిలో నీశాన్యపుదిక్కు నందలి యొక శాఖయందు, నొక యాకుదొన్నెలో నొక శిశువు పరుండి యుండి తన దేహ ప్రభచేతఁ జీఁకటి నంతయుఁ గబళించుచుండఁగాఁ గాంచెను. ఆచిన్నిబిడ్డఁడు మరకతమణులవలె శ్యామలవర్ణముగలిగి, మొ గము తామరపూవువలెఁ గాంతి సిరి గులుకుచుండ, సంకువు

వంటి మెడయు విశాలమయినవక్షమును, సొగసయినముక్కును గనుబొమలును గలిగి చెలువు గులుకుచుండెను. అతని యూర్పులు సోఁకి ముంగురు లల్లలాడుచుండెను. శంఖములవంటి చెవుల యందు దాడిమపూవువలె నున్న పోగులు సొగసుగాఁబు చుండెను. పగడమువంటి పెదవికాంతిచేతఁ దెల్లని చిఱునవ్వు కొంత యెఱ్ఱ వాఱుచుండెను. తామరపూవుకడుపు వలె నెఱ్ఱని కడగన్నులును, చెన్నుగులుకు చిఱునవ్వుతోడి చూపులును నూర్పులచేత నల్లల్లఁ గదలుచున్న వళులతోఁగూడి లోఁతయి యఱచేయంత యున్న యుదరమును, నాపాపనికిఁ జెలువారు చుండెను. సొగసయిన వ్రేళ్లుగల రెండు చిన్ని చేతులచేత నొక చరణాంబుజమును బట్టియెత్తి కొని నోట నిడికొని యాబాలుఁడు చీఁకుచుండెను. ముని యాబాలునిఁజూచి మిక్కిలి యాశ్చర్యపడెను.అతఁ డాపాపనిఁ జూడఁగానే బడలికలన్నియు నుడిగి యుబ్బున హృదయకమలమును గన్నుఁదామరలును వికసిల్లు చుండఁగా మేనంతయు మిక్కిలి గగురుపొడువఁగా, నత్యంతాశ్చర్యము చేత శంకించినను నాబాలునిఁ జూచుటకు సమీపమునకుఁ బోయెను. అపుఁ డాముని యాశిశువు నూర్పుగాలిచేత దోమవలె నతని శరీరము లోపలఁ జొచ్చెను.ఆతనిగర్భమందును నతనికంటె మఱియొక బాలుని నట్టి వానిని గాంచెను. మఱి యతని శరీరములోనికిఁ జొరక మునుపు నంతయును జూచినట్లె శరీరము లోపలను జూచెను. అట్లుచూడఁగా నతనికి మిక్కిలియు విస్మయముకలిగెను. అతఁ డందునంతరిక్షమును భూమ్యాకాశములను నక్షత్రగణములను బర్వతములను సముద్రములను ద్వీపములను వర్షములను

దిక్కులను సురాసురులను వనములను దేశములను నదులను బట్టనములను ఆకరములను సేద్యపుగ్రామములను, మందలను, ఆశ్రమములను వర్ణములను వాని వృత్తులను గాంచెను. మఱియు నాకాశాదిమహాభూతములను భౌతికములయిన దేవమనుష్యాదులను, నానాయుగములను గల్పములను గల్పించుచుండు కాలమును, ఇది యధి యననేల! వ్యవహారమునకునిమిత్తమయిన తక్కిన దొక్కొక్క దానిని మఱి యజ్ఞానులకు నిత్యమయినదిగాఁ దోఁచుచున్న జగత్తును గాంచెను. మఱియు నాగర్భములో ఋషి హిమాలయమును బుష్పవహ యనెడి యానదిని దన యాశ్రమమును నిట్లు విశ్వమునుగాంచుచుండి మరల నాబాలుని యూర్పుగాలి చేత నతని వెలుపలికి వచ్చి ప్రలయ సముద్రమునందుఁ బడెను. అట భూమియందొక మిట్టపయిని బెరిఁగి యున్న మఱిచెట్టును దాని యాకు దొప్పయందుఁ బరుండి యున్న యాపాపనిని జూచి యమృతంబు వంటి ప్రేమదొలఁకుచున్న చిఱునవ్వుతోడి యతని కడగంటిచూపును జూచెను. అంత నతండు తనకన్నుఁగవ చేతహృదయమునందుఁ గౌఁగిలించుకొనియున్న బాలునిఁగాంచి మిక్కిలియు నుబ్బుజెంది యాయధోక్షజునిఁ జేతులారఁ గౌఁగిలించుటకై యెదురుగాఁ బోయెను అప్పుడా దేవుఁ డచింత్యములయిన వివిధ విచిత్రశక్త్యాదిగుణములచేఁ బరిపూర్ణుఁడై యాశ్చర్య శక్తియోగనిర్వాహకుఁ డైన సర్వాంతరాత్ముఁడు గావునఁ దోడనే యంతర్ధానము నొందెను. ఆపు డా ఋషి యాలింగనము చేసికొన వలెనన్న వ్యాపారము, నిర్ధనుఁడు పూనినపనివలె, వ్యర్థమాయెను. ఆ శిశువు తిరోహితుఁడు

కాఁగానే యతనివెంటనే ప్రలయ జలమంతయు మఱుఁగయ్యెను. తక్షణమే యామునియెదుట వటవృక్షమును మఱుఁగుపడెను. అతఁ డెప్పటివలెఁ దన యాశ్రమమందున్నవాఁడయ్యెను. ఇది తొమ్మిదవయధ్యాయము.

---

## మార్కండేయ చరిత్రము.

(అనుబంధము)

శ్రీసూతుఁడు—ఇట్లు ముని,నారాయణుఁడు పన్నిన తనయాశ్చర్యశక్తి వైభవము ననుభవించి యానారాయణునే యతని మాయను ధరించుటకై శరణుఁజొచ్చెను.—* మార్కండేయుఁడు—'హరీ! నీదు మాయచేత దేవతలు సయితముజ్ఞానముచేత మనంబు చెదరి మోహము నొందుచుందురుగదే. ఇట్టి నీదు పాదమూలమును బ్రపన్నుల కభయం బొసంగువానిని శరణుఁజొచ్చితిని' అనెను. సూతుఁడు—ఇట్లతఁడు సమాహితచిత్తుఁడై యుండఁగా భగవంతుఁడు రుద్రుడు పార్వతితోఁగూడ నిజగణములచేఁ బరివృతుఁడై నందినెక్కి యాకాశమునఁ బోవుచు నతనిఁ జూచెను. అంతఁ బార్వతి యాఋషినిఁ జూచిశివునితో 'భగవంతా! గాలిలేనపుడు జలములును మత్స్యసమూహములును నిశ్చలములై యున్న మహాసముద్రమువలె దేహేంద్రియములును మనస్సును నిశ్చలములై యీ విప్రుఁ

---

* అల్పదేశమందు విస్తారముగల దేశమును అల్పకాలమందు బహుకాలమును అంతర్భవించి యుండుటయును తనకంటె వ్యతిరిక్తములయిన మూర్తామూర్త పదార్థసమూహమును గాలావసానము గలిగించు జలాదులను సృజించుటయును ఈశ్వరుని సర్వశక్తిత్వమువలన ఉపపన్నము.

డున్నాఁడు.ఇతనిని బోయిచూతము రమ్ము. ఈముని తపస్సునకు ఫలమొసంగుము.నీవు సిద్ధిప్రదుఁడవుగదే'యనెను. రుద్రుఁడు— 'భగవతీ! ఈ బ్రహ్మర్షి కామములనేమియు మోక్షమును సైతము గోరఁడు; ఏలనఁగా నితఁ డవ్యయుఁడగు పరమపురుషునియందు ననన్యప్రయోజనంబగు భక్తిని లభించియున్నాఁడు. భవానీ! అయిన నీ సాధుపురుషునితో మాటలాడుదము. మనుష్యులకు సాధువులతోడి సమాగమమే పరమంబయిన లాభముసుమీ' యని చెప్పెను.సర్వవిద్యలకు నిర్వాహకుఁడై సర్వదేహధారులకు నీశ్వరుండయి సత్పురుషులకు గతియైన యా భగవంతుఁ డీశానుఁ డతనిని దఱిసివచ్చెను. జగదాత్మకులైన యీ యీశు లిరువురును వచ్చియున్నను నాముని యంతఃకరణవృత్తుల నిరోధించియుండుటంబట్టి యెఱుంగఁడయ్యె. వారినేకాక తన్నును దక్కిన ప్రపంచమును దెలియకుండెను. భగవంతుఁడు రుద్రుఁ డది యెఱింగి వాయువు ఛిద్రమునందుఁ జొచ్చునట్లు యోగమాయచేత నతని హృదయాకాశమును జొచ్చెను. అంత నాముని తనలోపలను మెఱపువలెఁ బిశంగములయిన జటలుదాల్చి మూఁడుకన్నులును బది భుజములును గలిగి పొడవై యుదయించుచున్న సూర్యునివలె వెలుఁగుచుఁ బులితోలును శూలమును ధనువును బాణములను ఖడ్గ చర్మములను నక్షమాలను డమరుకమును, గపాలమును బరశువును దాల్చి శివుఁడు తటాలున హృదయమందు జూపట్టఁగా గాంచి విస్మయమునొందెను. అమ్ముని 'యేమిది' యని యాసమాధినుండి విరమించి రెండుకన్నులను దెఱచి త్రిలోకైకగురుండగు రుద్రుఁడు పార్వతితోడను బ్రమథగణములతోడను వచ్చి

యుండుటను జూచెను. ముని యద్దేవుని శిరస్సుచేత మ్రొక్కి యతనికిని బార్వతికిని బ్రమథగణములకును స్వాగతం బడిగి యాసనము లిడి యర్ఘ్యపాద్యముల నర్పించి గంధపుష్ప ధూప దీపములచే నర్చించి యెంతయు సపర్యలు గావించెను. అంత నద్దేవునిఁజూచి 'నీవు నీప్రభావముచేతనే పరిపూర్ణ కాముఁడవు. ఈ జగత్తంతయు నీచేతనే సుఖముగా నూఅట నొందియుండును. ప్రభూ! ఈశానా! ఇట్టి విభునకు నీకు నేనేమిచేయుదును? శాంతుఁడును సత్త్వుఁడును బ్రహ్మృడుండును రజోజుష్ఠుండును ఘోరుండును దమోజుష్ఠుండును నగు శివునకు నీకు నమస్కారము' అనెను. సూతుఁడు—— ఇట్లాదిదేవుఁడును సజ్జనులకు దిక్కునయిన యా భగవంతుఁడు స్తుతింపఁబడఁగాఁ బరితుష్టుఁడై ప్రసన్నంబగు మనంబుతో నవ్వుచు నమ్మునిని జూచి 'మేము ముప్పురమును వరదులయందు మిన్నలము; మాదర్శనము వ్యర్థముగాదు. ఆదర్శనమువలన మనుష్యుఁడు ముక్తి నొందును. కాఁబట్టి నీవు నావలన వరమును వేఁడుము. సాధువులును శాంతులును సంగరహితులును భూతములందు దయగలవారును మాయం దేకాంతభక్తులును వైరము లేనివారును సమదర్శులునగు బ్రాహ్మణులకు, లోకులను లోకపాలురును, వీరువా రననేల? భగవంతుఁడగు నేనును బ్రహ్మయు నీశ్వరుఁడగు హరి తానును వందనములను నర్చనములను నుపాసనములను జేయుదుము. ఏలనఁగా వా రచ్యుతశరీరరుల మగు నాయందును బ్రహ్మయందును నచ్యుతుం డగు హరియందును భేదమణువంతయైనను గలిగియుండరు. మఱియుఁ దామును నితరజనులును నచ్యుతునికి భిన్నులయినవా రనియుఁ దలంపరు;

అనఁగా నందఱును నచ్యుతునికిఁ బరతంత్రులై తచ్ఛరీరభూతులై యుండుటంబట్టి యచ్యుతుఁడేయని తలంతురు. కనుక మేమును మిమ్ము భజింతుము. జలమయములగు తీర్థములును, ప్రాణరహితములయిన (మృచ్ఛిలామయములయిన) దేవతలును దర్శనమాత్రమున బవిత్రత గలిగింపనేరవు. చిరకాల స్నానముల చేతను, ఆవాహనాది షోడశోపచార పూజాదులచేతను, నవి పవిత్రముచేయుచున్నవి. మీరన్నన్ దర్శన మాత్రముచేతనే పవిత్రతఁ జేయుచున్నారు. ఎవ్వరు వేదమయంబగు మా రూపమును నాత్మసమాధిచేతను దపస్సుచేతను స్వాధ్యాయముచేతను సంయమములచేతను దాల్చియుందురో యట్టి బ్రాహ్మణులకు మేము నమస్కరించుచున్నాము. అట్టి మహాత్ములను దర్శించినను విన్నను మహాపాతకులయినను శూద్రులయినను శుద్ధి నొందుదు రనఁగా నిఁక వారితోడ సంభాషణాదులచేత శుద్ధినొందుట చెప్పనేల' యనెను.

సూతుఁడు—— ఇట్లు చంద్రధరుఁ డాశివుఁడు సజ్జనసేవ యనెడు ధర్మరహస్యమును గూర్చి విస్తరించిచెప్పిన యా వాక్య మమృతమువలెఁ జవి గులుకఁగా నాఋషి చెవులు రెంటను నెంతయుగ్రోలియుఁ దృప్తినొందఁడయ్యెను.ఋషి—— ఆహా! జగదీశ్వరులయినవారు తమకీశితవ్యములయిన యపకృష్ట భూతములకు మ్రొక్కుచున్నారే! ఔరా! ఈశ్వరునిచర్య యిది శరీరధారుల కెంతమాత్రము దెలియఁదరముగాదు గదే! వారు దేహులకుధర్మము నుపదేశించువారయ్యునుధర్మములను వారిచేత గ్రహింపఁజేయుటకై తామే యాచరించుచును నను

మోదించుచును నట్లువిచేయఁబడుచుండఁగా స్తుతించుచును, నుందురు. ఇట్లు భగవంతుఁడు తన కీశితవ్యములయిన వానికి నమస్కరించుట మొదలగు వానిని నాశ్చర్య మయము లయిన తనచేష్టలచేతఁ జేసినంతమాత్రమున వాని ప్రభావ మెంత మాత్రము చెడదు. లోక ప్రసిద్ధమగు మాయావి యింద్రజాలాది కపటవ్యాపారము లెంతచేసినను వాని ప్రభా వము చెడక వాని మాయావిష్కారప్రభావమె వెల్లడియగు నట్లె దీనిని తెలియవలయును. భగవంతుఁడు సంకల్పమాత్రము చేత నీజగత్తును సృజించి తాను దీనిలోపలఁ జొచ్చి, గుణ ములు పూర్వకర్మ వాసనానుగుణముగాఁ బరిణమించి యుత్త రోత్తర పుణ్యాపుణ్యరూపము లయిన విషమసృష్టిని జేయు చున్నను దానే చేయువానివలెఁ గనఁబడుచున్నాఁడు గాని స్వప్నము గన్నవాఁడు స్వప్నమందలి యర్థములను దాను జేయనియట్లు, నిజమున కా సృష్టికిగుణములేకాని తాను కర్త గాకుండును. అట్టిత్రిగుణుండును మహాత్ముండును కేవలుం డును నద్వితీయుండును గురుండును బ్రహ్మామూర్తియు నయిన యాభగవంతునకు నమస్కారము. భూమా! పురుషుఁడు స్వతం త్రుఁడును సత్యకాముఁడు నగుటకంటె వర మేమి వరదోత్త ముండవగు నీవలనఁ బడయవచ్చును ? ఏమియుఁ గలుగదు. అయినను బూర్ణకాముఁడవు వర్షించుచున్న నీవలన నీ వరమును వేఁడెదను. భగవంతుని యందును భగవత్పరు లయినవారి యందును నీయందును నచ్యుతంబగు భక్తి నాకుఁ గలిగియుండ వలయును' అనెను. సూతుఁడు——ఇట్లు ముని చక్రనివాక్యమున స్తుతింపఁగా నచ్యుతుఁడును భగవంతుఁడు నగునాగుద్రుఁడు

పార్వతి యనుమోదింప నతనితో 'మహర్షీ ! నీకు విభుండయిన యధోక్షజునియందు మిక్కిలియు నీవు కోరినభక్తి కలుగుఁగాక. కల్పాంతమువఱకును నీకుఁ బవిత్రంబయిన యశస్సును, ముదిమియు మరణమును లేకుండుటయుఁగలుగుఁగాక. భూతభవిష్యద్వర్తమానములనెడు త్రికాలములందున్న వస్తువులను గూర్చిన జ్ఞానమును బ్రహ్మస్వరూపరూపాదులను గూర్చిన విజ్ఞానమును విరక్తిసహితముగాఁ గలుగు గాక. బ్రహ్మవర్చసుల కెల్ల నీవు పురాణాచార్యుండ వగుదువుగాక' యనెను. సూతుఁడు—. ఇట్లీశ్వరుఁ డాముక్కంటి మునికి వరములనొసంగి పార్వతీదేవికి నాముని మున్ను భగవన్మాయను దర్శించిన కథను జెప్పుచుఁ దన స్థానమునకుఁ బోయెను. ఆ మార్కండేయుఁడును మహాయోగవైభవమును భగవంతుఁడగుహరి యందు ననన్యప్రయోజనంబగుభక్తిని బొంది యిప్పటికిని సంచరించుచున్నాఁడు. ఇందులకు సందియము లేదు. బుద్ధిమంతుఁడగు మార్కండేయుఁ డనుభవించినభగవంతునిమాయావైభవమును మిక్కిలి యద్భుతమయిన దానిని నీకువర్ణించి చెప్పితిని. సంసార మనాది యని తెలియని వారుకొందఱు, జీవులకుభగవంతునిమాయవలన నొకానొకప్పుడే, సంసారము మార్కండేయునికిఁ గలిగిన మాయా వైభవదర్శనమువలెఁ గలుగుచున్నదని చెప్పుదురు. ఈసంసార మనాదియై పొరలి పొరలి వచ్చుచున్నది గాని యొకానొకప్పుడు కలుగునది గాదు. ఇట్లు చక్రపాణి యగు భగవంతుని వైభవముతోఁ గూడిన మార్కండేయుని వృత్తమును వినువాఁడును వినిపించువాఁడును నిరువురును గర్మనిమిత్తంబగు సంసారమునకుఁ బాలుపడరు. ఇది పదియవయధ్యాయము.

---

{మహాపురుషవర్ణనము. ద్వాదశాదిత్యవ్యూహాదు
లను వర్ణించుటయు.}

శౌనకుఁడు—భాగవతా! నీవు మిక్కిలియు వేత్తలగు వారి యందు మిన్నవు. ఏలన నీవు సమస్తములయిన పురాణ పంచరాత్రాది తంత్రముల సిద్ధాంతముల తత్త్వములను జక్కఁగాఁ దెలిసినవాఁడవు. కాఁబట్టి యీ యర్థమును నిన్న డుగుచున్నాము. శుద్ధసత్త్వమయమగు దివ్యవిగ్రహముఁగల శ్రియఃపతికిఁ బరిచర్య చేయునపుడు భగవదారాధన తంత్రనిష్ఠితు లయినవా రద్దేవుని పాణి పాదాదులయినయంగములను హృదయాదులయిన యుపాంగములను సుదర్శనాదులయిన యాయుధములను భూషణములను నే. యే తత్త్వాభిమాని దేవతగాఁ గల్పించి యేవిధమున ధ్యానింతురో దానిని, భగవదారాధన క్రియకు నపేక్షితములయిన వానిని, దెలిసికొనఁ గోరుచున్నారము గాన మాకు వివరింపుము. ఆయా యంగాదులను నాయా తత్త్వములుగాఁ గల్పించి యారాధనము చేయు కౌశలముచేత మర్త్యుఁడు జరామరణములను గడచి ముక్తిని బొందుచున్నాఁడు గదే' యనిరి. సూతుఁడు 'నేను గురువులకు నమస్కరించి విష్ణుదేవుని యంగాదులకు నభిమాని దేవతలయిన యా విభూతులను జెప్పెదను. బ్రహ్మ నారదుఁడు మొదలయిన యాచార్యులవలనను, నాగమమువలనను, బంచరాత్రమువలనను, నావిభూతు లెఱుంగఁబడినవి. ప్రకృతి, మహత్తు, అహంకారము, పంచభూతములు, కాలమనెడి తొమ్మిదితత్త్వములచేతను వీని వికారములయిన యేకాదశేంద్రియములచేతను బంచతన్మాత్రలచేతను విరాట్టు (బ్రహ్మాండము) నిర్మింపఁబడినదని శాస్త్రముచేతఁ దెలి

యఁబడుచున్నది జీవులతోఁ గూడిన యీవిరాట్టునందుమూఁడు లోకములు కనఁబడుచున్నవి. ఈ*బ్రహ్మాండము పరమపురుషుని రూపము. తలాతల మొదలైన సప్తలోకములతోఁ గూడిన భూమి యతనికిఁ బాదములు. దివి యతనికిశిరస్సు. ఆకాశము నాభి. సూర్యుఁడు కన్నులు. వాయువు నాసిక. దిక్కులు కర్ణములు. ప్రజాపతి మేఢ్రము. పరమపురుషునకు మృత్యువు గుదము. బాహువులు లోకపాలురు. మనస్సు చంద్రుఁడు. యముఁడు కనుబొమలు. లజ్జ పయిపెదవి. లోభము క్రింది పెదవి. వెన్నెలలు దంతములు. భ్రమము నవ్వు. వృక్షములు రోమములు. మేఘములు తలవెండ్రుకలు. ఈవ్యష్టి పురుషునకు నెన్నియవయవములో తనకొలఁతచేత నవయవసంస్థానమెంత మితిగలిగి యుండునో, యట్లే యీ పరమపురుషునకు లోకముల కొలఁదిచేతఁ (అనఁగా లోకాభిమాని దేవతా రూపములగు పాదాద్యవయవముల సంస్థానముచేత) నంత యవయములు గలవాఁడై యుండును. అజుండు భగవంతుఁడు కౌస్తుభము నెపమునఁ దనయాత్మ జ్యోతిని, అనఁగాఁ దనకు విశేషభూతమై జ్ఞానాకారమై యుండు చిదాత్మస్వరూపమును దాల్చుచున్నాఁడు. [1] ఆజీవుని ప్రభయగు ధర్మభూతజ్ఞానము వ్యాపించునట్టిది. ఆ ప్రభను భగవంతుఁడు వక్షమున శ్రీవత్సముగాఁ దాల్చియున్నాఁడు. విషమావస్థయందున్న సత్త్వాది గుణములమయ మైయుండు ప్రకృతియే వనమాలగాఁ దాల్చి

1. బ్రహ్మాండమున కభిమానిదేవత భగవద్దివ్య విగ్రహమని యర్థము.

2. కౌస్తుభము జీవవర్గాభిమాని దేవతయనియు దాని ప్రభకు అభిమాని దేవత శ్రీవత్సమనియు ఛందోభిమాని దేవత యతని వస్త్రమనియుఁ దెలియునది.

యున్నాఁడు. అతనివస్త్రము గాయత్రి మొదలగుఛందములు. అకారాదిత్రివర్ణములు గల ప్రణవ మాతని బ్రహ్మసూత్రము. అతని యొక్క మకరకుండలము సాంఖ్యములు వేదము మఱియొకకుండలము. సర్వలోకోత్తరమయినబ్రహ్మలోకము నతఁడు కిరీటముఁగా ధరించి యుండును. అది సర్వలోకములకు నభయప్రదమైనది. పరమపురుషుఁ డధిష్ఠించియున్న శేషుం డనెడి యాసనము మూల ప్రకృతి. ధర్మజ్ఞానాదులతోఁ గూడిన విశుద్ధ సత్త్వము పద్మమనఁబడుచున్నది. [1] ఓజస్సుతోను సహస్సుతోను బలముతోను గూడిన మహత్తత్త్వం బగు బుద్ధియే గదగాఁ దాల్చియున్నాఁడు. జలతత్త్వమే శంఖము. తేజస్తత్త్వము సుదర్శనము. ఆకాశమువలె నీలదేహుఁడగు భగవంతునకు నాకాశతత్త్వమే ఖడ్గము. తపస్సే కేడెము. కాలము శార్ఙ్గ ధనువు. కర్మములే యమ్ములపొది ఇంద్రియములు గుఱ్ఱములు. మన స్సతనికి రథము. అర్చావతారములందాహితమైన యతని యంశమే తన్మాత్రలు. [2] ఇంద్రియవ్యాపారము లతని క్రియలు అతని యాసనమందుఁ బద్మాకారముగా నున్న మండలము [3] యజ్ఞభూమి. యజమానుని ప్రోక్షణావఘాతాదు లయిన యాగదీక్షా సంస్కారము భగవంతునికిఁ బరిచర్య. అది దురిత ములనెల్ల క్షీణింపఁజేయునది. భగవచ్ఛబ్దమందలి యవయవ

1. ఓజస్సనఁగా ఇంద్రియశక్తి. సహస్సు అనఁగా మనశ్శక్తి. బలమనఁగా దేహబలము. ధేనువునకుఁ గాల మభిమానిదేవతయనుట.

2. ఇట 'ముద్రయార్థ క్రియాత్మతా' అని పాఠాంతరము. 'వరదాభయాది ముద్ర ప్రయోజనము దాని క్రియా స్వరూపమునగు' నని భావము.

3. యజ్ఞభూమ్యభిమానిదేవత యామండలమనుట. దీక్షాసంస్కారమున కభిమానిదేవత పరిచర్య.

మగు భగవచ్ఛబ్దమునకు నర్థమగు జ్ఞానాదిషాడ్గుణ్యము లీలా కమలముగా ధరించి యున్నాఁడు. ధర్మమును యశమును భగవంతునకుఁ జామరమును వ్యజనము నగును. దేని వలనను భయము లేకున్న సాంతధామమయిన వైకుంఠ మతనికి [1]ఛత్రము. ఋగ్యజుస్సామాత్మకమయిన వేదము యజ్ఞారాధ్యుండయిన యాపురుషుని వహించు వాహనమయిన [2] గరుడుఁడు. శ్రీదేవి హరికిఁ బాయక యుండు తోడి శక్తి. అది యాపరమాత్మునకు ధర్మభూతియగు ప్రభ. సేనాపతియగు విష్వక్సేనుఁడతని విగ్రహవిశేషము. హరిద్వారపాలురయిన నందాదు లైన మంత్రు అణిమ మొదలయిన గుణములు. వాసుదేవుఁడు సంకర్షణుఁడు ప్రద్యుమ్నుఁ డనిరుద్ధుఁ డనెడి యీమూర్తిసమూహము పరమపురుషుఁడు తానే యని చెప్పఁబడుచున్నాఁడు. ఈవాసుదేవాదికమయినచతుర్మూర్తి సమూహము జాగరము స్వప్నము సుషుప్తి ముక్తి యనెడి యవస్థలందువరుసగా విశ్వుఁడు తైజసుఁడు ప్రాజ్ఞుఁడు తురీయుఁడు(ముక్తుఁడు) అనఁబడు [3]జీవుఁడు. బాహ్యేంద్రియములచేత నర్థములను దెలుపుజాగరావస్థయందు నుమానసేంద్రియవిషయమగుస్వప్నావస్థయందునుమనస్సుడుగఁ గావాసనమాత్రము మిగిలియున్న యాశయమగు సుషుప్తియం

1. వైకుంఠాభిమానిదేవత యతనికి ఛత్రమనిభావము.

2. వేదాభిమానిదేవత గరుడుఁడనియు, అణిమాద్యష్టైశ్వర్యాభిమానిదేతలు నందాదులనియుఁ దెలియునది.

3. అనఁగాముక్త్యవస్థుఁడగు జీవునకభిమాని వాసుదేవుఁడు. స్వప్నావస్థ జీవున కభిమాని సంకర్షణుఁడు. తక్కిన రెండవస్థల జీవులకు తక్కిన రెండు మూర్తులు వరుసగా నభిమాని దేవతలని యర్థము.

దును బరిశుద్ధానవచ్ఛిన్నజ్ఞానం బగుము క్తియవస్థయందును గల యాయాజీవున కభిమాని భగవంతుఁ డని చెప్పఁబడుచున్నాఁడు. అంగములతోను ఉపాంగములతోను నాయుధముల తోను భూషణములతోను గూడి వాసుదేవాది చతుర్మూర్తి దాల్చియున్న భగవంతుఁడు హరి యీశ్వరుఁడు ప్రసిద్ధములయిన సృష్టి స్థితి సంహార మోక్షములను నాలుగింటిని గావించుచున్నాఁడు. బ్రాహ్మణోత్తమా! బ్రహ్మరుద్రాది సంజ్ఞలతోఁ గూడి తనమాయచేత సృజించుచును సంహరించుచును రక్షించుచు నున్నయాభగవంతుఁడే స్వరూపముచేతను గుణములచేతను నిరతిశయ బృహత్త్వముగల బ్రహ్మము, సర్వకారణభూతుఁడు, సమస్తమును నొక్కుమ్మడిని జక్కఁజూచువాఁడు, తన మహిమచేతనే నిండియున్న యవాప్త సమస్తకాముఁడు, అసంకుచిత జ్ఞానుఁడు. ఇట్టివాఁడయినను గూఢుం డని శాస్త్రములు చెప్పుచున్నవి. అయినను నతఁడు తనయుపాసకుల యోగపరిశుద్ధ మనస్సులకు లభించుచున్నాఁడు. *శ్రీకృష్ణా! కృష్ణసఖా! వృష్ణివృషభా! భూద్రోహులయిన రాజుల వంశములకు దహనుఁడయినవాఁడా! అనపవర్గవీర్యా! గోవిందా! గోబ్రాహ్మణ దేవతలయార్తిని హరించుటకై యవతరించువాఁడా!

* ఇందు మొదటిదానిచే సర్వావంచకరత్వమును, రెండవదానిచే సాక్షిత్వమును, మూఁడవదానిచేత సౌలభ్యమును, నాలుగవదానిచేత దుష్కృతులను నాశముసేయుటయు, ఐదవదానిచేత అపారవీర్యత్వమును, ఆఱవదానిచేత సర్వాధారత్వమును, ఏడవదానిచేత సాధుపరిత్రాణత్వమును, ఎనిమిదవదానిచేత పావనకీర్తిత్వమును, తొమ్మిదవదానిచేత అత్యాదరమున వినఁదగినవాఁడై యుండుటయు చెప్పఁబడినవి.

తీర్థశ్రవా! శ్రవణమంగళా! నీభృత్యులను రక్షింపుమా ! ఎవ్వఁడు ప్రాతఃకాలమున లేచి చిత్తము పరమపురుషునియం దునిచి సమాహితేంద్రియుఁడై మహాపురుషుని చిహ్నభూతముల యిన యంగోపాంగాదులనిరూపించు నీప్రకరణమును జపించునో వాఁడు హృదయగుహాశయమందున్న బ్రహ్మమును గలరూపునఁ దెలియుచున్నాఁడు' అనెను.

శౌనకుఁడు—భగవంతుఁడగు శుకుఁడు పరీక్షిత్తునకుసూర్యా రాధకమగు గణము లేడు నెలనెలకు నానావిధములయిన కర్మ ములను గావించుచున్నదని ముం దతఁ డడుగఁగాఁజెప్పెను. 'సూర్యాత్మకుం డగుహరిని నుపాసించుచుండెడి యా గణముల నామములను వారలాచూవమాసమునఁ బతియగు నాయా సూర్యునిచే నియుక్తులై చేయుకార్యములను వినఁగోరుచున్న మాకుఁ జెప్పుము' అనియడిగెను. సూతుఁడు-సమస్తదేహధా రుల కాత్మభూతుఁడయిన విష్ణుఁ డనాదియైన తన ప్రకృతిచేత లోకయాత్రా ప్రవర్తకుఁడయినయీసూర్యుని నిర్మించెను. కాఁబ ట్టియే యితఁడు లోకములందుఁబరిభ్రమించుచున్నాఁడు. *లోక ములకెల్లనాదికర్తయు నద్వితీయుండు సర్వాంతరాత్ముఁడునయిన యా హరియె సూర్యశరీరకుఁడై నెలకొనియున్నాఁడు. అతఁడు సమస్తములయిన వేదక్రియలకుఁ గాలావచ్ఛేదకుఁడై మూలము గానున్నాఁడు. మఱి పరాశరాది ఋషులచేతఁ బండ్రెండు

---

* ఇదియె పంచమ స్కంధమందు—'తథాన్యేచ ఋషయోగన్ధర్వా అప్సరసో నాగాగ్రామణ్యో యాతుధానాదేవా ఇత్యేకైకశోగణాః సప్త చతుర్దశమాసి భగవన్తం సూర్యమాత్మానం నానానామానం పృథఙ్నామానః పృథక్కర్మభి ర్ద్వంద్వశ ఉపాసతే' యని చెప్పఁబడియున్నది.

విధములయిన వాఁడుగాఁ జెప్పఁబడు చున్నాఁడు. [1] కాలము దేశము క్రియ కర్త కరణము కార్యము ఆగమము ద్రవ్యము ఫలమని హరి యొక్కఁడే తొమ్మిది విధములఁ జెప్పఁబడినట్లే, పండ్రెండు విధములుగాను జెప్పఁబడుచున్నాఁడు. చైత్రాదిమాసములయందు భగవంతుఁడు కాలావచ్ఛేదక మగు రూపమును దాల్చి లోకయాత్ర నిర్వహించుటకై (యొక్కొక్క నెల నొక్కొక్క గణముగా) వేఱు వేఱ పండ్రెండుగణములతోఁ గూడి [2] చరించుచున్నాఁడు. ధాత (సూర్యుఁడు), కృతస్థలి (అప్సరస), హేతి (రాక్షసుఁడు), వాసుకి (నాగుఁడు), రథకృత్తు (యక్షుఁడు), పులస్త్యుఁడు

1. కాలము వసంతాదులు. దేశము 'సమేయజేత' ఇత్యాద్యుక్తము. క్రియ యాగాదులు. కరణముసాధనము. కార్యముఅపూర్వమనెడు స్థాయికార్యము. ఆగమమనఁగా ప్రమాణభూతమగువేదము. ద్రవ్యముఃచరుపురోడాదాశాదికము ఫలము స్వర్గాదులు. దేశము మొదలుకొని ఫలమువఱకుఁ జెప్పఁబడినవెల్ల సాధనములుగానో సాధ్యములుగానో క్రియయొక్కటియందు అంతర్భూతము. ఇట్టి క్రియతోఁగూడిన వాఁడై హరి ద్రవ్యాదిశరీరకత్వమువలన బహువిధములఁ జెప్పఁబడు చున్నాఁడని భావము.

2. సూర్యుఁడు ఒక్కొక్క నెలకు ఒక్కొక్కగణముగా పండ్రెండునెలలకు పండ్రెండుగణములతోఁగూడి తిరుగుచుండును. ఒక్కొక్క గణమునకు గణులు ఏడేసిమంది యుందురు. పంచమస్కంధమునఁ బదునలుగురనిచెప్పఁబడినను అందు ప్రధానులు ఏడుగురే యని యిట తెలియునది. మఱియు నొక్కొక్కగణమందును మొదటనామాసమునకు పతియై యొకానొక పేరుగల సూర్యుఁడును పిదప ఒకఋషియు గంధర్వుఁడును అప్సరసయు నాగుఁడును గ్రామణియు రాక్షసుఁడును దేవతయును జెప్పఁబడుదురు. అందుచైత్రమాసపు వారిని మొదటఁ జెప్పుచున్నారు.

(ఋషి), తుంబురుఁడు (గంధర్వుఁడు) ననెడి యీ యేడుగురు చైత్రమాసమునఁ దమ తమ కార్యములచేత సూర్యుని నడపుచుందురు. అర్యముఁడు (సూర్యుఁడు), పులహుఁడు(ఋషి), రథౌజుఁడు(యక్షుఁడు), ప్రహేతి(రాక్షసుఁడు),పుంజికస్థలి (అప్సరస). నారదుఁడు (గంధర్వుఁడు), కచ్ఛనీరుఁడు (నాగుఁడు), ననెడి యీ యేడ్గురు వైశాఖమాసమున సూర్యుని నడుపుచుందురు. మిత్రుఁడు (సూర్యుఁడు), అత్రి (ఋషి), పౌరుషేయుఁడు (రాక్షసుఁడు), తక్షకుఁడు (నాగుఁడు), మేనక(అప్సరస), హాహా (గంధర్వుఁడు), రథస్వనుఁడు (యక్షుఁడు), ననెడి వీరు సూర్యుని జ్యేష్ఠమాసమందు నడపుదురు. వరుణుఁడు (సూర్యుఁడు), వసిష్ఠుఁడు (ఋషి), రంభ (అప్సరస), సహజన్యుఁడు (యక్షుఁడు), హూహూ (గంధర్వుఁడు), శుకుఁడు (నాగుఁడు), చిత్రస్వనుఁడు (రాక్షసుఁడు) నను వీ రాషాఢమాసమును జరుపుచుందురు. ఇంద్రుఁడు (సూర్యుఁడు), విశ్వావసువు (గంధర్వుఁడు), శ్రోత (యక్షుఁడు), ఏలాపుత్రుఁడు (నాగుఁడు), అంగిరసుఁడు (ఋషి), ప్రమ్లోచ (అప్సరస), చర్యుఁడు (రాక్షసుఁడు) ననెడి వీరు శ్రావణమాసమును జరుపుదురు. వివస్వంతుఁడు (సూర్యుఁడు), ఉగ్రసేనుఁడు (గంధర్వుఁడు), వ్యాఘ్రుఁడు (రాక్షసుఁడు), ఆసారణుఁడు(యక్షుఁడు), భృగువు (ఋషి), అనుమ్లోచ (అప్సరస), శంఖపాలుఁడు (నాగుఁడు) నను వీరు భాద్రపదమాసమును జరుపుదురు. పూష (సూర్యుఁడు), ధనంజయుఁడు (నాగుఁడు), వాతుఁడు (రాక్షసుఁడు), సుషేణుఁడు (గంధర్వుఁడు), సురుచి (యక్షుఁడు),

ఘృతాచి (అప్సరస), గౌతముఁడు (ఋషి), * మాఘమాసమును గడపుదురు. పర్జన్యుఁడు (సూర్యుఁడు), ఋతువర్చసుఁడు (రాక్షసుఁడు), భరద్వాజుఁడు (ఋషి), సేనజిత్తు (అప్సరస), విశ్వుఁడు (గంధర్వుఁడు), ఐరావతుఁడు, (నాగుఁడు) నను వీరు ఫాల్గునమాసమును గడపుదురు. అంశుమంతుఁడు (సూర్యుఁడు), కశ్యపుఁడు (ఋషి), తార్క్ష్యుఁడు (యక్షుఁడు), ఋతుసేనుఁడు (గంధర్వుఁడు), ఊర్వశి (అప్సరస), విద్యుచ్ఛత్రువు (రాక్షసుఁడు), మహాశంఖుఁడు (నాగుఁడు) నను వీరు మార్గశీర్షమును జరుపుచున్నారు. భగుఁడు (సూర్యుఁడు), స్ఫూర్జుఁడు (రాక్షసుఁడు), అరిష్టనేమి (గంధర్వుఁడు), ఊర్ణుఁడు (యక్షుఁడు), ఆయువు (ఋషి), కర్కోటకుఁడు (నాగుఁడు), పూర్వచిత్తి (అప్సరస) యనెడు వీరు పుష్యమాసమును జరుపుదురు. త్వష్ట (సూర్యుఁడు), జమదగ్ని (ఋషి), కంబలాశ్వుఁడు (నాగుఁడు), తిలోత్తమ (అప్సరస), బ్రహ్మోపేతుఁడు (రాక్షసుఁడు), ఋతజిత్తు(యక్షుఁడు), ధృతరాష్ట్రుఁడు (గంధర్వుఁడు), ఇషంభరుఁడు నను వీరాశ్వయుజమాసమును నిర్వహించుచుందురు. విష్ణువు (సూర్యుఁడు), అశ్వతరుఁడు (నాగుఁడు) రంభ (అప్సరస), సూర్యవర్చసుఁడు (గంధర్వుఁడు), సత్యజిత్తు (యక్షుఁడు), విశ్వామిత్రుఁడు (ఋషి), మఖాపేతుఁడు (రాక్షసుఁడు) నను వీరు కార్తికమాసమును గడపుదురు. భగవంతుఁడు నాదిత్య శరీర

---

* ఇచట భాద్రపదమునకు పిమ్మట ఆశ్వయుజ కార్తికమాసములను జెప్పవలసియుండఁగా మాఘమును జెప్పుట కూర్మపురాణోక్తమగు ఆదిత్య క్రమమును అనుసరించుటచేత నని తెలియునది. లేక క్రమవివక్షలేక చెప్పఁబడినది గాన యథాక్రమముగా యోజించుకొనవచ్చును.

కుండు నయిన విష్ణుని యీవిభూతులును, సంధ్యలయందు తమ్ము స్మరించునట్టి మనుష్యులకుఁ గల పాపము ప్రతిదినమును నపహరించుచున్నవి. ఆదిత్యరూపుండయిన యీ దేవుఁడు పండ్రెండుమాసములందును తా నీ*యార్గురతోఁ గూడి సంచ రించుచు నీ జనమున కిందును బరమందును శుభంబగు గతిని గూర్చుచున్నాఁడు. ఋషు లీ యాదిత్యుని సామముల చేతను యజుస్సుల చేతను ఋక్కుల చేతను సూర్య ప్రకాశకములగు లింగముల చేతను స్తుతించుచుందురు. గంధర్వు లతనిఁగూర్చి పాడుచుందురు. అప్సరస లతనిమ్రోల నాడుచుందురు. నాగు లాతని రథమును దృఢముగాఁ గట్టుదురు. యక్షులు రథ మును ముందుదోలుదురు. బలశాలులయిన రాక్షసులు వెనుక ప్రక్కనుండి రథమును నడపింతురు. నిర్మలులగు బ్రహ్మర్షు లయిన వాలఖిల్యులు పదివేవు రతనిముంగల నభిముఖులై పోవుచు స్తుతుల చేత నావిభుని స్తుతించుచుందురు. ఇట్లాద్యంత రహితుండును నీశ్వరుఁడు నగు భగవంతుఁడు హరి ప్రతికల్ప మందును బ్రకృతిపురుషశరీరకుం డగు తన్ను ద్వాదశగణ రూపముగా విభజించికొని లోకములను దమ తమ కర్మ ములయందుఁ బ్రవర్తింపఁ జేయు చుండును. ఇది పదునొకం డవయధ్యాయము.

---

* ఒక్కొక్కగణమందును ఆదిత్యుఁడు తప్ప తక్కిన వారార్గురు. ఆది త్యునితోడ నేడుగురు. కాఁబట్టి ఆఱుగురని యిట చెప్పఁబడినది. ఒక్కొ క్క గణమందును ఆదిత్యుని చెప్పుట నామభేదమును బట్టికాని ప్రాధాన్య వివక్ష చేతఁగాని, లేక విగ్రహాంతరముతో స్వాత్మభూతుఁడగు భగవంతు నుపాసించునని తెలుపుటకుఁ గాని యుండవచ్చును. వాలఖిల్య గణముతోఁ గూర్చి యేడ్గురనియుఁ జెప్పవచ్చును.

ఈ! పురాణమందలి విషయానుక్రమ
ణికయు భాగవతమాహాత్మ్యము
మొదలగునవియు.

సూతుఁడు—సిద్ధరూపధర్మంబగు కృష్ణునకును ధర్మప్రవర్తకుండయిన వ్యాసునకునుఁ జతుర్ముఖబ్రహ్మకును నారద శుకాదిబ్రాహ్మణులకును నవిచ్ఛిన్నమగు నుపదేశపరంపరచేఁ బ్రాప్తమయిన ధర్మములను నీగ్రంథమునందు బ్రతిపాద్యములయినవానిని సంగ్రహమునఁ జెప్పుచున్నాను. విప్రులారా! మీరు నన్నడుగఁగా మనుష్యులకు మనుష్యత్వమందుచితమైనదియు, నద్భుతమయినదియు నగు విష్ణుచరిత్రము మీకుఁ జెప్పఁబడినది. ఇందు సమస్తపాపహరుండును నారాయణుఁడును హృషీకేశుండును భగవంతుఁడును సాత్వతాంపతియు నగు సాత్వోద్ధరియె కీర్తింపఁబడుచున్నాఁడు. అతఁడు వేదాంతరహస్యంబును జగత్తునకు సృష్టిసంహారకారణంబు నగు పరబ్రహ్మము. సాధువులగు మీరు నన్ను భాగవతమడుగు నుపాఖ్యానమును, జ్ఞానవిజ్ఞానములను భక్తియోగమును, దాని కంగమయిన వైరాగ్యమును, బరీక్షిత్తు కథయు, నారదవృత్తాంతమును, రాజర్షియగు పరీక్షిత్తు బ్రాహ్మణశాపమునఁ బ్రాయోపవేశమొందుటయు, బ్రాహ్మణసత్తముఁడగు శుకునకుఁ బరీక్షిత్తుతో సంవాదమును, పరీక్షిత్తు యోగధారణముచేతఁ బ్రాణములువిడుచుటయు, బ్రహ్మకును నారదునకును జరిగినసంవాదమును, అవతారములను వర్ణించుటయు, సృష్టికిఁ బూర్వము ప్రాకృతమగు మహదాదితత్త్వసృష్టియు, ఉద్ధవునకును విదురునకును సంవాదమును, విదురమైత్రేయసంవాదమును,

భాగవతపురాణప్రశ్నమును, భగవంతుఁడు ప్రలయమందుండు నునికియు, ప్రకృతిగుణక్షోభరూప మగు ప్రాకృతికప్రలయమును, వైకృతికము లగు మహదహంకార భూతపంచకముల సృష్టియు, ఆవైకృతికములనుండి బ్రహ్మాండము సృజింపఁబడుటయు దానివలన నుండి బ్రహ్మ పుట్టుటయు, పరమాణువు మొదలుగా సంవత్సరము వఱకు స్థూల సూక్ష్మరూపమున నున్న కాలము గతియును, వ్యష్టిభూతముల యుత్పత్తియు, సముద్రమునుండి భూమిని బయి కెత్తుటయు, దానివలన హిరణ్యాక్షుని వధమును, దేవతిర్యగధోలోకముల సృష్టియు, సగము స్త్రీలు గాను, సగము పురుషులుగాను, సృష్టియుఁ జెప్పఁబడెను. ఆ సృష్టివలన స్వాయంభువ మనువును నతని పత్నియు స్త్రీ వర్గమునందు మొట్టమొదటిదయిన రూపును నుత్తమురాలు నయినశతరూపయుఁ గలిగిరి. కర్దమప్రజాపతి ధర్మపత్నులసంతానమును, మహాత్ముం డయినభగవంతుని కపిలుని యవతారమును, దేవహూతికి బుద్ధిమంతుఁడగు కపిలునితోడి సంవాదమును, తొమ్మిది బ్రహ్మల యుత్పత్తియు, దక్షయజ్ఞ వినాశమును, ధ్రువుని చరిత్రమును, పృథుని చరిత్రమును, ప్రాచీనబర్హికథయును, నారదునిసంవాదమును, ప్రియవ్రతునివృత్తాంతమును, నాభిచరితయును, ఋషభునికొడుకయిన భరతుని చరిత్రమును, ద్వీపములు సముద్రములు మొదలగువానియు వర్షములయు నదులయు నుపవర్ణనమును, జ్యోతిశ్చక్రము నునికియు, పాతాలనరకముల స్థితియుఁ, జెప్పఁబడియున్నవి. మఱియుఁ బ్రచేతసులవలన దక్షుండు పుట్టుటయు, నతని పుత్రికలసంస్థితియు, వారలవలన దేవతలును నసురులును

నగులును దిర్యక్కులును నాగులును ఖగములును మొదలగునవి పుట్టుటయును, వృత్రాసురుని జన్మమును మరణమును (సప్తమమున) దితిపుత్రులగు హిరణ్యాక్ష హిరణ్యకశిపుల జననమరణములును, మహాత్ముండయిన దైత్యవల్లభుండగు ప్రహ్లాదుని చరిత్రమును (అష్టమమున) మన్వంతరముల చరిత్రమును, గజేంద్రుని మోక్షణమును, మన్వంతరములందు విష్ణువు హయగ్రీవాదులుగా నవతరించుటయు, ఆజగత్పతి కూర్మావతారమును మత్స్యావతారమును నరసింహావతారమును వామనావతారమును నమృతను కొఱకు దేవతలు పాలసముద్రమును జిలుకుటయును, దేవాసురమహా యుద్ధమును, (నవమమున) రాజవంశానుకీర్తనమును, ఇక్ష్వాకుని జన్మమును, నతని వంశమందు మహాత్ముండగు సుద్యుమ్నుఁడు పుట్టుటయును, ఇలోపాఖ్యానమును, దారోపాఖ్యానమును, సూర్యవంశానుకథనమును, దాని వలనఁ బుట్టిన శశాదుఁడు మొదలగు రాజుల కథలును, సుకన్యావృత్తాంతమును,శర్యాతిచరిత్రయు, కకుత్థ్సునిచరితమును, ఖట్వాంగుని చరిత్రమును, మాంధాతృ వృత్తాంతమును, సౌభరిచరితమును, సగరునికథయు, కోసలేంద్రుండగు రామునిపాపహారంబగు చరిత్రంబును, నిమియంగముల పరిత్యాగమును, జనకులు పుట్టుటయును, భార్గవోత్తముఁడగు పరశురాముఁడు భూమియందు క్షత్రియులే లేకుండునట్లు చేయుటయు, సోమవంశమందైలుని కథయు, నహుషుని కొఱకు యయాతి చరిత్రమును, దుష్యంతుని పుత్త్రుఁడయిన భరతుని వృత్తాంతమును, శంతనుని యతని పుత్త్రునివృత్తాంతములును,యయాతి జ్యేష్ఠపుత్త్రుఁడయినయదువు వంశమును గీర్తింపఁబడినవి. ఆ యదువంశమున నుండి

యే జగదీశ్వరుండగు భగవంతుఁ డవతరించెను. అతఁ డందుఁ గృష్ణుం డను పేర వసుదేవుని గృహమం దవతరించి పిదపఁ గోకులమందుఁ బెరిఁగెను. ఆయసురద్వేషియగు కృష్ణునియుదార కర్మములు కీర్తింపఁబడినవి. అవి యేవన ఆబిడ్డఁడుపూతనపాలును దానిప్రాణములతోఁగుడుచుటయు, శకటాసురునివిఱుచుటయుఁ, దృణావర్తుని నఱ్ఱగావించుటయు, బకవత్సాదులను జంపుటయు, అఘాసురుని ప్రాణములుదీయుటయు, చతుర్ముఖునకుఁ దన మాయను జూపుటయును, బలాసురుని వానితోడఁబుట్టువయిన ధేనుకాసురునిని వధించుటయు, ప్రలంబాసురునిఁ జంపుటయు, గోపకులను దావాగ్ని చుట్టుకొనఁగా రక్షించుటయు, కాళియమహాసర్పమును నడంచుటయు, వరుణుని వలన నుండి నందుని విడిచిపుచ్చుటయు, గోపకన్యల వ్రతచర్యయును, ఆవ్రతమందు గొల్లలు కృష్ణుని స్తుతించుటయు, యజ్ఞపత్నుల ననుగ్రహించుటయు, వారిపతులగు విప్రుల యనుతాపమును, ఇంద్రునిఁ గ్రిందుపఱచుటకై గోవులను రక్షింప గోవర్ధనము నెత్తుటయు, కృష్ణునికిఁ బూజయు నభిషేకమును, కృష్ణుండు శరద్రాత్రులందు గోపికలతోఁ గ్రీడించుటయు, దుర్బుద్ధియగు శంఖచూడుని వధమును, అరిష్టునిని గేశినిని సంహరించుటయు, అక్రూరునిరాకయు, రామకృష్ణులు మథురకుఁ బయనమగుటయు, గోపస్త్రీల విలాపమును, మథురను జూచుటయు, గజుఁడు ముష్టికుఁడు చాణూరుఁడు కంసుఁడు మొదలగువారిని వధించుటయు, గురువగు సాందీపని మృతపుత్రులను మరలఁదెచ్చుటయు, కృష్ణుండు మథురయందు నుద్ధవునిని బలరామునింగూడి వసించుచు యదువులకుఁ బ్రియము గావించు

టయు, జరాసంధుఁడు తెచ్చిన సైన్యములను బహుతరముగా వధించుటయు, కాలయవనునిఁ జంపుటయు, గుశస్థలియందు నివేశించుటయు, దేవలోకమునుండి పారిజాతమును సుధర్మా సభనుగొని తెచ్చుటయు, శత్రువులను యుద్ధమునఁ గలంచి హరి రుక్మిణీదేవిని గొనిపోవుటయు, హరిబాణాసురయుద్ధమందు విజృంభించుటయు, బాణాసురుని భుజములను ద్రుంచుటయు, ప్రాగ్జ్యోతిషపతియగు నరకాసురునిఁజంపి కన్యలను దెచ్చుటయు, శిశుపాలుఁడు, పౌండ్రకుఁడు, సాల్వుఁడు, దుర్మతి యగు దంతవక్త్రుఁడు, శంబరుఁడు,ద్వివిదుఁడు, పీఠుఁడు,మురాసురుఁడు,పంచజనుఁడు మొదలగువారల మాహాత్మ్యమును వీరినివధించుటయు, కాశిని దహించుటయు, పాండవులను నిమిత్తముగాఁ జేసికొని భూభారమును దింపుటయు, (ఏకాదశమున) బ్రాహ్మణశాపము నెపమునఁ దనకులమును సంహరించుటయు, వాసుదేవునకును నుద్ధవునకును జరిగిన యద్భుత సంవాదమును, అందు వర్ణాశ్రమధర్మనిర్ణయమును గావించునాత్మవిద్యయంతయుఁ జెప్పఁబడుటయు, నంత నాత్మయోగప్రభావముచేత మర్త్యలోకమును బరిత్యజించుటయును, (ద్వాదశమునందు) యుగముల లక్షణములును వానియందలి వృత్తులును, కలియందు మనుష్యులకుఁ గలుగు నుపద్రవమును, ప్రాకృతికమునైమిత్తికము ఆత్యంతికము నిత్యమనెడి నాలుగు విధములయిన ప్రలయములును, ప్రాకృతికి నిత్య నైమిత్తికి యని మూఁడువిధములయిన యుత్పత్తియు, బుద్ధిమంతుఁడయిన రాజర్షి పరీక్షిత్తు దేహత్యాగమును, వేదాదిశాఖల విభాగమును మార్కండేయమహర్షి చరిత్రమును, మహాపురుషుని, యంగోపాంగముల విన్యాసమును, జగదాత్మకుం

డయిన సూర్యుని గణవిభాగమును జెప్పఁబడినవి. బ్రాహ్మణ శ్రేష్ఠులారా! మీరు నన్నేమి యడిగితిరో దానినంతయుఁ జెప్పితిని. ఈపురాణమందు హరి లీలారూపములయిన యవతార కర్మములు సంపూర్ణముగాఁ గీర్తింపఁబడినవి. పతితుఁడుగాని, స్ఖలితుఁడుగాని, యార్తుఁడుగాని, పరవశుఁడయినను గాని 'హరయేనమః' యని చెప్పినను జెప్పఁగా విన్నను సమస్తపాతకముల నుండి విముక్తుఁడగుచున్నాఁడు. భగవంతుని ప్రభావమును విని యతనిని గీర్తించుచుండినచో సూర్యుఁడు చీఁకటిని, బెనుగాడ్పు మబ్బును దూలించునట్లు,లామనుష్యుల చిత్తమును బ్రవేశించి వారలవ్యసనము నెల్ల విదిల్చివైచును. అధోక్షజుం డగు భగవంతుఁ డెందుఁ జెప్పఁబడఁడో యాముచ్చటలు, వట్టి పొల్లు మాటలు. అవి దోషావహములయిన యుబుసులు. భగవద్గుణము లెందుఁ బ్రకాశించుచుండునో యాకథాప్రసంగమే సత్యము. అదియే మంగళము. అదియె పుణ్యావహము. ఎచ్చట నుత్తమశ్లోకుం డయినభగవంతునియశస్సు వర్ణింపఁబడుచున్నదో యదియె మీఁదు మిక్కిలి యింపయినది. రుచికరమయినది. అదియె మనస్సున కెప్పుడును మిక్కిలి యానందకరమయినది. అదియె మనుష్యులకు శోకసముద్రము నింకింపఁజేయునది. ఏవాక్యమందు, అది చిత్రపదములతోఁగూడి యున్నను జగత్పవిత్రమయిన హరి యశము చెప్పఁబడకుండునో యది కాకులవంటి కాముకులు రమించుచోటుగాని హంసలవంటి జ్ఞానులు గోలుచుపట్టుగాదు. ఏలనఁగా నేప్రబంధమం దచ్యుతుఁడు ప్రతిపాద్యుఁడగునో యందే నిర్మలాంతః కరణులయిన సాధువులు రమించుచుందురు. ఏవచన ప్రయోగము ప్రతిశ్లోక

మును నబద్ధముగా నుండినను ననంతుఁడగు భగవంతుని యశస్సునకుఁ బ్రకాశకములయిన నామములు వర్తించు చుండునో యట్టి వచనప్రయోగమే జనసమూహముల పాపము లను రూపుమాపునది. కాఁబట్టియే, సాధువులట్టి వచనప్రయోగ మును నొకరు చెప్పుచుండఁగా వినుచుందురు; వినువారుం డఁగాఁ జెప్పుచుందురు; ఆ యిరువురును లేనియెడఁ దమంతటఁ బాడుచుందురు. సకల కర్మబంధములను విధ్వంసము చేయు నదై ప్రకృతి సంబంధములను దూలించుచు నిర్మలమైయున్న జ్ఞానముగూడ, నచ్యుతగుణానుశ్రవణాదుల నుద్దేశింప కుండిన యెడలఁ బ్రచ్యుతి నొందఁగూడును గాన యంతగా శోభింపదు. ఇట్టిజ్ఞానయోగమే శోభింపదనఁగా నిఁక నీశ్వరునియందర్పింపఁ బడినదై, కావుననే యనుష్ఠింపఁబడునప్పుడు పతనశంకచే సదా భయావహమై యుండు కర్మయోగము బ్రకాశించుట యెక్క డిది? వేయేల! ఫలాభిసంధి లేనందున సర్వోత్తమైయున్న కర్మముగూడ నెట్లు ప్రకాశింపఁగలదు? కీర్తికొఱకును సంప దకొఱకును వర్ణాశ్రమాచారములందును దపస్సునందును శ్రవ యనాదులందును నిష్ఠ గలిగియున్నను దానివలనఁ గలిగెడి యాకీర్తిసంపదలు సతములుగాక క్షీణించునవి. కాఁబట్టి యా నిష్ఠయంతయు వట్టి కష్టపడుటయె యగునేకాని; సఫలము గాదు. శ్రీధరుని గుణానువాదశ్రవణాదరాదులచేత నతని పాదపద్మ ములయందు మఱపు లేకుండిననే యీ వర్ణాశ్రమాదుల యందలి నిష్ఠ సఫలమగును కృష్ణపదారవిందములయందు మఱపు లేకుండుట దుఃఖనిమిత్తములయిన దురితములను క్షీణింపఁ జేయుచున్నది. రాగాద్యకలుషితం బగు శాంతి

బెంచుచున్నది. సత్త్వము రజస్తమస్సులచేఁ గీడ్పడకుండు నట్లు శుద్ధముగావించు చున్నది. ప్రేమయుక్తంబగుటంజేసి పరమంబయిన శక్తినిని భగవంతుని స్వరూపజ్ఞానమును, నతని ప్రకారజ్ఞానమును భగవద్వ్యతిరిక్తము లయిన విషయము లందు విరక్తియునుగలిగించుచున్నది. బ్రాహ్మణోత్తములారా! మీరు మహాభాగ్యవంతులు. ఏలందురా ? మీరు బాహ్యవిషయములందుఁ జింత లేక. సమస్తమున కంతరాత్మభూతుండును, దన తేజంబున వెలుంగుచుండు వాఁడును, దన కారాధింపఁ దగిన మఱియొక దేవుఁడు లేనివాఁడును, సర్వ నియంతయు నయిన నారాయణుని దదీయ గుణగ్రహణాదులచేత మనస్సునందు స్థిరముగాఁ జొనిపి భజించితిరి గదా ! కనుక మీరు మహాధన్యులరు. రాజగు పరిక్షితుని ప్రాయోపవేశము నందు సదస్సున మహాత్ములగు ఋషులు వినుచుండఁగాఁ, బరమ ఋషియగు శ్రీశుకుని ముఖమునుండి మున్నువిన్న యాత్మతత్త్వప్రకాశక మైన పురాణమును, మీరు మరల స్మరింపఁ జేసితిరి గాన నేను కృతార్థుఁడ నయితిని. ఎవ్వనియపరిమిత ములయిన చేష్టితములను మీఁదు మిక్కిలి చెప్పుచుండఁ దగునో యావిష్ణుని వాసుదేవుని మాహాత్మ్యమును బ్రకాశింపఁ జేయునదియును గీర్తించువారల సమస్తములయిన యశుభములను వినాశము చేయునదియును నయిన యీ పురాణమును మీకుఁ జెప్పఁబడినది. ఎవ్వఁడు బుద్ధి పరాయత్తము గానీక దీనిని జాముగాని క్షణము సేపుగాని నిత్య మితరులకు వినిపించునో లేక శ్రద్ధతోడఁ దానే వినుచుండునో వాఁడు తన్నుఁ దప్పక పరిశుద్ధునిఁ జేసికొనుచున్నాఁడు. దీనిని ద్వాదశియందును

నేకాదశి యందును విన్నవాఁ డాయుష్మంతుఁ డగును. దీనిని బరి శుద్ధుఁడై యితరమునందు మనస్సు నుంపక పఠించువాఁడు పాతకుఁడైనను బవిత్రుఁడగును. పుష్కరమందును మధుర యందును ద్వారకయందును సమాహితచిత్తుఁడై యుపవసించి యీ పురాణసంహితను బఠించి సంసారభయమునుండి విము క్తుఁడగును. ఈ పురాణమందుఁ గీర్తింపఁబడియున్న దేవతలును మునులును సిద్ధులును ఋషులును బితరులును రాజులును దీనిని ముచ్చటించువారికిని వినువారికిని గోరిన కామములొసంగుదురు. ఋగ్యజుస్సామములను బ్రాహ్మణుఁ డధ్యయనముచేసి పడయు నట్టి ఫలమును దేనెయుఁ బాలును నేయును వెల్లువలుగా బాఱ నన్నమిడినట్టిఫలమును దీనిని జదువఁగా సిద్ధించు చున్నది, ద్విజుఁ డీపురాణసంహితను జదివి భగవంతునకుఁ బ్రతిపాదింపఁబడిన పరమపదమును బొందుచున్నాఁడు. దీనిని బ్రాహ్మణుఁడు చదివి ప్రజ్ఞను బొందును. రాజు చదివి సముద్ర పర్యంతమైన భూమండలమును బడయును. వైశ్యుఁడుచదివి నిధులకుఁ బతియగును. శూద్రుఁడు చదివి పాతకమునుండి పరి శుద్ధుఁ డగును. కలికాలదోషసమూహములను దూలించెడి యీ యఖిలేశ్వరుండు హరి యితరములగు రాజసాది ప్రబంధ ములయందు మాటి మాటికిఁ గీర్తింపఁబడుట లేదు. ఇంద న్ననో, శేషమూర్తియైన యీ భగవంతుఁడు ప్రతిపదము నందు నాయీ కథా ప్రసంగములచేతఁ బ్రతిపాదింపఁబడి యుండును. అజుండును ననంతుఁడును నాత్మతత్త్వంబగు వాఁడును జగదుదయస్థితి నాశములకు హేతువులయిన రజస్సు మొదలగు శక్తులు గలవాఁడును, దేవలోక పతులగు బ్రహ్మ

స దేవేంద్రాదులచే నెప్పుడు నుడుగక స్తోత్రములు చేయఁబడు చుండువాఁడునునయిన యచ్యుతునకు మ్రొక్కెదను. పయిపయిని వృద్ధినొందుచున్న కాలప్రకృతి మహదహంకార పంచభూతము లనెడు తొమ్మిదిశక్తులచేతఁ దనయందే స్థావరజంగమములను గల్పించుకొని వానికెల్ల నునికిపట్టయి కేవలజ్ఞానరూపం బగు తేజస్సే స్వరూపముగాఁ గలిగియున్న దేవతాశ్రేష్ఠునకు సనాతనునకు భగవంతునకు నమస్కరించుచున్నాను. ఎవ్వనిని బ్రహ్మాయు వరుణుఁడును నింద్రుఁడును రుద్రుఁడును దక్కిన దేవతలును దివ్యస్తవములచే స్తుతించుచుందురో, సామగులు సాంగములతోను బదక్రమములతోను నుపనిషత్తులతోను గూడిన వేదములచే నెవ్వని గానము సేయుచుందురో, యెవ్వని యోగులు ధ్యానముచేత మనస్సును నిశ్చయముగా నందు నిలిపి యోగవిశుద్ధంబగు మనంబున దర్శింతురో, సురాసుర సమూహములును నెవ్వని మహిమకొలఁదిని నింతయని యెఱుఁగరో, యట్టి దేవునకు నమస్కారము. అమందమైన మందరగిరి వీపునందు గిరగిరఁ దిరుగుచుండునపుడు దాని పెనుబండల మొనలు గోఁకికొనఁగా వీఁపుతీఁట యుడిగి హాయిగాఁ గూర్చు న్నట్టికూర్మరూపుండయిన యాభగవంతుఁడూర్పులువిడిచెను. ఆ యూర్పులను వాసనావశమున గొంచె మనువర్తించుచుండుటచే సముద్రము జలము లింతవఱకును నిటునటు రాకపోకలు సముద్రక్షోభమనెడి నెపమునఁ జేయుచు నిప్పటికిని నిమ్మళము నొందకయున్నవి. అట్టి యాయూర్పులు నుమ్ము రక్షించుఁగాక.

సూతుఁడు—పురాణము లగ్రంథసంఖ్యలను సమాహారమును, నీ పురాణమునకుఁ బ్రధానమగు వాచ్యమును బ్రయోజన

మును దీనిదానమును, దానము యొక్కయుఁ బఠనాదుల యొక్కయు మాహాత్మ్యమును వినుము. బ్రాహ్మపురాణము పది వేలును, పాద్మ, మేబదియైదువేలును, వైష్ణవ మిరువదిమూఁడు వేలు. శైవ మిరువదినాలుగువేలు. శ్రీభాగవతము పదునెని మిదివేలు. నారద మిరువదియైదువేలు. మార్కండేయము తొమ్మిదివేలు. ఆగ్నేయము పదియేనువేల నన్నూఱు. భవిష్య మిరువదినాలుగువేల యేనూఱు. బ్రహ్మకైవర్తము పదివేల యెనమన్నూఱు. లైంగము పదునొకండువేలు. వారాహ మిరు వదినాలుగువేలును. స్కాందమును బదియొక్కవేయున్నూఱు. వామనము పదివేలు. కూర్మము పదియేడు వేలు. మాత్స్యము పదునాలుగువేలు. గారుడము పందొమ్మిదివేలు. బ్రహ్మాండము పండ్రెండువేలు. ఇట్లు పురాణసమూహము నాలుగులక్షలగ్రంథ పరిమితి గలది యని యుదాహరింపఁ బడియున్నది. వాని యం దీభాగవతము పదునెనిమిదివే లని చెప్పఁబడుచున్నది. దీనిని దొల్లి భగవంతుఁడు తన నాభికమలమం దున్నబ్రహ్మ సంసారభీతుఁడై యుండఁగాఁ గారుణ్యమున నతనికి నుపదేశిం చెను. ఇం దాదిమధ్యాంతములయందు నానావిధము లయిన యాఖ్యానములు కలిసియున్నను, నంతటను హరిలీలా కథా సమూహ మనెడు నమృతమె నిండి సత్పురుషులను దేవ తలును నందింపఁజేయుచుండును. సమస్తవేదాంతములసారంబై బ్రహ్మాత్మ మనెడి యొకవస్తు విందుఁ బ్రతిపాద్యమగువాచ్యము. అది యద్వితీయమైనది. కైవల్యము దానికి లోనై దానివలనఁ గలుగునది. ఆకైవల్యమే దీనికిఁ బ్రయోజనము. ఎవఁడు, తన యంతరాత్మానుసంధానము చిత్తమెల్ల నిండియుండుట

వలన భగవంతునకు వ్యతిరిక్తము లయినసంగములెల్లను నిరసించి యజితుండగు భగవంతుని రమణీయలీలలచేతఁ జిత్తమాకర్షింపఁబడఁగా నతని స్వరూపరూపగుణవిభూతిప్రకాశకమును దత్త్వములకు దీపమువలెఁ బ్రకాశకము నయినయీపురాణమును గృపచేత రచించెనో సమస్తపాపములను దూలించునట్టియీవ్యాసపుత్త్రునకు శ్రీశుకునకు నమస్కరించిన వాఁడ నయితిని.

శ్రీ వేదవ్యాసాయ నమః

శ్రీ కృష్ణాయ పరబ్రహ్మణే నమః

శ్రీ రామచంద్రార్పణ మస్తు.

శ్రీ మ దాం ధ్ర వ చ న భా గ వ త ము

సమాప్తము.